# శ్రీ మాత

## ప్రశ్నోత్తరములు

[1950 డిశంబరు 21 మొదలు 1951 మార్చి 12 వరకు]





అనువాదం:

పాలా వెంకటసుబ్బయ్య

కడప

"ఈ గ్రంథములు ముద్రించుటకు అవసరమైన
కాగితము కేంద్ర ప్రభుత్వమువారిచే
తగ్గింపు ధరకు అందజేయబడినది"



సంపుటి 7

కొవ్వూరు, రాజమహేంద్రవరం
శ్రీఅరవింద స్వాధ్యాయ కేంద్రముల విరాళములతో

శ్రీ దివ్యమాత శతజయంతి గ్రంథ ప్రచురణ సమితిచే
ప్రచురింపబడినది.

ముద్రణ : శ్రీఅరవిందాశ్రమ ఆంధ్రభవనం ముద్రణాలయం, పుదుచ్చేరి.

# శ్రీ మాత

జ న న ం

ఫిబ్రవరి 21, 1878

భారతదేశానికి ఆగమనం

మార్చి 29, 1914

మ హా స మా ధి

నవంబరు 17, 1973

శ త జ య ం తి

ఫిబ్రవరి 21, 1978

# శ్రీమాత

# ప్రశ్నోత్తరములు

## 1950 - 51

### ప్రారంభమై రూపొందిన తీరు

ఫ్రెంచిభాషలోని 'ఎంట్రిటీన్స్' అనుదానిని అనువాదమైన ఈ 'ప్రశ్నోత్తరములు' ఎట్లు ప్రారంభమయ్యెనో వివరించుట ప్రయోజనకరము. ఈ ప్రారంభము ఆ కారణముగా ఏదో ఒక నిర్ణయమును బట్టి గాక, వ్యవహారికమైన ఒకానొక ఆవశ్యకత ననుసరించి జరిగినది. ఆశ్రమములో ఆధ్యాత్మికమును సర్వశః భౌతికముతో మేళవించినట్లే ఇదియును జరిగెను. ఆశ్రమ పాఠశాల 1943 లో స్థాపించబడినది. బాలురసంఖ్య అధికము కాజొచ్చినది. వారు ఫ్రెంచిభాషను నేర్చుకొనిరి. పిల్లలు ఇంకను అధికముగా రాసాగిరి. వారి సంఖ్యకు దగిన అధ్యాపకులు లేరు. అందువలన శ్రీమాత వారమునందు మూడుదినములు ఫ్రెంచిభాషాతరగతులలో పైచదువులవారికి స్వయముగ బోధచేయ మొదలిడెను. ఆమె తాను రచించియుండిన ఫ్రెంచిభాషా పుస్తకములనుండి పాఠములను జదివెడిది. బాలురు, అధ్యాపకులు గూడ ప్రశ్న లడిగెడివారు. ఇయ్యదియే ఈ సంభాషణలకు మూలకారణము. ఇవి తల్లిగారి తరగతులనికూడ పిలువబడిడెవి. అందువలన, ఈ అడుగబడిన ప్రశ్నలు వివిధములై, వివిధస్థాయిలకు జెందినవిగా నున్నవి.

ప్రారంభములో ఈ సంభాషణలు సంక్షిప్తలేఖనమున వ్రాయబడుచుండి నను, కొన్ని వదలబడుటయు, కొన్ని అసంపూర్ణముగ నుండుటయు జరుగుచు వచ్చినది. 1953 నుండియే వీనిని టేపురికార్డింగు చేయుట మొదలయ్యెను.

ఈ పుస్తకములోని పాఠ్యభాగములలో ఆరు మాత్రము తప్ప మిగిలిన వన్నియు అంతర్జాతీయ శ్రీఅరవింద విద్యాకేంద్రపు 'బులెటిన్' లో ప్రప్రథమముగా ప్రకటింపబడెను.



# ప్రస్తావన

శ్రీమాత 'ప్రశ్నోత్తరములు' అను శీర్షికను వెల్వడిన గ్రంథజాలము నుండి ఈ 1950 - 51 ప్రశ్నోత్తరముల సంపుటము మొట్టమొదటిది. అసలీ 'ప్రశ్నోత్తరములు' ఎటుల ప్రారంభమయ్యెనో తెలిసికొనుట అత్యావశ్యకము. తొలుత ఇవి 'ఎంట్రిగిన్స్' అను పేరుతో ఫ్రెంచిభాషలో ప్రచురితమై పిమ్మట ఆంగ్లములోనికి అనువదించబడినది. ఇవి ఆ కారణముగా ఏ ప్రత్యేక నిర్ణయాను సారముగనో ప్రారంభమైనవి కావు. ఒకానొక అవసరమును పురస్కరించుకొని ఆశ్రమములో ఆధ్యాత్మికమును భౌతికముతో మేళవింపగోరు పెక్కు ఇతర కార్య క్రమములవలెనే అవియును రూపొందినవి.

ఆశ్రమపాఠశాల 1943 లో స్థాపింపబడెను. బాలురసంఖ్య అధికమ య్యెను. వారు ఫ్రెంచిభాషను నేర్చుకొనిరి. విద్యార్థులు ఇంకనూ అధికముగా రాసాగిరి. వారి సంఖ్యకు దగిన అధ్యాపకులు లేరు. అందువలన శ్రీమాత వారమునందు మూడుదినములు ఫ్రెంచిభాషాతరగతులను పైచదువులవారికి తీసి కొన నారంభించిరి. తాను రచించిన ఫ్రెంచిభాషా గ్రంథములనుండియు శ్రీఅర విందరచనల అనువాదములనుండియు పాఠములను చదివి ఆమె బోధించుచుండెడి వారు. విద్యార్థులు, అధ్యాపకులు కూడ ఆమెను ప్రశ్నలడిగెడివారు. తరువాత క్రమముగా ఆశ్రమవాసులును ఆ తరగతులకు హాజరగుచు ప్రశ్నలు వేసెడివారు. ఇయ్యదియే ఈ సంభాషణలకు మూలకారణము. ఇవి 'శ్రీమాత తరగతు' లని

కూడ పిలువబడుచుండెడివి. అందువలన, ఈ అడగబడు ప్రశ్నలు వివిధములు గాను, వివిధస్థాయిలకు చెందినవిగాను ఉన్నవి.

ప్రారంభములో ఈ సంభాషణలు సంక్షిప్త లేఖనమున వ్రాయబడెడివి. కొన్ని వదలివేయబడెడివి. కొన్ని అసంపూర్ణముగా నుండెడివి. 1953 నుండియే వీనిని టేపురికార్డింగు చేయుట మొదలైనది. ఈ సంపుటములోని పాఠ్య భాగములలో ఆరు మాత్రము తప్ప మిగిలినవన్నియు అంతర్జాతీయ శ్రీఅరవింద విద్యాకేంద్ర సంచికయందు తొలుదొల్త ప్రకటింపబడినవే. 1950 డిసెంబరు 21 నుండి మార్చి 12 వరకు గల ఈ సంపుటపు 'ప్రశ్నోత్తరము' లను తెలుగు లోనికి అనువదించి యిచ్చిన శ్రీ పాలా వెంకటసుబ్బయ్యగారికి శ్రీదివ్యమాత శతజయంతి గ్రంథప్రచురణ సమితి యంతయు కృతజ్ఞము. ఒక్కొక్క ఆంగ్ల సంపుటమును తెలుగున రెండు సంపుటములుగా వెల్వరించవలెనన్న సంకల్పము ననుసరించి, ఆంగ్లములో 4 వ సంపుటపు ప్రథమార్థమైన యీ తెలుగు సంపుటము 7 సంఖ్య కలది యగుచున్నది.



# వి షయ సూ చి క

* * *



"....ఆమె సర్వాతీతమైనది. దేనిచేతను బంధింపబడునది కాదు. ఈ విశ్వమున దేనియందును, ఆమెకు ఆసక్తి లేదు — మహేశ్వరి"



# ప్రశ్నోత్తరములు

**21 డిసెంబరు 1950**

"ఓ ప్రశాంత నిశ్చల చైతన్యమా, ప్రపంచపు పొలిమేరలయందు నీవు, అనంతకాలపు స్త్రీముఖ సింహశరీర యక్షిణిరీతి కావలియున్నావు. అట్లయ్యును, నీ రహస్యములను నీవు కొందరికి ఎరుకపరతువు. అట్టివారు, నిష్పక్షపాతముగ ఎన్నికసేయుచు నిష్కామముగ కార్యముల నెరవేర్చు నీ యకుంఠితేచ్ఛాస్వరూపులే కాగలుగుదురు."

శ్రీమాత 'ప్రార్థనలు, ధ్యానములు' నవంబరు 20, 1914

ఈ నిశ్చలచైతన్యము 'స్వప్నముల మాత'*; విశదీకరించవలసిన గూఢ ప్రశ్నవోలె, ప్రపంచపు పొలిమేరలను కావలికాయుచున్న అనంతకాలపు

---

* 'స్వప్నముల మాత' శ్రీఅరవిందుల కవితా రచన

స్త్రీముఖ సింహశరీర యక్షిణి. ఈ గూఢప్రశ్న మన జీవిత సమస్యయే; ఈ ప్రపంచసమస్యయు నగును. మన జీవితసమస్య యేదన, భగవంతుని సాక్షాత్తుగా అనుభవమునకు దెచ్చుకొనుట; లేదా, తానే యీ విశ్వమూ, జీవిత మూలకారణమూ, అంత్యలక్ష్యమూగూడనైన భగవంతుని యెరుకను మరల బొందనేర్చుట.

అనంతకాలపు సింహముఖ యక్షిణి రహస్యమును, గ్రహించినవారు క్రియాశక్తి, సృజనశక్తి తామే యగుదురు.

నిష్పక్షపాతముగా ఎన్నుకొనుట. నిష్కామముగా కార్యముల నెరవేర్చుట కష్టతరమైన పని. ఆత్మనిగ్రహమునకు, సత్యచైతన్యవికాశమునకు మూలమిదియే. ఈ సందర్భమునందు ఎన్నుకొనుట అనుదాని యర్థమేమన, యదార్థమేదో తెలిసికొని దాని నావిష్కరించుట. దేనిపైనను,—ఏ వ్యక్తి, ఏ చర్య, ఏ పరిస్థితిపైనను,—వ్యక్తిగతాభిమానము లేక ఈ విధముగా ఎన్నుకొనుట ఏ సామాన్యవ్యక్తికైనను నిజముగ కష్టసాధ్యమైన విషయము. అయినను, ప్రలోభముల కతీతముగ, ఇష్టానిష్టములకు దూరస్థుడై, తన్ను నడిపించు సత్యముపై నాధారపడి ప్రవర్తించుట సాధకుడు నేర్చుకొనవలెను. అవసరమైన చర్యను సత్యము ననుసరించి యెన్నుకొన్న తర్వాత, కోరికను విడనాడి సాధనాపథమందు నడువవలెను.

నిన్ను నీవు జాగ్రత్తగా ఆత్మపరిశీలన చేసుకొన్నట్లయితే, ఏదైన చర్యకు బూనుకొనకముందు, నీకొక ప్రోత్సాహకరమైన ఉరవడి, నిన్ను ముందుకుత్రోయు ఒక ప్రేరణ కావలయుననుట గ్రహింతువు. సామాన్యుని యందు సర్వసాధారణముగా ఈ ప్రేరణశక్తి కోరిక యగుచుండును. 'సత్యము' యొక్క విశదమైన, ఖచ్చితమైన, ఎడతెగని దర్శనము ఈ కోరికస్థానమును ఆక్రమింప వలసియున్నది.

దీనిని కొందరు భగవద్వాణి, లేక భగవదిచ్ఛఅనియు నందురు. ఈ మాటల నిక్కమైన యర్థమునకు అపార్థము కల్పించబడియున్నది. అందు వలననే నేను 'సత్యమును' గురించి మాట్లాడ సంకల్పించితిని. నిజమున కీ 'సత్య' పదము సైతము, సర్వమునకు మూలము, అంత్యలక్ష్యము నైయున్న దాని ఒకానొక పరిచ్ఛిన్నస్వరూపమును సూచించునదే యగును. భగవంతు డను పదమును నేను బుద్ధిపూర్వకముగనే వాడలేదు. ఏలన, తన సృష్టి కంటె వేరై దానికి బాహ్యమైన సర్వశక్తిమంతుడగు పురుషునకు భగవంతు డను నామకరణమును మతములు చేసినవి, అది సరికానేరదు.

అయినను, భౌతికస్థాయిలో ఈ భేదము సుస్పష్టమే. కారణ మేమన, ఏది ఇకమీద మనము కాకూడదని కోరుచున్నామో అది అంతయు నిపు డింకనూ మనముగానే ఉన్నాము. మరి ఆయనయో,—మనము కాగోరుచున్నదంత యునూ ఆయనయే.

## దైవేచ్ఛ యేదియో మనమెట్లు తెలిసికొనగలము?

అది ఎవరును తెలిసికొనునది కాదు, అనుభవించునది. దాని నా విధ ముగా అనుభవమునకు దెచ్చుకొనుటకు అంతశ్శుద్ధిపూర్వకమైన తీవ్రసంకల్ప ముండవలెను. అప్పుడు అన్ని ఆటంకములును పటాపంచలై పోవును. ఎంతకాలము నీ కొక అభిమతము, అభీష్టము, ఆకర్షణ, కామన, అనునవి యుండునో అంతకాలము ఇవన్నియు సత్యమును నీకు మరుగుపరచుచుండును. అందువలన, నీవు మొట్టమొదట చేయవలసిన దిది: నీ చేతనయొక్క పోకడల నన్నింటిని అదుపులోనికి దెచ్చుకొని సరిదిద్ది సక్రమముగా నడిపించు టకును, మార్పుచేయ వీలుపడనివాటిని, పూర్తిగా తొలగించి వేయుటకును, నీవు ప్రయత్నించవలెను. పరిశుద్ధము, శాశ్వతము నైన సత్యావిష్కరణ ముగా సమస్తమూ రూపొందుపర్యంత మిది యిట్లు చేయక తప్పదు.

దీనిని కేవలము వాంఛించుటతోనే సరిపోదు. ఎందుకన. తరచుగా ఈ వాంఛను మరచుటయూ సంభవించుచుండును.

ఏది అవసరమనగా. ఎడతెగక అగ్నిజ్వాలవలె మండుచున్న అకాంక్ష. కామన, అభిమతము, ఆకర్షణ. అనునవి నీలో తలయెత్తినపుడెల్ల వానిని ఆ మంటలో దహింపజేయవలెను. నీ విది దీక్షతోచేసినయెడల, నీ సాధారణ చేతనయందు సత్యచేతన వెలుగురేఖ ఉదయించుటను నీవు చూడగలవు. కాసన అభిమతము. ఆకర్షణ అనువానికి ఈ రేఖామాత్ర సత్యము కడుదవ్వై అస్ప ష్టముగా నుండును. నీవు వీని నధిగమించి. వీని వెనుకనుండు,— స్థిరత, ప్రశాంతత, నిశ్చలనీరవతతో నొప్పారు సత్యచేతనను గనుగొనవలెను.

ఎవరు సత్యచేతనతో సంబంధము కలిగియుందురో వారు సకలసంభావ్య తలను ఏకకాలమున గనుగొననేర్తురు. అవసరమైనచో వానిలోనుండి ఐచ్ఛిక ముగనే మిక్కిలి అననుకూల మైనదానినిసైతము ఎన్నుకొనజాలుదురు. కాని, ఈ స్థితిని జేరుటకు నీవు కడు దూరప్రయాణము చేయవలసియుండును.

అభిమతములను నిరర్థక మొనర్పవలెనా, లేక విస్మరింపవలెనా ?

ఇవి ఎవరికిని ఉండనేకూడదు.

మనస్సు నీరవతను జేరుకొన్న తరువాత, తనకు తెలిసినదనుకొన్న జ్ఞానముతో తీర్పుల నిచ్చుటను విరమించిన తరువాత, ఆ వ్యక్తి తన జీవిత సమస్యను పరిష్కరించుటకు ప్రారంభించును. తీర్పుల నిచ్చుట మానుకొన వలెను. ఎందుకన, మనస్సు క్రియోపకరణముమాత్రమే. నిజమైన జ్ఞానము నకు ఉపకరణము గాదు. ఆ జ్ఞానము వేరుచోటునుంచి వచ్చును.

ఎవరైనను తీర్పుల నిచ్చుట విరమించినప్పుడే సత్యమును గురించిన అసలైన జ్ఞానమును బొందనేర్తురు. అప్పుడు, ప్రపంచదౌర్భాగ్యమున పదింట తొమ్మిదిభాగములు అదృశ్యమగును.

మనస్సు తన కేమియు తెలియదని ఒప్పుకొన్నట్లయితే, ప్రపంచములోని కలతలలో అత్యధికభాగము నిరర్థకమైపోవును.

తర్వాత, "ఆలోచనలు, రేఖామాత్రదర్శనములు," అనుదానిలోని యీక్రింది సూక్తి చర్చింపబడెను. "మనము భోగముల నతిక్రమింప నేర్చినపుడు, ఆనందము ననుభవింతుము. వాంఛ సహాయకారి; వాంఛ ప్రతిబంధకముగూడ."

శ్రీమాత వెంటనే ఇట్లన్నది:

ఇది నీవుండే మజిలీనిబట్టి.

సహజముగా, ఎవరు చిత్తశుద్ధితో, తమ మూలసత్యమును దెలిసికొని, తమ జీవితములో దానిని వ్యక్తముచేయ వాంఛించుచున్నారో అట్టివారి నుద్దేశించి నేనిది చెప్పుచున్నాను. ఇక్కడ ఉన్నవారందరికి ఇది వర్తించుననియే నా తలంపు.

అధికాధికముగా సత్యము ననుసరించి ఇచటి అధ్యాపకులు బోధించవలెను. ఎందుకనగా, ఇక్కడ మనము నడిపే పాఠశాల, ప్రపంచములోని లక్షలాది పాఠశాలలతో పోల్చిచూచినప్పుడు, ప్రత్యేకత గలిగినదై యుండుట యుక్తము. ఈ పాఠశాల విద్యార్థులకు, సామాన్యజీవితము, సత్యపరమైన జీవితముల భేదము నెఱుంగుటకు అవకాశ మివ్వవలెను. విషయములను

ప్రత్యేకదృష్టితో చూచుట నేర్పవలెను. సాధారణజీవితమునే పునరావర్తింప జేయుట నిరర్థకము. వేరెచ్చోటను కనుగొనరానిదానిని కనుగొనే కనువిప్పు వారిలో కలుగజేయుటే అధ్యాపకుని కర్తవ్యము.

* * *

డిసెంబరు 23, 1950

శ్రీమాత తాను 'బులెటిన్' కు వ్రాసిన వ్యాసము "ఏకాగ్రత, చంచలత్వము," అనుదానిని చదువు చున్నది-

('బులెటిన్' ఏప్రిల్, 1949)

ఒక సమస్యను పరిష్కరించుటకు, ఒక పాఠము నేర్చుకొనుటకు, ఎక్కువ ఏకాగ్రత, శ్రద్ధ అవసరమైయున్నవి. ప్రతి ఒక్కరికి ఆ విషయము తెలియును. అది బుద్ధిగతమైన శ్రద్ధ, ఏకాగ్రత. అయితే, ఏకాగ్రత బుద్ధికి సంబంధించినది మాత్రమే కాదు. మనుజునియొక్క అన్ని క్రియలలోను, అతని శారీరక కార్యములందుకూడ అదికానవచ్చును. నీవు చేయు పనులయందు నీకు పూర్తిగా ఏకాగ్రత సాధ్యమగుటకు వీలు కల్పించునదిగా నాడులపై పెత్తన ముండవలయును. నీ తీవ్రతరమైన ఏకాగ్రతవలన, బాహ్యస్పర్శలకు అతి త్వరితమైన జవాబులు నీకు లభించును. ఈ ఏకాగ్రతను సంపాదించుటకు ఎఱుకగల ఆధిపత్యము నీ శక్తులపై నీ కుండవలయును.

నీకు లభించు శక్తులను, నీవు వ్యయముచేయు శక్తులను నీ వెఱుంగుదువా ?

ఒకడు దాదాపుగా తాను వ్యయముచేయు శక్తిని గుఱించియు, ముఖ్యముగా దుర్వినియోగపరుచు శక్తినిగురించియు యెఱుక గలిగియే యుండును. విత్యము శక్తియొక్క జమాఖర్చులగుఱించినదే ప్రశ్న యిది. హేతువాద యుగమునకు ముందు పిల్లలు ఆలోచనతో నిమిత్తములేకయే అధికశక్తిని రాబట్టి అత్యధికముగా ఖర్చుచేసెడివారు, ఇది వారిని గంటలకొలది ఆటలయందు నిమగ్నము చేసినను వారు అలసట చెందెడివారు కారు. అయితే, క్రమ క్రమముగా, ఆలోచన అభివృద్ధి యగుటతో, వ్యక్తి తాను ఖర్చుపెట్టు శక్తిని గొలుచుటకు, లెక్కగట్టుటకు, మొదలు పెట్టును. మామూలుగా ఇట్టిది నిరుపయోగము. నీకు శక్తి వచ్చు విధానము తెలియనంతవరకు నీవు దానిని నిలువరము చేయుటకంటె స్వేచ్ఛగా ఖర్చుపెట్టుటయే మంచిది.

మొదట, నీకు శక్తివచ్చుట, అది నీయందు ప్రసారమగుట, ఖర్చుపడుట నీవు ఎఱిగియుండవలయును. తర్వాత, ఎచ్చటనుండి ఈ శక్తి నిన్ను జేరవచ్చుచున్నదియు నీకు దెలియపరుచు సహజజ్ఞాన ముండవలయును. ఆమీదట నీవు ఆ శక్తితో ఆలోచనద్వారా గాని, నిశ్చతత్వముద్వారాగాని, మరి యేవిధానముద్వారాగాని సంబంధము కలిగించుకొనవలెను, ఇట్టి విధానము లనేకములున్నవి. నీకు ఎటువంటి శక్తి కావలయునో అది యెచ్చటనుండి వచ్చుచున్నదో, అది దేనితో చేయబడినదో నీకు దెలిసియుండవలెను. ఆ వెనుక నీలో ప్రవేశించిన శక్తిని అదుపాజ్ఞలలో బెట్టుకొనుట తలఎత్తును. నూటికి తొంబైమంది వ్యక్తులు తగినంతగా శక్తిని గ్రహింపలేరు. లేదా, ఎక్కువ మోతాదును తీసికొందురు, కాని, దానిని జీర్ణించుకొనలేరు, తగినంత మోతాదులో శక్తి తమలో ప్రవేశింపగానే ఆందోళనతో అమితముగా మాటలాడుచు కేకలు వేయుచు దానిని వెనువెంటనే బయటికి నెట్టివేయుదురు. నీలో ప్రవేశించిన

శక్తిని నీయందు నిలువరము చేసికొనుట, నీ వెన్నుకొన్న లక్ష్యముపై దానిని పూర్తిగా కేంద్రీకరింప జేయుట, నీ వెఱిగియుండవలెను. అన్యము అవాంఛ నీయము. ఇది నీవు చేయగలిగితే, నీవు నీ సంకల్పశక్తిని ఉపయోగింపనవ సరములేదు. నీలో ప్రవేశించిన శక్తులన్నిటిని కూడదీసికొనుట, ఎఱుకగలిగి ఉపయోగించుట, పూర్తి కేంద్రీకరణను అధికశ్రద్ధతో నీవనుకొన్న లక్ష్యమును సాధించుటకు పూనుట నీవు చేయవలసియుండును.

నీ వెన్నుకొన్న లక్ష్యమునకు నిజమైన విలువను ఇచ్చుట నీకు తెలిసి యుండవలెను. నీ ఉన్నతచేతన చేయ గోరుచున్నదేదో నీవు గ్రహించవలెను. ఎందుకనగా, ఒకడు చేయనిచ్ఛగించునది చేయుట కష్టముగాదు.

## ఏకాగ్రత అనగా నేమి?

అన్నివైపులకు ప్రాకిన ఎఱుకయొక్క ప్రోగులను ఏకైకాంశమున జేరు నట్టుగా వానిని వెనుకకు మళ్ళించి, ఏకైకభావమున గూర్చుటయే ఏకాగ్రత. ఇట్టి పూర్ణశ్రద్ధాళువులైనవారు, తాము పూనుకొన్న ప్రతికార్యమును సాధింప గలరు. వారెప్పుడును త్వరితగతిని పురోగమింపగలరు. ఈ విధమైన ఏకా గ్రతను శరీర కండరములవలెనే అభివృద్ధిపరచుకొనవచ్చును. వివిధమైన పద్ధ తుల నవలంభింపవచ్చును. వివిధమైన తర్ఫీదుల పొందవచ్చును. ఉదాహ రణకు; అమితబలహీనుడుసైతము, క్రమశిక్షణతో ఎవ్వనికి దీసిపోనంతటి బల మును సంపాదించుట మనము చూచుచున్నాముగదా! మైనపువత్తి దీపము అటూ ఇటూ కొట్టుకొని ఆరిపోవునట్లు చపలమైన సంకల్పము ప్రయోజన పడదు.

దృఢసంకల్పము, ఏకాగ్రత సాధింపవలెను. క్రమబద్ధమైన సాధన విధా నము నవలంబించుటే కావలసినది. నీవు సంకల్పించినచో జయము బొందగలవు.

'ఏమిటి ప్రయోజనము?' అను ఆలోచన నీ సంకల్పమును బలహీన పరుచునట్టిది. అది నీలో ప్రవేశింపగూడదు. ఒకఁడు ఒకవిధమైన గుణ ముతో పుట్టెను కనుక అత డింకేమియు దాని విషయమున జేయ జాల డను అభిప్రాయము బుద్ధిహీనతవలన బుట్టినది.

* * *

డిసెంబరు 25, 1950

ఒక శిష్యుఁడు పిల్లల కిట్లు బోధించుచున్నాడు:

సంవత్సరములో దక్కువ కాలము గల దినము, సూర్యుడు ఎక్కువ క్షయమును బొంది దక్షిణమున మకరరేఖను జేరు డిసెంబరు 21వ తేదీతో సరిపోవు చున్నది. మఱల సూర్యుఁడు ఉత్తరమునకు ఎక్కి పోవును.

తల్లి దీనిపై వ్యాఖ్యానించుచున్నది:

అందువల్లనే. ఏసుక్రీస్తుకు పూర్వమే డిసెంబరు 25 దీపపు పండుగగా నుండినది. ఈ పండుగ క్రైస్తవమతమునకు పూర్వమే వాడుకలో నుండినది. ఈజిప్టు దేశములో ఇది ప్రారంభింపబడినది. బహుశా ఆ వెలుగు వచ్చు దినమే క్రీస్తు పుట్టుకదినముగా నిర్ణయింపబడి ఉండవచ్చును.

పిమ్మట తల్లి 1949 ఆగష్టు సంచికయందు ప్రక టింపబడిన "తరుగనిశక్తి" అను వ్యాసమును చదువు చున్నది. ఒకనిలో మానసికక్రియాకలాపము ఎక్కువై నప్పుడు శక్తులను పునఃస్థాపించుటలో సామర్థ్యము తగ్గుట ఎందుకు?

వయోజనులయందు మానసికచర్యలు ఎప్పటికప్పుడు శక్తుల మార్పిడిని స్తంభింపజేయును. అరుదైన కొందఱిని మినహాయిస్తే, ప్రతి శిశువు 14 సం॥ వయస్సు వచ్చునంతవరకు ఒక చిన్న జంతువు, ఆ బిడ్డ తన శక్తులను ఎప్పటికప్పుడు జంతువువలెనే అదే క్రియల మార్పిడితో పునరుద్ధరించుకొనును, అయితే మనస్సు చపలత్వమును ఆ శిశువులో ప్రవేశపెట్టును. ఎప్పటికప్పుడు సంభవించు క్రియలకు బదులు తెలిసికోవలెననుట, క్రమబద్ధము చేసికోవలె ననుట, నిశ్చయించుకొనవలెననుట తాపుచేసికొనును, తిరిగి ఎప్పటికప్పుడు శక్తిని పునఃస్థాపించుకొనగల బలమును సంపాదింపవలెనంటె, ఒకడు సహజ ప్రవృత్తిని దాటి ఒక మెట్టు పైకి పోవలసియుండును, అనగా, సామాన్య మానసిక క్రియాశీలత్వమును దాటి నేరుగా బోధస్ఫూర్తి జ్ఞానమును చేరవలయును.

(తల్లి చదువుచునే ఉన్నది.)" .... అయినప్పటికి శక్తిఉత్పాదనమార్గము ప్రత్యేకముగానున్నది. అది ఒక తూరి కనిపెట్టబడినట్లయితే, మఱెప్పటికిని—బయటిపరి స్థితులు, జీవితములోని భౌతికస్థితిగతులు ఏవిధముగా ఉండిననూ—యెండిపోనేరదు. దానిని ఆధ్యాత్మికశక్తిగా అభివర్ణింపవచ్చును. అది క్రిందనుండి గాని, అచేతనపు లోతులనుండిగాని కాక, పైనుండి, మానవునకు సమస్త విశ్వమునకు పుట్టుకస్థానమైన ప్రదేశమునుండి, సంపూర్ణ

శక్తివంతమైన, శాశ్వతమైన, ప్రకాశమానమైన పర చేతననుండి పుట్టుచున్నది. అది మన చుట్టునున్నది. అన్నిటిని చీల్చుకొని ప్రవేశింపగలదు. దాని సంబంధము పెట్టుకొని దాని నందుకొనుటకు, దానిని మనస్ఫూర్తిగ కోరుకొని విశ్వాసముతో, నమ్మకముతో దానికి తనను సమర్పించుకొనవలెను. తన చేతనను విశాలపరుచు కొనుటకు, విశ్వచేతనతో ఏకత్వమునందుటకు ఇట్లు చేయవలయును.

ఈ వ్యాసావళిలో నేను సామాన్య పదజాలములోనికి యోగాత్మక పరిభాషను మార్చుటకు ప్రయత్నించుచున్నాను. ఎందుకనగా, ఈ సంచికలు యోగాభ్యాసముచేయు విద్యార్థుల కొఱకైనప్పటికీ, సామాన్య జీవితము సాగించువారి కుపయోగపడును. సామాన్యులనఁగా, ఖచ్చితముగా భౌతిక, స్థూలజీవితము సాగించుచు, భౌతికజీవితమును సామాన్య పరిస్థితులకు మించి చక్కదిద్దు కొన ప్రయత్నించువారు. అది చాలా కష్టతరమైన పనియైనను అది యొక విధమైన యోగము. వీరు భౌతికవాదులమని చెప్పుకొందురు. యోగసంబంధమైన పరిభాషను ఉపయోగించినచో వీరు కోపతాపములకు గుఱియగుదురు. కావున, వీరికి భయోత్పాతము కలిగించని రీతిగా వీరి భాషనే మాట్లాడవలయును. భౌతికవాదులమని చెప్పుకొనుచు, యోగులమని చెప్పుకొనెడివారి కంటె తీవ్రమైన క్రమశిక్షణమార్గమును అనుసరించు ననేకులను నేను నా జీవితమందు ఎఱుఁగుదును.

మనము కోరునది మానవాళి పురోగమనము. వారు యోగాత్మక జీవితమును సాగించుచున్నారా లేదా అనునది గమనింపఁదగినది కాదు. వారు అభివృద్ధి గాంచిన చాలును.

## ధ్యానమునకు, ఏకాగ్రతకు గల భేధమేమి?

ధ్యానము, మానసికచర్యలకు సంబంధించినది. మానసిక జీవికే అది పరిమితము. ధ్యానముచేయుచు బుద్ధిని కేంద్రీకరింపఁజేయవచ్చును. కాని యిది మానసికఏకాగ్రతయే. నిశ్శబ్దత సాధించవచ్చును గాని, అది శుద్ధముగా మానసికశాంతి మాత్రమే. శరీరములోని యితర భాగములు నిశ్చలముగాను, నిష్కర్మముగాను, ధ్యానమునకు భంగకరము గానట్లు ఉంచబడును. నీవు దినమునకు ఇరువది గంటల కాలము ధ్యానములో నున్నను, మిగిలిన నాలుగు గంటల కాలము నీవు సామాన్యుఁడవే; ఎందుకనగా, నీవు మనస్సును మాత్రమే లగ్నమొనరించితివి. మిగిలిన ప్రాణకోశమును, భౌతికశరీరమును నీ ధ్యానమును భంగ పరుపకుండునట్లుగా ఒత్తిడిలోఁబెట్టితివి. ధ్యానముద్రలో నేరుగా ఇతర మానవ విభాగములకు ఏమియు చేయఁబడదు.

వాస్తవముగా ఈ వక్రమార్గము గుణముగలదే అయినను ఋజువైనది కాదు. ధ్యానముచేయుటందు అమోఘమైన శక్తిని ప్రదర్శించువారిని నా జీవితమున నే నెఱుగుదును. ధ్యానములో లేనప్పుడు వారు సర్వసామాన్యులే. పైపెచ్చు, దుస్స్వభావము గలవారు. తమ ధ్యానమునకు భంగము కలిగించినచో మండిపడుదురు. ఎందుకనగా, వారు తమ మనస్సును మాత్రమే అధీనములో నుంచుకొనిరి. ఇతరభాగములను స్వేచ్ఛగా వదిలిపెట్టిరి.

ఏకాగ్రత మఱింత క్రియాశీలత్వముగలది. నీవు మానసికముగా, ప్రాణపరముగా, భౌతికముగా, పూర్ణముగా ఏకాగ్రత సాధింపవచ్చును. ఏకాగ్రత అనగా, తన శక్తు లన్నింటిని ఒకచోటికి దెచ్చుట. ధ్యానముకంటె మిక్కిలి కష్టమైనది. నీలో ఒకభాగముగాని, ఎఱుకనుగాని, సంపూర్ణమైన ఎఱుకనుగాని, ఎఱుకలోని విభాగములనుగాని, కేంద్రీకరింపవచ్చును. అట్టియెడ, నీ ఏకాగ్రత

ఏకపక్షమైనది కావచ్చును, సంపూర్ణమైనది కావచ్చును. కాగా, వాని ఫలితములు వివిధముగా నుండును.

నీవు ఏకాగ్రతను సాధింపఁగలిగితే, నీ ధ్యాన మప్పుడు ఆసక్తిదాయకము, సులభతరము అగును. అయితే ఒకడు ఏకాగ్రత లేకున్నను ధ్యానము చేయవచ్చును. అనేకులు ధ్యానములో ఎడతెగని భావములను అనుసరింతురు. అది ధ్యానమేగాని ఏకాగ్రతకాదు.

ఒకఁడు సంపూర్ణ ఏకాగ్రతను సాధించిన క్షణమును, ఈ ఏకాగ్రతనుండి తన్నుతాను విశ్వచేతనకు సమర్పించుకొనిన తరుణమును వేరుచేసి తెలిసికొనుట సాధ్యమా?

అవును, తెలిసికొనుట సాధ్యమే. నీవు ఏదోఒకదానిపై బుద్ధిని కేంద్రీకరించెదవు, లేదా నీవు నీ శక్తుల నన్నింటిని ఒకచోటికి కూడగట్టుకొందువు. ఎప్పుడు నీవు ఏకాగ్రతను పరిపక్వముగా సాధించుకొందువో, ఎప్పుడు దీర్ఘకాలము దానిని నిలువరము చేసికొందువో, అప్పుడు ద్వారమొకటి తెరుచుకొని నీ సాధారణజ్ఞానమును దాటి, ఆంతరము, ఉన్నతము నైన జ్ఞానములోనికి ప్రవేశింతువు. లేదా, అందు నిమగ్నమైపోదువు. అటు తరువాత, దిగ్భ్రాంతి నొందించు కాంతిని అనుభవింతువు. ఆంతరంగికముగా అద్భుతమగు మహదానందమును, సంపూర్ణ జ్ఞానమును, సంపూర్ణ శాంతిని పొందుదువు. అనేక మార్గములకు అవకాశము లుండినను, దృగ్గోచరమగునది ఒకటే.

ఈ యనుభవము ఉన్నతోన్నతమైన పవిత్రతతో గూడిన దీర్ఘకాల ఏకాగ్రతపై ఆధారపడియున్నది.

ఈ యనుభవమును పొందవలయు నన్న ప్రతి దఫా బుద్ధిని కేంద్రీకరింప వలయునా?

ప్రారంభములోఁ జేయవలసినదే. ఎందుకనగా, నీవు సాధించినదానిని నిలుపుకొనుటకై ఏకాగ్రతను అత్యున్నతస్థాయిలో నుంచుకొనుటకు నీకు శక్తి చాలదు. తెలియకయే నీవు వెనుకకు జారిపోదువు. నీ యనుభవమును గురించిన జ్ఞాపకమును కూడ పోగొట్టుకుందువు. కాని నీవొక మార్గమును అనుసరించినట్లయితే, తిరిగి అదే మార్గమును, రెండవమారు, తదుపరి, అనుసరించుట సులభము. ఆంతరంగిక అనుభూతిని పోగొట్టుకొనకుండునంతటిస్థాయిని జేరువరకు నీవు బుద్ధిని కేంద్రీకరింప జేయు శ్రమను పడవలసినదే.

అప్పటినుండియు నీవు ఈ ఆంతరంగిక అధిచేతనలోనే తప్పనిసరిగా నుండిపోవలయును. ఆ స్థాయినుండి నీ వేమైనను జేయగలవు. అటనుండి నీవు నీ శరీరమును, భౌతికప్రపంచమును జూడుము. నీవు ఏమి చేయవలయునో, ఎట్లు చేయవలయునో నీకు దెలియును.

అదియే ఏకాగ్రతయొక్క మొదటి లక్ష్యము. కాని, అది సహజముగా కడపటిది కానేరదు.

అట్టి ఏకాగ్రతను సాధించుటకు గొప్ప ప్రయత్నము అవసరము. వెనువెంట, లేక త్వరితగతిని ఫలమును సాధించుట అరుదుగా పొసఁగును. అయితే, లోపలిద్వారమును ఒకతూరి తెరచినట్లయితే, అది మఱల తెరవఁబడుట తథ్యము, నీకు ఎట్లు శ్రమపడవలయునో తెలిసియున్నట్లయితే.

ఎంతవరకు తలుపు తెరవఁబడదో, అంతవరకు - నీవునీశక్తిని అనుమానింపవలసినదే. అయితే, అది ఒకతూరి తెరవఁబడితే, తరువాత అనుమానము

నకు చోటులేదు. నీవు బుద్ధిపూర్వకముగాను, అపేక్షతోను ప్రయత్నించు చున్నట్లయిన.

ఈ యనుభవమునకు అత్యధికమైన విలువగలదు.

'స్వప్నముల తల్లి' అన్నమాటకు అర్థమేమి?

అచలమైన, గంభీరమైన, చేతనను గుఱించి మాట్లాడినపుడు శ్రీఅరవిందులు అనేకరీతుల మిక్కిలి సూచనాత్మకమైన కవితాపదజాలమునే ప్రయోగింతురు. ఆయన తన్ను తాను తగ్గించుకొన్న స్థాయిలోనుండి, రహస్యమగు నెద్దానినైన గ్రహింపగల నేర్పుతో, విచిత్రమైన, అతిలోకమైన, సర్వసాధారణముగా తెలిసికొనరానిదైన దానిని చూడనేర్తురు. అట్లు చూచిన కారణముననే, 'స్వప్నములతల్లి' అని ప్రయోగించినారు. అయితే, మఱియొక కోణమునుండి చూచినచో, నీవు దానిని సృజనాత్మకజ్ఞానమని, విశ్వమునకు మూలకందమైనదని, విశ్వజనని యని, సృజనాత్మకశక్తి యని, ఇంకను ఏదేదో చెప్పగలవు.

చెడ్డగా ఆడినప్పుడు మనము శక్తిహీనులమని గ్రహించుచున్నాము. అయితే మనము అతి ఉత్సాహముతో, బాగుగా ఆడినట్లయితే, మనకు శక్తి వచ్చుటను గ్రహించుచున్నాము ఎందువలన?

అది నిజమే. ఇహలోకసంబంధమైన శక్తిస్పర్శను నీవు పొందగోరినట్లయితే, ఒకవిధమైన పొందికను నీలో నీవు స్థాపించుకొనవలెను. నీవు బాగుగా ఆట తెలిసినవాఁడవైతే, ఏ మార్గమును ద్రొక్కవలసినదీ తెలసినవాడవైతే, ఉత్సాహకరమైన శ్రద్ధను గైకొన్నవాడవైతే ఒక విధమైన ఆశా

భావముతో (బహుశా పిల్లచేష్ట గావచ్చు) జయించుటకు ఇచ్ఛగల వాడవైతే, అప్పుడు నీవు, విజయము గాంచుచున్నకొలది, సంపూర్ణము గానిదైనను శక్తి మార్పిడికి అవసరమైన పొందికను సృజింపగల హృదయానందమును అనుభవమునకుఁ దెచ్చుకొందువు. అట్లుగాక, అపజయమునెట్లు స్వీకరింపవలెనో తెలియనివారై, పరిస్థితులు తమ కోర్కెల కనుగుణముగా లేనప్పుడు చిడిముడిపాటుతో ఆగ్రహావిష్టు లగువారు, పొందికను గాంచజాలక, శక్తిని నానాటి కధికముగా గోల్పోదురు.

మఱియు, నీవు క్రుంగిపోవుదువేని, శక్తియొక్క వేళ్ళను సమూలముగా ఖండించుకొన్నవాడ వయ్యెదవు. అది సోమరితనమున పడిపోవుటకు మంచి త్రోవ. నీవు క్రుంగిపోకూడదు. దానిని పూర్తిగావ్యతిరేకించవలెను.

సర్వదా విషాదము అహంకారమునకు గురుతు. అది నిన్ను సమీపించుచున్నదని గ్రహించినపుడు, "నేను అహంకారరోగమున బడు స్థితిలో నున్నాను. నేను దానికి ఏమాత్రము లోనుగాక స్వస్థత పొందవలెను." అని పీకు నీవు చెప్పుకొనుట అవసరము.

* * *

డిసెంబరు 28, 1950.

"సరియైన తీర్పు" అను శీర్షికగల 1949 నవంబరునాటి సంచిక నుండి ఒక వ్యాసమును తల్లి చదువుచున్నది. మన తీర్పును పెడమార్గము పట్టించు అనేక సూక్ష్మాంశములను పరిశీలించిన యనంతరము తల్లి ఈ క్రింది వ్యాఖ్యను జతపరుచు చున్నది:

వ్యక్తియొక్క మానసికస్థితికి లోఁబడి కర్మేంద్రియములు పనిచేయు చున్నవి. ఎందువల్లననఁగా, చూపుయొక్క గ్రహింపునకు, బుద్ధియొక్క స్వీకృతికి మధ్య ఏదో అడ్డుపడుచున్నది. అది సూక్ష్మాతిసూక్ష్మము. నాడుల ద్వారా దృష్టి పర్యాలోకనములను బుద్ధి గ్రహించుచున్నది. ఇచ్చట హేతువాదము లేదు. అది వెనువెంటనే సంభవించునది. అయితే, దృష్టి పర్యాలోకనమునకును, ప్రత్యుత్తరమివ్వగల, విషయవిమర్శనమున విలువ గట్టగల బుద్ధిలోని ఒక విభాగమునకును మధ్య కొంత వ్యవధి ఉన్నది. ఈ బుద్ధిలోని మదింపే భావముల పలుకుబడికి లోఁబడియున్నది. కనుచూపు, బుద్ధి మదింపుల మధ్యగల ఈ చిరుకంపనమే అనేకముగా జవాబును పెడదారిని బట్టించు చున్నది. మంచి విశ్వాసమును గురించిన ప్రశ్నగాదిది. ఎందురనఁగా, అత్యంత నమ్మకముగలవారు కూడ ఏమి జరుగుచున్నదో తెలియజాలరు. తీవ్రావేశము లేని, ఆవేశమేమిటో గ్రహింపలేని నెమ్మదిపరులు కూడ పెడదారిని బట్టించు స్వల్పకంపనమును గ్రహింపలేని స్థితిలో దాని పలుకుబడికి లోనగుచున్నారు.

కొన్ని సమయములలో నైతికాభిప్రాయములు మిశ్రమమై తీర్పును అసత్య మొనరించును. అందువలన, వానిని దూరముగా నెట్టివేయవలయును.

నీతి, సత్యములు ఒకదానికొకటి అమితదూరమున నున్నవి. (ఈవిధముగా జెప్పి ఎవరినైనా విస్మయచిత్తులను జేసినయెడల నేను చింతిలుచున్నాను. అయితే అది అంతే.) నీవు అన్ని ఆకర్షణలను, అనిష్టములను జయించినప్పుడే అసలైన వివేకము గలవాడ వగుదువు. ఎంతవరకు నిన్నాకర్షించునవి నిన్ను వెనుకకు త్రిప్పునవి గలవో అంతవరకు, నిరాటంకమగు నిజమైన వృత్తిని నీ కర్మేంద్రియములు చేయఁజాలవు.

అందరికి తెలిసిన తార్కాణమును చెప్పుచున్నాను. ఒక ప్రమాదము సంభవించినపుడు దానిని చూచినవారు ఇద్దరు, ముగ్గురు, లేదా పదిమంది ఉండవచ్చును. అయితే, అందఱు ఒకదానినే చూడరు. ఒకటి సంభవించినపుడు దానిని ఒకే విధముగా చూచినవా రిద్దరైనా నుండరు. వారికి అంతరంగికముగాఁ గలిగిన దిగ్భ్రమవలన దానిలో ఏ చిన్న అంశమునో చూతురు.

అయితే, అనుకూల వ్యతిరేక భావములను సమన్వయము చేసికొను మార్గము గలదు. వానిని రెంటిని ఒకే మార్గమునందుగల రెండు కొసలని భావించి వాని మధ్య ఒకదానివెంట ఒకటి వచ్చు అనేక భావములను ఉంచినట్లయితే, వానిలో సమన్వయమున్నదని గ్రహింతువు.

(తల్లి చదువుటను సాగించుచునే ఉన్నది):

"ఎవడైతే యిష్టానిష్టములకు, కోరికలకు, ఎన్నికలకు, ఉపరిభాగమున నున్నాడో వాడే పూర్తి నిష్పక్షపాతముతో విషయములను, అతిసూక్ష్మమైనట్టిదియు, చక్కఁగా దీర్చిదిద్దబడినట్టిదియు, సజీవమై విశదమగు ఎఱుకను గలిగినట్టిదియు, నగుదుర్భిణీయంత్రము, విశుద్ధమగు వస్తుదృష్టితో చూచినట్లు చూడగలడు."

నేను వస్తుదృష్టి అనుచున్నాను. వస్తుముఖముగా జూచుట యనఁగా, తన వ్యక్తిగతమైన వాసనలను రంగరింపక, వ్యక్తిగతమైన అభిప్రాయములను వానిపై రుద్దక చూచి నిర్ణయించుట. వ్యక్తిగతమైన భావములను మిశ్రమము సేయక, ఒక వస్తువును విశుద్ధముగా జూచుట తప్పనిసరిగా నేర్చుకొనవలెను.

నే నింకను దీనికి జేర్చుచున్నాను. ఈ చక్కని యంత్రము సజీవమై, విశదత్వము లేనిదే దేనినీ చూడలేదు. ఎఱుక ఒకటైనప్పుడు, రూపురేఖలను బట్టి గుర్తింపగలదు. అది యెట్లనఁగా, నీవు నీ ఎఱుకను, నీవు తెలిసికొనగోరు, నిష్పక్షపాతముగా దీర్పు జేయగోరు, వస్తువుతో గాని, వ్యక్తితో గాని, జతపరిచి ఆ వస్తువుయొక్క, లేదా ఆ వ్యక్తియొక్క, ఆంతరంగిక స్పర్శను బొందినప్పుడు పూర్తి నిజాయితితో తెలిసికొనుట కప్పుడు అవకాశము లభించును.

ఏమి చెప్పితే ఏమి జరుగునో అను ఆందోళన నిర్ణయమును వక్రపరచును; అసత్యమునకు ముడిపెట్టును. సంపూర్ణతగల నిజమైన వివేకమును కలిగియుండవలెనన్న, అమలుపరుచుటకు వాంఛారహితముగా చర్యతీసుకొనుటను తెలిసియుండవలెను. వేయిమందిలో ఒకఁడట్లు చేయగలడు. అత్యధికులు ఫలితమును బొందుటకు, ఆందోళనను, లేక ఆశను కలిగియుందురు. నీవు చేయవలసినట్లుగా జూచితివి కనుక ఆపని చేయుము. నీవీ విధముగా ననుకొనుము: "నేను చేయవలసినది ఈ పని కనుక చేయుచున్నాను. తర్వాత ఏమిసంభవించునో అది నాకు సంబంధించినది కాదు."

అది విశదమైన, అందఱు అనుసరింపఁదగిన మార్గము. దానిని అందుకొన నంతవరకు క్రియ సర్వదా మిశ్రమమైనదిగా నుండును. అందువలన సత్యమును విశుద్ధమైన దృష్టితో తెలిసికొను అవకాశము లేకపోయినట్లయితే నీవు ఒక నియమమును నీదిగా స్వీకరించి నీవు చేయవలసిన దానిని చేయుము.

ఎందుచేతననఁగా, నీవు దానిని మినహాయించి చేయుటకు ఏమియు లేదు కనుక.

* * *

డిసెంబరు 30, 1950

"మేము జయమును కోరుటలేదు, మా లక్ష్యము పరిపక్వతను సాధించుట. మేము మహిమను, ప్రఖ్యాతిని అపేక్షించుటలేదు. మేము దైవసాక్షాత్కారమును పొందుటకు సిద్ధపడుటయే మా వాంఛ."

(తల్లి, 'ఆటపోటీలు' : బులెటిన్ 1950, ఏప్రిల్)

పరిపక్వత అనగా నేమి ?

కొందఱు పరిపక్వతను శిఖరమునందు నుంతురు. కొందఱు పవిత్రత సాధింపఁదగిన అంత్యలక్ష్యమని సామాన్యముగా భావింతురు. అయితే పవిత్రత లక్ష్యశిఖరమును గాదు; చివరిదియును గాదు. అసలు చివరిదన్నది లేదు. నీ వేమి చెప్పినప్పటికి కొంత మంచి అందులో ఉన్నది. ఈ కొంత మంచి ఉండుటకు గల అవకాశమే అభివృద్ధికి దోహదము.

చివరిది లేనప్పుడు మనము పరిపక్వతను ఎట్లు సాధింపగలము ? మనము కొంత అభివృద్ధిని సాధించినపుడు పరిపక్వతవైపు పయనించుచున్నా మనవచ్చునా?

నీవు పరిపక్వతను, అభివృద్ధిని మిశ్రము చేయుచున్నావు. నీవు పరిపక్వతవైపునకు పయనింపక పోవచ్చును. అభివృద్ధిలో కొంత పరిపక్వత బహుశః ఉండవచ్చును. అయితే అభివృద్ధి పరిపక్వత అని చెప్పరాదు. అభివృద్ధి ఆరోహణకు సూచనమాత్రమే. పరిపక్వత మధురమైన పొందిక; సమతాస్థితి అగును.

అయితే, సమతాస్థితి యన నేమి? ఇక్కడున్నవారిలో ఎవరైనను ఇంచుకేనియు ప్రకృతిశాస్త్రమును చదువుకొన్నవా రున్నారా?

త్రాసు కిరువైపుల నున్న తక్కెడలలో సమానమైన బరువులను వేసినప్పుడు సమతాస్థితి ఏర్పడినదని చెప్పవచ్చును.

అవును. అదియే సరియైనది. పరిపక్వత సమతాస్థితి యని నేను చెప్పినప్పుడు నా యర్థమేమి?

ఒక పరిస్థితిలో, సాక్షాత్కారానుభూతికి వ్యతిరేకత ఉన్నప్పుడు, అనగా దానిని అడ్డుతగులునది ఉన్నప్పుడు దానిని చైతన్యశక్తితో జయించినచో, తత్ఫలితముగా సాక్షాత్కారోపలబ్ధి కలుగును.

అవును అది యించుమించుగా అంతే. అయితే, నేను మఱియొక విధముగాఁ జెప్పుచున్నాను.

పరిపక్వతాభావము దైవమునుండి మనకు లభించిన ఒకానొక విశేషము. అది ఒక మెట్టునుండి ఒక మెట్టుకు

దిగవచ్చును. మనము ఒక మెట్టునుండి ఒక మెట్టుకు ఏక్కి పైకిపోదుము,

ఇది ఒక పరిణామభావము. సృష్టి ఉన్నతోన్నతపరిధి చేరినప్పుడు, పరిపక్వత చెందినట్లు సర్వదా చెప్పబడుచున్నది. అయితే అది, అది కాదు. ఈ యభిప్రాయమును నేను ప్రతిఘటించుచున్నాను. ఇది యంతయు అభివృద్ధిపథములో ఒక మెట్టు. అది యెట్లన, ప్రకృతి తాను ఉన్నస్థితిలో చిట్టచివరి మెట్టును జేరుకొనినతర్వాత, ఇక తాను ముందుకుసాగలేనని తెలిసికొనినప్పుడు, ఇక కదలజాల ననుకొన్నప్పుడు, సర్వమును నాశనమొనర్చి తిరుగ ప్రారంభించును. ఇది పరిపక్వత అని చెప్పబడజాలదు. పరిపక్వత నాశనము చేయబడరానిది. ప్రకృతి దేనిని ప్రారంభించినదో దేనిని ఇఁక మీదట చెడగొట్టజాలదో అదిమాత్రమే పరిపక్వత సిద్ధించినదగును. అది చాలదని నమ్మిగాని, తాను కోరిన దదికాదని గాని ప్రకృతి క్రమానుగతముగా నాశనము చేయని దృష్టాంత మొక్కటైనను ఈ తరుణములో లేదు, అందుచే తన సృష్టి కార్యక్రమములోనే పరిపక్వతను సాధించినదనుటకు వీలు కాదు. తాను చేసినదానిని చెడగొట్ట నవసరము రాలేదనుట దాని అత్యున్నత దశ.

మీరు, మనము జయము నన్వేషించుట లేదని చెప్పుచున్నారు. అయితే, జయము ఒక విధమైన పరిపక్వత కాదా ?

సామాన్యమానవునిబుద్ధికి, జయము బహుశా పరిపక్వత యగును; అయితే, మనకు కాదు.

పరిపక్వత స్తబ్ధతగా నుండు స్థితి గాదు, అదియొక సమతాస్థితి,—దిన దినాభివృద్ధి జెందుచు కార్యశీలతగల సమతాస్థితి. ఒకడు పరిపక్వదశనుండి

వేరొక పరిపక్వదశకు పోవచ్చును. అటనుండి క్రిందకు దిగి ముందుకు సాగిపోనవసరము లేనట్టి ఒక స్థాయికి రావచ్చును. ప్రకృతమున ప్రకృతి గమనము ఆ విధముగా నున్నది. అయితే, ఈ నూతనస్థాయిలో వెనుకకు దిరిగిపోయి అక్కడినుండి మళ్ళీ ప్రారంభించుటకు అవకాశమివ్వక ఒకడు ఎక్కడా నిలువక సదా ముందుకు సాగిపోవచ్చును. ఇప్పటి పరిస్థితులను బట్టి, ఏ యొకరును, ఒక దశకు చేరుకొని, ఇప్పటి మానవ ప్రకృతి ననుసరించి మేర లేకుండా అభివృద్ధిపథమున ముందుకు సాగలేరు. ఒకడు తప్పనిసరిగా ప్రస్తుత మానవజాతినుండి పైజాతికైనా పోవలెను; లేదా ప్రస్తుతమానవజాతిని వదలి క్రొత్తజాతినైనను సృష్టించుకొనవలెను. మానవుడు ఇప్పుడు తానున్నస్థితిలో పరిపక్వతను తనను దాను అతిక్రమించిపోనిదే సాధింపలేడు. మానవుడు అవస్థాంతరప్రాప్తి నందుకొనుదశలో నున్నవాడు. మామూలు భాషలోచెప్పుదుమేని, —"ఓ! మానవుడు పరిపక్వత చెందినవాడ" డనియే చెప్పవచ్చును. కాని, అదిఒక అలంకారికోక్తి మాత్రమే. ఇప్పుడు మానవుడు అధికతరముగా సాధింపగలది అభివృద్ధిలేని సమతాస్థితిమాత్రమే. స్థాణువుగా నుండు సమతాస్థితి. అయితే, స్థాణువుగానున్న దేదైనను అభివృద్ధిలేని కారణమున ముక్కలుగా పగిలిపోగలదు.

పరిపక్వత యనునది మానవుని సకల విభాగము లందును దైవిక (దివ్య) సంసిద్ధిని పొందుట కాదా?

అది కాదు - నీ వాలోచించునది మఱలా అభివృద్ధిలోని ఒకమెట్టు కాగలదు కాని పరిపక్వత కాదు.

ఇప్పుడు మనము నిర్వచనముచేయుటకు ప్రయత్నింతము, అది అన్నింటికి సరిపోవునట్లు, అనఁగా వ్యక్తికి, సమాజమునకు, భూమికి, విశ్వమునకు అన్వయించునట్లుండవలెను. సంపూర్ణత వ్యక్తిలోను, సమాజములోను, భూమి

లోను, విశ్వములోను, సాధింపవచ్చునని యనవచ్చును. అప్పుడు, ప్రతిఘడియ లోను, గ్రహణశక్తి నాణ్యమునందును. పరిమాణమునందును, ఆవిష్కరింప బడు శక్తికి సమానముగా నుండును.

అదియే అత్యున్నత స్థితి.

అందుచేత, పైనుండి వచ్చుదానికి, క్రిందినుండి జవాబు చెప్పుదానికి చక్కనైన సమస్థితి ఉండి, అవి రెండును ఐక్యము చెందినప్పుడున్న స్థితియే సమతాస్థితి. అదియే దివ్యసాక్షాత్కారము, దానిని అనుభవమునకు దెచ్చు కొనుచో అయ్యది నిత్యాభివృద్ధిదాయకముగ నుండును.

అదే వ్యాసమును తల్లి చదువుచునే ఉన్నది.
"....'అగుపించుట' కంటె, 'అగుట' శ్రేయస్కరము, మన శ్రద్ధ పరిపక్వత చెందినదైతే, మనము మంచిగా అగుపడ నవసరములేదు. పరిపక్వతగల శ్రద్ధ అనగా మన అర్థమేమన, మన అన్ని ఆలోచనలలో, మన అన్ని సంకల్పములలో, మన సమస్త ఇంద్రియజ్ఞానము లలో, మన క్రియలలో మనము వ్యక్తమొనర్చునది మన యందున్న సత్యముదన్న అన్యము గాదు.''

నీవు సంపూర్ణశ్రద్ధాళువైనప్పుడు, నీవు నీలోని సత్యముతోను, సమైక్యతతోను, జీవించుటకు నిత్యప్రయత్నము చేయుచునేయుందువు. నీ వాలోచించు అంతటిలోను, నీ అనుభవములలోను, నీ చర్యలలోను ఎంత పరిపూర్ణత గలిగియుండుటకు సాధ్యమో అంత, ఎంత పూర్తిచేయదగునో అంత, నీవు ప్రతిఘడియ, ఉన్నతోన్నత నియమముతో సమైక్యత గలిగియుండుటకు ప్రయత్నించుము - లేక నీవు నీలోని సత్యదృష్టితో దాని నెఱిగినవాడవైతే నీవు

నిజమైన శ్రద్ధను జేరినవాడ వగుదువు. నీవా విధముగా నున్నవాడవైతే, అహంకారపూరితములైన భావములతో చర్యగైకొనకుండువాడవైతే, నిన్ను ప్రపంచమంతయు ఏరీతిగా నిర్ణయించినను నీకు స్వచ్ఛముగా నంతయు నొకటే. ఈవిధమైన పరిపూర్ణశ్రద్ధగల స్థితిలో నిన్నితరులు, నీవు మంచివాడవనియు, లేదా నిన్ను అంగీకరించవలెననియు నీవు భావనసేయ నవసరము లేదు. నీకు నీ నిజమైన జ్ఞానదృష్టియందు నీ యనుభవమునకు వచ్చు మొట్టమొదటి విషయమేమన, నీవితరులకు ఏవిధముగా కనబడవలెననునది నీవు సరకుజేయవు. ఇతరులకు నీవు ఏవిధముగా కనిపించినను ఉపేక్ష, కాఠిన్యము, గర్వము మున్నగునవి కలవాడవుగ గన్పట్టినను,—ఇది యంతయు అముఖ్యము. పునరుక్తియైనను మరల చెప్పుచున్నాను. నీవు పరిపూర్ణశ్రద్ధ గలిగియుందువేని, అనగా నీవు నీలో ఉన్న ఆంతరంగిక కేంద్రసత్యమును అనుభవమునకు దెచ్చుకొనుటకే జీవించియుంటినను విషయమును ఏమరకుందువేని,—ఇక తక్కిన దానికి ఎట్టి ప్రాముఖ్యము లేదు.

భగవంతుని దప్ప మఱెవరిని గాని సంతృప్తిపరచుట పరిపూర్ణతలోని భాగము కాదుగదా?

అవును, అట్లే చెప్పవచ్చును. అయితే, ఒకడు పరిపూర్ణముగా శ్రద్ధలేనివాడైతే, ఒకడు తన్ను తాను సులభముగా మోసగించుకొనువాడైతే, ఒకడు సంతోషకరమని భావించితే, ఇట్లు చెప్పును, "ఓ, నేను భగవంతుని సంతోషపెట్టుచున్నాను. ఇది నిజము" అని.

* * *

జనవరి 4, 1951

తల్లి 1950 ఆగస్టు బులెటిన్‌లోని "రూపాంతరము" అనువ్యాసమునుండి చదువుచు వానిపై వ్యాఖ్యానించు చున్నది :

మనము కోరునది సంపూర్ణ రూపాంతరము. రూపాంతరమునుగుఱించి సాధారణముగా ఎవరైన మాట్లాడినప్పుడు, అది ఆంతరంగికచేతనకు సంబంధించినది మాత్రమేనని భావించుటయు, తనలోని గూఢచేతనను కనుఁగొనుటకు ప్రయత్నించుటలో శరీరమును, దానికి సంబంధించిన చర్యలను, అపరోధములను పనికిరానివని వదలిపెట్టి, ఆంతరంగికమైన వ్యవస్థపై శ్రద్ధవహించుటయు జరుగుచుండును. శ్రీఅరవిందులు ఇది చాలదని ప్రకటించిరి. పరమసత్యము, భౌతికప్రపంచముకూడ రూపాంతరముచెందవలయుననియు, నిగూఢమైన సత్యస్వరూపప్రతిబింబము కావలెననియు కోరుచున్నది. అయితే, ప్రజలిది వినినప్పుడు. అనేకులు శరీరమును, దానికి సంబంధించు చర్యలను రూపాంతరము చెందించవచ్చుననియు, అంతర్గతముగా ఏమి జరుగుచున్నను లెక్కచేయ నవసరములేదనియు భావించిరి. సహజముగా ఇది సత్యము గాదు. కష్టతరమైన భౌతికరూపాంతరీకరణమునకు సంబంధించిన చర్యల గైకొనుటకు ముందు, నీ ఆంతరంగికజ్ఞానము గట్టి పునాదులపైన స్థాపింపఁబడవలెను; ఎందుకనగా, ఈ రూపాంతరము సత్యముయొక్క కడపటి అభివ్యక్తి గావలసియున్నది.

రూపాంతర్గీకరణమున ప్రారంభాంశము ఇదివరకే చెప్పబడినట్లు గ్రహణశీలత యని చెప్పనగును. రూపాంతరమునొందుటకు త్రోసివేయరాని నియమమది. దానిననుసరించి జ్ఞానమున మార్పు ఏర్పడును. ఎఱుకలోని ఈమార్పునకు సిద్ధపడుట త౯ుచుగా కోడిగ్రుడ్డులో పిల్ల ఏర్పడు పద్ధతికి పోల్పఁబడి

నది. పొదుగులోనున్న గ్రుడ్డు కడపటి ఘడియవరకు యథాతథముగా నుండును. మార్పు లేదు. పిల్ల పూర్తిగా నేర్పడి, ప్రాణము పూర్తిగాఁ బ్రవేశించినపుడు ఆ పిల్లయే తన ముక్కుతో పై పెంకును బొక్కచేసికొని బయటికి వచ్చును.

అదేవిధముగా ఎఱుకలో మార్పువచ్చినప్పుడును జరుగును. చాలాకాలము వరకు ఏమియు జరుగలేదను భావము నీకు కలుగును. నీయెఱుక యథాతథముగానే యున్నదనుకొందువు. నీకు తీవ్రమైన ఆకాంక్ష ఉన్నట్లయితే, నీవు గోడమీదకొట్టినట్లును, అది లోబడకపోయినట్లును అడ్డగించుచున్నట్లును, భావము నీయందుకల్గును. అయితే, నీవు ఆంతరంగికముగా సిద్ధపడినప్పుడు, కోడిపిల్ల పెంకును పొడిచినరీతిగా నీవు పొడిచినంతనే సర్వము తెఱవబడి నీ ఎఱుక మఱియొక జ్ఞానమునందు ఉబికి ముందుకువచ్చును,

ప్రధానమైన సమస్థాయియొక్క విప్లవమని దానిని బేర్కొనిరి. ఎట్లనగా చదునైన ప్రక్కలుగల గాజుకడ్డీలో కాంతిరేఖ ప్రసరింపజేసిన ఏమిజరుగునో అట్లే మొత్తముచేతన మార్పిడి చెందును. లేక అది బంతియొక్క లోపలి భాగమును వెలుపలికి త్రిప్పినచందముగ నుండును. అది నాలుగవపరిమాణమున గాని సాధ్యపడదు. ఒకఁడు సామాన్యమైన మూఁడుపరిమాణములుగల ఎఱుక నుండి ఉన్నతస్థాయిలలోనున్న నాల్గవపరిమాణమును ప్రవేశించుటకు బయటికి వచ్చును. తర్వాత అసంఖ్యాకమైన పరిమాణములందు ప్రవేశించును. ఇది తప్పించుకొనలేని ప్రారంభదశ. నీ ఎఱుక తన పరిమాణమును మార్చుకోనట్లయితే ఎక్కడవేసిన బొంత అక్కడే పడియుండి, వస్తువులయొక్క పైపై చూపునుమాత్రమే కలిగియుండును, లోతైన జ్ఞానము నీనుండి తప్పించుకొని పోవును,

ఈ చేతనయొక్క మార్పులో ఇదివరకే అనుభవమును సంపాదించిన వారే ఒకరైన ఇక్కడఉన్నారా, అతఁడు తన అనుభవమును విశదపరచ గలఁడా?

గుండెలో నొప్పివంటిది ఒకరోజంతయునుండెను. మరుదినము నేను నిద్రనుండి మేల్కొనఁగా నేనొక సంపూర్ణ సమాధినుండి బయటికి వచ్చినట్లున్నది. నా అన్ని ఆలోచనలు, అన్ని చర్యలు, నాతలవైపున నిలుచుండి నన్ను కనిపెట్టుచుండిన ఒకానొకరి వలనగాని, ఒకదాని చేతగాని ఆజ్ఞాపింపఁబడి నట్లున్నది. నా నోటి నుండి వెల్వడు అన్ని మాటలు సత్యముగా నుండినవి.

ఈ గుండెనొప్పి ఏవిధముగానున్నది? ఒకకత్తిడివలెనా? చీల్చబడినటులనా? ఈడ్వబడినటులనా?

నాలో ఏదో సంతోషరహితముగా నుండినట్లు తోచినది. అది అంతయు రాత్రికాలమున మార్పుచెందినది. మరుదినము ఆ వ్యాకులత గతించిపోయినది.

అది ఉన్నతచేతనకు మానసికద్వారము తెరచుకొనుటయే. ఉన్నతచేతనకు మానసికచేతనయొక్క ఆరోహణమే అది. బహుశా ప్రాణకోశపు ఆవేశయుతమైన ఆందోళనయందు గల్గిన ఘర్షణయే ఆ నొప్పికి కారణమైయుండవచ్చును. ఆ అసంగతమైన ఘర్షణ ఉన్నతస్థాయిలో విడుదలయైన ఎఱుక వలన అదృశ్యమైనది.

నేను శ్రీఅరవిందుల ఎదుట నిలబడినప్పుడు ఒక విధమైన చురుకుదనముగల బాధకు గురియైతిని. నేను శ్రీఅరవిందులను ఏదియో యిమ్మని ప్రార్థించితిని. వెను వెంటనే బాధ అమితానందముగా మారినది.

ఇది నీ ఆత్మ చైతన్యపు వ్యక్తిత్వముతో గల్గిన సంబంధము.

భూమియొక్క ఉపరిభాగమున చేతనయొక్క ఆరోహణము ఒకనికి తరచుగా అనుభవమునకు వచ్చుచుండును. జవాబును పొందుటకు బదులుగా అన్ని సమస్యలు, అన్ని ప్రశ్నలు, అదృశ్యమగు ప్రదేశమును, అతడు చేరుట సంభవించును. ఆ సమస్యలకిక ఎట్టి ప్రాముఖ్యము ఉండనట్లే తోచును. అయినను ఇది ఒక జ్ఞానము నుండి మఱియొక జ్ఞానమునకు పురోగమించుట కానేరదు.

ఇది లోపలనున్న వ్యక్తికి భగవంతుని సన్నిధానమును ఆధ్యాత్మిక కేంద్రమున సాక్షాత్కరింపఁ జేయుటయైయున్నది. అక్కడ నీకు ప్రతిక్షణము లోను, ఏమిచేయవలయును? అనునదియే గాదు; ఎందుకు చేయవలయును? ఏవిధముగా జేయవలయును? అనునదియు విశదమైపోవుచుండును. అచ్చట నీకు కనబడువాని వెనుకనున్న సత్యముయొక్క దృశ్యము సాక్షాత్కారమగును. మామూలుగా మానవుడు వెలుపలినుండి వస్తువులను జూచుట జరుగుచున్నది. ఇట్లు ఎక్కువగా వెలుపలనుండియే చూచుకారణమున, ఏదోకొన్ని సందర్భములందు దక్క ఇతరమనుష్యుఁ డేమని భావించుచున్నాడో తెలిసికొన అశక్తుఁడగుచున్నాడు. (నీవు ప్రబల ప్రయత్నముతో వస్తువుల బాహ్యమును మాత్రమే చూతువుగాని, లోపల ఏమి జరుగుచున్నదో తెలిసికొనలేవు) కాని, అంతరంగమున ద్వారము తెరుచుకొన్న తర్వాత ఆధ్యాత్మికకేంద్రములో సాక్షాత్కా

రము పొంది నీవు భగవంతుని గుర్తించిన వెనుక, వస్తువులను లోపలి నుండియే వెలుపలికి చూడఁగలవు. వెలుపలి మనుగడ లోపల చూచినదానికి ఒక విధమైన వక్రరూపమై గోచరమగును. భూతజాలపు ఆంతరంగిక జీవన స్వరూపము నీకు తెలియనగును. వాని బాహ్య జీవితము ఇంచుమించుగా లోపలిసత్యమునకు వక్రభాష్యమేయగును, ఇందువలననే మూలభూతమగు సమస్థితి పూర్తిగా మార్పుచెందినదని చెప్పుచున్నాను. ప్రపంచమునకు వెలుపలగా నుండి వస్తుజాలమును నీకు వెలుపలనున్నట్లుగా జూచుటకు బదులు, నీవు ప్రపంచమును లోపలనుండి చూడనేర్తువు. బాహ్య వస్తువులు ఇంచుమించుగా లోపల నున్నదానికి వికృత రూపములై కానవచ్చును. లోపల కానుపించినదే నీకు సత్యము.

* * *

జనవరి 8, 1951

1950 అగస్టు బులెటిన్ నుండి తల్లి ఒక వ్యాసమును
చదువుచున్నది : "బిడ్డ ఏమి తెలిసికొనవలెను."

> "తుదకు సత్యము జయించు" నను నిశ్చయము ఒకని కుండవలెనని మీరు చెప్పుచున్నారు, అయితే, ఈ నిశ్చయము ఒకడు బోధించుదానితో భేదించుచున్నది, కేవలము దానికి వ్యతిరేకమై కానవచ్చుచున్నదికూడ!

అవును. సామాన్యముగా ప్రకృతిలోని అభ్యర్థనలు ఎల్లప్పుడు చెడ్డగా ముగియునని నమ్మట జరుగుచున్నది. జీవితములో జయప్రదముగా భోగముల ననుభవించిన తర్వాత దుఃఖకరముగా ముగిసిన కొందఱి జీవితమును, అసాధారణ శక్తియుక్తులు గలిగియు, తుదకు వానిని గోల్పోయిన కొందఱి

చరిత్రలను, అత్యద్భుతమైన నాగరికతతో విలసిల్లి ఆదర్శప్రాయమైన ఒక జాతి, నాగరికత అదృశ్యమైపోగా దుఃఖకరమైన పరిణామమునుజెందె, స్మృతి పథములో కూడ నిలువలేకుండా పోయిన గాథలు, అందఱికి తెలిసినవే. భూగోళము యొక్క చరిత్రను చూచినట్లయితే, విజయ పరంపర, దాని వెంట అపజయ ములు, వానివెంట మఱల విజయపరంపర, సంభవించినదిగా ఉన్నదికదా?

అయితే, విశ్వజనీనమైనట్టియు, భగవత్సంబంధమైనట్టియు, సమస్య వచ్చి నప్పుడు, విశ్వజనీనదృష్టి, దైవికమైన జ్ఞానము, సత్యమెట్లు అభివ్యక్త మగు చున్నదో ఎఱుంగుటకు కావలసియున్నది. సామాన్యముగా సర్వము దుఃఖాంత మగునను అభిప్రాయమున్నది. దానిప్రకారము, శుభప్రదముగా ప్రారంభమై నవి చెడుగా ముగియునని, బలహీనత, (ఆషాఢభూతుల విజృంభణము) వంచన, అసత్యము, దుష్టత్వము, సర్వదా పైచేయిగా నుండునని. అందు చేతనే వైయక్తిక దృష్టితో ప్రపంచమును చూచువారు ప్రపంచము చెడ్డది, దానిని నాశనమొనర్చి, దానినుండి సాధ్యమైనంత త్వరలో బయట పడవలెను, అనుచున్నారు. బోధకులు దీనిని బోధించిరి. అయితే, వారి బోధన, వారి చూపు సంకుచితమైనదని, వారి వ్యక్తిగతాభిప్రాయమని ఋజువగుచున్నది.

నిజానికి, ప్రకృతిచైతన్యము ఆటుపోటులవంటిది. అది ముందుకు సాగును, వెనుకకు తగ్గును, పురోగమించును, తిరోగమించును. దీని యర్థ మేమన, విశ్వ జీవితమునందేమి, భూలోక జీవితమునందేమి, తిరోగమనముతో త్రుంచబడినట్లు కానవచ్చినను అది పురోగమనమే. తిరోగమనములుగా మనకు గోచరించినను, అవి నిజముగా వెనుకకుతగ్గి ముందుకుపోవు వానిని పోలియున్నవి. నీవు వెనుకడుగు వేసినట్లున్నను అది ముందుకు సాగిపోవుటకే.

ఇదంతయు బాగుగనే యున్నదిగాని, విద్యార్థికి సత్యము జయించునని ఎట్లు బోధించుట అని నీవు అడుగవచ్చును. ఆతడు చరిత్రను నేర్చుకొన్నప్పుడు,

ప్రకృతిని పరిశీలించినప్పుడు, విషయము శుభప్రదముగా ముగియుట లేదని తెలిసికొనుచున్నాడు.

విద్యార్థులకు ప్రపంచములో దైవసాక్షాత్కారము
అర్థమగునట్లు బోధింపవలెను. చెడుగా ముగింపబడు
పక్షమును చూపరాదు.

అట్లుగాదు. విద్యార్థి, భగవంతుడు ప్రపంచముకంటె వేరని తలంచినచో, ప్రతిదీ చెడుగా ముగియునను అతని భావము న్యాయమైనదే యగును.

విద్యార్థులలో దైవికన్యాయమును గుర్తించిన భావ
మును కలిగించవలెను.

దానిని గుర్తించి మనకేమియు దెలియదు. ఎందుకనగా, ఈ న్యాయము ఇప్పటి స్థితియందున్న ప్రపంచములో ప్రత్యక్షము గాదు.

అయినను, ఒకడు విషయములను లోతుగా గమనించినట్లయితే, అభివృద్ధి యున్నదని గ్రహించును; విషయములు క్రమక్రమముగా మెరుగుపడుచున్నవని గ్రహించును. ఈ అభివృద్ధి బయటకు స్పష్టముగా కనిపించక పోవచ్చును. ఉన్నతస్థాయిలో కూర్చుని తిలకించు జ్ఞానమునకు స్పష్టముగా కనబడునదేమనగా, ఏది కీడు అని మనము అనుకొనుచున్నామో అది అంతయు, సత్యమునకు విరుద్ధమై కానవచ్చు సమస్త అనృతము, సకల బాధలు, వ్యతిరేకతలు, అన్నియు విషమస్థాయి మూలమున ఏర్పడినవే. ఉన్నత స్థాయి నుండి విషయములను చూచుటకు అలవాటు పడినవాడు, దీనిని ఈవిధముగానే భావించునని నా విశ్వాసము. కాబట్టి ప్రపంచము విషమ స్థాయిపై నిర్మింపబడుట అసంభవము. అట్లయినచో అది ఎప్పుడో అదృశ్యమైయుండెడిది. విశ్వము

నకు మూలమునందు పరమమైన సామ్యస్థితి ఉండి యుండునని భావింప నగును. లేక, అది మనము లోగడ పేర్కొనినట్లు, ప్రగతిగల సామ్య స్థితి - ఆ సామ్యస్థితి మనము నేర్చుకొనిన దానికంతటికి, మనము కీడు అను దానికంతటికి - పూర్తిగాభిన్నము. సంపూర్ణమైన కీడు అనునది లేనేలేదు. ఉన్నది ఒకవిధమగు పాక్షిక అసమస్థితి మాత్రమే.

ఇది అతిసులభమైన మార్గములో విద్యార్థికి బోధింపవచ్చును. ఒక వస్తువును సమస్థాయిలో నుంచకపోయిన అది క్రింద పడిపోవునని, సమ స్థాయిలో ఉన్న వస్తువులే తమ స్థానములో నుండునని, భౌతికవస్తువుల సహాయముతో చూపవచ్చును.

విద్యార్థిలో చిన్నవయస్సునుండి తప్పక అభివృద్ధి పరచవలసిన యితర గుణ మొక టున్నది. అదియే నైతికస్థాయి తప్పినపుడు కలుగు మనోవ్యాకు లత. అది చేయరాదని చెప్పిన కొన్ని పనులను చేసినందులకు గలుగు మనోవ్యాకులతగాదు; శిక్షకు భయపడుటవలన కలుగు మనోవ్యాకులతయుగాదు. ఆ మనోవ్యాకులత అయత్నకృతముగా కలుగునది మాత్రమే. ఉదాహరణకు: అల్లరితనముచేత ఒక విద్యార్థి తన స్నేహితుని గాయపరచినాడు. స్వాభా వికమైన, సహజమైన స్థితిలో నున్నట్లయితే, వాడు మనోవ్యాకులత పొందు చున్నాడు. ఆ వ్యాకులత అతని హృదయపు లోతులలో కలుగుచున్నది. ఎందువలన? తనలో నున్న ఆత్మీయసత్యమునకు చేసినపని వ్యతిరేకముగా నున్నది కాబట్టి.

ఏ బోధలు ఎన్ని చేసినప్పటికి, ఏ ఆలోచనలు ఎన్ని చేసినప్పటికి, అంతరాంతరమున, పరిపక్వతనుగురించి, గొప్పతనమునుగురించి సత్యమును గురించి ఒకానొక భావము నెలకొనియుండును. ఈ సత్యమునకు వ్యతిరేకముగా నడచు ప్రవృత్తు లన్నియు బాధ కల్గించునవియే యగును.

విద్యార్థి తనచుట్టు ప్రక్కలనున్న ఉదాహరణలచేత చెడిపోకుండినట్లయితే తన సహజమైన స్థితిలోనే తాను ఉండి ఉన్నట్లయితే, అప్రయత్నముగా, ఏ బోధలతోను నిమిత్తము లేకయే, అతడు మానసికవ్యాకులతను, తనలోనున్న సత్యమునకు విరుద్ధముగా ఏదైనను చేసినప్పుడు పొందుచున్నాడు. దీని పైన ఆధారపడియే, తరువాత ప్రగతికి సంబంధించిన అభివృద్ధి సాధింప వలసి యున్నది.

నీవు అభివృద్ధిని సాధించుటకు ఏదైననొక సిద్ధాంతము కావలెనను కొంటే, నీ కేదియు లభింపదు; సరిగా చెప్పవలెనన్న, కావలసినదిగాక ఇతరములభించును. ఎందుకనగా, వాతావరణము, వయస్సు, నాగరికతల ననుసరించి నీకు చేసిన బోధ తద్విరుద్ధముగా నున్నది. ఒకడు ఇది బాగున్నదంటే, మఱియొకడు కాదు ఇది చెడ్డది అని హేతువాదముతో, ఉత్సాహకరమైన ధోరణిలో చెప్పును. పర్యవసానముగా, దీనినాధారము చేసికొని ఎవరును నిర్మాణముచేయజాలరు. మతము సర్వదా హేతువాదమునకు విరుద్ధమైన సిద్ధాంతమును స్థాపింప ప్రయత్నించినది. "నీ విట్టి మత సిద్ధాంతము ననుసరించినచో సత్యమున నుందువు, లేనియెడల అసత్యమునం దుందువు" అని బోధించుచున్నది. అయితే, ఈ సిద్ధాంతము దేనినీ సాధింపలేక పోయినది పైగా గందరగోళపు స్థితిని సృష్టించినది.

ఒకేఒక సత్యమైన ఉపదేశికుఁ డున్నాడు. అతడు నీయందున్న ఉపదేశికుఁడు. అతఁడు మానసిక జ్ఞానముద్వారా బోధింపడు.

ఒక విద్యార్థికి దురదృష్టకరమైన చదువును ఇచ్చినట్లయితే, అది స్వల్పమాత్రమయిన ఈ సత్యమును రూపుమాపుటకు ప్రబలప్రయత్నము చేయును; ఒకప్పుడది జయించి, సత్యముయొక్క స్పర్శకూడ లేకుండా చేయును. మఱియు అతనిలో మంచిచెడ్డలు గుర్తించు శక్తిని కూడ నశింపఁజేయును.

అందువల్ల నేను దీనిని నొక్కివక్కాణించుచున్నాను. పిల్లలకు చిన్నతనము ననే ఒకానొక ఆంతరంగిక సత్యము—వారి యందును, భూమిలోపలను, విశ్వాంతరాళమునను, కలదని నేర్పవలెను. వారున్న భూమి, విశ్వము, ఇవి ఆ సత్యముయొక్క కర్మలే. ఆ సత్యమనేది లేకపోతే, పిల్లవాడు తానుండు స్వల్పకాలముకూడ మనలేడు. సర్వము ఎట్లు సృష్టింపబడినదో అట్లే తిరిగి కరిగిపోవును. విశ్వమునకు సత్యము పునాది కాబట్టి సహజముగా అది జయించును. దీనిని వ్యతిరేకించునవన్నియు చాలకాలము నిలబడవు. ఎందుకనగా, విశ్వమునకు పునాదియు, శాశ్వతమైనదియు నిదియే. పిల్లలకు తాత్విక సిద్ధాంతములను వివరించుట కాదు; అయితే, వారికి ఈవిధమైన భావమును కలుగజేయవలయును. తమలోనున్న ఈ స్వల్పమైన, శాంతియుతమైన సత్యమునకు తాము లోబడనేర్చినప్పుడు, అదివారికి ఒకవిధమైన సంతృప్తిని, సంతోషమును కలుగజేయును. పైపెచ్చు, వారిని దానికి వ్యతిరేకమైన ఏ పనులను చేయనివ్వదు. ఈ యనుభవముమీదనే వారికి చేయు బోధ ఆధారపడవలయును. శాశ్వతముగా నుండునట్టి నిజమైన తృప్తి తనలో లేకపోయినట్లయితే, ఏదియు నిలబడలేదు, అను అభిప్రాయమును విద్యార్థియందు గలిగించవలెను.

## పెద్దవానివలె పిల్లవాడు ఆంతర్యములోనున్న సత్యమునుగుర్తింపనేర్చునా?

పిల్లవాడి కిది విశదముగా కనబడును. ఎందుకనగా, ఆ జ్ఞానము, మాటలు, లేక ఆలోచనల చిక్కులో తగులుకొనునదికాదు. అక్కడ వానికి సుఖము గూర్చునది అసుఖము గూర్చునదికూడ ఉన్నవి. (అది అనుభవ తీవ్రతలోగలుగు సంతోషమని గాని, దుఃఖమనిగాని చెప్పవలనుపడదు.) ఇదంతయుకూడ పిల్లవానికి పెద్దవానికంటె ఎక్కువ విశదముగా కనబడును

ఎందుకనగా, ప్రయోజనమునకు సర్వదాపనిజేయు మనస్సున్నది, అందుచేత అది సత్యముయొక్క జ్ఞానమును అజ్ఞానపు మేఘములతో మూసివేయును.

పిల్లలకు సిద్ధాంతములు నేర్పుట నిష్ప్రయోజనము. ఎందుకనగా, వాని మనస్సు మేల్కొనినప్పుడు, నీ సిద్ధాంతములను ఖండించుటకు వేయికారణములను కనిపెట్టును. వా డప్పుడు, యథార్థవాదియే యగును.

పిల్లవానిలోనున్న ఈ చిన్న సత్యము అంతరాత్మయందలి దైవసాన్నిధ్యమేయగును. చెట్లు, జంతువులయందు కూడ ఇది ఉన్నది. చెట్లయందిది తెలియనిస్థితిలోనుండును. జంతువులయందు తెలివిప్రారంభమగును. పిల్లలయందు ఈ తెలివి చాల ఎక్కువగాఉండును, 14 సం॥ వయస్సులో కంటె 5 సం॥ వయస్సులోను 25 సం॥ వయస్సులోకంటె 14 సం॥ వయస్సులోను బాలురలో అంతరాత్మనుగురించిన జ్ఞానము వికసించుట నే నెఱుగుదును. ఇది ఇట్లుండ ఏఘడియ బాలురు పాఠశాలకు పోదురో ఆ ఘడియనుండి పిల్లలు మనస్సునకు సంబంధించిన తర్ఫీదును పొందుటచే అది వారిలో నున్న బుద్ధి పాటవమును రేపి దానియందు అమిత శ్రద్ధగల వాడినిగా జేయును. అందుచేత వారు తమలోని ఆత్మజ్ఞానమునకు సంబంధించిన విషయమునందు పూర్తిగా సంబంధమును గోల్పోదురు. నీవు అనుభవముగలిగిన పరిశీలకుడవైతే కన్నులలోనికిజూచి ఒకని ఆంతర్యమున నేమి జరుగుచున్నదోచెప్పగలుగవలెను. కండ్లు ఆత్మను ప్రతిబింబించు అద్దములుగా చెప్పబడినవి. సర్వసాధారణముగా అది యట్లు చెప్పబడుచుండును. అయితే, ఆ కండ్లు హృదయస్థమైన అంతరాత్మను వ్యక్తము చేయజాలకున్నచో, దానికి కారణము, అది అతిదూరమున అనేకవిషయముల చేత మఱుగుపడి పోవుటయే. జాగ్రత్తగా బాలుర కండ్లలోనికి చూడుము. నీ వొక విధమైన కాంతిని జూతువు కొందరది నిష్కాపట్యమని యందురు. అయితే అది ఎంతసత్యమైన కాంతియన, అయ్యది ప్రపంచమును అత్యాశ్చర్యముతో చూచెడిచూపు. ఈ యాశ్చర్యభావ మంతరాత్మది. దానిని సత్య

దర్శనము కలదు. కాని, ప్రపంచమునకు కడుదూరమున నుండుటచే దానిని అర్థముచేసికొనజాలదు. పిల్లలలో సత్యముయొక్క ఛాయలున్నవి. అయితే, ఎక్కువగావిద్యనేర్చుకొనుకొలది, ఎక్కువగా తెలివిగలవారలగు కొలది ఎక్కువగా చదువుకొన్నవారు అగుకొలది ఈ ఛాయలు తుడిచివేయబడును. అటుమీద నీవు వారి కండ్లలో అనేకరకములైన విషయములను, ఆలోచనలను, కోరికలను, మనో భావములను, కాపట్యమును, చూతువు. పరిశుద్ధమైన కాంతిరేఖ ఇక ఎప్పటికిని కాన రాదు. మనస్సు అక్కడకు చేరినది. అంతరాత్మయైన చైత్యపురుషుడు అతిదూరము నకు నిర్గమించినాడు. అదీ అసలు విషయము.

అర్థము చేసికొనుటకు తగినట్లుగా మెదడు అభివృద్ధిచెందని పసిబాలు డైనను నీవు సామాన్యముగా, రక్షణ, ప్రేమ, విన్నపము, ఓదార్పులకు సంబంధించిన అభిప్రాయమును అందజేసినట్లయితే, ఆ బాలుడు జవాబిచ్చుట నీవు గ్రహింతువు. సామాన్య తలిదండ్రులుగలిగి దురాదరణచేయబడిన 14 సం॥ల విద్యార్థిని ఉదాహరణకు తీసికొన్నట్లయితే, అతని మనస్సు ముందుకోపున నుండును. అతని ఆత్మ కడుదూరమున ఎక్కడో వెనుకభాగమున నుండును. అందుచేత, ఆ బాలునిలో కఠినత్వముండును. అటువంటి పిల్లలు నీ సూచ నలకు జవాబుల నివ్వరు. వారుకొయ్యతోగాని, ప్లాస్టరుతోగాని చేయబడి నట్లుందురు.

ఆంతరంగికసత్యమగు దివ్యసాక్షాత్కారము ఆత్మ యందు కలిగి దాని ఎఱుక బాలునకు కలిగినట్లయితే అతని నిక ఒక చిన్న జంతువని అనకూడదుకదా?

ఎందుకనగూడదు? ఒక్కొక్కప్పుడు జంతువులలో ప్రబలమైన ఆత్మీయ సత్యము ద్యోతకమగును. సహజముగా ఆత్మవ్యక్తీకరణము జంతువులలో కంటె బాలునిలో కొంత ఎక్కువగా ఏర్పడి ఎఱుక వికసించి యుండునని

నేను నమ్ముచున్నాను. అయినను, విషయపరిశీలనార్థము నేను జంతువులను పరీక్షించి చూచియుంటిని. జంతువులయందున్న కొన్ని సరళగుణములు, మానవులయందు అరుదుగా నున్నవని మీకు నేను నమ్మకముగా జెప్పగలను. ఉదాహరణకు, పిల్లులను తీసుకొందము, వానిని ఎక్కువగా పరిశోధించితిని. అవి అద్భుతమైన ప్రాణులు. తల్లిపిల్లులు తమ బిడ్డలకొఱకై పూర్తిగా తమను తాము త్యాగము చేసికొన్నవానిని నేనెఱుగుదును. జనులు మాతృప్రేమను గుఱించి, అది తమ హక్కయినట్లు గొప్పగా జెప్పుకొందురు. అయితే, సామాన్య మానవుల నధిగమించి తల్లిపిల్లులు ఈ ప్రేమను వ్యక్తీకరించుట నే నెఱుంగుదును. తమ బిడ్డలు తమకు కావలసిన అహారమును పూర్తిగా తీసికొను వరకు ఆహారము ముట్టని తల్లిపిల్లులను నేను చూచితిని. తమబిడ్డలను వదలి వెళ్ళితే ఏమి అపాయము జరుగునో అని, ఎనిమిది దినములు, తన అవసరాలను ఎంతమాత్రము దలంపక బిడ్డలచెంతనే ఉన్న ఒక తల్లిపిల్లిని నేను చూచితిని. తన బిడ్డకు గోడమీదనుండి కిటికీపైకి ఎగురుట నేర్పుచు జాగ్రత్తతో, తెలివితో, నిపుణతతో ఏబదికంటే ఎక్కువ మారులు ఒకే గంతును వేసిచూపిన తల్లిపిల్లిని నేను చూచితిని. అనేకమంది సాధారణ మహిళలలో ఈ దక్షత, దీక్ష లేదు. అది ఎందుకావిధముగా నున్నది? ఎందుకనగా; అక్కడ మానసిక ప్రతిబంధకము లేదు. అది మొత్తముమీద అయత్నకృతమైన సహజజ్ఞానమే. అయితే, సహజజ్ఞానమనగా నేమి? అది ఆ జాతి జీవములలో భగవంతుని ఉనికియే యగును. కాని అది సామూహికముగా జంతువులయందున్న ఆత్మతత్వమేగాని, పైయక్తిక ఆత్మజ్ఞానముగాదు.

జంతువులలో, మానవులు గర్వముగా చెప్పుకొను ఆవేశయుతమైన, గాఢమైన, భావగర్భితమైన అన్నిరకముల ప్రతిచర్యలను నేను చూచితిని. ఒకే ఒక భేదమేమనగా, అవి మాటలాడలేవు, వ్రాయలేవు, అందువలనను, పుస్తకాలతో మనలను ముంచివేయవు గనుకను, మనకంటె తక్కువజీవులని భావించుచున్నాము.

నేను చిన్నదాననుగా నున్నప్పుడు, నే నేమైన చెడ్డ పని చేసినట్లయితే, వెంటనే నేను వ్యాకులపడుదా నను; ఇకమీాదట అట్టివి చేయరాదని నిశ్చయించు కొనుదానను. ఇకమీాదట అట్టివి చేయకూడదని నా తల్లిదండ్రులుకూడ సలహాయిచ్చెడివారు. ఎందుచేత? నేను స్వబుద్ధితో ఇకమీాదట అట్టివి చేయరాదని నిశ్చయించితిని కనుక.

చిన్నపిల్లల నెప్పుడును తిట్టరాదు. నేను తల్లిదండ్రులగుఱించి నిందాపూర్వకముగా మాట్లాడుదునని నామీద అభియోగము. అయితే, వారు పనిమీద నుండగా నేను వారిని పరిశీలించియుంటిని. తొంబదిశాతము తలిదండ్రులు, తన తప్పును ఒప్పుకొన వచ్చిన బిడ్డను, "నీవు వట్టి తుంటరివి, నేను పనితొందరలో ఉన్నాను పో" అని గదిమెడువారు. ఓర్పుతో బిడ్డ చెప్పునది విని, ఎక్కడ తప్పున్నదో వివరించి, బిడ్డ ఏవిధముగా ప్రవర్తించి యుండవలెనో చెప్పియుండవలసినది. మంచి అభిప్రాయములతో వచ్చిన బిడ్డ, "నేను ఎందుకు ఇట్లు నిందింపబడితిని," అను భావమున బాధతో తిరిగిపోవును. తన తల్లిదండ్రులు మంచివారు కాదని యనుకొనును. అది యీనాటి తల్లిదండ్రుల విషయమున నిజమైనదే. వారిది తప్పని బిడ్డగ్రహించి, "ఎందుకు నన్ను వారు తిట్టినారు? వారును నావంటివారే," అనుకొనును.

* * *

జనవరి 11, 1951

"బిడ్డ దేనిని సర్వదా జ్ఞాపక ముంచుకొనవలెను ? అను తన వ్యాఖ్యానమునందలి కొన్ని లక్షణములను శ్రీమాత విశదీకరించుచున్నది.

(బులెటన్, ఆగస్టు, 1950)

"నమ్రత కలిగియుండుట"

అనగా, తన నిజమైన విలువ తెలిసికొని మెలగుట. సామాన్యముగా జనులు తమ వ్యక్తిగత విలువ విషయమున అత్యధికముగ తమ్ము తాము మెచ్చుకొనుటయో, లేక అత్యధికముగ నిరుత్సాహపడుటయో చేయుచుందురు. ఒకదినము వారు, "నేను అద్భుతమైన వ్యక్తిని." అనుకొందురు. మరుదినమే, "ఓః నేను వట్టి నిష్ప్రయోజకుడను, ఏమియుచేయజాలను." అందురు. గడియారములో లంబకము ఊగినమాదిరిగః ఎవరి అర్హతనైనను సరిగ విలువకట్టుట ఏమంత కష్టముగాదు. ఎవరుగాని, తనకు తాను ఎక్కువ విలువకట్టుకొనరాదు, తగ్గించుకొనుటయు కూడదు. అయితే, తన పరిమితులను గ్రహించి, తాను ఎన్నుకొనిన లక్ష్యమును ఎట్లుసాధించవలెనో తెలియవలెను. తమ్ము తాము ఎక్కువగా తలంచుకొని, అన్నియు సాధించుకోగలమని తలంచువారు గలరు.

ఉదాహరణకు: సైన్యములోని చిన్నఅధికారులు ప్రపంచములోని అన్ని యుద్ధములను జయించగలమని తలంతురు. ప్రపంచములోని ప్రతి ఒక్కరిని అధిగమించగలమని తలంచు అల్పులు గలరు. మఱియొకపక్షమున, సామర్థ్యము గలిగియు తమ సమయమును, "నేను నిష్ప్రయోజకుడను" అని తలంచుచు వ్యర్థముచేయువారు గలరు. సామాన్యముగా రెండుచివరలూ ఒకనియందే కనబడుచున్నవి. అయితే, నిష్కర్షగా తన స్థానమెయ్యది, తా నెంత వరకు పోగలడు, అను విషయము అర్థముచేసికొనిన ఒక్కరినైనను కను

గొనుట అరుదైనసంగతి. మేము స్వాతిశయ ప్రవృత్తిని గుఱించి మాట్లాడుట మానివేసినాము. ఎందువల్లననగా. జయముసాధించుటతోనే మీరు స్వాతిశయమునకు గుఱికాబోరని మా ఆశయము. ఊహించండి.—స్వాతిశయప్రవృత్తి గల మొక్కలున్నవి. పెంపుడుమొక్కలనుగురించి మాట్లాడుచున్నాను. ఒకడు వానిని మాటలచేతగాని, భావములచేతగాని, శ్లాఘించినపుడు, మెచ్చుకొనినపుడు అవి తలను పైకెత్తి గర్వమును ప్రకటించును. జంతువులుకూడ అంతే. నేను ఒక చిన్న వినోదకరమైన కథను మీ కిప్పుడుచెప్పెదను.

ప్యారిస్ నగరములో 'మొక్కలతోట' అనేది ఉన్నది. మొక్కలే గాక జంతువులును అందు కలవు. క్రొత్తగా ఒక అందమైన సింహము ఆ తోట లోనికి వచ్చినది. దానిని బోనులోనుంచిరి. అది ఉగ్రత వహించినది. ఆ బోనులో రెండరలున్నవి. రెంటికి మధ్య తలుపులున్నవి. ఒక గదిలో అది దాగుకొనవచ్చును. ఎవరైనను చూడవచ్చినపుడు అది దాగుకొనియుండును. నేను ఒకదినము ఆ బోనుదగ్గరకు వెళ్ళి మృదువుగా దానితో, "ఓ, నీవెంత అందముగా నున్నావు ? నీవు ఈవిధముగా దాగుకొనుట ఎంతవిచారకరము ? మేము నిన్నుచూచుటకు ఎంతో ఇష్టపడుచున్నాము;" అంటిని. అది ఆ మాటలు విన్నది. కొద్ది కొద్దిగా నాపైపు ఓరగా జూచినది. నన్ను బాగుగా జూచుటకు మెడ చాపినది. తరువాత తన పంజాను పైకి తెచ్చినది. తుదకు తన ముక్కు చివరిభాగమును బోనుయొక్కఇనుపకడ్డీలమధ్యకు బెట్టి, "తుదకు నన్ను అర్థము చేసికొనగల మనిషి వచ్చినది." అన్నట్లు తోపజేసినది.

"ఔదార్యము కలిగియుండుట"

తనకున్న దేదైనా వస్తువును ఇతరుల కిచ్చు ఔదార్యమునుగూర్చి నేను మాట్లాడుటలేదు. అయితే ఈవిధమైన సుగుణము విధివిగా ఆచరింపబడుట లేదు. ఎందుకనగా, ఒకడు ధనవంతుడు కాగానే, తానే ఆ ధనమును ఉంచు

కొనవలెనని తలంచును. ఎక్కువధనము సంపాదించువారు తక్కువ ఔదార్యము కలిగియుందురు.

నేను నైతిక ఔదార్యమును గురించి మాట్లాడదలంచుకొన్నాను. తోటివాడు విజయము సాధించినప్పుడు సంతోషముపొందవలెను. స్వార్థరాహిత్యము, ధీరత్వము, మంచి త్యాగముగలచర్యలలో ఎంతో సొగసున్నది. అవి నీకు ఎంతో సంతోషమునిచ్చును. నైతికఔదార్యము ఇతరులలోని నిజమైన విలువను గుర్తించుటలో నున్నదని చెప్పవచ్చును.

* * *

జనవరి 13, 1951

తల్లి వ్యాసము "జీవన శాస్త్రము" అనుదానిపై తల్లిగారి వ్యాఖ్య.

(బులెటిన్, నవంబరు 1950)

"లక్ష్యములేని జీవితము ఆనందములేని జీవితము" ఎందుకు ?

ఒకనికి లక్ష్యమున్నచో ప్రశాంతముగా దానిని చేరుమార్గమును తాను అనుసరింపవచ్చును.

మార్గమును ప్రశాంతముగా అనుసరించుటకు లక్ష్యముండ నవసరములేదు. లక్ష్యములేని అనేకులు ప్రశాంతముగా, ఏ ప్రయత్నము లేకయే దినచర్యలను చేయుచుందురు.

లక్ష్యము సంతోషమునిచ్చును.

ఒకప్పుడు తన లక్ష్యమును సాధించుటకు తనజీవితకాలమంతయు పట్టును. అపుడు జీవితపు చివరి భాగముననే వా డానందమును పొందును.

"లక్ష్యమనునది ఒక ఆదర్శము. ఆదర్శము పుష్టి దాయకము.

అవును, ఆయితే ఒకడు పూర్తిగా జడమైన ఆదర్శమును కలిగియుండ వచ్చును, అది ఆనందమునిచ్చు ఆదర్శముగాదు.

లక్ష్యము జీవితముయొక్క అర్థమును, ఉద్దేశ్యమును చూపును. ఈ ఉద్దేశ్యమునందు ప్రయత్నము ఇమిడి యున్నది. ఆ ప్రయత్నమునందే సంతోషము లభ్యమగును.

అదే నిజము. ఆనందమిచ్చునది ప్రయత్నమే. ప్రయత్నముచేయుట దెలియని మానవుడు ఆనందమును నెప్పటికిని బొందలేడు. ముఖ్యముగా సోమరులైన వారు ఆనందము నెప్పటికిని బొందలేరు. వారికి సంతోషము ననుభవించుటకు బలములేదు. ప్రయత్నమే ఆనందము నిచ్చును. ప్రయత్నము మానవుని ఒక విధమైన బిగువు నందుంచి స్పందింప జేయును. అదియే సంతోషమునకు కారణమగును.

ఆనందమును కలిగించే ఈ ప్రయత్నము పరిస్థితులచే ప్రతిపాదింపబడినదా? లేక పురోగతిని సాధించు ప్రయత్నమా?

నీవు రెండు విషయములను కలుపుచున్నావు. ఒకటి భౌతికము, రెండవది మానసికము. ఒకపని జేయనిశ్చయించుకొని ఆపనిని జేయుట ఇంచుమించు అనుకూలపరిస్థితుల ఒత్తిడిచే ఆ పనిజేయుట.—ఈ రెండింటికిని ఫలితము ఎప్పటికి ఒకటిగా నుండదనుట విస్పష్టమే. ఉదాహరణకు, యోగాభ్యాసము చేయువారు తరచుగా ఉపవాసములు చేయుదురు. కొన్ని యోగాభ్యాసవిధానములందు దీర్ఘోపవాసములు చేయవలసియుండును. సాధారణముగా అది వారి కానందదాయకమే, ఎందుకనగా, అది వారు కోరుకొన్నది.

ఇదే వ్యక్తి ఆహారము లభింపని కారణముననో, అతనియొద్ద ధనములేని కారణముననో, ఉపవాసముండుట తటస్థించెనేని, అతడు దుఃఖపడుట మనము చూతుము. అతని జీవితము దుర్భరమగును. ఉపవాసము చేసినప్పటిస్థితి, ఆహారము లభింపని స్థితి, రెండూ ఒకటైనప్పటికి మొదటి పరిస్థితిలో అతడు తినకూడదని నిర్ణయించుకొన్నాడు, రెండవపరిస్థితిలో గత్యంతరములేక తినలేదు. అది స్పష్టమే. కాని, ఇది విచారించవలసినది వేఱొకటున్నది.

నీలో కొన్ని చైతన్యములను కలిగించి, విశ్వచైతన్యములో నీకు సంబంధమును గూర్చునది ప్రయత్నము మాత్రమే. ఆ ప్రయత్నము, భౌతికము, నైతికము. బుద్ధికుశలతకు చెందినది ఏదైనను కావచ్చును. అదియే ఆనందము నిచ్చునది. ప్రయత్నమే నిన్ను సోమరితనము నుండి బయటికి లాగును. విశ్వశక్తులను గ్రహించునట్లుచేయును, యోగసాధన చేయనివారికి, ఆధ్యాత్మిక చింతన లేనివారికి, సాధారణజీవితమును సాగించువారికిసైతము అయత్నకృత

ఆనందము అందుబాటులోనికివచ్చును. ప్రజలకిదితెలియదు. ఇందువలననె ఇది జరిగినదని వారు చెప్పజాలరు. అయినను అది అంతే.

అందమయిన జంతువుల వంటివా రున్నారు. వారి చర్యలన్నియు సామరస్య పూర్వకమై యుండును. వారు తమ శక్తులను సామరస్యపూర్వకము గనే వ్యయింతురు. అబుద్ధి పూర్వకముగనే వారిని ప్రయత్నములు సర్వదా శక్తుల నాహ్వానించుచుండును. వారు నిరంతరము సంతోషముగా నుందురు. అయితే, కొన్ని సమయములలో వారి తలలయందు ఆలోచనలుండవు. కొన్ని సమయములలో వారి హృదయములలో భావము లుండవు. వారు పశుప్రాయ మైన జీవితమునే జీవింతురు. అటువంటి జనుల నే నెఱుంగుదును. వారు అందమైన జంతువులు. చక్కని పొందికగల చేష్టలు వారివి. పొంది కతో నొప్పారు శక్తిసామర్థ్యములు. ఇచ్చినా పుచ్చుకొనినా వారికి లెక్క యనునదిలేదు. భౌతికజగత్తుతో పొత్తుగలిగియుండి వారు సంతోషముగా జీవించు చుండెడివారు. తాము సంతోషముగా నున్నట్లు వారు బహుశా మీతో చెప్పకపో వచ్చును. సంతోషము వారిపక్షమున అయత్నకృతమైనది, సహజమైనది. వారి బుద్ధి విశేషము బాగా వికసించలేదు కాబట్టి తామెందుకు సంతోషముగ నున్నదియు చెప్పు టకుకూడ వారికి కుదురదు. అవసరమైన ప్రయత్నమును చేయు సమర్థు లైన ఇట్టివారిని నే నెఱుగుదును. (ఆ ప్రయత్నము, వివేకముతోను, నిర్ణయముతోను చేసికొన్నదిగాదు. అది అయత్నకృతము.) భౌతిక, ప్రాణిక, వైజ్ఞాని కాది ఏ రంగము నందైనను చేయ సమర్థులు. ఈ ప్రయత్నములో సర్వత్ర ఆనంద మున్నది. ఉదాహరణకు: ఒకడు ఒక పుస్తకము వ్రాయ గూర్చున్నాడు. అతని ఆ ప్రయత్నము బుద్ధిలో భావముల జన్మింప జేయును; చైతన్యమును గలిగించును. అతనికి ఆకస్మికముగా ఆనం దము కలుగును. భౌతిక కార్యములగు గదిని ఊడ్చుట, వంట చేయుట వంటి వానియందు నీ సంపూర్ణసామర్థ్యము నుపయోగించి, అవసరమైన ప్రయ త్నమును జేసినట్లయితే, నీవు చేయునది నీ ప్రకృతికి వ్యతిరేకమైనప్పటికి

నీవు ఆనందమును బొందుదువు. ఏదేని ఒక విషయమును నీవు సాధింప దలచుకొన్నప్పుడు నీవు అయత్నకృతముగా, అవసరమైన ప్రయత్నమును గావింతువు. నీవు సాధింపనెంచుకొన్నదానిపైన నీ శక్తులన్నింటిని కేంద్రీకరింతువు. ఇది నీ జీవితమును అర్థవంతముజేయును. ఇది నిన్ను ప్రణాళికా బద్ధముగా నీ శక్తులన్నింటిని కేంద్రీకరింపజేయించి నీ కిష్టములేకపోయినను కార్యము జేయించును. ఎందుకనగా నీవు తలపెట్టిన దిదియే, ఇతర ఏవివి తద్వ్యతిరేకమైనవి గావు. ఇటువంటి కేంద్రీకరణలోను, తీవ్రమగు బుద్ధి బలములోను అనందముయొక్క పునాది నిక్షిప్తమైయున్నది. నీవు వ్యయపరచిన శక్తులకు బదులుగా క్రొత్తశక్తులను గ్రహించుటకు నీవు సమర్థత సంపాదింతువు.

అదే వ్యాసమును తల్లి చదువుచున్నది: "స్వయంపరిపక్వతకు సంబంధించిన మొదటి మెట్టు ఏదనగా,
నిన్ను నీవు ఎఱుగుట.''

"నిన్ను నీవు తెలిసికొనుట. కట్టుబాటులో నుంచుకొనుట," — దీని యర్థమేమి?

తన ఆంతర్య సత్యమును, తన వ్యక్తి యందలి వివిధ భాగములను, వాని వాని వ్యాపారములను దెలిసికొనుటయని దీని యర్థము. ఎందుకు ఈ పని చేయుచున్నావో, ఎందుకు ఆపని చేయుచున్నావో నీవు తెలిసికొనవలెను. నీ ఆలోచనలను, భావములను నీ సర్వచర్యలను, కదలికలను, ఎట్టిది నీ సామర్థ్యము అన్న విషయమును, అన్నిటిని నీవు తెలిసికొనవలెను. నిన్ను నీవు తెలిసికొనుట చాలదు. ఈ విజ్ఞానము ఎఱుకతో నిన్ను నీవు స్వాధీనము లోనికి మాత్రమే తెచ్చుకొనుట కుపయోగపడవలెను. ఒకడు తనను గురించి

తాను సంపూర్ణముగా దెలిసికొనుటయేగాక, తనను తాను స్వాధీనములో నుంచు కొనుటయు తెలియవలెను.

అయితే, ప్రతిక్షణములోను ఆకాంక్ష తప్పక యుండవలెను.

ఎక్కువ ముందుగా ప్రారంభించుట, ఎక్కువ ఆలస్యముగా కొనసాగించుట, అనునది దీనికి లేదు. పసితనములోనే నిన్ను నీవు పరిశీలించుకొనుటకు, క్రమముగా నిన్ను నీవు అధీనములో నుంచుకొనుటకు ప్రారంభింపవచ్చును. ఈ కార్యమునకు ఎక్కువవయస్సు, వృద్ధాప్యము ఆటంకములుగావు. ఇదియే జీవితవిజ్ఞానశాస్త్రము.

ఒకడు పరిపక్వతను బొందుటకు తన్ను తా వెలుగవలయును. నేను నిజము పలుకుచున్నాను. ఉదాహరణకు, నీ జీవితములో అనేకమారులు ఈ క్రిందిపరిస్థితి సంభవించియుండును. ఒకానొకడు నిన్ను ఉన్నట్టుండి, "నీ వెందుకాపని చేసితివి?" అని యడుగగా, అయత్నకృతముగా నీవు, "నాకు తెలియదు' అని సమాధానము చెప్పుదువు. అట్లేయింకొకడు 'నీవు ఏమి ఆలోచిస్తున్నావు?' అని యడుగగా, దానికిని, 'నాకుతెలియదు' అనియే నీ జవాబు. ఇదీ వరుస. నేను ఒక ఏబదిమందిని ఆకస్మికముగ ఉన్నట్టుండి "నీ వెందు కాపని చేసితివి?" అని యడిగినచో, వారు ఆంతరంగముగా మేల్కొని యుండకపోతే, 'మాకు తెలియదు' అందురు. (ఆత్మజ్ఞానశిక్షణ గలవారినిగురించి నేను మాట్లాడుట లేదు; వారు తమ మార్గమున చివరి వరకు పయనించియుందురు. అట్టివారు సహజముగానే, చిత్తమును సమాహితపరచుకొని సత్యమైన జవాబునే జెప్పగలుగుదురు. అదియైనను కొంత ఆలస్యముగా). నీవు నీ దినచర్య నంతను బాగుగా పరిశీలుంచుకొనినట్లయితే పరిస్థితి ఇట్టిదిగానే యున్నట్లు నీకు స్పష్టమగును. నీ వేదో చెప్పుదువు. నీవేమి

చెప్పితివో నీకు తెలియదు. మాటలు నీ పెదవి దాటినంతనే, ఇదికాదు నేను చెప్పవలసినది అని కనుగొందువు.

ఉదాహరణకు నీ వొకని జూడబోయెదవు. నీవు ముందుగనే వానితో ఏ మాటలు మాట్లాడవలయునో సిద్ధపరచుకొనియేపోదువు. కాని, ఆ చూడవలసిన వ్యక్తిసమక్షమునకు బోవుసరికి నీవేమియుఁ జెప్పలేవు. ఒకవేళ చెప్పినను నీవనుకున్నదానికి భిన్నముగా నుండును. ఎంతవరకు ఆతని సన్నిధి గల వాతావరణ ప్రభావము నీపై బడి నీవు సిద్ధమొనర్చుకొన్న మాటలను పలుకనీకుండ జేసినదో చెప్పగలవా? ఎంతమంది జవాబునివ్వగలరు? ఎదుటి మనిషి ఇట్టి పరిస్థితిలో నుండినందున, మేము మాట్లాడలేకపోయితిమని పరిశీలించి చెప్పగలవారెందరున్నారు? కొన్ని సందర్భములలో ఎదుటివాడు చెడ్డ మనఃస్థితిలో నుండుటవలన నీవు వాని నేమియు నడుగఁజాలకపోదువు. నేను అట్టి సందర్భములను గురించి మాటాడుటలేదు. ఒకరి ప్రభావమింకొకరి పైన ఎట్లు పనిచేయుచున్నది, నీ స్వభావముపై వాని ప్రతిక్రియ లే తీరున నున్నవి స్పష్టముగా గుర్తింపగలుగుటనుగురించి ప్రస్తావించుచున్నాను. ఇది ఎవనికిని చేతనైయుండదు. ఉదాహరణకు, ఒకడు ఆకస్మికముగా విచారములో బడును, లేక సంతోషమును బొందును. ఎంతమంది. 'ఇది యిది' అని చెప్పగలరు? అది తెలిసికొనుట దుస్తరమే. సులభముగాదు. ఒకడు సదా మేల్కొనియుండవలెను. నిరంతరము పరిశీలనయందు శ్రద్ధగలిగియుండవలెను.

దినమునకు 12 గంటలు నిదురపోయి మిగిలిన సమయములో నేను మేల్కొనియున్నాను అనువారు గలరు. దినమునకు ఇరువదిగంటలు నిదురపోయి తక్కిన సమయములలో సగము మేల్కొని యుండువారును గలరు.

శ్రద్ధాపూర్వకమైన పరిశీలనదృష్టి కలిగియుండవలయునన్న, స్పర్శ జ్ఞానేంద్రియములవంటివి నీ శరీరమంతటను ఉండి, నీ యదార్థజ్ఞానకేంద్రముతో

ఎడతెగని సంబంధము కలిగియుండవలెను. అపుడు, నీ వన్నింటిని నమోదుచేయుదువు; అన్నింటిని ప్రణాళికాబద్ధము చేయుదువు. నిన్నెవ్వరు నీకు తెలియని రీతిగా కార్యములం దుపయోగించుకొనజాలరు. నీవు మోసగింపఁబడవు. నిన్ను ఎవరును తప్పుగా భావింపరు. నీవు చెప్పఁదలచు కొన్నదానినితప్ప వేరేదియు నీవు చెప్పవు. అయితే, ఎంతమంది జనులు ఈస్థితిలో నుందురు? ఎఱుకనుగూర్చి మాట్లాడినపుడు నా యర్థమిదియే. నీవున్న స్థితిగతులయందు నీవు లాభమునుపొందవలయునంటే, నీవు పూర్తిగా మేలుకొని యుండవలయును. ఎవరును నిన్ను నివ్వెరపోవునట్లు చేయగలిగి యుండరాదు. ఎందుకోతెలియకుండా దేనిని గుఱించియు మాట్లాడుస్థితి నీకు ఏర్పడరాదు. నీవు నిరంతరము మేల్కొని యుండవలయును.

నీవు వేరుపడిన వ్యక్తిత్వము గలిగినవాడవుగావు. జీవితము ఎడతెగని శక్తులమార్పిడి; ఎఱుక, చైతన్యము, వివిధకార్యాచరణశీలత్వము గలది; ఒక సామూహిక తత్వము గలది. ప్రతిఒక్కఁడు ముందుకు వచ్చినట్లయితే అందరు ముందుకు పోదురు. అందరు వెనుకకు నెట్టినట్లయితే ప్రతిఒక్కఁడు వెనుకకు వచ్చును. నీ ఆంతరంగిక ప్రపంచములో, నీ జ్ఞానములోఁగూడ ఇదియే వర్తించును. నీపైన శక్తులు, పలుకుబడులు, పనిచేయుచు ప్రతికారము నల్పుచు నిరంతరముగా నుండును. ఇది వాతావరణములోని వాయు పదార్థము వంటిది. నీవు మేల్కొని యుండకపోతే, ఈ విషయములు నీలోనికి ప్రవేశించును. అవి బాగుగా నీలోపలికి చొచ్చుకొనిపోయి, నీలోనుండియే పుట్టినట్లు భ్రాంతిని కలుగజేఁయుచు వెలికి వచ్చినపుడే నీవు వానిని గుర్తింతువు. ధైర్యహీనులు, క్రోధగ్రస్తులు, వ్యసనపరులు నైనవారిని కలుసుకొని, ఎందుకో తెలియకుండా తామును ధైర్యహీనులు, క్రోధగ్రస్తులు వ్యసనపరులు నైనవారున్నారు, నీవు కొందరితో ఆటలాడినపుడు సరిగా ఆడవు, మరి కొందరితో ఆడినపుడు బాగుగా ఆడుదువు. శాంతియుతులైనవారు, దుష్టులు కానివారు ఆకస్మికముగా క్రోధముఁగల వారిమధ్య నున్నప్పుడు తాము క్రోధముగలవా రగుదురు. ఎవరు

దానిని ప్రారంభించిరో ఎవరికిని తెలియదు. అది త్వరితముగా వ్యాపించి ఎఱుకను తుడిచిపెట్టివైచును. ఈ విధమైన ప్రకంపనములను విడుదల చేయఁ గలిగినవారు కొందరున్నారు. తెలియకయే ఇతరులు వానికి లోబడుచుందురు. స్వల్పమైనది మొదలుకొని ఘనమైన దానివరకు ప్రతిదియు ఇట్లే జరుగు చుండును.

సమూహములోనుండి వ్యక్తిత్వమును నిలబెట్టుకొనవలయునంటే, ఒకఁడు సంపూర్ణముగా తన యాత్మను గుఱించి ఎఱుక గలిగియుండవలెను. ఏ యాత్మనుగుఱించి? సమస్తవిషయముల కలగాపులగముకంటే అతీతమైన ఆత్మ; అదియే నీ సత్యస్వరూపము. ఆ సత్యమును నీ వెంతకాలము తెలిసికొన లేకయుందువో, అంత కాలము నీ వేమాత్రము దానినిగురించి ఆలోచింపకయే నీవు అన్నివిధముల విషయములచేత చలింపఁబడుదువు. సామూహిక ఆలోచనలు సామూహిక సూచనలు దాటరాని పలుకుఁబడి గలిగినవి. అవి నిరంతరము వ్యక్తి గత ఆలోఁచనలమీఁద ఆధిపత్యమువహించును. అసాధారణమైన దేదనఁగా, దానిని ఏ ఒకడును గమనింపడు. తానే ఆవిధముగా ఆలోచించుచుంటినని విశ్వసించును. అయితే, యదార్థమునకు, సమూహమే అట్లు అలోచించుచున్నది. సమూహ మెప్పు డును వ్యక్తికంటె తక్కువైనదే. అదే గుణములు గలిగి అదే తరగతికిచెందిన వ్యక్తులను తెలిసికొనినట్లయితే, వారు విడిగానున్నప్పుడు అదే తెగకుచెందిన సమూహములోని, వ్యక్తులతో పోల్చిచూచినట్లయితే రెండు డిగ్రీలు హెచ్చు గొప్పదనము కలవారై యుందురు. సమూహమునందు ఒకవిధమైన అజ్ఞాన మిశ్రమము ఉండును. అందువలన, వ్యక్తి తనకు తెలియకుండానే ఆ అజ్ఞాన ములోనికి జారిపోవును. దీనినుండి తప్పించుకొనవలయునంటే, ఒకే ఒక మార్గమున్నది,—తన్ను తాను ఎఱిఁగియుండుట, అధికాధికముగా జ్ఞానమును సంపాదించుట. అధికాధికముగా శ్రద్ధ కలిగియుండుట.

దినప్రారంభములో ఈ చిన్న సాధనను అమలులోఁ బెట్టుము. "నేను ఏమిచెప్పినను ఆలోచించిగాని చెప్పను." అని గట్టిగా నిశ్చయించుకొనుము. నీవు మాట్లాడినదంతయు ఆలోచించియే మాట్లాడుచున్నట్లు నమ్ముచుందువు గదా! అది నిజము గాదు. నీ వనేకమారులు, నీవు చెప్పదలంచుకొనిన మాట, నీ నోటినుండి వెలువడుట నీవు చూతువు. ఆ మాట నీ నోటినుండి వెలువడకుండజేయుటకు ఎంతో ప్రబల ప్రయత్నము చేయవలసియుండును.

నేను అనేకుల నెఱుగుదును. వారు అబద్ధము చెప్పమను నియమమును పాటింతురు. అయితే, ఆకస్మికముగా, సమూహములో నున్నప్పుడు సత్యమును చెప్పుటకుబదులు, అయత్నకృతముగా, అబద్ధమును చెప్పుదురు. వారి కట్లు చెప్పవలెనన్న ఉద్దేశము లేదు కాని చెప్పుటకు ఒక నిముషము ముందుగా దానిని గురించి ఆలోచింపరు; అయితే, అది ఆవిధముగా ఏల సంభవించినది? ఏలననగా, వారు అబద్ధీకుల గుంపులో నున్నారు. అక్కడ అబద్ధపు వాతావరణ మున్నది. వారికి సులభముగా ఆ రోగము వ్యాపించినది.

క్రమముగా, నిదానముగా, పరిశ్రమతో, మొదట బహుజాగ్రత్తతో, బుద్ధిపూర్వకముగా ఒకఁడు ఎఱుకను సంపాదించును. తన్ను తాను తెలిసికొనుటకు ప్రయత్నించును, పిమ్మట తనపైన తాను ఆధిపత్యము సాధించుటకు కృషి సల్పును.

* * *

జనవరి 15 1951

అధికశ్రద్ధతో మన జీవనసత్త్వయొక్క చలనము
లను కనిపెట్టుచు, మన ఉన్నతోన్నత ఆదర్శరూప
మైన న్యాయస్థానము ముందర వానిని విచారణకు
నిలిపి, అది యిచ్చుతీర్పును నమ్మకముగా మనము
శిరసావహించి నేర్చినప్పుడే, మనలోసరియైన దృష్టిని
సంతరించుకోగలుగుదుము. అది యెప్పుడును
తప్పుడు త్రోవ త్రొక్కదు.

(జీవన శాస్త్రము - బులెటిన్ నవంబరు 1950)

పరస్పరవ్యతిరేకములగు కార్యముల సాధింపవలయునన్న కోరికలు వ్యక్తిలో నున్నవి. కొన్ని యిటువైపు, కొన్ని అటువైపు త్రోయుచుండును. అందువలన జీవితములో సంకులస్థితి ఏర్పడును. కాబట్టి మన ప్రవృత్తులయొక్క మూలమును మనము తెలిసికొని యుండవలయును. నిన్ను నీవు గమనించినట్లయితే, నీ శాంతిని భంగపరచు కార్యమేదైనను నీవు చేయుట తటస్థించినపుడు, వెంటనే నీ మనస్సు నిన్ను నీవు సమర్థించుకొనుటకై నీకు అనుకూలమైన కారణము నొకదానిని నీకు అందించును. ఈ మనస్సు అన్నింటికి బంగారు మలాము వేయ సమర్థమైనది. ఇట్టి పరిస్థితులలో నిన్ను నీవు తెలిసికొనుట చాల కష్టము. మనస్సుయొక్క వక్రచర్యలను విశదముగా చూచుటకు నీవు సంపూర్ణముగా అంతశ్శుద్ధి కలిగి యుండవలయును.

నీ మనస్సులో ఆ దినమునకు సంబంధించిన వివిధ కార్యకలాపములను, ప్రతీకారములను మాటిమాటికి అదేపనిగా పరిశీలించుచు కూర్చుండిన యెడల, నీవు అభివృద్ధి పథములో ముందుకు సాగలేవు. ఈ పునఃపరిశీలన వలన నీ వభివృద్ధి పొందవలయునంటే, ఒకానొకవెలుగును నీలో నీవు కను

గొనుట ఆవశ్యకము. ఆ వెలుతురులో, నీ పైన నీవే తీర్పుచెప్పుకొగల న్యాయాధికారివిగా నుండగలవు. అది నీ స్వరూపములోని ఉత్తమోత్తమాంశమై అభ్యుదయమును ప్రేమించు సద్భావలక్షణోపేతమై యుండవలెను. దానిని నీముందుంచుకొని సినిమాతెరపైవలె, నీవు చేసినవన్నింటిని, నీ వనుభవించినవన్నింటిని, నీ ప్రేరణల నన్నింటిని, నీ యాలోచనల నన్నింటిని ఆతెరపైన చూచి సమన్వయించుకొనుము. ఏది దేనిని ఎందుకు అనుసరించుచున్నదో కనుగొనుము. నీముందున్న ప్రకాశవంతమైన తెఅపైచూడుము. కొన్ని విశేషములు బాగుగనే ఏ నీడయు పడకుండా కదలిపోవును. ఇతరములు కొన్ని కొద్దిగా నీడలను కల్పించును. కొన్ని వెగటుగా గన్పించు దట్టమైన నల్లని నీడనుమాత్రమే కన్పింపజేయును. ఇదంతయు నీవు కడుచిత్తశుద్ధితో ఒక వినోదక్రీడలో పాల్గొనుచున్నట్లు చేయవలెను. నీవిట్లనుకొనవలెను. "నేను ఫలానా పరిస్థితులలో ఫలానా కార్యమును ఈరీతిగా స్పృశించుచు, ఈ రీతిగా ఆలోచించుచు చేసితిని. ఆత్మజ్ఞాన, ఆత్మస్వామ్య ఆదర్శమును, నాయెదుట నిడుకొనియున్నాను. ఈ పని ఆ యాదర్శమునకు అనుగుణమైనదా కాదా?" అనిచూడవలయును. అనుగుణమైనదే అయితే, తెరపైన నీడలు కనిపించవు, తెఅ అంతయు పారదర్శకమై వెలుతురు విరజిమ్మును. అట్టియెడ దానినిగుఱించి ఎట్టిబాధయు పడనవసరముండదు. అట్లుగాక, చీకటినీడలు పడినట్లయితే, "ఏందుకు ఈ నీడలు పడినవి, ఆత్మజ్ఞానమునకు, ఆత్మస్వాధీనతకు భంగము వాటిల్లినదా?'' అని ప్రశ్నించుకొనుము. సామాన్యముగా దానికి కారణము అజ్ఞానమై యుండును. అప్పుడు అజ్ఞానమునకు సంబంధించిన జాబితాలో దానిని చేర్చుము. ఇఁకమీదట నేను ఎఱుకతో గార్యముల జేయుదునని తీర్మానించుకొనుము. అసహ్యమైన నల్లటి అహంకారము ఇతర విషయాలను చూచినప్పుడు నీకు కనబడును. అది నీ చర్యలను, లేదా ఆలోచనలను, చెడగొట్టుటకు వచ్చినదే, అప్పుడు ఈ అహంకారమును నీ జ్యోతియెదుట నిలిపి, "నాచేత ఆవిధముగా పనిచేయించుటకు, ఆవిధముగా ఆలోచన చేయించుటకు, ఈ అహంకారమునకు హక్కు ఎందువలన వచ్చినది''

అని యడుగుము. వివరణనైనను ఆమోదించేముందు, నీవు బాగుగ వెదకిచూడవలెను. అంతట నీలో ఒక మూల ఒక విషయమును కనుగొందువు. అది ఆలోచించి ఇట్లు చెప్పును: "లేదు, ఏమైనను నే నొప్పుకొందునుగాని, దానిని మాత్రము ఒప్పుకొనను," అని. అది ఒకక్షుద్రమైన స్వాతిశయ ప్రవృత్తియనియు, స్వార్థప్రేమయనియు, ఎక్కడో దాగుకొన్న అహంభావమనియు, మఱియు నింకేమేమో యనియు, గ్రహింతువు. అప్పుడు నీ యాదర్శజ్యోతి వెలుగులో దానిని బాగుగాఁ పరిశీలించి ఇట్లు ప్రశ్నించుకొనుము. "ఈ ప్రవృత్తి అన్వేషణకు, నా యాదర్శమునకు అనుగుణమైనదగునా, కాదా? ఈ చిరు చీకటి కోణమును నేను నా జ్యోతిసమక్షములో నిలిపి, అది అదృశ్యమైపోవునంతవరకు దానిలోనికి కాంతిని ప్రవేశింపజేసెదను." ఇంతటిలో ఈ ప్రహసనము ముగియును, కాని. పూర్తిదినముయొక్క ప్రహసనము ఇంకను పూర్తికావలసియేయున్నది. ఎందుకనగా. ఆ జ్యోతిసమక్షమునకు తేబడవలసినవి అనేకమున్నవి. అయితే, ఈ యాటను నీ విట్లే సాగించుచున్నట్లయితే—ఇది నిజముగా ఆటే కనుక, నిజాయితీతో దీనిని నీవు సాగించుచున్నట్లయితే,—నేను నిశ్చయముగా చెప్పుచున్నాను. ఆరుమాసములలో నిన్ను నీవే గుర్తించుకొనజాలవు. "ఏమిటీ? నేనావిధముగా నుంటినా? అసంభవము!" - అనుకొందువు.

నీవు అయిదు సంవత్సరాలవయస్సు, ఇరువది, ఏబది లేక అరువది వయస్సు గలవాడవైయుండినను, ఈవిధముగా సర్వము, ఆంతరంగిక జ్యోతి యెదుట ఉంచి నీవు మార్పుజెందవచ్చును. నీ ఆదర్శమునకు సరిపడని అంశములు సాధారణముగా నీనుండి పూర్తిగా బయటికి నెట్టివేయవలసినవి కావు. (అటువంటివి చాలకొద్దిగా నుండును) అవి తమతమస్థానములు తప్పిన అంశములుమాత్రమే. నీ భావములను, యాలోచనలను, ప్రేరణలను, తదితరముల నన్నింటిని అంతర్జ్యోతియైన నీ ఆత్మకేంద్రము చుట్టునుండునట్లు

ఏర్పాటుచేసికొనినట్లయితే, తారుమారుగ నున్నవన్నియు ప్రకాశవంతమైన మార్గమునకు మార్పుజెందగలవు.

అదే పద్ధతిని, జాతిసర్వము, లేకభూమి సకలము, అనుసరించినట్లయితే, మానవులను విచారగ్రస్తులను జేయునవి అన్నియు నిశ్చయముగా అదృశ్యమైపోవును. ఎందుకనఁగా, ప్రపంచపు దౌర్భాగ్యమంతయు చాలవరకు ఆయా విషయములు వానివాని స్థానములం దుండకపోవుటచేతనే సంభవించుచున్నది. ప్రతిది దాని స్థానములో నుండునట్లు, ఎద్దియు దుర్వినియోగము కాకుండు నట్లు, జీవితమును ఏర్పాటు చేసికొన్నట్లయితే, ఈ దౌర్భాగ్యము ఇఁక ఉండదు. ఒక పురాతనఋషి, "కీడనునదిలేదు. సమస్థాయిలో లేకపోవు టొక్కటే లోటు. చెడ్డ అనునది లేదు. ఉన్నస్థితి ఒక్కటే, ఆయా విషయములు వాని స్వస్థానమునందులేవు." అన్నాడు.

వివిధదేశములలోగాని, భౌతికప్రపంచములోగాని, సర్వవిషయములు, క్రియలు, ఆలోచనలు, వ్యక్తుల భావములు, వాని వాని స్థానమునందున్నట్లయితే మానవుని బాధలందు అధికభాగము అదృశ్యమైపోవును.

రెండు విషయములనుగూర్చి ఆలోచింపవలయును. అవి జ్ఞానావిష్కారణకు కారణమైన ఎఱుక, పరికరములు; మనము పరికరములను విచారింతము. ఆలోచనలకు మూలమైనది మనోమయసత్త, ఆవేశములకు నిలయమైన భావమయసత్త, క్రియాసామర్థ్యము నిచ్చునది ప్రాణమయసత్త, క్రియల నిర్వర్తించునది అన్నమయ భౌతికసత్త - ఇవన్నియుపరికరములు.

ప్రతిభ గలవాఁడు ఏదైనను ఉపయోగించి, సుందరమైనదానిని రూపొందించగలడు——అతనికి ప్రతిభయున్నది కనుక. ఈ ప్రతిభకుతోడు పరిపక్వత జెందిన పరికరము నున్నచో ఆశ్చర్యకరమైన కార్యములు సాధింపబడును.

గొప్పగాయకుని తీసికొనుము. అతనిచేతికి పనికిమాలిన పియానోనిమ్ము. దానికి స్వరములు చెడిపోయియుండినను, మనోహరమైన నాదము దానినుండి సృష్టించ గలడు. స్వరములు చక్కగా మేళవించిన మంచిపియానో నిచ్చినచో, ఇంకను అత్యధికమనోహరమైనదానిని సృష్టింపగలడు. రెండిటియందు జ్ఞానముసమా నమే. కాని, ప్రకటనకు కావలసినది మంచిపరికరసామగ్రి. మానసిక, ప్రాణిక చైత్యాత్మిక, భౌతిక శక్తిసామర్థ్యములు,

శారీరక నిర్మాణము సరిగా లేనిచో, మంచి తర్ఫీదు నీవు పొందియుండి నను వ్యాయామక్రియలు నిర్వర్తించుట నీకు కష్టముగా నుండును. అంద ముగా బాగుగా నిర్మింపబడిన శరీరముతో చేసినంత చక్కగా చేయజాలవు. మనస్సుకు సంబంధించిన పరిశ్రమయు నంతే, బాగుగా వ్యవస్థితము, సుసం స్కృతమునైన మనస్సుగలవాడు, అవ్యవస్థితము, అసంస్కృతమునైన మనస్సు గలవానికంటె చాలా బాగా ఆత్మప్రకటనము గావించుకొనగలడు. మొట్ట మొదట నీ జ్ఞానమును అభివృద్ధిపరుచుకొనవలెను. నీ ఎఱుకతో నిన్ను నీవు తెలిసికొనవలెను. నీ యెఱుకను నీ యాదర్శమునకు అనుగుణముగా వ్యవ స్థీకరించుకొనవలెను. అదే సమయమున నీ శరీరములోని పరికరములను సైతము ఉపేక్షింపరాదు.

ఉదాహరణకు: నిశితమైన ఆదర్శముతో నీశరీరమున నెలకొనియున్న నీవు, పాఠశాల తరగతికి అధ్యాపకుడవుగ వెళ్ళవలసివచ్చినది. విద్యార్థులకు నీవు ఏదైనను బోధింపవలయును, జ్ఞానజ్యోతి నీలో ఉన్నది. కాని నీవు విజ్ఞానశాస్త్రమును వివరింపవలయునన్న, దానికి సంబంధించిన విస్తారజ్ఞానము నీకు ఉండుట మంచిదా లేక ఈ విస్తారజ్ఞానము అవసరములేకయే ఈ జ్ఞానప్రేరణ మాత్రమే అందుకు సరిపోవునా? నీ వ్యక్తిగత అనుభవమేమి? నీకు తెలియును,— అంతయు సవ్యముగా సాగినదినములలో, నీవు చక్కగా బోధింతువు, విద్యార్థులు నిన్ను సులభముగా అర్థము చేసికొందురు అయితే,

ఇతరదినములలో నీవేమి బోధింపవలయునో నీకు తోచలేదు. విద్యార్థులు నీవు చెప్పినది వినరు, నీవు విసుగు చెందుదువు. వారిని విసిగింతువు. మొదటి సందర్భములో నీ జ్ఞానము మేల్కొనియున్నది. నీవు చెప్పదలచుకొన్నదానిపైన ఏకాగ్రత ఉన్నది. రెండవసందర్భములో అది యించుమించుగా నిదురించుచున్నది. నీవు బాహ్యాధారముపైననే ఆధారపడవలసివచ్చినది. నీకు విస్తారశాస్త్రజ్ఞానమున్నట్లయితే, విద్యార్థులకు కొంత చెప్పగలవు. లేక, తర్ఫీదు పొందినమనస్సును కలిగియుండి, దానిని నీవు ఉపయోగించుకొనగోరినప్పుడు, అది మారుపలుక గలిగినదైనచో, ఇంకను పాఠ్యభాగములను గుఱించి వ్రాసుకున్న వివరణపత్రములు, అభిప్రాయములు ఉన్నచో, అంతయు సవ్యముగానే జరుగును. అయితే, నీ తలలో నేమియు లేనప్పుడు, ఉన్నతచేతనతో సంబంధము లేనప్పుడు, అప్పుడునీవు తప్పనిసరిగా పుస్తకము తీసికొని పాఠ్యభాగమును చదువవలసియుండును అనగా, ఇతరుని మనస్సును ఉపయోగింపవలసియుండును.

ఆటలు తీసికొనుము, అక్కడకూడ కొన్నిదినములలో అంతయు సవ్యముగానే సాగిపోవును. నీవు ముందుగా ప్రత్యేకించి చేసినదేదియు లేదు. అయినను నీవు జయమునుపొందుదువు, నీవు తర్ఫీదును పొందియుండినట్లయితే ఫలితము ఇంకను అధికమైనదిగా నుండెడిది. ఉదాహరణకు: నిదానముగా, ఉపేక్షింపక, సహనముతో తర్ఫీదుపొంది, బలమైన ఆకాంక్షగల ఒకనితో నీవు పోటీపడవలసివచ్చినప్పుడు, నీ ఆకాంక్ష అతని ఆకాంక్షను విశేషముగ మించియుండకపోయినట్లయితే, అతఁడే నిన్ను జయించును, నీతో పోటీపడువాడు జ్ఞానయుతమైన ఆకాంక్ష లేక సాంకేతిక జ్ఞానము మాత్రమే గలిగి యుండినచో, నీవు సంపూర్ణ ఆత్మజ్ఞానము గలిగి యున్నప్పుడు నిజమునకు నీవే అతనిని మింతువు. ఎందుకనఁగా, సాంకేతిక జ్ఞానముగల అర్హతకంటె ఎఱుకకు సంబంధించిన నీ యోగ్యత అధికము కనుక అయితే, అందొకటి మఱియొకదాని స్థానమును అతిక్రమింపజాలదు. ఏది ఎక్కువ అర్హత గలదో అదే ముఖ్యము. అయితే, త్వరితముగ ప్రతిస్పందించగల

వరములు, స్వచ్ఛందముగా చర్యలుగొను తత్త్వము నీవు గలిగియుండి, ఆట యొక్క రహస్యముల నన్నింటిని తెలిసికొనవలెను, రెండునుగూడ నీకు ఉండవలసినవే. రెంటిలో గొప్పదిమాత్రము 'ఆత్మచైతన్యము' అది నమ్మకమైన చర్యను, సరియైన తరుణములో గైకొనును. కాని, అది మాత్రమే చాలదు. నీకు సంపూర్ణ పరిపక్వత కావలయునన్న, ఒకటి కలదని రెండవ దానిని ఉపేక్షించి త్రోసిపుచ్చరాదు.

## జయించుటకే ఆట ఆడవలయునా ?

నీ ఎఱుక మూడు లేక నాలుగు సంవత్సరముల వయస్సు గలదే యైనప్పుడు, జయకాంక్ష మొత్తముమీఁద ప్రేరకము కావచ్చును. అయితే, నీకు యాభై సంవత్సరముల వయస్సులోకూడ నాలుగుసంవత్సరముల ఎఱుక మాత్రమే ఉండవచ్చును. కాదా ? నీ యెఱుక బాగా పండి ఉన్నట్లయితే, గెలుపుకొఱకై ఆడవలసిన అవసరములేదు. నీవు ఆడుటకొఱకు ఆడవలసినదే. ఆట ఎట్లాడవలెనో నేర్చుకొనుటకు, ఆటలో అభివృద్ధిగాంచుటకు, నీ యాంతరంగికచేతన మహోన్నతముగ అభివ్యక్తమగుటకు నీ వాడవలసియున్నది. ఇదియే అత్యంత ముఖ్యము.

ఉదాహరణకు; ఆట బాగుగా ఆడగోరువారు కేవలము గెలుచుటకొఱకై పోయి అసమర్థులయిన ఆటగాండ్లను ఎన్నుకొని వారితో ఆడుటకు ఇచ్ఛగింపరు. నేను ఎనిమిదేండ్లవయస్సులో టెన్నిసు ఆట ఆడుట నేర్చుకొంటినని జ్ఞాపకము. అది నాలో తీవ్రవాంఛగా నుండెను. అయితే, నేను నా తోటివయస్సు పిల్లలతో ఆడుటకెన్నడును ఇచ్ఛగింపలేదు. ఎందుకనఁగా, నేను వారివలన నేర్చుకొనునది ఏమియుఉండదు. (మామూలుగా నేను వారిని ఓడించివేయుచుండెడిదానను ) ఎప్పుడును నేను సమర్థులైన ఆటగాళ్ళతో ఆడుటకే వెళ్ళెడుదానను. ఒక్కొక్కప్పుడు వారు నన్ను ఆశ్చర్యముతో జూచెడివారు, ఏమైనను కడకు వారు

నాతో నాడిరి. నే నెప్పుడును గెలవలేదు. అయితే, అధికముగా ఆట నేర్చు కొంటిని.

20 జనవరి 1951

"ఆత్మను ఆవిష్కరించే ఉద్యమమును పూర్తి చేయ వలయునన్న, మానసికాభివృద్ధిని నిరాకరింపకుండుట మంచిది. ఎందుకనఁగా, మానసిక పరికరము దోహద కారియైనను గావచ్చు, గొప్ప నిరోధకమైనను గావచ్చు. దాని సహజదశలో మానవుని మనస్సు సర్వదా పరిమిత దృష్టి గలది. దాని అర్థావగాహనము, సంకుచితము, దాని భావనాసరళి కఠినము. దానిని విశాలపరచుటకు, మృదుత్వము గాంభీర్యము గలదిగా జేయుటకు నిర్వి రామకృషి యవసరము."

("జీవన శాస్త్రము'' బులెటిన్ 1950)

దురదృష్టవశాత్తు అనేకులు తాము ఎక్కువ ఆలోచనాపరులైనకొలఁది ఎక్కువ గొప్పవారమని తలంతురు. మనస్సు తనకు దాను తృప్తిపడి అభి వృద్ధిని ఎక్కువ కాంక్షింపదు. సర్వజ్ఞత్వముగలదాననని భావించును.

అనేకులు తమ ఆలోచనామార్గము అత్యుత్తమమైనదని భావింతురు. ఒకటే అంశమును గుఱించి ఆలోచించుటకు సర్వదా అనేకమార్గములు గల వని వా రర్థముచేసికొనరు. వారి యాలోచన పటిష్ఠము, నిష్కృష్టము అయిన కొలఁది వారు ఆలోచనకు, అది యొకటియే మార్గమని నిశ్చయించుకొందురు. కొన్ని సాధనలు ఆలోచనలను విశాలము చేసి, విషయములను ఒకే సమ యమున అనేక దృక్పథకములనుండి చూచు అలవాటును నీకు గలిగించును.

"సర్వ విషయములను ఎన్ని పరిశీలనా దృక్పథములనుండి చూచుటకు సాధ్యమో అట్లు చూచుట చాల అవసరము. ఈ సందర్భముగా సాధన ఉన్నది. అది ఆలోచనకు ఎక్కువ మృదుత్వమును, ఔన్నత్యమును చేకూర్చును. ఎట్లనగా; విశదమైన సూత్రముగా రూపొందించిన పక్షమొకటి యున్నది, దానికి వ్యతిరేకముగా ప్రతిపక్షము సైతమున్నది,అదియును అదే రీతిగ నిష్కృష్టముగ రూపొందించినదే, అప్పుడు, శ్రద్ధాపూర్వకమైన ఆలోచనతో ఆ రెండింటికి సమన్వయము కనిపెట్టబడునంతవరకు సమస్యను విస్తృతము, ఉదాత్తము గావింప వలయును. అప్పుడా రెండు వ్యతిరేక పక్షములు-ఘనము, ఉన్నతము మిక్కిలి అర్థవంతము నగు భావమున సమన్వయము గాంచును."

సరే, ఇప్పుడు మీరు నా కొక పక్షమును ప్రతిపాదన చేయండి.

పక్షము: ప్రతిఒక్కడు ఈ ప్రపంచములో తన శిలువను తాను మోయును.

ప్రతిపక్షము: సర్వదుఃఖములకు అధిగమించిన మానవులున్నారు.

మరి సమన్వయము?

సమన్వయము: ప్రతిఒక్కరిలోను అన్నిదుఃఖములకు అతీతమైన భాగమొకటి యున్నది.

అ : వివిధ రకముల మనుజులు ప్రపంచములోనున్నారు.

ఆ : దుఃఖమును దాటుటకు శిలువ అవసరము.

అది సమన్వయముగాదు.

ఇ : నా పక్షమునందు సాధారణ మానవులను గుఱించి ప్రస్తావించినాను. ప్రతిపక్షమునందు అసాధారణమానవులను గుఱించి మాట్లాడినాను.

అవును, కాని, అసాధారణమానవులకు దుఃఖములుండవు. అని నీవు విశ్వసించుచున్నావు. ఉన్నత జీవులుసైతము శిలువ మోయు నవసరమున్నది.

చైతన్యములో భేదములగుఱించిన సమస్యఇది. కొందఱిలో బాహ్యచైతన్యస్థితియే బాగుగా అభివృద్ధిచెందియుండును. దానికి భిన్నముగా ఇతరులు చైతన్యపు ఉన్నత స్థితులను వికసింపజేసికొనుటకు శ్రద్ధవహించియుందురు. అందువలన చెప్పునదేమనగా, "ప్రతిఒక్కరు తన శిలువను తాను మోయుదురు" అను మాట బాహ్యచైతన్యమునకు సంబంధించినంతవరకు యదార్థమే. అనగా, భౌతికసంఘటనలు, ప్రాణిక - ఆవేగాత్మిక - మానసిక సంఘటనలు ఈ పరిగణనలోనికి వచ్చును. అటువంటివారికి అనేకములైన మహావిపత్తులు కలుగుచుండును. వ్యక్తి తాహత్తును బట్టి కలుగునవి కనుక భరించుశక్తి ఎక్కువగా గలవారే ఎక్కువ కష్టములను, దురదృష్టములను అను

భవించుచున్నారు. కొందఱు దురదృష్టములకు అతీతులుగానుందురు. అయినా దురదృష్టములు వారికి ఉండనే ఉండును. ఎందులకు? వారి అంతశ్చైతన్యము బలము గలదిగాను, బాగా అభివృద్ధి చెందినదిగాను ఉండును. (నేను పరివర్తన చెందిన వారినిగుఱించి మాట్లాడుటలేదు. అట్టివారిలో భౌతికవ్యక్తిత్వముకూడ బాధలకు అతీతముగా నుండునని మనమూహింపవచ్చును. మనము ప్రస్తావించునది యధాతథముగా ఇప్పుడున్న వారినిగుఱించియే.) నీ చైతన్యము బాహ్య విషయములు అందుకోలేని స్థలములో నెలకొన్నదై యుండినచో, నీవు నీ శిలువను మోయనక్కరలేదు. ఎందుకనగా, నీవు దాని కతీతముగానున్నావు. దీనికి మినహాయింపులున్నవి, కొందఱు మానవులు కష్టముల కతీతులుగానుందురు. కాని తమ శిలువను మోయుచునే యుందురు. పైకి పరస్పర విరుద్ధముగ దోచు ఈ రెండు స్థితులను ఎట్లు సమన్వయ పరచుట?

దురదృష్టములు వివిధ భేదములు గలవిగా నున్నవి.

అట్లుకాదు, మానవదుఃఖములయు, — దురదృష్టములయు స్వభావ మెప్పుడును ఒక్కటే, నీలో నుండియు, పరిస్థితుల నుండి లేక సామాన్య స్థితుల నుండి వచ్చిన కష్టములు గలవు. అనఁగా, నీవు ఈ కష్టములను జననమాది అనుభవించుచుందువు. వీని నెవరును తప్పించుకోలేరు. అవి యెప్పుడు ఒకే మోతాదులో నుండవు. కాని అవి సర్వదా ఉండనే ఉండును. అందువలన వైరుధ్యమున్నట్లు కానవచ్చినను అది నిజము గాదు. ఎందుకనఁగా, కొందఱికి అవి కలిగినను కలుగని విధముగానే ఉందురు. ఇది గాని, అది గాని పూర్తిగా సత్యములు గావు; అబద్ధములును గావు.

మానవచైతన్యమునం దొక స్థితి ఉన్నది. (అది దివ్యచేతన గాదు. నిక్కముగ మానవతయే.) అందు ఈ రెండుస్థితులును ఏకకాలముననే కాన

వచ్చును. కష్టము లుండును కాని అనుభవింపఁబడవు. అవి సంభవింపనట్లే ఉండును, అనగా, ఆ కష్టము. బాహ్యచైతన్యమును, భౌతికమును, మానసికమును, ప్రాణమును తాకును, ఆధ్యాత్మికచేతనను తగలదు. అది అన్నిటికీ అతీతమైనది. ఒక నిదర్శనమును తీసికొందము. రోగము, శారీరక అవ్యవస్థితి కష్టములఁదెచ్చును. ఒకప్పుడు అమితమైన బాధయగును, అయితే, సంభవించిన కష్టములు తమ యెఱుకకు రానివారున్నారు, ఆ బాధలు వారికి సత్యములు గావు, వియోగము సంభవించినప్పుడును అంతే. నీ వొకరిని ప్రేమించినపుడు. ఎడబాటుకలిగినచో బాధ కలుగును. అట్టిది సర్వసాధారణముగా నున్నది. బంధములు త్రెంపఁబడును. అయితే, ఒకవిధమైన చైతన్యము గలిగినవారిలో ఇద్దరిమధ్య ఉన్న అనుబంధము త్రెంపఁబడజాలదు. త్రెంపబడగల వ్యవస్థలో అవి ఉండవు. అందువలన అట్టివాడు ఏమి సంభవించినను దానికి అతీతుడై యుండును.

ఉన్నతచేతనను ఒకఁడు చేరకముందు ఒకానొక దశ ఉన్నది. ఆ దశలో ఒకఁడు, హేతువాదశక్తిని అభివృద్ధి చేసికొనవచ్చును. అది విశుద్ధమైన, ఖచ్చితమైన, తార్కికమైన విషయములపైన బాహ్యదృష్టి కల్గినదై యుండును. ఒకఁడు ఈ హేతువాదమును అభివృద్ధిపరుచుకొన్నప్పుడు, సర్వప్రేరణలు, భావములు, వాంఛలు, ఆందోళనలు - అన్నియు ఈ హేతువాదము ముందుంచ గలిగినట్లయితే, సహేతుకప్రవృత్తి ఆతనికి అలవడును. అట్లుగాక అనేకులు, ఏదైనను తమ్ము ఆందోళన పరచినప్పుడు, సహేతుకప్రవృత్తిని కోల్పోయిన వారగుదురు. తాముజబ్బుపడినప్పుడు, "ఓ!, నేను ఎంతగా జబ్బుపడితిని. ఇది ఎంత భయంకరము. ఎల్లకాలము ఇది ఇట్లే యుండునా?" అని భావించువారి రోగము క్రమక్రమంగా ఎక్కువగుటయే సంభవించును. లేక, వారికొక దురదృష్టము సంప్రాప్తమైనచో, "నా కొక్కడికే ఇవుడీ బాధలు సంభవించుచున్నవి. అన్నియు నాకు అనుకూలముగా నున్నవవి పూర్వము భావించితిని" అని వారు అవశులై యేడ్తురు. వారికి నరములు సడలును.

మానవాతీతుడే కావలసినదిలేదు. మానవునియందుసైతము. హేతువాదమను ఉన్నతప్రజ్ఞగలదు. అది విషయములను ప్రశాంతతతో, నెమ్మదిగా, సహేతుకముగా జూడ సామర్థ్యము గలది. ఈ హేతువు "భయపడవలదు. అది నీకేమియు మేలు చేయదు. సణుగుకొనుట నిష్ప్రయోజనము. అది సంభవించినది కనుక దానిని నీ వామోదింపవలెను." అని నీకు చెప్పును. అప్పుడు నీవు వెంటనే శాంతింతువు. అది మంచి మానసిక శిక్షణ. అది, నీ నిశ్చయబుద్ధిని వాస్తవిక దృష్టిని అభివృద్ధిపరచును. ఇంకను నీ శీలమును చక్కగా తీర్చిదిద్దును. నీ నరములకు నీవు పరిహాసపాత్రముగా లోబడుటను తప్పించి సహాయముచేయును. నీవు సహేతుకముగ ప్రవర్తింపనేర్తువు.

మనస్సునకు గష్టతరమైన పని ఒకటున్నది. నా మతమున అది ఎంతో ముఖ్యమైనది. నీవు విషయములపైనను, మనుష్యులపైనను తీర్పుచెప్పుటకు నీ మనస్సునకు బెత్తన మివ్వవలదు. "ఇది మంచిది. అది చెడ్డది, అది న్యాయయమైనది, ఇది తప్పు, దీనికి ఈ లోపమున్నది — దానికి ఆ దోషముగలదు." అని చెప్పుట తప్పు నిర్ణయము చేయుటే యగును. బుద్ధిశాలురు బుద్ధియుక్తులైనకొలది తమ కేమియు దెలియదని చెప్పుట యుక్తమని ఎక్కువగా గుర్తింతురు, మనస్సుతో నేమియు దెలిసికొనలేమని ఎఱుగుదురు. ఒకఁడు ఒక ప్రత్యేకపద్ధతిలో యోచించవచ్చును, నిర్ణయించిదర్శింపవచ్చును, కాని, దేనియందును, వానికి నిశ్చిత జ్ఞానము కుదరదు. ఎన్నటికిని కుదురనేరదు. ఒకడు సర్వదా "బహుశః ఇది ఇట్లయి యుండవచ్చును." అని మాత్రము అనగలుగును. ఎందుచేతననగా. మనస్సు జ్ఞానమునకుఁ బరికరము గాదు.

ఆలోచనలకు ఊర్ధ్వమున పరిశుద్ధ భావము లున్నవి. ఆలోచనలు ఆ భావములను వెల్లడించుట కుపయోగపడును. జ్ఞానమనునది ఈ పరిశుద్ధ భావక్షేత్రము కంటెను పైన ఉన్నది; అవి ఏవిధముగా ఆలోచనలకు పైన ఉన్నవో అట్లే. అందువలన, ఒకడు ఆలోచనల నుండి పరిశుద్ధ భావనకు ప్రాకుట యెట్లో తెలిసి

కొనవలెను. పరిశుద్ధ భావము జ్ఞానమునకు అనువాదముతప్ప మరేమియు గాదు. పరిపూర్ణతాదాత్మ్యముతోగాని జ్ఞానము లభింపనేరదు. ఆరోపించుకొన్న గొప్ప తనపు ఎత్తులనుండి అన్నింటిని చూచుచు నిర్ణయించుచు నిరంతరము పని చేయు నీ క్షుద్రమానవ మనస్తత్వమునందు, అనగా భౌతిక చైతన్య మనస్తత్వము నందు, నీవు నెలకొని యుండునంత కాలము అయ్యది.—"ఇది ఏమాత్రము బాగుండలేదు. ఇది ఇట్లుండరాదు", అని నీకు చెప్పుట సంభవించుచుండును. దాని మాట వినుటయన, నీవు సంపూర్ణముగ తప్పుదారిన పడిపోవుటయే. మౌనము వహించి, అన్నింటిని బాగుగా పరిశీలించుచు కొద్దికొద్దిగా నీలో నీవే వివరణలు వ్రాసి రికార్డుపెట్టుకొనుచు, తీర్పులు చెప్పకయుండుట ఉత్తమమైనపద్ధతి. నీ వన్నింటిని నీలోనే నిలిపియుంచుకొననేర్చి ప్రశాంతతతో ఎట్టిఆందోళనయులేక నీ ఎఱుకలోని ఉన్నతోన్నత భాగముముందు సకలము నివేదించి శ్రద్ధాపూర్వకమైన నిశ్చలనీరవత నవలంబించుచు వేచియుందువేని అప్పుడు, కడునెమ్మదిగా, సుమారమునుండియు మహోన్నతస్థాయినుండియు వచ్చుచున్నది వోలె ఒకానొక జ్యోతినిబోలినది అభివ్యక్తమై తద్వారా నీవు కొద్దిగా సత్యమును తెలిసికొన గలుగుదువు.

అయితే ఎంతకాలము నీ యాలోచనలను రెచ్చగొట్టుచు తునకలు తున కలుగ వాటిని తెగగొట్టుచుందువో, అంతపర్యంతము నీవు ఏమియు దెలిసి కొనలేవు. అవసరమైతే నేను నూరుమార్లు దీనిని పునరుద్ఘాటించి చెప్పగలను. కాని, నీ వెంత కాలము దీనిని నమ్మలేవో అంతకాలము అజ్ఞానమునుండి వెలువడలేవనుట నిస్సందేహము.

పరిశుద్ధభావములకు ఖచ్చితమైన సంఖ్య ఏదైన ఉన్నదా?

అది తెలియవలెనంటే భగవంతుని చెంతకుబోయి అడుగుము. ఈ లెక్కలతో నాకు ఆసక్తిలేదు.

ఇక్కడ ఒక చిన్న కథ ఉన్నది. నా మిత్రులలో ఒకడు భారత దేశయాత్ర చేసివచ్చినప్పుడు, అతనిని ప్రయాణపు విశేషములు చెప్పమని కోరిరి. ప్రతిది సులభముగా నమ్మే స్వభావముగల ఒక వృద్ధవనిత అతనిని యిట్లడిగినది:

"భారతదేశములో ఆత్మ లెన్ని యున్నవో లెక్కింతురా?"
"లెక్కింతురు."
"అయితే అవి ఎన్ని?"
"ఒకే ఒకటి." అతని సమాధానము.
ఇది వాస్తవముగా జరిగిన సంభాషణ.

* * *

జనవరి 25. 1951

తల్లి, "జీవనశాస్త్రము" అను వ్యాసమునుండి చదువు చున్నది. (బులెటిన్, నవంబరు 1950)

"మనలోనున్న ప్రాణమయసత్త వివిధ ప్రేరణలకు వాంఛలకు. ఉత్సాహమునకు, హింసాప్రవృత్తికి, ప్రబలశక్తికి, నిరాశా నిస్పృహలకు, ఉద్వేగమునకు తిరుగుబాటువృత్తికి స్థానమైయున్నది. అది సమస్తమును

> కార్యాచరణకు పూన్చును; నిర్మాణముచేసి కార్యసిద్ధి కలుగజేయును. కాని, మఱియొకపక్షమునది సమస్తమును నిర్మూలించి నిరుపయోగమొనర్చునుగూడ. కావుననే మానవునిలోని విభాగములన్నిటిలో దీనిని క్రమశిక్షణలో బెట్టుట కడుంగడు కష్టమై కన్పట్టుచున్నది. సుదీర్ఘము, శ్రమాకులమునగు పరిశ్రమను గొప్పవోర్పుతో ఇందులకై చేయవలయును. సంపూర్ణమైన అంతఃశుద్ధి దీని కెంతేనియు అవసరము, ఎందుకనగా, అంతఃశుద్ధి లేనిచో ఒకఁడు తన్ను తానే మోసగించుకొనుట ప్రారంభములోనే జరుగును. తరువాత ఎంత ప్రయత్నించినను అభివృద్ధి కలుగదు.

నిజమైన అవసరమునకు, కామనకు మధ్యసరిహద్దులను తెలిసికొనుట మహాకష్టము. (యోగసాధకుని ఆదర్శము ఎట్టి అవసరముగాని, ఆ కారణముచే ఎట్టి కామనగాని లేకయుండుట.) కాని, ఈ వ్యాసము సద్భావన కలిగి తమ్ము దాము తెలిసికొన గోరుచు ఆత్మసంయమము గావించుకొన నభిలషించు ఎల్లరికొఱకు ఉద్దేశింపఁబడినది. ఇక్కడ నిజముగా మనకొక సమస్య ఎదురగుచున్నది. అసాధారణమైన అంతశ్శుద్ధి దీని కెంతేనియు కావలసియున్నది. ఎందుకనగా, జీవునకు జీవితముతో సమాగమము కామనద్వారా అగుచున్నది. అయినను అవసరా లనునవియు ఉన్నవి. కాని, ఏవి నిజముగా కామింపబడక అవసరములై యున్నవో తెలిసికొనుటెట్లు? తెలిసికొనుటకు, అధికాధికముగా శ్రద్ధతో బరిశీలింపవలయును. ఏవిషయమైన నీలో కొద్దిపాటిగా నైనను తీవ్రస్పందనము కలిగించునది ఏదైనను న్నచో, అప్పుడు నిజముగా కామన యున్నదని గట్టిగా నీ వనుకొనవచ్చును. ఉదాహరణకు: నీవు "ఈ ఆహారము నా కవసరము" అనుచున్నావు. అట్లని నమ్ముచున్నావు, భావించు

చున్నావు. అది అవసరమని తలపోసి దాని సంపాదనకై ప్రయత్నించుచు న్నావు. కాని, అది నీ అవసరమా, లేక కామనయా తెలిసికొనవలెనంటే విన్ను నీవు అతిశ్రద్ధతో పరిశీలించుకొని, "అది నాకు లభించకపోతే ఏము గును?" అని అనుకొనవలయును. అప్పుడువెంటనే, "ఓ అట్లనుట ఎంతమా త్రము మంచిదికాదు" అని జవాబువచ్చినచో అది నిశ్చయముగా కామనయే యగును. ఇకఅన్ని విషయములలోను అంతే. ప్రతిసమస్యకు. నీవు వెనుకకు తగ్గి, నీవైపుచూచుకొని, "నా కావస్తువు లభించనున్నదా?" అని ప్రశ్నించుకొ నుము. ఆ సమయములో నీయందేదియో సంతోషముతో గంతులువేసినచో అప్పుడు నీలో కామన ఉన్నదని నీవు నమ్మవచ్చును. అట్లుకాక నీలో ఏదియో "ఓః నా కదిలభింపదు," అని అనుకొన్నప్పుడు నీవు దిగజారిపోదువేని. అప్పు డును నీలో కామన ఉన్నట్లే. నీ ప్రాణమయసత్త విన్ను మోసగించకుండ వలెనంటే, నీవు ఎక్కువ జాగరూకత కలిగియుండుటయే గాక, నీ అంత శ్శుద్ధియు అత్యద్భుతమైనదిగ నుండవలెను. మిమ్ము నిరుత్సాహపరచుటకు గాదు నేను "అత్యద్భుత" మను పదమును ఉపయోగించుట. అందుకుభిన్నముగా, అంతశ్శుద్ధియెడ అధికతరమైన ఆకాంక్ష మీలో ఉత్పాదింపజేయుటకే.

తల్లి ఇంకను చదువుచున్నది :- "ప్రాణమయ సత్తతోడ్పాటుఉన్నచో సాధ్యముకాని సాక్షాత్కారము లేదు. ఆచరణయోగ్యముకాని పరివర్తనము లేదు.

ఇది మిగుల ఆశ్చర్యకరమైన విషయము. ప్రాణమయసత్త తన శక్తిని తాను ఎఱిగి యున్నది. అందుచేతనే అది ముఖ్యమైనదిగ నేను నమ్ముచున్నాను. దానికి అపరిమిత శక్తి ఉన్నది. దానికి ఎట్టి కష్టమైనను కష్టము గాదు. అయితే, అది సరియైన మార్గమున నుండవలయును. అది తోడ్పడినట్లయితే, ప్రతిదీ అద్భు తమే. కాని, దాని నిరంతర సహాయము దొరుకుట సులభము గాదు. అది మంచి కార్యకుశలత గలది. చాలా బాగా పనిచేయ గలదు, అయితే, ఆ పని చేయు

టలో తన సంతృప్తిని కోరుకొంటుంది. తన పనికి ప్రతిఫలము కావాలంటుంది. దాని నుండి రాగల సంతోషము నంతటిని వాంఛిస్తుంది. లాభమంతయు కావాలంటుంది. ఏ కారణముచేత నైనను ఈ సంతృప్తిని యివ్వకపోతే అది సంతోషము పొందదు. "అది యుక్తము కాదు. నేను పని చేసితిని. నాకు ప్రతిఫలముగా నేమియు ఇవ్వలేదు". అని వెనుకాడుతుంది. కదలదు. మౌనము వహిస్తుంది. ఒక్కొక్కప్పుడు, "నేను లేను" అనుకొంటుంది. అప్పుడు, శక్తియంతయు శరీరము నుండి నిర్గమిస్తుంది. నీవు అలసట చెందుదువు. నిర్వీర్యుఁడ వగుదువు. ఏమియు చేయలేని వాఁడవగుదువు. అకస్మాత్తుగా ఇది చెడుగా పరిణమిస్తుంది. ఎందుకనగా మనస్సుకు ప్రాణమయసత్తతో స్నేహ మెక్కువ. మనస్సంటే, హేతువాద మనస్సు గాదు, భౌతిక మనస్సు. దానికి ప్రాణమయసత్తతో అమిత స్నేహము. కనుక ప్రాణమయసత్త, "నాకు దీనితో ఇక పనిలేదు. నేను చాలాహీనముగా చూడబడితిని, నాకు దీనికి ఇక సంబంధములేదు". అని చెప్పుటకు ప్రారంభించి నంతనే, సహజముగా అప్పుడు మనస్సు దానిని ప్రోత్సహించుటకు, వివరించి తగిన కారణమును జూపుటకు ముందుకు వచ్చును, ఇక అంతయు పాత కథయే. "జీవితము నిష్ప్రయోజనము, లోకము నిజముగా అసహ్యముగ గనపడుచున్నది. పరిస్థితు లన్నియు నాకు బ్రతికూలముగా నున్నవి. ఇక అంతయు వదలివేయుట మంచిది", అని యేమేమో పలుక నారంభిస్తుంది. సర్వ సాధారణముగా సంభవించునది ఇదియే. కాని, ఒక్కొక్కప్పుడు హేతువాద బుద్ధి తళుక్కుమంటుంది. అది, "ఓః ఇక చాలు నీ ప్రహసనము, ముగించు" అని బుద్ధి చెబుతుంది.

కాని, ప్రాణమయసత్త ధోరణియే బలపడి, దానికి తగిన ప్రతీకారచర్య తీసికొనకపోతే, నీవు నిరాశలో పడిపోవుట నిశ్చయము. "నిజముగా ఈ జీవితము నావంటి మనుజులకు గాదు. నేను ఇతరచోట సంతోషముగా నుండగలను. స్వర్గములో అందఱు చక్కని ప్రవర్తనము గలిగి యుందురు. ప్రతివారూ అచట యథేచ్ఛగ మెలగవచ్చును" అను ధోరణి ఏర్పడును. స్వర్గలోక భావనలు దీని

నుండి ఉద్భవించినవే. భౌతిక మనస్సు, ప్రాణమయసత్త—యీ యిరువురు మిత్రులే స్వర్గమును నిర్మించినారని నా అభిప్రాయము. జీవితము నీ కోరికలకు అనుగుణముగా నుండని యెడల నీవు దుఃఖింప నారంభింతువు. "ఓ! ఈ జీవితానుభవ మిక చాలును. ఈ ప్రపంచము దుఃఖకరము. వంచనతోఁ గూడినది. నేను మరణించుట మేలు" అందువు. అప్పుడు పరిస్థితి మరింత తీవ్రమగు తరుణము వచ్చును. నిరుత్సాహము తిరుగుబాటుగను, విషాదము అసంతృప్తిగను మారును. దుస్స్వభావము గలవారి విషయము నేను మాట్లాడుచున్నాను. సత్స్వభావము గలవారుకూడ ఉన్నారు. దుస్స్వభావులగుట గాని, సత్స్వభావులగుట గాని వారి తప్పుకాదు, అయినను విషయము లావిధముగా నున్నవి. దుస్స్వభావము గలవారు క్రోధగ్రస్తు లగుదురు. అంతయు ధ్వంసముచేసి క్రిందకు లాగివేయ దలంతురు. "నేను వాంఛించినది వారు చేయుటలేదు. వారికి ఎట్టి శాస్తి జరుగునో చూచెదవు గాక!" అందురు. తరువాత యిది మఱికొంత తీవ్రరూపము ధరించును. మనస్సు ఎప్పుడును తన స్నేహితుని ఆదుకొనుటకు సిద్ధమే. అద్భుతమైన ఆలోచనలను పగ తీర్చుకొనుటకు అందించును. నిరుత్సాహ బలముతో నీవొక రకమైన చెడ్డపని చేయుదువు. దుష్టత్వము వలన మఱియొక విధమైన చెడ్డపని చేయుదువు. నిరుత్సాహమువలన చేయు అవివేకపు పనులు నీకు సంబంధించినవి. దుష్టత్వము వలన చేయునవి ఇతరులను బాధించును. ఒక్కొక్కప్పుడు ఈ దుష్టచేష్టలు చాల తీవ్రరూపము ధరించును. నీకు ఏమాత్రము సద్భావ మున్నను, అట్టి ఉద్వేగ పరిస్థితి యేర్పడినప్పుడు, నీవు కదలకూడదు. దీనిని నీవు నియమముగా పాటించవలెను. "నేను ఇచ్చటినుండి కదలను. ఈ తుఫాను దాటిపోవునంతవరకు వేచియుందును" అని నీకు నీవు చెప్పుకొనవలెను. ఎందుకనగా, కొన్ని క్షణములలోనే ఒకఁడు నెలల తరబడి చేసిన క్రమబద్ధమయిన ప్రయత్నమునంతను నాశనము చేయగలదు.

ఇక్కడ నేను నీకు ఓదార్పు కలిగించు సంగతి యొకటి చెప్పెదను. (తల్లి చదువుచున్నది).

"ఆకాంక్షారూపమైన అగ్నిజ్వాలయు, సాధింప వలసిన ఆదర్శముగూర్చిన యెఱుకయు ఆంతరమున సజీవముగా నుండుటకై, అంతరాత్మయగు చైత్య పురుషునితో సరియైన సంబంధము స్థాపించుకొని యున్నవారిలో ఈ విపరీతోద్వేగములు ఎక్కువకాల ముండవు, ఎక్కువ అపాయకరములును గావు. ఈ ఎఱుక సహాయముతో, తిరుగుబాటును చేసిన బాలుని, ఓర్పుతో, పట్టుదలతో, వానికి సత్యమును వెలుగును, చూపుచు, నమ్మించుటకు ప్రయత్నము చేయుచు, వానిలో మఱుగున బడియుండిన సద్భావ మును మేలుకొలుప యత్నముచేసినట్లు, ప్రాణమయ సత్తను దారికి తెచ్చుటకు వీలున్నది."

ఇది కడపటి ఓదార్పు, నిజముగా అంతశ్శుద్ధి. సద్భావన గలవారికి ఈతీవ్రో ద్వేగములు అభివృద్ధి సాధకములుగా మార్చవచ్చును. తుఫాను వంటి ఈ విధ మైన ఎదురుదెబ్బ నీకు సంభవించినప్పుడు ఈ పరిస్థితిని నూతన పురోగతిగా, అంత్య లక్ష్యమువైపు ముందడుగుగా మార్చుకొనవచ్చును. ఈ ఉద్వేగ కారణము యొక్క ముఖములోనికి నేరుగా జూడగల్గుటకు అవసరమైన నిష్కాపట్యము నీలో ఉండి, నీవు చేసిన తప్పు, తలంచిన తప్పు, భావించిన తప్పు తెలిసికొని చూచి నప్పుడు, నీ బలహీనతను, హింసను, ఆడంబరమును, (నేను మఱచితిని చెప్పు టకు, ప్రాణమయసత్తకు మనస్సుకంటె ఎక్కువ ఆడంబరము గలదు) అన్నిటిని నీవు నేరుగా జూచి, నిజాయితీగా, నిష్కాపట్యముగా, ఏమి జరిగినదో అది నీ లోపము వలననే జరిగినదని నీవు గుర్తించినచో, అప్పుడు ఎఱ్ఱగా గాల్చిన ఇనుప కడ్డీని బలహీనతగల స్థలముపై ఉంచినట్లుగా ఉంచి, ఆ బలహీనతను శుద్ధిచేసి దానిని క్రొత్త ఎఱుకలోనికి మార్చగలవు. ఆ తుఫాను అనంతరము నీవు కొద్దిగా బెరిగినట్లు, నిజముగా అభివృద్ధి సాధించినట్లు తెలిసికొందువు.

"అభివృద్ధి మందకొడిగా ఉండవచ్చును. తరచుగా పతనములు సంభవింపవచ్చును; అయితే, ధైర్యముగల నిశ్చయము స్థాపించుకొన్నచో ఒకనాటికి జయము తథ్యము. అన్నికష్టములు ప్రకాశమానమైన సత్యజ్ఞానము నెదుట కరిగి అదృశ్యమైపోవును."

ఇచ్చట నేను దోషములు, కష్టములపైన నొక్కి వక్కాణించు చున్నచో, అది నిన్ను ప్రయత్నమునుండి నిరుత్సాహ పరుచుటకు గాదు.— నీవు అవసరమైన ధైర్యముతో పనులు చేయుటకు, వెంటనే జయము సాధింప లేనందుకు నిరుత్సాహ పడరాదని చెప్పుటకే, అయితే, ఆకాంక్ష మీలో ఉన్నట్లయితే, దృఢ నిశ్చయము మీలో ఉన్నట్లయితే, ఇప్పుడో తర్వాతనో మీరు జయించుట తథ్యము. సామాన్య పరిస్థితులలో (మీకంటే తక్కువ అనుకూల పరిస్థితులలో) బ్రతుకుచున్న ప్రజలు, తమ్ము గూర్చి తాము తెలిసికొని, తమ్ము తాము జయించుకొని తమపై తామే ఆధిపత్యము వహించి తమ్ము దాము నడిపించుకొన నేర్తురేని, అట్టి వారిని దృష్టిలో నుంచుకొని నేనిది చెప్పుచున్నాను. కావున పరిస్థితులు అనుకూలముగా నున్నచో మీరు జయించుటకు మరింత ఎక్కువ అవకాశ మున్నది. ఒకటి మాత్రము సర్వదా అవసరము. ఏమన, ఆటను వదలి పెట్టవద్దు. అది గొప్ప ఆట. ఆ ఆట ముగింపువరకు సాగించు ప్రయత్నములో పడు కష్టములను లభింప నున్న ప్రతిఫలము దృష్ట్యా సరకు చేయరాదు.

"కట్టకడపటి అంశమేమన, మనము వివేక విశిష్టము, విస్పష్టమునైన భౌతిక విద్యద్వారా, మన శరీరమును బలము గలదిగా, మృదువైనదిగా చేసికొనవలయును. ఇది భౌతిక ప్రపంచములో పరమార్థ శక్తికి సరియైన

> పరికరము గావలయును ఎందుకనగా, ఆ శక్తి మన ద్వారా అభివ్యక్తము కాగోరుచున్నది".

ఉదాహరణకు, ప్రాణమయసత్తకంటె శరీరమును క్రమబద్ధము చేసికొనుట సులభము. అయితే, మనస్సు, ప్రాణమయసత్తయు తమకున్న స్వభావము బట్టి తమ బానిసయైన శరీరమును ఏమైనను చేయగలవు. అపకృతి యొనర్చి, లేదా నాశనముచేసి, తరువాత (అది వ్యతిరేకించును, కొంత జబ్బుపడును) ఆ యిద్దరు స్నేహితులు చెప్పునదిది: "ఎంతటి పశువు రా శరీరము. అది మన ఉద్యమములో మనల ననుసరింప లేకపోయినది". సంతస మించుకయు లేకయే శరీరము తన పెత్తన దారులకు లోబడును. మనస్సు తన సిద్ధాంతములతో, "నీ వది తినరాదు. అది నీకు హానిచేయును. ఇది నీవు చేయకూడదు. ఇది హానికరము", అని యనును. మనస్సు తెలివిగలది కాకపోతే, చూపు సరియైనది కాకపోతే, తనకు జారీ చేయబడిన ఉత్తర్వుల పర్యవసానముల వలన బాధపడునది శరీరము. నేను ప్రాణకోశము నుండి వచ్చు ఉత్తర్వులను గూర్చి చెప్పుటలేదు. మనస్సు తన కఠిన నియమములచేత, ప్రాణకోశము తన అత్యాచారములు, విజృంభణలు, ఉద్వేగములచేత, త్వరగా శరీరముయొక్క సమస్థాయిని చెడగొట్టుచున్నవి. శరీరమునకు అలసటను జీర్ణించిపోవుటను, రోగమును కలుగ జేయుచున్నవి.

> "దానిని ఈ పీడనము నుండి తప్పింపవలయును. చైత్యపురుష (అంతరాత్మ) కేంద్రముతో నిరంతర సంబంధము పెట్టుకొన్నప్పుడే అది సాధ్యమగును".

అదియే అన్ని రోగములను నివారింప గలదు.

> "శరీరమునకు,అలవాటుపడుట, ఓర్పువహించుట యందు ఆశ్చర్యకరమైన శక్తి ఉన్నది. ఒకడు అను

> కానేదానికంటే అనేక విషయములను సాధించుటకు దానికి శక్తి ఉన్నది. జ్ఞానములేని నియంతలచేత పరిపాలింపఁబడుటకంటె, చైత్యపురుష కేంద్ర సత్యముతో పరిపాలింపఁబడినచో అది యెంతటి శక్తిని చూపగలదో గమనించిన ఆశ్చర్యమగును".

గత యుద్ధములో, సాధారణముగా భరించుకొన వీలులేని కష్టములను శరీరము ఓర్చుకొన గలుగుటవలన అంతటి శక్తి దానికి గలదని రుజువైనది. నీవు యదార్థమునకు, ఇట్టి యుద్ధ కథలను చదివియు, వినియు నుందువు. శరీరము ఎంతటి సహనముతో ఘోరబాధలను భరించినదో దానికి ఓర్చుకొనుటకు తరుగని శక్తి ఎంతగా ఉన్నదో నిరూపితమైనది. కొందఱు తాము చంపబడు నంతటి పరిస్థితులలో నుండియు బ్రతికి బయటబడిరి. వారు బ్రతికిరంటే కారణము వారిలో బ్రతుకవలయునను బలమైన ఆకాంక్ష యుండుటయే. శరీరము ఆ ఆకాంక్షకు విధేయమైనది.

> "స్వస్థమైన, సమస్థాయి గలిగిన జీవితములో క్రొత్త పొందిక శరీరములో బ్రత్యక్షమగును. ఇది ఉన్నత భూమికలందుఁ గల సామరస్యమును ద్యోతకము చేయును. శరీరము చక్కనైన అవయవ పుష్టి గలిగి ఆదర్శ ప్రాయమగు అందమైన రూపమును బొందును",

అది కడపటి దశ. ఉన్నతమగు ఆదర్శ సౌందర్యముతో ఇప్పటి శరీరమును బోల్చి చూచిన, అనేకులీ పరీక్షలో తప్పిపోదురనుట స్పష్టము. మినహాయింపు లేకుండా, ఏ ఒక్కరిలోను అవయవ సౌష్ఠవము సమ తూకములో నుండదు. మనము దాని కలవాటుపడి యుండుటచేత అది మన దృష్టిలో బడదు.

అయితే మనము, ఉన్నత చేతనకు సంబంధించిన సౌందర్యపు దృష్టితో జూచినచో, అయ్యది దృష్టిగోచర మగును. ఆ సౌందర్యమునకు దీటురాగల శరీరములు చాల తక్కువ సంఖ్యలో నుండును. ఈ యసమతూకమునకు వేయి కారణము లున్నవి. మందుమాత్ర మొక్కటే. వ్యక్తిలోని ఈ సహజ జ్ఞాన బీజమును, మహోన్నతమగు నిజమైన సౌందర్య జ్ఞానమును, జొప్పింపవలయును. అది క్రమముగా శరీరాణువులపై బనిజేసి, శరీరము సౌందర్యమును వ్యక్తీకరించును. ఈ విషయము అందరికి ఇంకను దెలియదు. శరీరము అనంతముగా, మనము నమ్మదగిన దానికంటె ఎక్కువగా, సృజనాత్మకమైనది, మృదువైనది. నీవు నిజముగా (అస్పష్టముగ నైనను) గమనించి యుందువు. ఎవరు ఆంతరిక శాంతిలో, ఆంతరిక సౌందర్య భావనలో, కాంతిలో, చక్కని సద్భావమున నివసింతురో, వారు వ్యక్తము చేయునది అనన్య సౌందర్యము. దుష్టాలోచనలతో, తమ సహజ ప్రకృతిలో, క్రింది స్థాయిలో నివసించు వారిది దానికి సరిరాదు. మానవుడు ఉన్నతస్థాయిలో నున్నప్పుడు, పశువృత్తిని అధిగమించి నప్పుడు, ఒకానొక అపురూప సౌందర్యము నాతడు ప్రతిబింబించును. అతడు పశువృత్తిలో జీవించు చున్నప్పుడు అది కాన్పింపదు.

అహంకారముతోను, ఆడంబరముతోను ఎవరైన తమ రూపమును మార్పుచేసికొనయత్నింతురేని, వారు జయముబొందనేరరు. ఎందుకనగా, మార్పు తేగలిగినది లోపలనున్న ఒకానొక శక్తి. అయితే, చెడ్డబుద్ధిని దుష్టాలోచనలను సదా నిరోధించుచున్నయెడల క్రమక్రమముగా సామరస్యవ్యక్తీకరణము రూపమునందును, ముఖలక్షణములందును ప్రారంభమగును; ఎందువల్లననగా, శరీరము ఆంతర్యమునగల స్థితులను ప్రతిబింబించుననుట సత్యము కనుక.

అయితే, నీవొకటి మఱచిపోవుచున్నావు. పూర్తిదినములో 5 లేక 6 గంటలకాలము ఉన్నతచేతనలో నీవు నివసించుచున్నచో, అది అధికమని భావించి తక్కిన కాలమును, ఇంచుమించుగా అల్పజంతువురీతి తిరుగుచుందువు. నీ

పరిస్థితుల ప్రభావముననుసరించి చరించుచుందువు. పైనున్న దివ్యచేతనను అందుకొనవలయుననుట పూర్తిగావిస్మరింతువు. నిన్ను సహజప్రకృతియొక్క క్రిందిదశలకు దిగజారకుండా చేయగలది ఆ దివ్యచేతనయే.

నీవు నీ శరీరమునుండి ఎన్నియో సాధింపవచ్చును—శ్రమ తీసికొని ప్రయత్నించినట్లయితే.

నీవు దానిని తృణీకరింపరాదు, నిందింపరాదు.—అది దోషి కాదు కాబట్టి నీవు తగిన పద్ధతిననుసరించి నీ శరీరమునకు తర్బీదు, విద్య, గఱపినట్లయితే అపారముగా ఫలితమును ఇప్పుడున్నదానికంటె ఎక్కువగాసాధింతువు. ఇటీవలనే శారీరకవిద్యాశిక్షణమును గుఱించి అతిముఖ్యమైనదిగా మాట్లాడుట జరుగుచున్నది. ఒక వందసంవత్సరములు వెనుకకు తిరిగి చూచినట్లయితే ఇతర పనేమియు లేనివారికి విశేషాధికారముగల విషయముగా దీనిని భావించిరి. ఎవరైనను, "నేను నా పిల్లవానిని పాఠశాలకు బంపను. వాఁడు తన జీవితభృతిని సంపాదించుకొనవలెను," అనినప్పుడు, అనేకులు దాని కిట్లు ప్రత్యుత్తర మిచ్చుచుండిరి: అట్లుకాదు. నీవు చాలా పొరబడుచున్నావు. నీవు నీ పిల్లవానిని వయోజన జీవితమునకు సిద్ధపరుపకపోయినట్లయితే, వా డపుడు తానేమి చేయవలయునో చేయఁజాలని అసమర్థుఁడగును." ప్రజల మనస్సును గుఱించే ఇట్లుమాట్లాడిరిగాని శరీరమును గుఱించి కాదు. అందువలన అనేకమంది బిడ్డలు ఒకవిధముగా మంచి పరిస్థితులలోనే జీవించినను, వారి శరీరస్థితి కష్టభాజనముగనే ఉండెను. కాని, దాని కిట్లు సమాధానము చెప్పుకొనుట పరిపాటియయ్యెను: "ఆఁ, ఫరవాలేదు, అంతయు సర్దుబాటు కాగలదు." తగిన శిక్షణతోను, ఓర్పుతోను, నీవు శరీరమును చక్కదిద్దుకొని దానితో జీవితమును సాఫీగా కొనసాగించగలవు. ఆరోగ్యము కల్గి సామరస్యముతోకూడిన జీవితమునుగురించి ప్రజలు నేడు మాట్లాడుచున్నారు. ఈ సామరస్యము క్రమాభివృద్ధి గాంచుచుండునని నేను వక్కాణించియున్నాను.

"ఈ సామరస్యము క్రమాభివృద్ధిని బొందుచుండును. వ్యక్తియొక్క సత్యము స్తబ్దముగా నుండదు. అది నిత్యము వికసించుచు, పెరుగుచు, అధికాధికముగా పరిపూర్ణస్థాయినందుకోగల ప్రతిభావిశేషము గలది. ఎంత త్వరలో శరీరము ఈ అభివృద్ధికరమైన సామరస్య ప్రవృత్తి ననుసరింపనేర్చుకొనునో, అప్పుడు ఎడతెగని పరివర్తనతో శిథిల్య, వినాశముల ఆవశ్యకత నుండి తప్పించుకొనుటకు వీలుకలుగును. ఆవిధముగా, పరమ కఠినమగు మరణనియతి అర్థరహితమైపోగల స్థితి యేర్పడును. సత్యముయొక్క నాల్గుగుణములు మన వ్యక్తిత్వములో స్వేచ్ఛగా వ్యక్తీకరింపబడును. యదార్థము. పవిత్రము అయిన ప్రేమకు అంతరాత్మ వాహకమగును. మనస్సు పొరపాటుపడని జ్ఞానమునకు నిలయమగును. ప్రాణకోశము జయింపశక్యముగాని శక్తిసామర్థ్యములు ప్రదర్శించును. శరీరము పరిపూర్ణసౌందర్య సామరస్యములను ఆవిష్కరించును.

ఇయ్యది రహస్యవాదులకు మతకర్తలకు ఇంచుకేనియు దెలియదు. వ్యక్తియొక్క ప్రతిభాగములో, భగవంతుడు వేరువేరుగా ప్రత్యక్షమగును. ఉన్నతభాగములందు శక్తి, ప్రేమ వగైరాలుగా దర్శనమిచ్చును. భౌతికశరీరమున, సామరస్య సౌందర్యములు తోచును. అందువలన, భౌతికసౌందర్య వ్యక్తీకరణపుసమస్య, ఆధ్యాత్మిక సమస్యయే.

* * *

జనవరి 27, 1951

("పూర్వకాలపు మాటల" నుండి. తల్లి స్వప్నములకు సంబంధించిన పాతవ్యాసమును చదువుచున్నది.)

"మానవజీవితములో మూడింట ఒక భాగమునకు మించిన సమయము నిదురలో గతించుచున్నది."

అందువలన, శరీరసంబంధమైన నిదురను మనము ఆసక్తితో విచారింపదగియున్నది. నేను శరీరసంబంధమైన "నిదుర" అనుచున్నాను, ఎందుకనగా, మనశరీరము నిదురించునపుడు మనయావత్సత్తయు నిదురపోవుచున్నదని మనము నమ్ముచున్నాము.

"నిదురలో మానవుల నిజమైన ప్రకృతి బహిరంగము చేయబడుచున్నదని సర్వసాధారణముగా జెప్పబడుచున్నది."

వారి నిజమైన ప్రకృతి అనగా, వారి లోతైన ప్రకృతియని యర్థము గాదు, వారి స్వాధీనములో లేని స్వచ్ఛందప్రకృతి. కారణము, నిదురలో స్వాధీనమునునుంచుకొనుట అనునది ఆగిపోవును. నిదురలో మేల్కొని యున్నప్పుడు చేయలేనివన్నియు చేయబడును. ఎందుకనగా, ఇచ్ఛాప్రవృత్తి యొక్క పెత్తనము అచట తొలగింపబడును.

"కరగిపోక, అణగద్రొక్కబడిన కోరికలన్నియు ఇచ్ఛాప్రవృత్తి నిదురించునపుడు తృప్తిని జెందుటకు ప్రయత్నించును. కోరికలనునవి రూపకల్పనకు ప్రబలశక్తి

కేంద్రము లగుటచే, అవి మనలోను, మన చుట్టును, తృప్తినిజెందుటకు, అనుకూలమైన పరిస్థితుల సముదాయములను సృష్టించుకొనుటకు ఉద్దేశించును."

వేరొక పాఠములో మనము మానసిక రూపకల్పనా శక్తిని గురించి చర్చించియున్నాము. మనస్సు ఇంచుమించుగా స్వతంత్రజీవనముగలిగి తమ్ముదాము అభివ్యక్తము గావించుకొనెడి రూపవిశేషములను కల్పించును. ఇక్కడ నేను ఆలోచనలను గురించి మాట్లాడుట లేదు. కోరికలనుగుఱించియే. కోరిక ప్రాణమయకోశపరిధికి సంబంధించినది. అయితే. ఈ కోరికల కేంద్రభాగములో సర్వదా ఆలోచన ఉన్నది. మానసికరూపములను నిర్మించు శక్తిని, ఆత్మా విష్కరణ శక్తిని తనచేతిలో నుంచుకొన్నప్పుడు కోరిక క్రియాశక్తిని గ్రహించి, దక్షతనువహించును. వ్యక్తియొక్క దక్షతకు, క్రియాశీలమునకు కేంద్రము ప్రాణకోశము. ఈ రెండు కలసి బలమైన విషయ మగుచున్నది. వీనికి స్వానుభవమును వెలార్చుకొనగల లక్షణమున్నది. అది యటుండ, విశ్వములో నున్నవన్నియు అభివ్యక్తి నభిలషించుచున్నవి. అభివ్యక్తినిరోధించబడినప్పుడు ఆకారణముచేతనే అది తమ శక్తిసామర్థ్యములను కోల్పోవుచున్నది. ఇంద్రియ నిగ్రహమును లక్షించిన అనేకవిధానములు, వానిని అణగద్రొక్కుట, ప్రబల నీయకుండా చేయుట, అను పద్ధతుల ననుసరించుచున్నవి. దీనివలన లక్షించినదేమన, ఇట్లు దీర్ఘకాలము అణగద్రొక్కి ప్రబలకుండా చేయుటవలన, వద్దనుకొన్న గుణమును నిర్మూలించుటలో జయము సాధింపవచ్చునని తలంపబడుచున్నది. కేవలము భౌతికప్రపంచవిషయమున నిది యదార్థమే. కాని, ఈ భౌతికప్రపంచమువెనుక అపచేతనకు సంబంధించిన ప్రపంచము గలదు. దీని వెనుక అపారమైన అచేతనతత్వము గలదు. నీకు తెలియని దేదనగా. నీవు నీలో వున్న కోరికనే నాశనము చేయకపోతే, అనగా ఈ రూపకల్పనకు గల బీజమును నాశనము చేయకపోతే, అభివ్యక్తము కానివ్వకుండా నీవు అణగ ద్రొక్కివేయజూచు గుణవిశేషము క్రిందికి నెట్టివేయబడి అట్టడుగున దాగి

యున్నట్లగును. అవచేతనలోనికిదిగి నీవు వెదకినట్లయితే, అది అచట తిరిగి తలయెత్తుటకు వేచియున్నట్లు కానవగును. ఎప్పుడయితే, ఈ ప్రవృత్తివిశేషము అడుగుననుండి ఆకస్మికముగా పైకి తోచుకొనివచ్చునో, అప్పుడు సంవత్సరాలతరబడి దానిని తలయెత్తకుండా అణచివేయ గలిగిన వారెల్లరు ఆశ్చర్యచకితులగుదురు. (ఎంతకాలము అణిచివుంచుదురో అంతవేగముతో అది మరల బయటికి పొడుచుకొని వచ్చును.) ఈ అణచివేయుట అను ప్రయత్నమునకు స్వప్నములో అవకాశములేదు. అందువలన స్వప్నముల ఉపయోగము గొప్పది. ఎఱుకతోకూడిన ఇచ్ఛాప్రవృత్తి అక్కడ లేదు. (నిదురచెంది ఉండవచ్చు, లేక ఎక్కడికైనను వెళ్ళిఉండవచ్చు) అడుగున అణచివేయబడిన కోరిక పైకెగిరి తనంతతాను స్వప్నములద్వారా స్పష్టపరచుకొనును. నీవు నీ ప్రకృతికి సంబంధించిన అనేక విషయములను తెలిసికొందువు. అందువలననే మానవుడు నిదురలోను, స్వప్నములోను తన నిజమైన ప్రకృతిని కనుగొనునని చెప్పబడినది. అది అతని లోలోపలి నిజమైన చైత్యప్రకృతి గాదు. అది అనియతముగ అతనిలో మరుగునపడియున్న స్వచ్ఛంద ప్రకృతి.

> "పగటివేళ ఎఱుకతో గూడిన ఆలోచనలద్వారా ప్రయత్నించి సాధించిన ఫలితములు రాత్రి కొన్నిగంటల కాలములో ఇట్లు నాశనముచేయబడుచున్నవి. అందువలన, మనము మన స్వప్నములను తెలిసికొనుట నేర్చుకొనవలెను. మొట్టమొదట, అవి అత్యధికముగా ప్రకృతిలోను, స్వాభావములోను భేదించునుకనుక, వానిని ప్రత్యేకపరచి తెలిసికొనుట అవసరము, అనేకముగా మన నిదురలోతులనుబట్టి మనము వివిధవర్గములకు చెందిన స్వప్నములను ఒకే రాత్రిలో కనుచుందుము."

ఇక్కడ ఎవరైనా ఈ విషయముల పరిశీలించియున్నారేమో నాకుఁ దెలియదు. అయితే, రాత్రియందలి గంటలనుబట్టి, ఎన్నిగంటలు నిదురబోతి వనుదానినిబట్టి, నీ నిదురయొక్క లక్షణము మారుచుండును. పరిశీలించుటకు నీవు శ్రమను (శ్రమను తీసికొనువారు చాలా తక్కువమంది) తీసికొన్నట్లయితే, నిదురలో అకస్మాత్తుగా అసాధారణసమయమున నిన్ను మేల్కొలిపినప్పుడు, నీవు రెండుమారులు నిదురలో ఒకే స్థితిలో లేనట్లు తెలిసికొనగలవు. వేర్వేరు రకముల స్వప్నములు వచ్చిన గంటలుకూడ ఉండును. నీవు జాగ్రత్తగా ఉన్నట్లయితే నీకిది సుబోధకము కాగలదు. కొన్ని గంటలలో నిన్ను లేపుట మిక్కిలి కష్టమగును. నీవు మిక్కిలి గాఢనిద్రలోఉందువు. బాహ్యవిషయముల ఎఱుక నీకేమాత్రము ఉండదు. మఱికొన్ని సమయములలో దానికి విరుద్ధముగా, ఏ చిన్న శబ్దమైనను నిన్ను నిద్రలేపుటకు జాలును.

రాత్రులందు నేను కొన్ని విషయములకు భయపడను.
పగటిపూట వానికి భయపడుదును. ఎందువలన?

నీ ప్రాణమయసత్త శారీరకసత్తకంటె ఎక్కువ వయస్సు గలదని దానియర్థము.

(తల్లి ఇంకను చదువుచున్నది)

"మన అవచేతనకు మన సాధారణజ్ఞానముకంటె
ఎక్కువజ్ఞానము కలదని పెక్కు దృక్కోణములనుండి
మనకు తెలియనగును."

ఇక్కడ నేనొక పదమును దిద్దనెంచినాను. మన సాధారణ ఎఱుక కంటె అవచేతనకు గాదు ఎక్కువ జ్ఞానముండుట. అది పరచేతనకున్నది అది మన సాధారణచేతనకు అందకపోవుటకు గారణము అది నిమ్నచేతన యగుటవలనగాదు, ఉన్నతచేతన యగుటవలన. రాత్రులందు మనకు మనమే

ఒక సమస్యను ఇచ్చుకొనుచుందుము. ఆ సమస్య మనలోని ఉన్నత భూమికలకు బోయి ఉదయమున మనకు పరిష్కారముతో ప్రత్యుత్తరము వచ్చును. ఎందుకనగా. అక్కడ మన జ్ఞానముయొక్క లోతులలో మనకు బాహ్యములో దెలియని విషయములను తెలిసికొందుము.

నిదురలో ఒకనికి దాను ఉన్నతజ్ఞానపు జ్యోతిష్పథమును ప్రవేశించుచున్నట్లు అనేక సమయములలో భావముగల్గును. అయితే, మేలుకొన్నప్పుడు దాని జ్ఞాపకము మాత్రమే తెచ్చుకొన్నాడు. ఎందువలన ?

అది యెందుచేతననగా, వ్యక్తిలోని నిచ్చెనను అత్యంతబాహ్యచేతననుండి ఉన్నతోన్నతచేతనకు ఎక్కిపోవునపుడు, అక్కడక్కడ సందులు తెంపులు కానవచ్చుచున్నవి. ఎఱుక పైకిపోయి, క్రిందకుదిగి. మఱలా పైకి బోవునపుడు చీకటితోనిండిన బిలములను దాటిపోవుచుండును. ఆ బిలములలో నేమియు నుండదు. తరువాత నిదురలో బ్రవేశించును. అది ఒకవిధమైన మైమఱపు. పిమ్మట అది మఱియొకవైపునుండి నిదుర మేల్కొనును. పైనుండి తాను ఏమి తెచ్చినది జ్ఞాపకముండదు. సామాన్యముగా జరుగునదది. ముఖ్యముగా సమాధియనిపిలువబడుస్థితియందును ఇట్లే జరుగును. సమాధిలో బ్రవేశింపగా బాహ్య ప్రజ్ఞగల ఎఱుకకును ధ్యానములోని ఎఱుకకును మధ్య ఖాళీస్థలమున్నట్లు గోచరించును. పైమెట్టుమీద నున్నప్పుడు ఆవశ్యకముగా ఎఱుకగలిగియుందురు. ఏ స్థితియొక్క ఎఱుకను వారు పొందియుందురో దానిలోనుండి వారు క్రిందకు దిగి వారి శరీరమువైపునకు వచ్చునపుడు, మార్గములో ఒక విధమైన బిలమునందు బ్రవేశింతురు. అక్కడ సర్వస్మృతిని గోల్పోదురు: వారు తమ అనుభవమును తమతో దీసికొనిరాలేరు. పైమెట్టులో గలిగిన ఆ యెఱుకను మఱచిపోకుండాఉండుటకు వీలయిన మెట్లను సృష్టించుకొనవలెను. దానికి క్రమశిక్షణ అవసరము. అదంత దుస్సాధ్యమైన క్రమశిక్షణ

గాదు. అయితే, అది సుదీర్ఘము. దానికి అచంచలమైన ఓర్పు కావలయును. ఎందుచేతనంటే, నీవు నీలో ఒక వ్యక్తిని, ఒక శరీరమును సృష్టింపనెంచుచున్నావు. అందులకు మొట్టమొదట అవసరమైన జ్ఞానము గావలయును. సుదీర్ఘమైన పట్టుదల, నిలుకడ కావలయును. ఇది చాలమందిని నిరుత్సాహపరచును. అయితే, మొత్తముమీద, నీవు నీలో ఉన్నతస్థాయినిగల జ్ఞానమున పాలు పంచుకొనవలయునన్న ఇవి అనుల్లంఘనీయములు.

వచ్చిన స్వప్నములను వ్రాసుకొనుట ప్రయోజనకరమా ?

అవును. నా విషయమున నేను ఇట్టి శిక్షణను సంవత్సర కాలమునకు పైగా అవలంబించితిని. ప్రతిది — ఏవైనా మాటలు, ఏదైనా ఒక చిన్న జ్ఞాపకము,— అన్నియు వ్రాయ మొదలిడితిని. ఒక జ్ఞాపకము తర్వాత ఇంకొక జ్ఞాపకమును అందుకొనుచు బోవ యత్నించితిని. మొదట నా ప్రయత్నమంతగా ఫలప్రదము కాలేదు. కాని, కడకు సుమారు పధ్నాలుగు సంవత్సరము లగుసరికి నిద్రలో వచ్చిన అన్ని స్వప్నములను, చివరనుండి ప్రారంభించి మొదటి వరకు సవిస్తరముగా జ్ఞాపకమునకు దెచ్చుకో గలుగుచుంటిని. అది నిన్ను వరుసగా, తెంపు లేని ఎఱుకగల స్థితిలో నుంచును. ఇందువలన తుదకు నేను నిద్రించుట యనునదే లేకపోయెను. గాఢనిద్రలో నా శరీరము సాగిలి పరుండి యుండెడిది. కాని, ఎఱుకయందు మాత్రము విశ్రాంతి లేదు. దీని ఫలిత మత్యద్భుతము. రాత్రివేళ నిద్రలోని దశ లన్నిటిని, ఏమి జరిగిన అది యెల్ల నీవు గుర్తించ గలుగుచుందువు. ఏ చిన్న అంశము గూడ నీకు అందకుండబోదు. అయితే, పగటివేళ నీకు విస్తారమైన పనియుండి, నిద్ర ఆవశ్యకమైనచో, ఈ ప్రయత్నము నీవు చేయకుండుటే మంచిది.

ఏమైనను ఒకటి మాత్ర మత్యంత ముఖ్యముగా పాటించవలెను. నిద్ర నుండి మేల్కొని నప్పుడు, ఇంచుకేనియు నీవు కదలగూడదు. సంపూర్ణమైన అచలస్థితిలో మేల్కొనుట నీవు నేర్చుకొనవలెను. లేనియెడల అంతయు అంతర్ధానమైపోవును.

భౌతిక శరీరమునకు, మెదడునకే గాక, మనస్సునకు గూడ విశ్రాంతి అవసరమా ?

అవును, చాలా అవసరము. నిశ్చల నీరవతయందు మాత్రమే మనస్సు ఊర్ధ్వమునుండి యదార్ధమైన వెలుగును అందుకొన నేర్చును. మనోమయ సత్తకు అలసట యుండునని నే ననుకోను. అది అలసట చెందినచో, దానికి గారణము మెదడు. నీరవతలో మాత్రమే మనస్సుతనను దా నధిగమించ గలుగును. కాని, మనము మాట్లాడుకొనుచున్న నిద్ర-కలల విషయమున మాత్రము నే జెప్పిన పద్ధతి మిక్కిలి గణనీయము. నేనది స్వయముగా అభ్యసించి చూచితిని. శిరస్సునందు నిశ్చల నీరవతను నెలకొల్పుకొనుటయే గాక, నీ ప్రాణమయ సత్తకు గూడ విశ్రాంతి నొసగి అన్ని చేష్టలను నీవు నిలిపివేయ గలుగుచు, రూప ప్రపంచము నుండి వెలికి నిర్గమింతువేని, పరచేతన యగు సచ్చిదానంద స్థితికి నీవు చేరగలుగుదువు. అట్టి స్థితిలో మూడు నిమిషములు నీవు ఉండగలిగినచో, ఎనిమిది గంటల నిద్ర యిచ్చుదానికంటె ఎక్కువ విశ్రాంతిని నీవు పొందగలవు. అది సులభమనుకొందువేమో,—కాదు. నిండైన తొలివెలుగులో, సంపూర్ణమైన మెలుకగలిగి అత్యంత నిశ్చలముగా నుండు స్థితి యది. ఆ స్థితి నీవు సంపాదింపనేర్చి, నీ యందలి సమస్తమును నిశ్చలము గావింపగలిగినచో, అపుడు నీ యావత్సత్తయు ఈ పరమచేతనానుభూతియందు పాల్గొనును. మూడుగంటల మామూలునిద్ర యిచ్చు విశ్రాంతితో సమానమైన విశ్రాంతిని మూడునిముషములిట్టిస్థితిలో నుండుటవలన పొందనగునని నే ననుభవపూర్వకముగ గుర్తించియున్నాను.

## ప్రాణికశరీరమునకుగూడ విశ్రాంతి అవసరమా?

అవును. ప్రాణిక శరీరము భౌతిక శరీరమును ఒక విధమైన తొడుగుతో ఆవరించి యున్నది. దినము వేడిగా నున్నప్పుడు వాతావరణ తరంగములకు ఎంత సాంద్రత ఉండునో అంత సాంద్రత ఈ తొడుగున కున్నది. సూక్ష్మ శరీరమునకు, భౌతిక శరీరమునకు మధ్యగా ఈ తొడుగున్నది. అంటువ్యాధుల నుండి, అలసట నుండి, నిర్వీర్యత నుండి, ఇంకను ప్రమాదముల నుండి భౌతిక శరీరమును కాపాడునది ఇదియే. అందువలన ఈ తొడుగు భద్రముగా దన స్థానములో నున్నట్లయితే, అన్నిటి నుండి అది రక్షించగలదు. అయితే, కొద్ది పాటి తీవ్రమైన ఆందోళనలు, ఇంచుక అలసట, అసంతృప్తి, లేక ఏదైన ఆఘా తము మొదలైన వానివలన ఆ తొడుగులో చిలుగు ఏర్పడును. చిన్న చిలుగై నప్పటికి బయటినుంచి ఏదైన చొచ్చుకొని వచ్చుటకు ఆస్కారమిచ్చును. వైద్య శాస్త్రముకూడ దీని నిపుడు గుర్తించుచున్నది. నీ ప్రాణకోశము పూర్ణమైన సమ స్థాయిలో నున్నట్లయితే, నీకు రోగములు రావు. ఏ విధముగా నైనను, నిన్ను సురక్షితముగా నుంచు కవచమువలె అది పనిచేయును. అంటురోగములు నిన్ను సమీపింపవు. నీలో ఈ స్థాయి, అంతర సామరస్యము ఉన్నట్లయితే, ఈ తొడుగు సురక్షితముగా నుండును. అది నిన్ను అన్నిటినుండి కాపాడును. సర్వ సామాన్య జీవితమును సాగించు ప్రజలున్నారు, వారికి తగినట్లుగా ఎట్లు నిదుర పోవలయునో, ఎట్లు తినవలయునో తెలియును. నాడీరూపమైన తొడుగు భద్రముగా నున్నందున సర్వ ప్రమాదములను ఎంతమాత్రము సరకుగొనక కాలము గడుపుకొందురు. ప్రతి ఒక్కరు సాధింపవలసిన యోగ్యత ఇది. ఈ తొడుగులోని బలహీన స్థానము నెఱిఁగి యున్నట్లయితే, కొన్ని నిమిషములపాటు ఏకాగ్రతతో శక్తిని ఆహ్వానము చేయవలయును. తొడుగు బాగుపడుటకు అంత శ్శాంతి కావలయును. స్వాస్థ్యము చేకూరుటకు గల ఆటంకములు అదృశ్య మగుట కవి చాలును.

* * *

ఫిబ్రవరి 3, 1951

తల్లి 1929 నాటి సంభాషణలలో మొదటిదాని చదువు చున్నది :

"యోగమువలన నీ వాసించు ప్రయోజనమేమి? శక్తిని సంపాదించుటకా? నెమ్మదిని, శాంతిని సాధించుటకా? మానవసేవ చేయుటకా? నీవు ఈ మార్గము ననుసరించుటకు దగిన వాఁడివని చెప్పుటకు ఈ ఉద్దేశము లెవ్వియు చాలినవి కావు."

ముఖ్యమైన ప్రాతికూల్య మేమనఁగా, నీవు మాటలతో ఆలోచించుదువు. ఈ మాటలు అర్థము లేనివి. ఎక్కువ కాలము అవి వట్టి మాటలే. నీవు భగవంతుని గురించి, దివ్యచేతనను గురించి, యోగమును గురించి, అనేక విషయాలను గురించి మాట్లాడుదువు. ఇది యెల్ల నీ తలలో నీకు ప్రత్యక్షమగు దేనితో నైనను, — ఆలోచనతోగాని, భావముతోగాని, స్పష్టమైన అభిప్రాయముతోగాని, అనుభవముతోగాని,—సరిపోవు చున్నదా? లేక, వట్టిమాటలేనా?

యోగము జీవితమున అంత్య లక్ష్యమని చెప్పఁబడినది, అయితే, ఈ యంత్య లక్ష్యము వలన ఏమి కావలయునని కోరుచున్నావు? కొందఱు, ఆత్మ జ్ఞానమే—తనను గురించి తాను తెలిసికొనుటయే—అని అందురు. అది తనకు సంబంధించిన వ్యక్తిగత విషయము. దాని నింకను కొంచెము ముందుకుపోయి విచారించినచో, జీవునియొక్క సత్య స్వరూపమును గురించిన నెఱుక గలిగి యుండుట, అను అర్థము వచ్చును. నీ వెందుకు జన్మించితివి? ఏమి చేయవలయును? ఇంకా దూరము వెళ్ళినచో, నీవు ఇతర మానవులతో ఎట్టి సంబంధము గలిగి యున్నావో ఎఱిఁగియుండుట. ఇంకా సుదూరము వెళ్ళుదువేని, నీ

వడుగదగిన ప్రశ్నలు,—నీ కర్తవ్యమేమి ? ప్రపంచములో మానవ లక్ష్యమెట్టిది ? అంత ర్దృష్టిలో భూమియొక్క స్థితి యేమిటి? విశ్వమననేమి ? దాని లక్ష్యమేమిటి ? దాని కర్తవ్యమేమి ? ఈ విధముగా ఒక దశనుండి ఇంకొక దశకు ముందుకు సాగి చివరకు మొత్తముగా సమస్యను చూతువు. నీవు వస్తుదర్శనము చేయవలెను. మాటల వెనుకనున్న అనుభవమును గ్రహింపవలెను. ఇక్కడ మనము యోగమును గుఱించి మాట్లాడుదము. ఇతర చోట్ల దానిని గుఱించి వేరు విధముగా మాట్లాడుదురు. "నా పుట్టుటకు హేతుబద్ధమైన కారణ మేమై యుండును ?" అని కొందఱు విచారింతురు. మతమువైపు మొగ్గు చూపువారు ఇట్లందురు. "నేను దేవుని సాక్షాత్కారము కోరుదును" అని. ఇట్లు యాభై విధములుగా ఈ విషయమును గుఱించి చెప్పవచ్చును. అయితే. విషయమే ప్రధానము. నీవు దానిని నీ తలలో అనుభవింపవలెను. నీ హృదయములోను, అన్ని చోట్లనుగూడ, అది దృఢమైనదిగాను, సజీవముగాను ఉండవలెను. లేనిచో నీవు ముందుకు సాగలేవు. నీవు మాటలను విడిచిపెట్టి కార్యరంగములోనికి దిగవలెను, అనుభవించవలెను, జీవితములో అడుగు బెట్టవలెను.

(తల్లి ఒక బిడ్డవైపు తిరిగి) నీవు యోగము చేయనెంతువా ?

అవును జననీ!

నీ వెందుకు యోగమును జేయఁ గోరుదువు ?

దైవ సాన్నిధ్యము ననుభవించుటకు

మఱి నీవు ?

దైవ సాక్షాత్కారమును బొందుటకు, అందులకు పరిపక్వతను సాధింపవలసి యున్నది.

మఱి నీవు? ఎందుకు నీకు యోగముపై ఆసక్తి కలిగినది?

ఎందుకనఁగా, నన్ను నేను తెలిసికొనగలుగుదును.

మఱి నీవు?

ఆంతరంగిక సత్యమిదని భావించిన దానిని ఆచరించుటకు.

మఱి నీవు? నీవు యోగము చేయుచున్నావా?

అప్పుడప్పుడు.

నీవు నిజాయితీగల బిడ్డవు. అయితే, అప్పుడప్పు డెందువలన?

(మఱియొక బిడ్డను సంబోధించుచు) యోగ మనఁగా నేమిటో నీ కేదైనా అభిప్రాయమున్నదా?

అది యొక మార్గము, దానివలన............

ఆ మార్గాంతమున ఏమున్నది?

భగవంతుని యొక్క నిత్యదర్శనము.

(మఱియొక బిడ్డవైపు తిరిగి) యోగములో ఎక్కువగా నీకు శ్రద్ధ గలిగించున దేది ?

యోగ మనగా నేమిటో నా కర్థము కాలేదు. ఏకాగ్రతతో నిన్ను ధ్యానించుటయా ?

అది ఒక మంచి ప్రతీక.

ఏమైనప్పటికి, శక్తిని సంపాదించుటకు యోగమును కోరుచున్నామని యెవరును చెప్పలేదు. సంతోషము. యోగమన నేమో, అస్పష్టముగా తెలిసిన దేశములు, ప్రజలు ఉన్నారు. వారు ఇతరులకంటే తా మధికుల మౌదుమని, గొప్ప శక్తిని ఇతరులను మించి సాధింతుమని యోగమును ప్రారంభింతురు. దాని ఫలితముగా ఇతరులపైన పెత్తనము సాగింతురు. ఇది కడునికృష్టమైన కారణము. అత్యంత స్వార్థపరత్వముతో కూడినది కనుక చాలా చెడ్డ ఫలితములను కలుగజేయును. కష్టముల పాలైన కష్టభాజనమైన జీవితము గడుపుచు, ఆయాసము, దుఃఖము, వ్యాకులత అనుభవించువారు, "ఓ! నేను శాంతిని, సమస్థితిని పొందుదును. విశ్రాంతి లభించును." అని యోగ సాధనమునకు మొదలు పెట్టుదురు. దురదృష్టవశాత్తు అది కేవలము ఆ విధముగా లేదు. నీవు యోగసాధనను ఇట్టి కారణములతో మొదలుపెట్టిన, మార్గమధ్యమున నీ వనేక కష్టములకు గురియగుదువు. ఇక మనుజులలో, 'పరోపకారము, మానవుల యెడ ప్రేమ' అను గొప్ప సుగుణములను గుఱించిన భావన లున్నవి. వీని నాధారముగా దీసికొని, "నేను యోగ సాధనను మానవ సేవకై చేయుదును. దుఃఖములో నున్న వారిని సంతోషపరుతును, ప్రపంచమున నందఱు సుఖశాంతులతో బ్రతుకునట్లు ఏర్పాటు చేయుదును." అని ప్రారంభింతురు. అది చెడ్డదని అనను కాని, చాలదని చెప్పుచున్నాను. వయస్సుమీరిన జ్యోతిష్కు డొకఁడు, "అంత త్వరలో ప్రపంచములోని దుఃఖములు తొలఁగిపోవు. ఎందుకనఁగా, ఈ దారిద్ర్యముపైన

సంతోషకరమైన జీవితమును సాధించు వారలనేకు లున్నారు.'' అన్నాడు. అది హాస్యమునకన్న మాట యైనను, అందులో సత్యము లేకపోలేదు. పరోప కార శీలుడు తాను స్వార్ధపరుఁడను గానని ప్రవచించును. నేనట్టి వారి నెరుగు దును. దారిద్ర్యము భూమిపై లేకపోతే అట్టివారు సంతోషింపలేరు. ఇతరులను దారిద్ర్య విముక్తులను జేయగోరు వారు దారిద్ర్యము లేకపోతే ఏమి చేయఁగలరు? కీర్తి ప్రతిష్ఠలు ఎట్లు సంపాదింతురు? "నేను స్వార్ధపరుఁడను కా" నని "కారుణ్య ధాముడ''నని ఎట్లు రుజువు చేసికొన గలడు?

(తల్లి ఇంకను చదువుచున్నది): "నీవు యోగమును దేవుని ప్రత్యక్షపరుచు కొనుటకై కావలయునని కోరు దువా? అట్లగుచో, అప్పుడు మాత్రమే నీవా మార్గ మును అనుసరించుటకు సిద్ధముగా నున్నావని యను కొన వచ్చును. ఇది మొట్టమొదటగా కావలసినది — భగవంతుని కొఱకు ఆకాంక్ష."

ఆకాంక్షకు మొట్టమొదటి కదలిక యిది: నీకు ఒక విధమగు అస్పష్ట మైన ఇంద్రియ జ్ఞానము ఉన్నది — విశ్వము వెనుక ఏదియో ఒకటి తెలిసికొన దగినది ఉన్నదని. అది యేమిటో నీకు తెలియదు. కాని, దాని కొఱకే జీవితము, జీవింపదగి యున్నదని, అది నిన్ను సత్యమునకు అనుబంధింప జేయునని, విశ్వమునకు ఆధారభూతమై యున్నదని విశ్వము మీఁద అది ఆధారపడి లేదని, నీ అవగాహనమును ఇప్పటికిని అది తప్పించుకొనిపోవు చున్నదని. కాని అది అన్నిటి వెనుక నున్నదనుట నిశ్చయమని నీవు తలంతువు. ప్రజలలో అనేకులు దీనిని గుఱించి యేమనుకొనుచున్నారో దానికంటే అత్యధికముగానే చెప్పినాను. అయితే, ఇదియే ఆకాంక్షకు మొదటి మెట్టు. అక్రమములతోను, కృత్రిమముల తోను కూడిన శాశ్వత అసత్యపు లోకములో బ్రతుకకూడదని తెలిసికొనుట ఒక

విధముగా సంతోషకరమైన విషయమే. తగినదాని కొఱకు బ్రతుకుటను దెలిసికొనుట మంచిదే.

"తర్వాత నీవు చేయవలసినది. నీ ఆకాంక్షను కాపాడుకొనుట. దానిని సర్వదా చైతన్యవంతముగా నుంచుకొనుట, మేల్కొని జీవించుట."

ఏదో చెదరువాటుగ ఏ యొకప్పుడో, "నేను దైవమును కనుగొనదలంచుచున్నా' నని అనుకొనుటకుబదులు, అసహ్యకరమైనది నీకు సంభవించినపుడు, అలసట చెందిన కారణముగా నీవు విసుగుచెందియున్నప్పుడు, ఆకస్మికముగా నీలో నీవు, యోగసాధన అనునది ఒక టున్నదనియు, అది భగవంతుని తెలిసికొనుటకు మార్గమనియు దాని మూలమున నిరుపయోగమైన జీవితమునుండి బయటపడవచ్చుననియు గుర్తునకు దెచ్చుకొందువు.

"దానికి కావలసినది ఏకాగ్రత, దైవసంకల్పమునకు, దైవకార్యమునకు సంపూర్ణమైన ఆత్మసమర్పణము గావించుకొను దృష్టితో దైవమును గుఱించిన ఏకాగ్రత."

ఇది రెండవమెట్టు, అనగా నీవు దైవమును కనుగొని తెలిసికొని జీవించుటను ప్రారంభింతువు. అదేసమయములో, అది చాలా పవిత్రమైనదనియు, అతిముఖ్యమైనదనియు, దానిని సంపాదించుకొనుటకు జీవితమంతయు జాలదనియు నీవు భావింపవలెను. తర్వాత మొదటిప్రయత్నము, ఆత్మసమర్పణము: నీవిట్లుచెప్పుకొనుము: "నేనికమీద నాకొఱకు వ్యక్తిగతమైన క్షుద్రకామనల సంతృప్తికొఱకు జీవింపబోను. దేనికొఱకై నే నాకాంక్షించుచున్నానో

ఏదికనుగొనదగియున్నదో, తెలియదగియున్నదో, అట్టి అద్భుత వస్తువైన దైవమునకు చెందినవాడనై దైవముకొరకే జీవించెదను."

"హృదయములో ఏకాగ్రత వహించుము. దానిలో ప్రవేశించుము: లోపలికి పొమ్ము. లోతునకు పొమ్ము. దూరమునకు, నీ వెంతదూరమునకు పోగలిగితే అంత దూరమునకు పొమ్ము. వెలికి విరజిమ్మబడియున్న చైతన్యపు దారముల నన్నింటిని పోగుచేసి చుట్టచుట్టి, లోనికి దూకుము. నీ అంతశ్చేతనలోని నిశ్శబ్దతలో మునిగి పొమ్ము."

సహజముగా నేను హృదయమునుగుఱించి మాట్లాడినప్పుడు, దేహములోని భౌతికావయవ విశేషమును గుఱించికాక, అయితే వ్యక్తిలోని ఆంతరికమైన అంతరాత్మ కేంద్రమును గుఱించి మాట్లాడుచుందును.

తల్లి తరువాత, అదే పాతసంభాషణలోని రెండవ ప్రశ్నకు పోవుచున్నది—"యోగమునకు సిద్ధపడవలయునన్నచో ఏమి చేయవలయును,"

నాకు ప్రశ్నవేసినవాని కిట్లు జవాబుచెప్పితిని; "తొలుదొల్తగా, ఎఱుకగల వాడవు గమ్ము." అప్పుడావ్యక్తి ఎఱుకగలవాడు కావలెనని కొన్నిమాసములు ప్రయత్నించి తరువాతవచ్చి యిట్లుజెప్పెను; "ఓ! ఎంతటి అసహ్యకరమైన బహుమతిని మీరు నా కొసగితిరి. ఇంతకుముందు నాతో సంబంధముకలిగిన జనులు కడు చక్కగా గన్పట్టిరి. నేను సద్భావముతో మెలగుచుంటిని. వారు నాయెడ చక్కగా ప్రవర్తించుచుండిరి. ఇప్పుడు, ఎఱుకగలిగిన తరువాత, నాలో అందముగా లేని ఎన్నోరకముల వస్తువులను చూచుచున్నాను.

ఆదేసమయములో ఇతరవస్తువులందును వికారరూపమునే చూచుచున్నాను." నే నామెకిట్లు సమాధానము చెప్పితిని: "అది సంభవమే. నీవు చిక్కుల నెదుర్కొన గోరనిచో నీ అజ్ఞానమునుండి బయటపడకుండుటయే మంచిది."

అందువలన, మొదటిమెట్టు ఏమిటనగా, ఒకడు సత్యమును సాక్షాత్కరించి తెలిసికొనకోరుచున్నాడా, లేక సుఖముగా తన అజ్ఞానములోనే ఉండ గోరుచున్నాడా? అనునది కనుగొనుట అవసరము.

> (తల్లి ఇంకను చదువుచున్నది) ఈనాడు సరాసరి మానవుని వైఖరి ఎట్లున్నది? నిక్కమైన దైవత్వము నందు బాలుబంచు కొనుచున్న దేనితోనైనను తనకు సాక్షాత్సంబంధ మేర్పడినప్పుడు, క్రోధము, తిరుగు బాటు ప్రవృత్తి అతనిలో తలఎత్తుటలేదుగద! దైవ మనగా తాను ఆశతో అంటిపెట్టుకొనిఉన్న ఆస్తియొక్క వినాశమని అంతరంగమున తలపోయుటలేదుకద!"

ఎంతకాలము నీవు స్వల్పమైన నీ వ్యక్తిగత అహంకారములో నుందువో అంతకాలము దైవముతో నిన్ను తాదాత్మ్యము చెందింపగల అభినివేశము, తెగింపు చూపుటకు నీవెన్నడును సిద్ధము కానేరవనుట సుస్పష్టము.

ఈ సందర్భములో నే నొకటి చెప్పవలసియున్నది. చాలా కాలము క్రిందట కొందఱు, ఆశ్రమములోచేరుటయన అమరత్వమును బొందుటయే అన్న భావనతో వచ్చిరి. అమరత్వమును బొందవలయునన్న గొప్పఆశ వారి కుండినది. సహజముగా వారు వృద్ధులు కాబట్టి, తమ ముందున్న జీవితపథము స్వల్పమైనందున, తమముందు దూరముగనున్న పథమును చూడలేకపోయి నందున, దానిని అంతములేనిదిగా పొడగించవలయునని వారి యాశ, జీవిత

మును పొడగించుటయే అమరత్వమని వారు భావించిరి. వచ్చిన వారిలో మొదటివాని అభిప్రాయసూచనకు నే నిట్లంటిని. "ప్రతిఒక్కరు అమరత్వ మును పొందగలరేమో నాకు తెలియదు; బహుశా అది సాధ్యముగాదు. అయితే, అమరత్వమును పొందగల్గు సామర్థ్యము గలవారిలోనైనను, ఎంతమంది దాని కొఱకై చేయవలసినత్యాగము చేయ సిద్ధముగాఉన్నారు? ఎందుకనగా, వారు తాము వదిలిపెట్టవలసినది అనేకమున్నందున, మధ్యమార్గములో "వద్దు, వద్దు, ఈ చెల్లించవలసినమూల్యము చాల ఎక్కువగానున్నది అందురు. అమరత్వ మును పొందుటకు గల అవకాశమును, నాతో చర్చించిన వర్ణ చిత్రకళా కారుడు నాకు జ్ఞాపకమున్నాడు. అతడు, "క్రొత్తప్రపంచము ఏవిధముగా ఉంటుంది," అని అడిగినాడు, నేను. "అక్కడివిషయములు స్వాభావికముగా ప్రకాశమానములై నుండును. భూమిమీదికి వచ్చిన సూర్యకాంతి ప్రతిఫలము వంటిది అక్కడ ఉండదు," అంటిని. నేను మాట్లాడుచుండగనే అతని ముఖము వైవర్ణ్యముచెందుట, నిడుపగుట, తీవ్రత్వమును దాల్చుట, నేను చూచితిని. అతడు తుదకు, "అయితే, ప్రకాశమును చిత్రించుటకు అనువగు నీడలు లేకుండా ఒకడు రంగుబొమ్మల నెట్లు గీయగలడు? అన్నాడు "నీవు సమస్యకు సరియైన తాళపుచెవినిచ్చినావు." అని నేను సమాధానముచెప్పి తిని. పెక్కుమంది నన్ను, "క్రొత్తజీవితము ఏవిధముగా ఉంటుంది?" అని అడిగినారు. వారికి నా సమాధానము; "అక్కడ శక్తుల పరావర్తనము ఉంటుంది, శక్తిప్రవాహం ప్రసరిస్తూ ఉంటుంది, శరీరనిర్మాణము వేరువిధ ముగా ఉంటుంది. ప్రయోజనములేని అవయవములుండవు. వానికి బదులుగా ఆంతరికవ్యాపారములు ఉంటవి, తిండితినుట, మాటిమాటికి తినుట అదృశ్యమై పోతుంది," మఱియొకసారి వారిముఖములు నిడుపగుట చూచితిని. వారు, "ఓ! మేము తిను మంచి పదార్థములన్నియు పోవునన్నమాట!" అన్నారు.

ఇవన్నియు స్వల్పవిషయములు. ముఖ్యమైనవి అనేకమున్నవి. అతి ముఖ్యమైనది, కష్టతరమైనది ఏమన, అహంకారమును విడిచిపెట్టుట. ఎందు

కనగా, అందుకు సిద్ధముగా లేనివారికి అహంకారమును విడిచిపెట్టుట మృత్యువుతో సమానము. అహమును విడుచుటయన, వ్యక్తిలయించిపోవుట యని వారి భావము, ఇది యదార్థముగాదు. కాని, ఇట్టి అభిప్రాయమును కలిగించుటతో అది ప్రారంభమగును. అమరత్వమును పొందవలయునన్న హద్దుల నెల్ల త్యాగముచేయవలయును. అహంకారత్యాగము అన్నిటికన్న పెద్దత్యాగము. అందువలన, 'నేను' కు అమరత్వములేకపోతే, ఇక దానివలన ఏమిప్రయోజనము అనిపించును.

> చిరకాలమునాటి సంభాషణలోనే ఒకానొకడు తల్లిని,
> "ఏవిధముగా ఇందరు ఇక్కడకు వచ్చి కలుసుకొన్నారు?"
> అని యడిగిరి. దానికి తల్లి ఇట్లు జవాబుచెప్పినది ;"

> "మన మందరము పూర్వజన్మలలో కలుసుకొని
> ఉన్నవారమే. లేనిచో ఈ జీవితకాలములో అంద
> రము ఇట్లు కలుసుకొని యుండము."

యాదృచ్ఛికముగనో, లేక ఎప్పుడు ఒకటిగా జీవించియుండుట చేతనో, అని చెప్పవచ్చును. రెండును సమాన యధార్థములే. ఈ స్త్రీకి గుప్తవిద్య యందు ప్రీతి కలదు. అందువలన "మనము పూర్వజన్మలో కలుసుకొన్నాము." అని చెప్పితిని. అది నిజమే,—కాదందురా ? విషయావలోకనమున అది యొక పద్ధతి, మఱియు "మనమందరము ఏక కుటుంబమునకు చెందినవారము", అనునదియు సత్యమే. అయితే. మానవులు సామాన్యముగా చూచే దృష్టితో గాదు.

నే నింకను ఇట్లు జెప్పితిని. "దైవ విజయము కొఱకు, భువిపై దైవాభివ్యక్తి కొఱకు భూమి మీద మనము కలిపి కొన్ని యుగములుగా పనిచేసి యున్నాము, ఇది కడు సుస్పష్టమే. ఎందుకనఁగా ప్రపంచము అందుకొఱకే

సృష్టింపఁబడినది. అందువలన, ప్రపంచములోని ప్రతి విభాగముకూడ, తెలిసియో, తెలియకయో దానికోసము పనిచేయుచునే యున్నది.

* * *

ఫిబ్రవరి 5, 1951

తల్లి ఏప్రిలు 14, 1929 సంభాషణను చదువుచున్నది. యోగము నందలి ప్రమాదములను గుఱించి "నీవు అత్యాశను విడనాడనట్లయితే, యోగము జోలికి పోకుము. అది మండుచున్న అగ్ని") మాట్లాడిన పిదప ఆమె యోగమున గల రెండు విధములను గుఱించి మాట్లాడుచున్నది.

"యోగమున రెండు మార్గము లున్నవి. ఒకటి తపస్సు (క్రమశిక్షణ), రెండవది : సమర్పణ".

సమర్పణ అనగా నేమి ?

దాని యర్థము : ఒకఁడు తన్ను తాను సంపూర్ణముగా దైవమునకు సమర్పించుకొనుట.

అవును, తరువాత జరుగున దేమి ? నిన్ను నీవు సంపూర్ణముగా దేవునికి సమర్పించు కొన్నచో, ఆయనే యోగమును చేపట్టి నిర్వహించును, నీవుగాదు. అందువలన అది కష్టబహుళమైనది కాదు. కాని, నీవు తపస్సు నవలంబించినచో,

యోగమును చేయువాడవు నీవే యగుదువు. దాని బాధ్యత అంతయు నీదే. ఇక్కడనే ప్రమాద మున్నది. దాని, ప్రమాదములతో సహా సకల బాధ్యతను స్వీకరింపగోరువా రున్నారు. ఎందుకనంగా, వారిది చాల స్వతంత్ర ప్రకృతి. ఫలితమును త్వరలో సాధింపవలయు నన్న తొందరపాటు బహుశః వారికి లేదు. జయము సాధించుటకు అనేక జన్మలు ఎత్తవలసి వచ్చినను వారికది లెక్కలేదు. అయితే, కొందఱు త్వరగా పయనించి, గమ్యమును నిశ్చితముగ చేరగోరువా రున్నారు. వీరు సర్వ బాధ్యతలను భగవంతుని చేతిలో బెట్టుచున్నారు.

(తల్లి ఇంకను చదువుచున్నది) "యోగమువలన కలుగు మొదటి ఫలితము, మానసికమైన అదుపును తొలగించుట, స్తబ్ధముగానున్న తృష్ణ లప్పుడు విడువబడి వేగముగా పైకివచ్చి జీవునిపై దాడి వెడలును.

"అపుడు నీవు చేయవలసిన దేమన, ఆ విషయములను దూరమున బెట్టుట, (ముఖ్యముగా స్త్రీ సంబంధమైన ప్రేరణలను) వానితో సంబంధము త్రెంపుకొనుట, వీలైనవరకు వానిని గణింపకుండుట, వానిని గుఱించి ఆలోచింపవలసి నప్పుడు ఉపేక్షాభావముతో సంబంధము లేనివాడుగా ఉండిపోవుట."

కష్టముపై తిష్ఠవేయుటకంటె, కూర్చొని కష్టమునకు దూరముగా నుండుట, నీకు సంబంధించనదిగా చూచుట, నీది కానట్లుగా నుండుట, ప్రపంచమునకు సంబంధించినది. నాది కాదనుట, చాల కష్టమైన విషయము. అయితే ఇట్లు చేయుట మూలముననే నీవు జయింపఁ గలవు. ఇందుకు ఒక విధమైన ఆత్మ స్వాతంత్ర్యము, ఆంతరంగిక వ్యక్తియందు విశ్వాసము కావలయును. నీవు సరియైన దృక్పథము గైకొన్నచో, నీకు శుభము కలుగును. నమ్మవలయును.

నీకు యిష్టముకానిది సంభవించినపుడు భయపడి నట్లయితే నీ వేమియు జేయలేవు. ఎంత కష్టము వచ్చినను, ఎన్ని యాటంకములు కలిగినను, నీవు ఈ నమ్మకమును నీలో నుంచుకొనవలయును. నీ కయిష్టమైనది సంభవించిన కాలమం దెల్లప్పుడు నీవు "ఇది ఇంకను అధికమగునా? ఇంకా ఏమి ప్రమాదము వాటిల్లగలదో!" అనుకొందువు. అట్లుగాక, నీకు నీవు ఇట్లు చెప్పుకొనుము: "ఈ విషయములు నావికావు. అవి అవచేతనా ప్రపంచమునకు సంబంధించినవి. సత్యముగా వానితో నాకు సంబంధము లేదు. అవి మఱల నన్ను ముట్టడించుటకు వచ్చినట్లయితే నేను పోరాటము నిత్తును." ఈ విధముగా చెప్పుట సులభమే కాని ఆచరించుట కష్టము, అని నీవు అనవచ్చును. కాని నీవు నిజముగా ఈ తీరు నమ్మకము గలిగి యున్నట్లయితే, నీకు జయింపరాని కష్టమేదియు నుండబోదు. ఆందోళనమున కష్టము వృద్ధి చెందును.

నిజమునకు ఒక ముఖ్యమైన కష్టమున్నది. నీ చేతనకు సంబంధించిన వ్యక్తిత్వములో, ఈ కష్టమును గోరని దేదియో కలదు. అది దానిని అధిగమించు టకే నిజముగా కోరుకొనును. కాని, చేతనలో నీకు తెలియని ఇతర విభాగము లందు అసంఖ్యాకములైన ప్రవృత్తి విశేషము లుండును. వీనిని గుఱించి నీకుఁ దెలియదు. "ఈ కష్టము నివారణ కావలెనని కోరుచున్నాను." అని నీవందువు, కాని దురదృష్టవశాత్తు, "నేను కోరుచున్నాను" అనిన మాత్రమున చాలదు. నీ చేతనలోని యితర విభాగములు, నీ దృష్టి పథమున బడకుండ దాగుకొని యుం డును. నీ యాసక్తి మఱియొక వైపు మళ్ళియున్నప్పుడు, అవి పైకెక్కి వచ్చి తమ ప్రాబల్యమును చాటుకొనును. అందువలననే, నేను మాటిమాటికి చెప్పు చున్నాను, సంపూర్ణమైన అంతశ్శుద్ధి కలిగియుండవలెనని. నిన్ను నీవు వంచింపఁ బూనుకొనవలదు. "నేను చేయగలిగిన దంతయు జేసితిని." అనవలదు: నీవు జయము పొందకున్నచో, చేయగలిగిన దంతయు నీవు చేయలేదనియే దాని యర్థము. ఎందుకనఁగా, నీవు నిజముగా చేయగలిగిన దంతయు జేసి యుండినచో జయించియే యుందువు. నీయం దేదైనను లోపముండి, దానిని నీవు తొలగించు

కొన గోరినను, అది యింకను హాశము చేయుచునే యున్నయెడల, "నేను చేయగలిగిన దంతయు జేసితిని," అని నీవు అనినను, నిజముగా నీవు చేయవల సిన దంతయు జేయలేదనియే చెప్పవలెను. చేసియుండినట్లయితే నీవు జయించియే యుందువు. ఎందుచేతననఁగా నీకు వచ్చే కష్టములు నీ బలమునకు ఈడైనవిగ నుండును. నీ యెఱుకకు దెలియని దేదియు నీకు సంభవింప నేరదు. నీ ఎఱు కకు సంబంధించిన అన్నింటిని నీవు నీ ఆధిపత్యము లోనికి దెచ్చుకోగలవు. బయటినుండి వచ్చిన విషయములు, సూచనలు కూడ, నీ యెఱుకలోని సమ్మతిని బొంది, ఎంత శాతము సమ్మతి లభించునో అంతవరకు, నిన్ను స్పృశించును. నీవు నీ యెఱుకకు అధిపతివి. నీవు "నేను చేయవలసిన దంతయు చేసితిని, అయినను, ఇదంతయు యథాపూర్వముగా సాగుచునే యున్నది. అందువలన, ఆ ప్రయత్నము వదలివేయుచున్నాను." అని అందువేని. చేయవలసిన దంతయు నీవు చేయలేదనియే విశ్వసింపవచ్చును. అన్నియుఁ జేసినప్పటికి ఇంకను ఒక లోటు ఉండినట్లయితే, దాని యర్థ మేమన, నీలో దాగియుండిన ఒకా నొక విష యము అకస్మాత్తుగా, అవకాశము వచ్చినప్పుడెల్ల తలయెత్తెడు దానివలె వేగ ముగా బయటికి వచ్చి నీ జీవితములో ప్రాధాన్యము వహించుచున్నది. కనుక, ఒకే ఒకటి ఉన్నది నీవు చేయవలసినది. నీలో దాగిఉన్న చీకటి మూలలను వేటాడి కనుఁగొనవలెను. తరువాత అ మూలలపైన నీ సత్సంకల్పాగ్ని స్ఫులింగ మును ప్రసరింపజేయుము. అవి నీకు లోఁబడి అదృశ్యమగును. నీకు అసంభావ మనిపించినది సంభావ్యమగుటయేఁ గాక, వాస్తవికముగ, చేయఁబడినదికూడ నగును. ఈ విధముగా నీవు ఒక్క నిమిషములో, సంవత్సరములుగా నిన్ను హింసించిన దానిని దొలగించుకొనఁ గలుగుదువు. నీకు ఈ విషయములో ధ్రువ పరిచి చెప్పుచున్నాను. నీవు సత్యముగా, సమ్యకముగా నీ లోటును తొలగించు కొనవలెనని స్థిర సంకల్పము పూనినచో అది సాధ్యమగును. అన్నిటికి, అనఁగా శారీరక రోగము నుండి, ఉన్నతమైన మానసిక కష్టముల వరకు, ఈ పద్ధతి నను సరింపవలెను. ఎఱుకలో ఒక భాగము, "అది నా కక్కఱలేదు." అనును. దాని వెనుక కుప్పలుగా విషయములు దాగియుండి, మౌనము వహించి పైకి కనబడక

యుండును. సామాన్యముగా అజ్ఞానముచేత, ఇప్పుడున్నట్లుగానే యుండవలయు నని భావింతురు. నివారణ మవసర మనుట నమ్మరు. అన్నియు మన మేలు కొఱకే, ఈ శుభప్రదమైన ప్రపంచములో నని నమ్మెదురు. నాతో సంభాషణ జరిపిన మహిళ, "నీవు మార్పు చెందవలయునని కోరగానే కష్టములు ప్రారంభ మగును." అని చెప్పెడిది. ఒక గొప్ప ఫ్రెంచి రచయిత దీనినే పునరుద్ఘాటించి దానినుండి, తనకు ప్రియమైన వాదమును సృష్టించినాడు. "నీవు పరిపక్వతను సాధింపవలయునని కోరిన వెంటనే దుఃఖము ప్రారంభమగును. నీవు పరిపక్వత చెందవలయునని కోరుకొనకపోతే నీకు ఏ దుఃఖము ఉండదు". ఇది పూర్తిగా తప్పని నేను చెప్పుచున్నాను. ఏమైనను నీలో విషయములు సంపూర్ణముగా స్వేచ్ఛను గోరునవి. ఏ విధముచేతనైనను తమ నెమ్మదిని చెడగొట్టుట సహింప లేనివి ఉన్నవి. అవి "ఓః ఎంతటి కంకటప్రాయులు మీరు. మా జోలికి రాక మాయంతకు మమ్ములను వదలిపెట్టుడు," అనుచుండును.

"ఈ ప్రపంచమంతయు సంశయము సంకోచము, నిస్పృహ అనెడి విషయముతో నిండియున్నది నీవు ప్రతి ఊర్పుతోను దీనినే లోపలికి పీల్చుకొనుచున్నావు. నీవు ఏ కొన్నిమాటలు అవాంఛనీయుడగు వానితో మాటలాడినను లేక అటువంటివాడు నీ సమీపముగా వెళ్ళినను, నీకు అతనినుండి అంటు రోగము సంక్రమించును. నీవు ఎంతకాలము సామాన్య జీవితము సాగించుచుందువో అంతకాలము ప్రపంచ మానవులతో నీవు కలసిపోయినను పరవాలేదు. అట్లుగాక, నీవు దివ్యజీవనము కోరినట్లయితే, నీవు నీ స్నేహితులవిషయములోను, నీ వాతావరణవిషయములోను, బహు జాగ్రత్తగలిగి యుండవలెను."

ఈ సమస్యను పరిష్కరించుటకు, సన్యాసులు అడవులకువెళ్ళి చెట్ల క్రింద కూర్చుందురు. అక్కడ సామాన్యముగా ఇతరమానవులనుండి అంటు రోగములు రావు. అయితే ఈ నిర్ణయమును కడవరకు నెరవేర్చుట దుస్తరము. ఎందుకనగా, చెట్లక్రింద ఒక సన్యాసి సమాధిలో గూర్చొనియున్నాడను విషయము వెల్లడియైపోవును. వెంటనే గుంపులు గుంపులుగా ప్రజలక్కడికి వెళ్ళుదురు. అతడు కష్టములనుండి తప్పించుకొనలేకపోవుటయే గాక వానిని ఎక్కువచేసికొనును. ఎందుకన, బోధించుటకంటె ఎక్కువప్రమాదకరమైన విషయము మఱొకటిలేదు. నీకు కొద్దిగా తెలియును. అప్పుడే బోధించుటకు ప్రారంభింతువు. నీకు తెలిసినదానికంటె ఎక్కువగా బలవంతముమీద జెప్పవలసివచ్చును. ప్రజలు ప్రశ్నలు వేయుదురు. నీవు జవాబు చెప్పలేవు. నీవు మౌనమువహించుటలో వీరుడవై యుండవలెను. ప్రజలు వచ్చి తమకు దెలియనివి అడిగినప్పుడు, తత్వవేత్తలమని చెప్పుకొనువారు జవాబులను సృష్టింతురు - అందువలన, నీ క్రమశిక్షణపథమును విడిచిపెట్టి, తెలిసినవానివలె నటించుటకు ప్రారంభించినయెడల, నీవు కచ్చితముగా ఉపద్రవకరమైన బిలములో బడిపోదువు. అన్నిటికంటె, తెలియునని నటించుట వినాశకరమైనది. ప్రపంచములో నీకు లేనిపోని ఘనత యొకటి రావచ్చు. ఎందుకనగా, ప్రజలు సులభముగా మోసగింపబడుదురు. నీకు సంభవించు విపత్తేమియు నుండదు. కాని, (నీవు అత్యుక్తులలోనికి దిగినచో విపత్తు సంఘటిల్లుటయు నిశ్చయము.) ఆధ్యాత్మికప్రపంచములో నీవు మానవులతో వ్యవహరింప బనిలేదు. భగవంతునితో మాత్రమే వ్యవహరింపవలసియుండును. ఆయనముందర, నేను ఇదియని అదియని నటించుట సాధ్యముగాదు. భగవంతుడు సర్వజ్ఞుడు. అవునుగదా ! ఆయనకు నీ సంగతిసందర్భములు బాగుగా తెలియును. ఆయనను భ్రమింపజేయు పలుకులేమియు నీవు పలుకజాలవు.

ఆధ్యాత్మిక క్రమశిక్షణ లన్నిటిలో నీకు నేర్పబడు తొలివిషయము, నీ యనుభవమును ఇతరులకు చెప్పకూడదనునది, నీ మనస్సును స్పష్టపరచు

కోపలపిన అవసరమున్నచో, నీ యనుభవములను నీ యాధ్యాత్మిక గురువుకు జెప్పుము. ఇతరులకు జెప్పరాదు. నీ యాధ్యాత్మిక గురువు నెదుటకూడ నీవు జాగ్రత్తతో మెలగవలయును. నీలో ఏమి జరిగినదో ఆయన యెదుట పెట్టునపుడు. వివరించునపుడు, నిన్ను నీవు పరిశీలించుకొన్నట్లయితే, సంపూర్ణముగా నీ యెఱుకకురాని విషయము లున్నవని గ్రహింతువు. అనేకముగా నీ యనుభవములలో కాళీ లుండును. ఎడనెడ తెంపులులేని యెఱుక ఉండనేరదు. (ఎఱుకను తెంపకుండా కడపటివరకు అనుసరించుట మహాకష్టము.) అట్టి సందర్భములలో నీ యనుభవములను ఉన్నవిఉన్నట్లుగా ఏ చేర్పులును లేకుంట చెప్పవలెనను భావముతో జెప్పినప్పటికీ, అక్కడలేనిదేదో నీవు చెప్పనే చెప్పుదువు. ప్రజలువచ్చి నాకు ఏ విషయమైనను—— ఏ లోపలిసంఘటననైనను చెప్పినప్పుడు ఒక్కొక్కసారితాముచెప్పునది నేను శ్రద్ధగా వినుటలేదని గమనింతురు. జెప్పబడేదానిపైన నాకు శ్రద్ధలేదని అనుకొందురు. అదికాదు; నేను వారి లోపలనుండుదానిని వినుచుందును, ఏది సరియైనదో దానిని, దానిని అదనముగా చేర్చబడిన చిన్నచిన్నవిషయములను - చూచుచుందును. ఈ కారణము చేతనే సామాన్యముగా నేను ఈ విషయములను ప్రోత్సహింపను, ఏమి జరిగినదో వారు నాకు జెప్పగలిగితే, వారికి ఉపశాంతికలుగునని సంతోషించెదరని నాకు దెలియును. కాని, అప్పుడు వారు నాకడకు సునిసితమైన శాస్త్రీయ దృష్టితో రావలయును. విజ్ఞానశాస్త్రవేత్తఎప్పుడు "ఇది ఇది, ఇది అది," అనిచెప్పడు. వీలైన అన్ని పరిశోధనలు చేసి, తాను జెప్పబోవుదానిని రుజువుతోసహా చెప్పును. ఆధ్యాత్మిక విషయములలోగూడ ఈ పద్ధతిని అనుసరింపవలయును. "నే నట్లు చేసితిని; విషయములు ఆవిధముగా జరిగినవి." అని చెప్పుటకు బదులుగా, "నాకీ అభిప్రాయముగలిగినది. విషయములు ఈవిధముగా నుండి యుండవచ్చును," "దీనికి దానికి సంబంధముండునట్లుగా నాకు తోచినది,"——అని చెప్పనగును. అది పట్టి సంభాషణ పద్ధతికాకుండ సత్యమైన మానసిక పరిస్థితిని తెలుపునదిగా నుండవలెను. నీవు వివరణను గోరినట్లయితే, ముందుగా దానిని నీవే వివరింపగూడదు. ఒక్కతూరి వివర

ణను నీవే ఇచ్చినట్లయితే, నేను ఇవ్వవలసినవి ఏమీ ఉండదు. ఉదాహరణకు: నీవు నాకు బూవులను దెచ్చియిచ్చితివి.— అన్ని రకములైనపూలను. అయితే వాటిని నీవు బంతిగా గూర్చలేదు. నాతో "నేను మీకు పూలు తెచ్చితిని. వానితో పూగుచ్ఛమును గూర్చుకొనుడు" అంటివి. ఈ మార్గము నాకు సులభమైనదిగదా! అందులో నాకుగావలసినవి తీసుకొని, ఏమిజరిగినదో వివరింపగలను. అట్లుగాక నీవు తయారైన పూగుచ్ఛమునే తెచ్చియిచ్చినచో అందు నిజమైన పూలుగాక కృత్రిమపు పూలు నాకు గన్పట్టినచో అప్పుడు నేను చెప్పవలసినదేదీ ఉండదు. నాకు పరిశుద్ధమైన పూలే గావలయును. కనుక ఈసలహా జ్ఞాపక ముంచుకొనుము. నేను సర్వదా నీవు చెప్పినదానిని వినుటకు సిద్ధముగానున్నాను. అయితే, తయారుచేసినవి తేవలదు. ఏమిజరిగినదో కచ్చితముగా నాకు జెప్పుము. అయినను అందులో మానసికపు వ్రాత కూడ కొంత ఉండుట నిశ్చయము. మనస్సునకు ఖాళీలు ఎట్లు నింపవలయునో తెలియును. విషయములు హేతుయుక్తముగాను, తెంపులేకుండాను ఉండవలెను గనుక, నీకు దెలియని రీతిగానే అయత్నపూర్వకముగా నీయనుభవములలో వెలితిపడిన విషయములను అది పూర్తిచేయును. నే నెవరిని నిందింపను. అది తనంతకు దానుగా నేర్పడిన విషయమని నే నెఱుగుదును. అనుభవమును సరియైన, కచ్చితమైన రీతిలో వివరించుటకు ఎంతోజాగరూకత అవసరము.

"నా ప్రవృత్తులు నావి గావు, వానిని గుఱించి నే నాలోచింప బనిలేదు" అని చెప్పుట ప్రమాద కరము గాదా ?

అవును. నిజమునకు నీ వీ రీతిగా, — "నేను చేసేది ఏమీలేదు—అంతయు ప్రకృతికి సంబంధించినదే, నా ప్రవృత్తి ప్రకృతిసిద్ధ మార్గమును అనుసరింపవలసి యున్నది." అని నీ వనుచో, చేయగూడదని దేనిని గుఱించి నేను చెప్పితినో దానినే నీవు చేయుచున్నట్లగును —నీవు దైవమును నీ కోరికల తృప్తికి

ముసుగుగా. వాడుకొను చున్నవాడ వగుదువు. దీనికి వ్యతిరేకము — "నేను పనికిమాలిన వానిని, ఎందుకనఁగా, అటువంటి ఆలోచన నా మనస్సులోనికి వచ్చినది"—అనుకొనుటయును తప్పే. అవును కాదా?

సహజముగా, నీవు కోరని ప్రేరేపణ యొకటి నీకు వచ్చినట్లయితే, మొదట చేయవలసిన దేమనఁగా, మఱల అది రాకూడదని కోరుటయే. అట్లుగాక తద్విరుద్ధముగా, నీవు అది అదృశ్యము కావలయునని కోరకపోతే, దానిని ఉంచుకొనుము. కాని, యోగమును మాత్ర మభ్యసింపవలదు. అన్ని కష్టములను అధిగమించుటకు ముందుగా నీవు నిర్ణయించుకొనకపోతే. ఆ మార్గమును త్రొక్కనేవలదు—ఆ నిర్ణయము పూర్ణమైనది, నమ్మకమైనదిగా నుండవలయును. నీవు పురోగమించుకొలఁది, నీవు సంపూర్ణమని దేనిని నమ్మితివో అది అట్టిది కాదు అని నీవు తెలిసికొందువు. కొద్ది కొద్దిగా నీవు పురోగమింతువు. అట్లుగాక నీవు జయము గాంచవలయునంటే పురోగమించుటకు సంపూర్ణమైన దృఢనిశ్చయ ముండవలెను. ఈ నిశ్చయము నీ కున్నట్లయితే, నిన్ను ఏదైన ప్రేరణ దౌర్జన్యముగా ఆక్రమించినపుడు, ఆ నిశ్చయమును దృఢతరముగా నుంచుకొనుము — నీ అంతస్సత్తను ఎంతమాత్రము చలింపనీయకుము. నీ విట్టివి కలుగునని తెలిసి ముందుగానే సిద్ధపడి యుండవలయును. అయితే, అవి వచ్చినపుడు "అవి క్రింది భాగమునుండి వచ్చునవి, అవి తిరిగి రాకూడదని కోరుచున్నాను, అవి నావి కావు" అని నీకు నీవు చెప్పుకొనవలెను. ఈ విధానము, "అది ప్రకృతి కార్యము కనుక పోనిమ్ము" అనుట వంటిది కాదు.

తనకు వచ్చు ప్రేరణపై తిరుగుబాటుచేయుటకు ప్రాణకోశమునందు ముందుగానే అనుభవసాక్షాత్కారమునకు పునాదిరాయి పడియుండవలెను. చాలమట్టుకు మానవులు, యోగముచేయుదురని మనము నమ్మినవారు, ఇట్లు ప్రేరణకలిగిన వెంటనే, "అంతయుసరిగనేయున్నది, చేయవలసినదేమియులేదు." అని యను కొందురు. తరువాత, నీలో ఏదైనను ఎదురుతిరిగితే, "ఇది నాకక్కరలేదు.

అనిచెప్పితే, అట్లుచెప్పినది, "ఉన్నతచేతన" యగును. యోగముచేయుటకు నిర్ణయించుకున్నది నీ శరీరముగాదు. నీ ప్రాణకోశమునుకాదు. నీ మనస్సు కూడా కాదు. అది నీ మనస్సులోని ఉన్నతభాగము. లేదా. అది నీయందలి చైత్యపురుషుడు. అది మాత్రమే నిర్ణయము చేసికొనగలిగినది. నీ శరీరము నకు, ఇదంతా ఏమిటో తెలియదు. నీ ప్రాణికసత్త మార్పుయొక్క ప్రారంభమును ఆందోళనతో జూచును, మనస్సు తన భావములతో, "ఇది ఆవిధముగా జేయవచ్చును, ఈ విధముగా వివరించవచ్చును." అని ప్రతిపా దింప మొదలిడును. కనుక, నీవు నిర్ణయమును గైకొన్నట్లయితే, అది నీ ఉన్నతచేతననుండియే వచ్చును; దానినుండియే నీవు బలమును బొందవలయును. మఱి దేనినుండియు గాదు. అదియే, "నేను" అనునది. అది వ్యక్తిగత మైన "నేను"కాదనియు, విశ్వాత్మకము. ద్వివ్యమునైన 'నే' ననియు తుదకు తెలియవలసియున్నది.

"అయితే తుదకు మార్పునుగోరి నిర్ణయమును
తీసుకొనునది ప్రాణికసత్త కాదా?"

నేను నీకు నమ్మకముగా జెప్పుచున్నాను, - ప్రాణికసత్తను స్వేచ్ఛగా వదలిపెట్టబడితే, పరివర్తన చెందవలెనన్న నిశ్చయమును అది ఎన్నడును గైకొనదు, తనకుతానే తృప్తిచెందియుండును. ఇదికాక ప్రాణికసత్త మనస్సు యొక్క మిత్రమైనందున మనస్సు ప్రాణసత్తచేయు సర్వకార్యములకు కావల సిన ఉపసత్తులను అందించుచుండును. ఎవరైతే తమ ప్రాణికచేతనయందే జీవించుచున్నారో వారు ఎల్లప్పుడు తమలో తాము తృప్తివహించియుందురు. తమకు సంబవించిన అన్ని విషయములలోను వారు తృప్తిని ప్రకటింతురు. వారు తమ ప్రేరణలను గుఱించి, "ఎంతచక్కగా, ఎంతముచ్చటగా నున్న దిది!" అందురు. కనుక, ప్రాణికచేతనయే నిశ్చయము గైకొనగలదని ఎదురు చూచినచో, నీవు దీర్ఘకాలము కాచుకొనియుండవలయును.

ప్రాణికసత్తకు నీవు విధేయతను బోధింపవలయును. తాను తృప్తిని చెందుటకు ముందు లోబడుటతప్ప తాను చేయవలసినదేమియు లేదని అది అర్ధముచేసికొనవలయును. అందువలననే, యోగము ప్రారంభించుట సులభము కాదని నేననుట, నీకు అంతశ్శుద్ధి లేనిచో యోగమును ప్రారంభింపవద్దు.

శరీరము చాలా అణకువ గలిగినది. నిజముగా అది తనచేతనైనంత చేయ యత్నింపగలదు. కాని, తాను ఎవరికి లోబడవలెనో దానికి తెలియదు. ఎందుకనగా సాధారణముగా అది ఉన్నతచేతనతోను, లేక అంతరాత్మతోను నేరుగా సంబంధము కలిగియుండదు. ప్రేరణలు మనస్సునుండి నేరుగా దానికి వచ్చుచుండును, లేక ప్రాణికసత్తతో ముసుగుపడ్డ మనస్సునుండి వచ్చుచుండును; అది అది ఏమికోరితే దానిని చేయును. ప్రాణికసత్త నిశ్చయము గైకొనేముందు (ప్రాణికసత్త నిశ్చయము గైకొనుట సులభముకాదని నేను చెప్పియున్నాను.) మనస్సుయొక్క ఉన్నతచేతనయందు వెలుగు ఉదయించవలెను. ఆ వెలుగు ఉన్నతచేతనతోను, లేక నీ అంతరాత్మతోను నీకు సంబంధము కల్పించును. ఈ వెలుగు ఆధారముతో నీవు తగు వివరణలను నీ మనస్సుకు, ప్రాణసత్తకు, కడపట నీ శరీరమునకు అందజేయుచుండవలయును.

* * *

ఫిబ్రవరి 8, 1951

తల్లి సంభాషణలు (1929) అధ్యాయము 2 ఇంకను చదువుచున్నది.

"బాహ్యవ్యక్తి ఒక గుల్లవలె నున్నది, సామాన్య జనులలో ఈ గుల్ల చాలా గట్టిగాను, మందముగాను ఉండుటచేత, వారు తమ అంతరములో నున్న భగవంతుని తెలిసికొనలేరు. అయితే. ఒక్కతూరి ఒకనిమిషము, మాత్రమైనను అంతరములోనున్న వ్యక్తి మేల్కొని, "నేను ఇక్కడ ఉన్నాను. నేను నీ వానిని" అని చెప్పినచో, అప్పుడు వారధి కట్టినట్లు కొద్దికొద్దిగా గుల్ల పలుచనై పలుచనై రెండుభాగములు పూర్తిగా కలిసికొనిపోవుటకు ఆస్పదము గలిగి లోపలివ్యక్తి, బైటివ్యక్తి ఒకటై పోదురు,"

నీ వెప్పుడైనా నీ వ్యక్తిత్వమును సమైక్యపరుపవలెనని యోచించితివా? ఒక్కొక్కప్పుడు నీ వొక వ్యక్తిగానుండి. వేరొకప్పుడు ఇంకొక వ్యక్తిగా నుందువు. ఒక సమయములో నీవొకటి చేయతలంతువు; ఇంకొక సమయములో నీవు దానిని చేయలేవు. ఒక వ్యక్తిత్వమును నీవు ముఖాముఖిగాం కనుకొని, "ఇదినేను" అనుకొందువు. కాని, అదే సమయములో ఈ వ్యక్తిత్వములో అనేకభాగములుండి, నీకు అందరాక తప్పించుకొని పోవుచుండును. ఈ పరిస్థితి నీకెప్పుడును ఆందోళన కలిగించలేదా?

నాలో ఉన్నవనే వివిధ వ్యక్తిత్వాలను నేను సమైక్యపరుప యత్నించియుండలేదు. అయితే, వానిని

> ముఖాముఖి కనుగొనుటకు ప్రయత్నించితిని, మంచి దానిని చెడ్డదానికి ఎదురెదురుగా నిలబెట్టితిని. మంచి దానిలో చెడ్డదానితో పోరాడునంతటి బలమును నే నెన్నడు చూడలేదు.

మంచిదానిని గుఱించిన నీ తీర్పు, చెడ్డదానిని గుఱించిన నీ తీర్పు పూర్తిగా మానవతకు సంబంధించినవని నీ వెప్పుడు ఆలోచింపలేదా? నీలోని దైవసన్నిధినుండి వచ్చిన తీర్పుతో నీ తీర్పు సరిపడవలసిన అవసరము లేదు. నీవు తొలిగించుకోలేని చెడ్డవిషయాలు బహుశా, వానివాని స్థానములను తప్పి యుండవచ్చు. అవి తొలగింపబడితే - అది ఎంతయు విషాదకరమైన విషయమేయగును. ఎందుకనగా, దానితోపాటు బహుశః నీ శక్తిలోను, దైవ సాక్షాత్కారములోను - కొంతభాగము అదృశ్యమయ్యే ప్రమాదమున్నది. యోగ సాధనము గురువు సలహాల ననుసరించి చేయనివారు సామాన్య నీతిమార్గము ననుసరించి చేయుదురు. వారు ఒక్కొక్కప్పుడు దిగ్భ్రాంతి చెందుదురు. ఎందుకనగా. వా రెంత సద్భావము గలవారైనను వాంఛించిన ప్రతిఫలము చేకూడదు. వారు తమ వ్యక్తిత్వమును పరివర్తనము చెందించుటకు బదులు దానినే ఆమోదింపగోరుదురు. నీ వ్యక్తిత్వములోని విభాగములన్నిటివి సమైక్య పరచుటకు, నీకున్న చైతన్యశక్తులను ఒకచోటికి దెచ్చుటకు జాలినంత భావనా శక్తి యుండవలయును. ఆ చైతన్యశక్తులను దైవసన్నిధిగ నీవు భావించు దాని ముందరపెట్టుటకు ఈ భావన ఉపయోగపడవలసియున్నది. సహజముగా నీ భావన సత్యమునకు జాల దూరమున నుండును. అయినా, నిన్ను నీతికి సంబంధించిన ఇరుకుత్రోవనుండియు, ఎఱుకకు సంబంధించిన పరిమితుల నుండియు కొంతవరకైన బయటపడుట కీ భావన తోడ్పడును. ఉదాహరణకు. నీ వ్యక్తిత్వమును, నీ సంకల్పమును. అపరిచ్ఛిన్నము, నిత్యము నైన ఎఱుక (చేతన) యెదుట పెట్టనుద్దేశ్యము నీ కున్నది. ఈ రెండు మాటలు మొట్ట మొదట నీకు ఏమంత అర్థమైనట్లుండవు. అయినను అవి పరిమితులను తెగ

గొట్టజేయు ఒకవిధమైన ఒత్తిడిని నీకు కలిగించును. నిన్నావరించి నీకు అతీతమైయున్న. ఒకానొకదానియెదుట నీవు నిలుచునట్లుచేయును. ఆ అతీత శక్తి చేయు తీర్పు మానవబుద్ధి చేసిన తీర్పును పోలియుండదు. సాధనను కేవలము ఆవిధముగనే ప్రారంభింపవలయును. నీవు నీతిసిద్ధాంతములతో నిన్ను తూచుకొని. నిన్ను నీవు విభజించుకొన్నట్లయితే. తప్పక నీవు దైవప్రణాళికకు వ్యతిరేకముగానే పోయినవాడవయ్యెదవు. దైవము నీతికి భిన్నమనిగాదు. గ్రహించుము. అయితే. ఆయన నీతి మానవులకు అర్థమగునదిగాదు; అదియు ఇదియు నొకటి కాదు.

(తల్లి ఇంకను చదువుచున్నది) ''ఆశ అనేకమంది యోగులను భగ్నమొనర్చినది. ఆశ్చర్యకరమైన శక్తులను సాధించిన ఒక యోగి కథ చెప్పబడినది. ఒక దినమున ఆతడు ఒక పెద్ద విందుకు శిష్యులచేత ఆహ్వానింపబడెను. ఎత్తు తక్కువగాఉన్న పొడుగాటి బల్లపైన ఆహారము వడ్డింపబడెను. శిష్యులు ఏదోఒకవిధముగా తన శక్తులను ప్రదర్శింపవలసినదిగా గురువుపై వత్తిడి చేసిరి. తాను చేయకూడదని తనకు దెలియును. అయితే అతని యెఱుకనుండి ఆశాబీజము పూర్తిగా దొలగింపబడలేదు. అతడు, ''ఏమైనా ఇది అమాయికపు విషయము. అది, అట్టివిసాధ్యమగునని రుజువుచేయును. భగవంతునియెడ వారి గౌరవము అధికమగును," అనుకొనెను. శిష్యులకిట్లు చెప్పెను, ''బల్లపైన వేసిన గుడ్డను, దానిపైన ఉన్న వస్తువులను తాకకుండా బల్లను తొలగించండి.'' శిష్యులు: ''ఓ. అది ఏ విధంగా చేయడము ? అన్నియు క్రిందపడును." అనిరి. 'చేయండి' అని గురువు పట్టుపట్టెను. బల్ల తొలగింపఁబడినది. అద్భుతము ప్రదర్శింపఁ

> బడినది. బల్లపైన గుడ్డ గాలిలో వ్రేలాడుతున్నది. పదార్థములన్నియు బల్ల ఉన్నట్లే గుడ్డపైన యథాతథముగా నున్నవి. శిష్యులు ఆశ్చర్యపడిరి. అకస్మాత్తుగా గురువు ఎగిరిపడి బొబ్బలు పెట్టుచు పరుగెత్తెను. ఇఁక మీదట నెప్పుడు శిష్యులను పెట్టుకోను. నేను నాశనమైతిని. నా దేవుని వంచించితిని. అనెను.

ప్రతి గురువు ప్రతి అడుగులోను ఎదుర్కొనే ఆకర్షణ యిది. సాధారణ మానవులు మామూలుగా దైవిక శక్తులతో సంబంధము లేనివారగుట. దివ్య చేతన యననేమో ఎఱుగని కారణమున, గురువుల నుండి భౌతిక రుజువులను గోరుదురు. ఈ విధమైన అభ్యర్థనల పైననే సర్వసామాన్యముగా అన్ని మతములను స్థాపింపఁ బడినవి. నిర్మొగమోటముగా జెప్పవలయునన్న, ఆధారము 'రాజకీయ' కారణములే. మత స్థాపకులు అనేక అద్భుతములు చేసిరని మతముల పునాదులలోనే నిక్షిప్తము చేసిరి. మొరటుగా అమాయికులైన ప్రజలలో ప్రచారము చేసి. అద్భుతములయందు రుచి కల్పించిరి. ఒకనియొక్క దైవిక శక్తిని నిరూపించుకొనుటకు అతఁడు అద్భుతములు చేయవలసిన అవసరమును బ్రజలు కల్పించిరి. ఇది అత్యంత మూఢత్వము. ఎందువల్లననఁగా, దైవశక్తి గాని, దైవచేతన గాని, అద్భుతములను జేయుటకు అవసరము లేదు. ప్రాణమయ ప్రపంచములోని అల్పములైన వ్యక్తి విశేషములలో సహాయముతో అతి సులభముగా అద్భుతములను జేయవచ్చును. ఆ వ్యక్తి విశేషములు భౌతిక ప్రపంచముతో సంబంధము పెట్టుకొని, అద్భుతములు చేయుటకు సాధనము లగుచున్నవి. ఉన్నత చేతనలో జీవించుచు ప్రకృతిపైన ఇతర భూమికలలోని ప్రతినిధుల సహాయముతో పనిచేయుటకంటె పై విధానము బహుసులభము; ఒకని దైవత్వమును రుజువుపరుచుటకు, అతఁడు మృతులను సజీవులను జేయవలెను. రోగములను నివారణ చేయవలయును. ఇంకను అటువంటివే అనేకము (శుద్ధ అవివేకిని, వివేకిని జేయుట దక్క) చేయవలయును, అని మానవబుద్ధులకు పలు

మారు బోధింపబడినది. * బాగుబాగు. ఇది ఎంతమాత్రము రుజువు కాజాల దని నేను హామీ ఇచ్చుచున్నాను. ఇది ఒక దానిని మాత్రము రుజువు చేయు చున్నది. ఈ ప్రబుద్ధులు, ప్రాణమయ ప్రపంచములోని శక్తి విశేషములతో సంబంధము కలిగియున్నా రనియు, వాటి సహాయముతో ఈ అద్భుతములు చేయుదురనియును,—అంతే. ఒకఁడు ఒక మానవుని గొప్పతనమును గుర్తించు టకు అద్భుతములపైన ఆధారపడునేని, అతఁడు నిస్సందేయముగా పొరబాటు పడుచున్నాడు. సహజముగా మతములు, వాని స్థాపకులకు కలిగిన ఆవిష్కరణల పైన స్థాపింపఁ బడినవి. ఈ ఆవిష్కరణలు వారు పొందిన జ్ఞానమునుండి జనించిన ఆనందదాయకములగు మానసికోల్లేఖనములు మాత్రమే. ఈ జ్ఞాన స్థాయి చాల గొప్పదేకాని, ఇదే రుజువని చెప్పుటకు వీలులేదు. కనుక నేను కడ పట చెప్పున దేమనగా. "మానవులు రుజువులకై చేయు అభ్యర్థన మానవుని పురోగతికి అనుకూలమైనది కాదు". ఎందుచేతననఁగా, సత్యమైన భగవంతుని శక్తి ఒక ప్రణాళిక ప్రకారము ప్రపంచమును ఏర్పాటు చేసినది, ఈ ప్రణాళిక లోని విషయములు అతార్కిక మార్గములో సంభవించునను ప్రశ్నయే లేదు. అట్లు సంభవించుచో, ప్రపంచము ఆదినుండియు అతార్కిక సిద్ధాంతములపై ఆధార పడియుండవలెను. అది యట్లులేదు. మనుజులు ఎక్కువగా రెంటింటిలో ఏదో ఒకదానిని భావన చేయుచుందురు. మొదటిది, భౌతికవాదము, భౌతిక ప్రపంచ

---

* ఇది ఒక మహమ్మదీయ గాధ యని నే అనుకొనుచున్నాను. ఏసు క్రీస్తు మరణించిన వానిని లేపినాడు. మూగవారికి మాటల నిచ్చినాడు. రోగు లను స్వస్థులను జేసినాడు. గ్రుడ్డివారికి చూపు నిచ్చినాడు, ఒక దినము ఒక మూర్ఖుని ఆయన యొద్దకు దెచ్చిరి—వానిని విజ్ఞునిగాఁ జేయుమని — ఏసుక్రీస్తు పరుగెత్తి పారిపోయినాడు. "నీ వెందుకు బరుగెత్తి పోయితివి." అని అడుగగా "నేను అన్నియు జేయఁగలను. మూర్ఖుని విజ్ఞునిగా చేయుట తప్ప — అనినాడు.

మున్నదనియు తాము దానికి చెందినవారే యనియు. దానినుండియే అన్నియు వచ్చు చున్నవనియు, అన్నియు అక్కడికే తిరిగిపోవుననియు అక్కడనే లయించు ననియు వీరందురు. వీరు నాస్తికులు. రెండవది—ఆస్తికవాదము. విశ్వాసపరుల వాదమిది, ఏదో ఒకటి ఉన్నది, అదియే భగవంతుడు. ఈ భౌతిక ప్రపంచము ఆయన చేతనే సృష్టింపఁ బడినది, తా నేమి చేయుచున్నది, తన కేమి కావలసి నది అయనకు దెలియును. కంగారు అంతయు, 'అన్నియు నిరంకుశముగానో, ప్రకృతిసిద్ధముగానో, లేక అప్రాకృతముగానో సంభవించు' చున్నవనియు అను టలో నున్నది. విశ్వములో అసంఖ్యాకమైన క్రమ విభాగము లున్నవని తెలిసిన వారు చాలా తక్కువమంది మాత్రమే. ప్రతి క్రమ విభాగమునకు ప్రత్యేకముగ తత్సంబంధమైన సత్యము, జీవితము, శాసనము, నిర్ణయము ఉన్నవి. నియంతృత్వ పూర్వక బుద్ధి నియంతృత్వ మార్గమున సృష్టి చేయబడలేదు. అది చైతన్య విల సనముతో ఏర్పడినది. ప్రతి యంశము, యుక్తియుక్తముగ. వెనుకటి దాని ఫలి తమును బట్టి, పరిణమించుచువచ్చినది. నేను ఇది యంతయు ఎంత సులభగ్రాహ్య ముగ చెప్పవలయునో అట్లు చెప్పుచున్నాను. ఇది సత్యమైన భాషణమని మీరు తెలిసికోవలయును. అయితే, ఉన్నది ఉన్నట్లు చెప్పినట్లయితే మీరు అర్థము చేసి కొనుట కష్టము. మీరు తెలిసికోవలసినది నేను కడపట చెప్పినది మాత్రమే. (నేను అనేక మార్లు దానిని గుఱించి సవిస్తరముగా వచించినాను) ఆ కడపట చెప్పినదిది : ప్రతిక్రమ విభాగమునకు దానికి సంబంధించి మిక్కిలి హేతుబద్ధ మైన నిశ్చయమున్నది. ప్రతిది కారణమునుండి కార్యముగా రూపొందినదే. అయితే, ఈ ప్రపంచము, విభాగములుగా నున్నప్పటికి, ఇవి ఒకదాని కొకటి వేరుగా లేవు. అసంఖ్యాకమైన పరిణామ పద్ధతిలో రూపొంది యున్నది. అంతర ఊర్ధ్వ ప్రపంచములు బాహ్య, అవరప్రపంచములతో నిరంతర సంబంధము గలిగి, దానిని మార్చుటకువీలగు ప్రభావితమొనర్చుచు, ఒకదాని నిర్ణయము మరొక దానిని మార్చుటకు వీలగు అవినాసంబంధము గలిగియున్నవి. ఉదాహరణకు, భౌతికవిభాగ మును తీసికొన్నట్లయితే, దాని భౌతికనియతులను గుర్తించినట్లయితే. అవి ఆకస్మి కముగా ఒకదాని ప్రాబల్యముచేత మార్చబడుచున్నవి. దానిని నీవొక అద్భుతముగా

భావింపవచ్చును. ఎందుకనఁగా, ఒక విభాగము యొక్క నిశ్చయము మఱియొక దాని నిశ్చయముతో రాపిడి పొందుచున్నది. సామాన్యముగా దీనిని మనము అద్భుతమనము. ఉదాహరణకు; మానవ నిశ్చయము జోక్యము కలిగించుకొని, ఒక దానిని మార్చినపుడు అది సహజముగానే కనబడుతుంది. ఎందుకనఁగా, బాల్యమునుండి నీవు దాని కలవాటుపడి యున్నావు. నీకు జ్ఞాపకమున్నదో లేదో, నేను ఇదివరలో యిచ్చిన ఉదాహరణ మిది : : జాయి ఒక నిశ్చయ శాసనము ప్రకారము పైకి విసరినపుడు క్రిందపడును. నీవు జోక్యము కలిగించుకొని దానిని చేతితో పట్టుకొన్నచో అది అద్భుతమని నీవనవు. ఎందుకనఁగా దానికి నీవు అల వాటు పడినావు. (ఎలుకగాని, కుక్కగాని, మాటలాడ గలిగినట్లయితే అది అద్భుత మగును.) పూర్తిగా అజ్ఞానులైన ప్రజలు ఒక క్రమ విభాగము, మఱియొక క్రమ విభాగముపై ప్రకటించు నిశ్చయము వలన కలిగిన మార్పులను అద్భుతము లందురు. వారికి మానసిక, ప్రాణిక నిశ్చయము లున్నట్లయితే అది సహజముగా కనబడును. ఉన్నత ప్రపంచమునకు అనగా దేవతలకు ఇతర ఉన్నత వ్యక్తిత్వము లకు సంబంధించిన నిశ్చయమైతే, అది నీ అల్పవ్యవస్థనంతను తారుమారు చేసి నప్పుడు, నీ కది అద్భుతముగా తోచును. అందులకు కారణము, క్రమవిభాగము లను, అవి ఒకదానిపై ఒకటి జరుపు ఘర్షణలను గుర్తించక పోవుటయే. అందు వలన, అత్యున్నత స్థానమునుండి వచ్చు పరమ నిశ్చయము హేతుబద్ధముగా జరుపు క్రియాకలాపమును చూచినప్పుడు, నీవు నిరంతరముగా దానిని గుర్తించు చున్నట్లయితే, నీ కది సహజముగానే కనబడును. అందువలన అద్భుతములను చూడగోరు వారు మూఢులు. కనుక, యోగమును పట్టుదలతో చేయువారు, ఈ పద్ధతిని ప్రోత్సహించుట ప్రమాదకరమని దానిని నిషేధించిరి.

నీవు చేయు పద్ధతిని చూచి గ్రహించుటకు వారికి నీవు అవకాశ మివ్వవు గనుకను, అందలి వివిధ దశలను వారికి చూపవు గనుకను, వారది అద్భుతమని భావించుచున్నారు. కొందఱు ఉన్నత మానసిక భూమికలను అందుకొనుట చేత, ఆలోచనా దశలను ఒకదాని తర్వాత ఒకదానిని వారు అనుసరించవలసిన అవసరము

లేదు. వారు ఒక దశనుండి ఉన్నత స్థాయిలో నున్న మఱియొక దశకు ఎగిరి పోగలరు. ఇది అంతర్జ్ఞానమని పిలువఁబడు చున్నది. ఇది నాకు కలిగిన అనుభవము. నేను శ్రీ అరవిందులతో మాట్లాడునపుడు, మధ్యనున్న దశలను స్పృశించు అవసర ముండెడిది గాదు, ఆయన ఒక విషయమును చెప్పును. నేను సుదూరములో నున్న ఫలితమును చూతును. మే మెప్పుడును ఆ విధముగా సంభాషించుకొనువారము. అప్పుడెవరైనను ఉండి మా సంభాషణను వినుచుండినట్లయితే, ''ఏమిటి వారు మాట్లాడేది,'' అని తలంతురు. అయితే, మాకు సుస్పష్టముగా అది అంతయు ఒక తెంపులేని వాక్యముగానే ఉండెడిది. అది మానసిక అద్భుతము అని నీ వనవచ్చు, కాని అది అద్భుతము గాదు. శ్రీ అరవిందులు మానసిక దృగ్విషయముల సంపూర్ణ దర్శనమును ఒక్కుమ్మడిగ పొందనేర్చినవారు. కావున, అన్ని దశలను ఒకదాని తర్వాత ఒకటిగా పర్యావలోకించుచు కాలము వృథాపుచ్చు నవసరము మాకు లేకపోయినది. ఈ క్రమము ననుసరించు ఏ వ్యక్తికైనా అది సహజముగాను హేతువాదబద్ధముగాను ఉండును, తెలియని వారికి అది అద్భుతము,

> "వానిని (శక్తులను) ఎట్లువచ్చినవో అదేవిధముగా ఉపయోగించుకొనవలెను అవి భగవంతుని కలిసికొని తిరిగివచ్చినవి. భగవత్సంకల్పము నెరవేరుటకే వానిని వినియోగించవలెనుగాని, ముసుగువేసికొన్న స్వార్థ విడంబనము కొఱకుగాదు,"

నీకు శక్తి ఉన్నదని చూపుటకు దానిని ఉపయోగించినట్లయితే, అది కేవలము అసత్యముతో నిండినదై, తుదకు అదృశ్యమైపోవును. అయితే, ఎప్పుడును అటులనే ఉండదు; ఎందుకనగా, నేను మొదటలో జెప్పినట్లు, రోగనివారణ చేయుటకు, బాహ్యమున నున్నదానిని పూర్తిగా మార్చుటకు, అననుకూలపరిస్థితులను అనుకూలముచేయుటకు, పారవేసికొన్న వస్తువులను

కనుగొనుటకు.—ఇట్టి చిన్నచిన్న అసంఖ్యాకములైన 'అద్భుతములను', - అన్ని మతములందును కానవచ్చువానిని, సులభముగానే చేయవచ్చును. ఇవి ప్రాణిక ప్రపంచపు వ్యక్తివిశేషముల తోడ్పాటుతో జరుగుచుండును. ఇవి సిఫార్సు చేయదగినవి గావు. ఇవి నిన్ను తమ వినోదమునకై వినియోగించుకొను చుండును. ప్రారంభమున నిది ఉత్సాహకరముగనే యుండునుగాని, తుదకు విషాదకరముగా బరిణమించును.

ఒక మనిషియొక్క కథ నాకు దెలియును. అతడు కొన్ని సాధనల మూలమున ప్రాణికజగత్తులోని ఒక చిన్న శక్తిని— ఒక భూతమును—స్వాధీనము చేసికొనెను. ఇతడు వ్యాపారి. ఇతడు ఋణముల నిచ్చును. వ్యాపారమున నొడుదుడుకుల గలిగించి తన కనుకూలమైన పరిస్థితిని కల్పించి తన లాభమునకై వినియోగించును. తాను స్వాధీనము చేసికొన్న భూతమును తన వ్యాపారమునం దుపయోగించెను. ఎప్పుడు వాటాలకు, నిల్వలకు ఎక్కువ ధర వచ్చునది, ఎప్పుడు పడిపోవునది ముందుగానే ఆ భూతము హెచ్చరించుచుండెడిది. మార్కెటురేట్లను ధరలను ముందుగానే తెలిపెడిది. సంవత్సరమంతయు ఆ భూతముయొక్క సలహాలను అనుసరించి అతడు విపరీతమైన జయమును గాంచి భూలోక కుబేరుడయ్యెను. సహజముగా తనను నడుపుచున్న ఆ భూతమునుగురించి చాల గొప్పగా చెప్పుకొనుచుండెను. ప్రతిఒకరితోను "చూచితివా ఈ భూతములతో సంబంధము పెట్టుకొనుట ఎట్లో నేర్చుకొనుట ఎంత లాభదాయకమో!" అనెడివాడు. ఒక రోజు వానికంటె వివేకియైనవా డొకడు, "జాగ్రత్తసుమా" అని హెచ్చరించెను. అతని మాటల నతడు ఆలకించలేదు. అధికారము, ఆశ అతనిని పొంగిపోవునట్లు చేసినది. అప్పుడు అతని యధీనములో నున్న భూతము, "ఇక నీవు ప్రపంచములోకెల్ల ధనికుడవౌదువు. నీ యాశ ఈడేరును. నేను చెప్పినట్లుగా చేయుము ఈసారి నీకున్న సమస్తము వ్యాపారములో బెట్టుము. ప్రపంచములోకెల్ల ధనికుడవై పోదువు", అని చెప్పెను. బుద్ధిలేని ఈ వ్యాపారి భూతము పన్నిన

ఈ ఉచ్చు తెలిసికోలేకపోయెను. అందువలన. భూతముచెప్పినట్లు చేసి, చిల్లి గవ్వతోసహా సర్వము గోల్పోయెను.

ఈ స్వల్పశక్తులు నిన్ను తమాషాపట్టించుటకు, నిన్ను నమ్మించుటకు, ప్రోత్సహించుటకు ఈ చిన్నచిన్న అద్భుతములను జేయును. నీవు సంపూర్ణముగా, తమ వలలో బడినావని గ్రహించగానే ఒక యుక్తిపన్ని నిన్ను సర్వనాశము చేయును.

ఒకే ఒక సురక్షితమార్గమున్నది. దైవాదేశము ననుసరించి తప్ప ఏ కార్యమును చేయవద్దు. ఇప్పుడొక ప్రశ్న ఉదయించును,—నిన్ను క్రియకు ప్రోత్సహించే దైవాదేశము నెట్లు గుర్తించుట, అనునది. నేనిట్లు జవాబు నిచ్చితిని. భగవంతుని గొంతును వినుట కష్టమైన పని గాదు. ఎవడును పొరబాటుపడ పని లేదు. నీవు దైవచింతనామార్గములో ఎక్కువదూరము పోయియుండ నవసరములేకయే దానిని నీవు గుర్తింపవచ్చును. నీ హృదయములోని శాంతినిలయములో నీవు నిశ్శబ్దముగానుండి, చిన్నదై, శాంతియుతమైన భగవంతుని మాటను నీవు వినవలెను.

నీవు దానిని వినుటకు సంపూర్ణముగా నిష్కపటుడవై యుండవలయును. నీవు నిష్కాపట్యము, నిజాయితీ గలవాడవు కాకపోతే నిన్ను నీవు మోసముచేసికొనుటతో ప్రారంభించి నీ అహంకారమును దప్ప భగవంతుని కంఠము నెంతమాత్రమువినలేవు. అప్పుడు నీవు అత్యధిక బుద్ధిహీనతను ప్రదర్శింతువు. నీవు నిజాయితీ గలవాడ వైతే, నీ మార్గము సరళము సునిశ్చితము నగును. నీకు వినిపించునది కంఠధ్వని గాదు, ఇంద్రియజ్ఞానమును గాదు. అది ఒకానొక అతి సూక్ష్మమైన సూచన, అన్నియు సవ్యముగా సాగిపోవునపుడు. అనగా, నీవు దైవనిశ్చయమునకు వ్యతిరేకముగానేమియు జేయకున్నప్పుడు. నీకు ఖచ్చితమైన ఏ అభిప్రాయము కలుగదు, అన్నియు

నీకు మామూలుగానే ఉండును. అయితే భగవంతుని యిష్టమునకు అనుగుణముగా నేను ప్రవర్తించుచున్నానా అను విషయము దెలిసికొనుటకు నీకు ఆదుర్దా యుండవలయును. అదియే మొదటి అంశము. సహజముగా అది లేనిదే నీ వేమియు దెలిసికొనలేవు. అయితే, నీ వాదుర్దా గలిగియుండి శ్రద్ధ గలిగినవాడ వైతే, అన్నియు నీకు మామూలుగానే యుండును. సహజముగా అప్పుడు ఆకస్మికముగా నీ తలలోనో, హృదయములోనో, కడుపులోనో, కొద్దిపాటి నెమ్మది లేమిని అనుభవింతువు. సామాన్యముగా ఎవడు దానిని గురించి ఆలోచింపరు. అనేకమారులు దినములో నీకది కలిగినను దానిపై శ్రద్ధలేక త్రోసిపుత్తువు. అయితే అది ఎప్పటిమాదిరిది కాదు. అప్పుడు ఆ సమయములో నీవేమి చేయుచున్నను నిలిచి చూడవలెను. నీవు నిజాయితీ గలవాడవైతే నీవొక నల్లని మచ్చనుచూతువు. (ఒక చిన్న దుష్టమైన భావము, ఒక చిన్న తప్పుడు చలనము, ఒక చిన్న నియంతృత్వపు నిశ్చయము) అదియే నీ వ్యాకులతకు కారణము. ఈ నల్లనిమచ్చ అహంనుండి వచ్చినదని నీవు గ్రహింతువు. అది పూర్తిగా యిష్టానిష్టములతో గూడినది. సామాన్యముగా అది తన కేది యిష్టమో దానిని చేయును. అది యిష్టపడినవి మంచివనియు, యిష్టములేనివి చెడ్డవనియు బిలువబడును. ఇది నీ నిర్ణయమును గప్పివేయును. ఈ పరిస్థితులలో వివేచించుట కష్టము. నీవు నిజముగా తెలిసికొనవలయునంటే, నీ వొక అడుగు వెనుకకు వెళ్ళిచూడుము. అప్పుడు ఈ అహమునకు సంబంధించిన చిన్న కదలికయే నీ వ్యాకులతకు కారణమని అర్థమగును. ఇది తనలో తానే చుట్టచుట్టుకొని యున్న ఒక చిన్న విషయమని నీవు గమనించగలవు. నీవొక కఠినమైన దానియెదుట నున్నావనియు, అది ప్రతిఘటన సామర్థ్యము గల నల్లని వస్తువనియు నీవు చూతువు. అప్పుడు ఓపికతో, నీ జ్ఞానశిఖరమునుండి ఈ చిన్న నల్లని చిహ్నమునకు దాని దొసగును చూపవలయును. కడపట అది అదృశ్యమైపోవును. నీ వొకదినములోనే జయింతువని నే ననలేదు. అయితే, నీవు చిత్తశుద్ధితో ప్రయత్నించినట్లయిన జయించితీరుదువు. నీవు పరిశ్రమించినట్లయితే, అకస్మాత్తుగా నిన్ను వెలుగులో వికసింపకుండా చేసిన

నీచస్వభావసమూహమునుండి, అసహ్యతనుండి, చీకటినుండి తొలగింపబడుదువు. నిన్ను ముడుచుకొని పోవునట్లును, విశాలహృదయుడవు కాకుండునట్లును నీ వెక్కడైతే ఆనందముగా నుంటినను భావమునుబొంది, దేని ప్రకాశములో వికసింతువో అది జరుగకుండునట్లును చేయునవి అవియే. నీవీప్రయత్నమును జేసినట్లయితే, చిట్టచివరకు నీవు ప్రారంభించిన చోటినుండి కడుదూరము వచ్చి నట్లు దెలియగలవు. ఇదిపరకు నీకు అనుభవమునకు రానివి, అర్థముగానివి విశదమగును. నీవు నిశ్చయించుకొన్నట్లయితే, తప్పక జయింతువు.

శక్తుల నన్నింటిని సమైక్యపరుచు కొనుటకు, కేంద్రీకృత నిశ్చయము గలిగి, ఈ నిశ్చయము ప్రకారము పనిజేయు చేతన గలవాఁడవగుటకు ఇది మొదటి మెట్టు. ఈ కేంద్రీకృత నిశ్చయము దైవసంకల్పపు నిరంత రాభివ్యక్తి రూపమై వెలయును — ప్రయత్నము చేయఁదగినది.

ఈ ప్రపంచములో ఇంతకంటె ఉత్సాహకరమైనది లేదని నా వ్యక్తిగత అనుభవమువలన జెప్పుచున్నాను — ఈ ప్రయత్నము నీవు ప్రారంభించినట్లయితే, నీ జీవితము అధికోత్సాహము గలిగినదిగాఁ దెలిసికొందువు. సామాన్య జనుల జీవితములో మూడింట ఒక భాగము నిరుత్సాహకరమగు విసుగుదలతోఁ గూడినది. (నేను మూడింట ఒక భాగమన్నాను. ఇతరుల మతములో అది మూడింట రెండు భాగములు.) ఈ విసుగుదల అంతయు ఆవిరియై పోవును. అన్ని విషయములు ఉత్సాహదాయకముగా నుండును. ప్రతిది సజీవముగా నుండి సంతోషముతో కూడినదిగా నుండును.

* * *

ఫిబ్రవరి 10, 1951

"నీవు దైవ మార్గ మనుసరించుటకు సిద్ధముగా నున్నచో, నీకు ఏ పని కేటాయించబడితె అది ఎంత బ్రహ్మాండమైనదైనను కైకొనుటకు సమర్థత గలిగియుండ వలెను. అటులనే, ఆ పని ఎంత నెమ్మదిగా తీసికొన్నావో అంత నెమ్మదిగానే మరుదినము వదలిపెట్టి పోవుటకును సమర్థుడవై యుండవలెను. దాని బాధ్యత నీవు నీదిగా భావించగూడదు. ఏ వస్తువు నెడగాని, ఏ విధమైన జీవి తము నెడగాని తగులము ఉండరాదు. నీవు సంపూర్ణ స్వేచ్ఛ గలిగి యుండవలెను.

(సంభాషణలు 1929 పే. 12)

"నీవు సంపూర్ణముగా స్వేచ్ఛ గలిగి యుండుము." అను మాటను తాను ఎట్టి అర్థమును చేసికొన్నదియు మీలో ఎవరైన నాకు జెప్పవలయునని కోరు చున్నాను. ఎందుకనగా, అది చాలా ముఖ్యమైన ప్రశ్న. ఎందుకో నేను చెప్పెదను.

ఎక్కువమంది ప్రజలు స్వేచ్ఛయన యధేచ్ఛా ప్రవర్తనముగా అర్థము చేసి కొని, తికమక పడుదురు. సామాన్య బుద్ధికి, స్వేచ్ఛగా నుండుట యన, తా నిష్ట పడిన ప్రతి బుద్ధిలేని పనిని నిరాటంకముగా చేయుట. "సంపూర్ణ స్వేచ్ఛను గలిగి యుండవలెనని నేనన్నాను. ఈ వాక్యము యొక్క అర్థమును దెలిసికొనని పక్ష మున, ఇది కడు అపాయకరమగు సలహాగా బరిణమించును. స్వేచ్ఛ దేనినుండి? తగులముల నుండి యనునది సుస్పష్టము. అదే ఖచ్చితమైన అర్థము. ఉదాహరకు, బుద్ధుని కథ. అన్ని కళలయందు నిపుణుడైన ఒక యువకునికి బుద్ధుడు, "నేను ఆత్మ నిగ్రహ కళయందు నిపుణుడను, ప్రజలు నన్నభినందించినపుడు, పొగడి

నపుడు నన్నది శాంతిగా, నిరపేక్షగా నుండనిచ్చును. నన్ను దూషించినపుడు కూడ అంతే,'' అని చెప్పెను.

నీవు దూషణ భూషణలకు పూర్తిగా అతీతుఁడవై యున్నావో నిన్ను నీవు ప్రశ్నించుకొని చూడుము. నీవు ఇతరుల కంటే గొప్పవాడవని భావించుకొని వారి మాటలను అలక్ష్యము చేయుమనిగాదు. నీ అజ్ఞానముతో సహా లోకము యొక్క సర్వసాధారణ అజ్ఞాన స్థితిని నీవు ఎఱిగియున్న కారణమున, నీవు ఇతరులు "ఇది మంచిది" అన్నప్పుడు "అది వారన్నంత మంచిది కాదు'' అని నీవనుకొందువు. అటులనే, ఇతరులు ''అది చెడ్డది" అన్నప్పుడు, "అది వారన్నంత చెడ్డదికాదు'' అని అనుకొందువు. ప్రతిదాని మంచి చెడ్డలు తెలిసికోలేనంతగా గలిసి పోయియున్నవి. ఎవరును ఎవరి విషయమునగాని ఇదమిద్ధమని నిర్ణయించి చెప్పలేదు.

కనుక నీవు దూషణ భూషణలకు అతీతుడవుగా ఉన్నావు. పర్యవసానము ఈ విధముగా నుండును, ఎంతకాలము నాలో ఉన్న దివ్య చైతన్యముగాని, నేను ఎన్నుకొన్న గురువులో ఉన్న దివ్య చైతన్యముగాని, నాకు, "ఇది చేయదగినది, ఇది చేయరానిది" అని చెప్పకపోయినదో, అంతకాలము ఇతరులు చెప్పుదాని విషయమున నేను నిర్లక్ష్యముగానే ఉందును. ఎందుకనగా, నేను ఎవరియందు విశ్వాసముంచినానో, ఆయనకు దైవముతోనున్న ప్రత్యక్షానుభవము, ఏది మంచిది, ఏది చెడ్డది, ఏది చేయఁదగినది, ఏది చేయఁగూడనిది అని తెలిసికొనుటకు సామర్థ్యము, గలిగియున్నదని నేను భావింతును.

అదియే స్వేచ్ఛగా నుండుటకు ఉత్తమోత్తమ మార్గము. భగవంతునికి నీ సమర్పణము పూర్తిగా నుండనిమ్ము. నీవు పూర్తిగా స్వేచ్ఛ గలిగినవాఁడ వగుదువు,

వాస్తవమైన స్వేచ్ఛగల వాఁడుగా నుండవలయునంటే, ఉన్న ఒకటే మార్గ మేదనఁగా, నీ సమర్పణ పూర్ణమైనది గావలెను. మినహాయింపు ఉండ కూడదు. ఎందుకనగా నిన్ను బంధించునదంతయు నిన్ను క్రిందికి దిగలాగి, గొలుసుతో కట్టివేయునదెల్ల నీ సమర్పణ సంపూర్ణత గలిగినదయితే దానంత టదియే రాలిపోవును. ఇక మీదట అది యెల్ల అముఖ్యమగును — ఒకడు వచ్చి నిన్ను నిందించినట్లయితే, "ఏ అధికారముతో వాఁడు నన్ను నిందించుచున్నాడు. వానికి దివ్యసంకల్ప మనగా నేమో తెలియునా?" అని అనుకొందువు. ఇతరులు నిన్ను ప్రశంసించినప్పుడును ఇదే భావము. ఇతరుల నుండి నీకు వచ్చుదానివలన నీవు లాభ పడవలదని" నేను సలహా యిచ్చుటలేదు — "నా జీవిత మంతటను నేను నేర్చుకొనిన దేమన, ఒక చిన్న బిడ్డకూడ నీకు పాఠము నేర్ప గలిగియుండును. నీకంటె ఆ బిడ్డ తక్కువ అజ్ఞాని అని కాదు. అతనియందు, అద్దములో బొమ్మ ఎట్లు ప్రతిబింబించునో అట్లు నీ గుణగణము ప్రతిబింబించును. ఆతడు నీకు నిజముకానిది కొంత చెప్పినను, నీకు తెలియనిది కొంత చెప్పవచ్చును. అందువలన నీవా పాఠమును అవాంఛనీయమని త్రోసివేయకుండా మంచిదానిని గ్రహించినట్లయితే నీవు ఎక్కువగా ప్రయోజనము పొందవచ్చును.

నా జీవిత మందలి ప్రతి గంటా నేను నేర్చుకొనినది యిది : "ప్రతి ఒక్కరు ఏదో కొంత నేర్చుకొనుచునే యుండవచ్చు"నని. అయితే, ఇతరుల అభిప్రాయములకు కట్టుబడియుంటినను భావము నాకు ఎన్నడును కలుగలేదు. ఎందుకనగా, ప్రపంచములో ఏదైనను కొంత తెలియగలిగినది ఒకేఒకటున్నది. అదియే దివ్యసత్యము. అది తెలిసినవాడే పూర్తిగా స్వేచ్ఛ గలిగినవా డగును. అన్ని అనుబంధముల నుండి సమస్త అజ్ఞానము నుండి, సకల ప్రతిక్రియల నుండి స్వేచ్ఛను మీరు కలిగి యుండవలెనని నేను కోరుచున్నాను. భగవంతునికి సంపూర్ణ సమర్పణ విషయమున మాత్రము నీకు స్వేచ్ఛ యుండరాదు. అది తప్పక చేయవలసినదే. ప్రపంచ బాధ్యతల నుండి దూరమగుటకు ఇదియే మార్గము.

ప్రారంభ దశనుండియు సంపూర్ణ సమర్పణ చేయ
గలిగి యుండుట సాధ్యము గాదు, అవునా?

సాధారణముగా సాధ్యము గాదు, దానికి సమయము రావలెను. అయితే, తక్షణ పరివర్తనములను ఉన్నవి. సవివరముగా అదియంతయు వివరించుటకు చాలాకాలము పట్టును. నీకు బహుశా తెలిసి యుండవచ్చును.—ఉపదేశమిచ్చు అన్ని పాఠశాలలలోను, ఒకని గుణగణములను మార్పుచేయుటకు 35 సంవత్సరములు పట్టునని పూర్వము నుండియు చెప్పఁబడుచున్నది. అందువలన, ఇది ఒక్క నిమిషములో సాధింప బడగలదని నీవు వాంఛింపరాదు.

ఒకఁడు అన్నిటియందు నిర్లక్ష్యముగానుండవలయు
ననుట లక్ష్యమైనప్పుడు పిల్లలకు బహుమతు లెందు
కీయవలెను ?

పాఠశాల విద్యార్థి యోగి కావలెనని నీ వపేక్షింప వనుకొందును. లక్ష్యసిద్ధి గాంచుటకు, ఒకని గుణగణములను మార్చుటకు 35 సంవత్సరములు పట్టునని మాత్రమే నేనన్నాను.

వ్యక్తిగతమైన మానవాధికారము, అనగా కుటుంబములోని తండ్రికి, ఉపాధ్యాయునకు, ప్రభువునకు, ఉన్న అధికారము సాంకేతికము. వారికి నిజమైన అధికారము లేదు. సాంఘిక జీవితములో ఒక బాధ్యతను నిర్వహించుటకు వీలుగా వారికి అధికారము ఇవ్వబడినది. ప్రస్తుతమున్న పరిస్థితులలో, గమనించి చూచిన, సత్యేతరమైన అవాస్తవికత మీఁద సాంఘిక జీవితము నెలకొని యున్నది. సత్యమనగా ఐకమత్యము. సంఘము విభజనమీఁద నిర్మింపఁబడి యున్నది. స్వకీయ బాధ్యతను, ధర్మమును, సాంకేతిక కృత్యములను ఇంచుమించుగా చక్కగా నెరవేర్పఁగల వారున్నారు, పొరబాటు చేయనివాఁడు లేడు, ఈ ప్రపంచములో

అంతయు మిశ్రమమే. ఎవ్వడైతే తన విద్యుక్త ధర్మమును ఉపేక్షింప రానిదిగా భావించునో వాడు, దానిని నిజాయితీగా నెరవేర్చుటకు ప్రయత్నించును. వాఁడు దానిని నిజాయితీగా నెరవేర్చుటకు ప్రయత్నించును. వాఁడు దైవ ప్రేరిత జ్ఞాన మంది నట్లయితే, సామాన్యునికంటే తన ధర్మాన్ని కొంచె మెక్కువ నిజాయితీతో నెరవేర్చగలడు. విద్యార్థులకు మార్కులిచ్చు ఆ ఉపాధ్యాయుఁడు తాను దివ్య చేతనకు ప్రతినిధినని మనస్సులో భావించినచో, అతడా దివ్యచేతనతో ఎడతెరపి లేకుండా సంబంధము పెట్టుకొని, తనకు సాధ్యమైనంత వరకు ప్రవర్తించినచో, అది చాలా ప్రయోజనకరము. ఎందుకనగా, సామాన్య ఉపాధ్యాయుఁడు, తన వ్యక్తిగత ఇష్టానిష్టములతో పనిచేయును. అతడు సామాన్య కాపట్యమునకు వాశ సుడు. అయితే అతఁడు మార్కులిచ్చే సమయములో, సామరస్యమున తన సంకుచితత్వము నధిగమించి మెలగుచు ఈ సత్యమునకు మధ్యవర్తిగా నున్నచో, విద్యార్థులకు వారిలోనున్న సత్యమును తెలిసికొనుటకు సహాయపడును.

నేను చెప్పదలచుకొన్న వానిలో ముఖ్యమైన దొకటి : విద్య, విద్యాబోధ, రాజ్యాధిపత్యము——ఇవి పవిత్ర పౌరోహిత్యము వంటివి, ఎవనికి ఈ విద్యుక్త ధర్మ మప్పగించ బడినదో అట్టివాడు దానిని మహోన్నతముగా, ఘనతర సత్య మార్గ ప్రతీకగా నెరవేర్చి నట్లయితే, ప్రపంచ పరిస్థితులు ఎంతయు బాగుపడును. కాని, దురదృష్టవశాత్తు, వారట్లు ఆలోచించుట లేదు——ఏదో ఒక విధముగా తమ కార్యమును నిర్వర్తించు చున్నారు. ధనార్జనము కొఱకే పనిచేయు అసంఖ్యాక ప్రజలు గుఱించి ఇక చెప్పనే అక్కరలేదు. వారి చర్యలు దుర్గంధ భూయిష్ఠ ములు. నేను ఆశ్రమమును స్థాపించుటకుగల కారణమిదియే ఇక్కడ చేసే పనులు దైవార్పణముగా నుండవలెను.

ప్రతివాడు తన సహజ ప్రకృతి ననుసరించి మనస్తత్వ ప్రవాహములో కొట్టుకొని పోకుండా, ఎడతెగక తన మనో వీధిలో తాను దివ్యజ్ఞానమునకు, దివ్యశాసనమునకు బ్రతినిధినని తలంపవలెను. ఆ లక్ష్యముతో అతడు అధిక నిజా

యితీతోను, అధిక నిష్కాపట్యముతోను, పనిచేసినట్లయితే, తాను పురోగమించుటయే గాక, ఇతరులనుగూడా పురోగమింపజేయును. అదియేగాక తాను గౌరవింపఁబడును, సంఘములో క్రమశిక్షణ రాహిత్య ముండదు. ఎందుకనగా, గొప్పతనమును గుర్తించి, దాని యెదుట తలవంచే స్వభావము ప్రతి మానవునియందు నున్నది. క్రూరమగు నేరస్థులు కూడ, గొప్పతనము కల నిష్పక్షపాత చర్యను గొనియాడుదురు. అందువలన, ఉపాధ్యాయునిలో సత్యము ననుసరించి చర్య తీసికొనవలెనను ఆకాంక్ష ఉన్నదని విద్యార్థులు భావించినట్లయితే, అతని బోధలను, చక్కగా వినయ విధేయతలతో విందురు. ఆ అధ్యాపకుని యందు ఒకరోజు సద్భావముండి, మరుదిన మది లేనట్లయితే, అది ప్రతి ఒక్కరికి ప్రమాదముగా మారి, విద్యార్థుల గౌరవమును మునుపటి రీతిగా సంపాదింపలేడు.

ఒకడు తన ప్రవర్తనను మార్చుకొనుటకు 35 సం॥లు పట్టినచో ఇప్పటినుండి ఒకడు భగవంతునికి ఎట్లు సర్వసమర్పణము గావించుకొనగలడు?

అది త్వరితముగ కొనసాగవచ్చునుగదా. తాను అనుసరించే మార్గమును బట్టి అది యుండును. పిల్లిపిల్ల, కోతిపిల్లల * యొక్క భావవైఖరులను

---

* శిష్యుఁడు ఈ రెండు మనోవైఖరులలో ఏదో ఒకటి గ్రహింపవచ్చునని శ్రీరామకృష్ణుడు నుడువుచుండెడివాడు. పిల్లిపిల్లది క్రియాశూన్యమైన నమ్మకము. తల్లి యెక్కడికి నోట కరుచుకొని తీసుకొని పోవునో అక్కడికి కిక్కురుమనకుండా పోవును. ఇక్కడ పిల్లిపిల్లయొక్క ప్రయత్నము లేదు. (ఇది సమర్పణ మార్గము, నమ్మకమైనది) కోతిపిల్లది క్రియాశీలత్వము గలది తల్లి కడుపును తానే పట్టుకొనును. (ఇది స్వీయ ప్రయత్నముతో సాధించునది:- పురుషకార పద్ధతి.

గురించి చర్చించియుంటిమి జ్ఞాపకమున్నదా? విధేయతగల పిల్లిపిల్ల (పిల్లిపిల్లలలోగూడ క్రమశిక్షణా రాహిత్యము గలవి ఉన్నవి. నేను వానిని జూచితిని) విధేయత గల చిన్నపిల్లలవలె మెలగును. ఆ పద్ధతిని తీసికొన్నచో నీవు వేగముగా పురోగమింపగలవు. "పిల్లిపిల్ల భావమైఖరిని అనుసరించుము." అని చెప్పుట సులభమే. చేయుట అంత సులభము కాదు. పిల్లిపిల్లవిధానాన్ని అవలంబించినచో నీ వ్యక్తిగత ప్రయత్నము అక్కఱలే దనుకోవద్దు. ఎందుకనగా, నీవు పిల్లిపిల్లవుగావు. మానవుల బిడ్డలు పిల్లిపిల్లలుగారు. తమ్ముతామే నమ్ముకొను అలవాటుపడినట్టియు, తమ పని తామే చేసికొనునట్టియు, అసంఖ్యాకములైన మూలపదార్థములు నీలో నున్నవి. అన్ని పరిస్థితులలోను నిన్ను నీవు సరుదుకొని పోగలవు గాని మూలపదార్థములను అధీనములోనికి దెచ్చుకొనుట కష్టతరము. అది చాలా కష్టమైన పని. మొట్టమొదటిది మనస్సుయొక్క అద్భుతమైన కార్యక్రమము. అది ఉండనే ఉన్నది. పరిశీలించుట, విమర్శించుట, విభజించుట, అనుమానించుట. సమస్యాపరిష్కారమునకు ప్రయత్నించుట, "ఈవిధంగా ఉంటే బాగుండునా. ఆవిధంగా బాగుండునా?" అని సమాలోచించుట మనస్సుయొక్క కార్యక్రమము. ఆవిధంగా ఉన్నప్పుడు పిల్లిపిల్ల ఎక్కడున్నది? అది ఆలోచింపలేదు. ఇట్టి కార్యక్రమ మేదియు లేదు గనుక, అది సమర్పించుకొని మెదలకుండా ఉండుట సులభము.

నీవు భగవంతునితో తాదాత్మ్యము చెందు నిముషమువరకు. నీ వేమార్గము ననుసరించినను, వ్యక్తిగత ప్రయత్నము సర్వదా అవసరము. ఆ కడపటి నిమిషములో, జీర్ణవస్త్రమువలె నీ ప్రయత్నములన్నియు నీ నుండి క్రింద పడిపోవును. నీవు నూతనవ్యక్తివగుదువు. నీకు సాధ్యముకా దనుకొన్నది సాధ్యమగుటయే గాక, నీకది తొలగింపరానిదగును. అదియే నీకు శరణ్యము. వేరుమార్గము లేదు.

నీవు శ్రద్ధగలిగినవాఁడవై, శాంతి గలిగి, ఈశ్వరప్రేరిత జ్ఞానముకొఱకు కాచుకొని యుండవలయును, బాహ్యప్రతీకారములవలన ఏమియు జరుగదు; నిరంతరాయముగ, క్రమముగ, పైనుండి వచ్చుకాంతి సమకూర్చు ఈశ్వర ప్రేరిత జ్ఞానమువలన నీవు పనిచేయుట తప్ప మఱేమియు చేయరాదు: ఆలోచింపరాదు; ప్రశ్నింపరాదు; "నే నిది చేయవలయునా?" అని అడుగరాదు. తెలిసికొనుట, చూచుట, అర్థము చేసికొనుటతప్ప. ప్రశ్నలువేయకుండా, అనుమానించకుండా, ఆంతరంగిక నిశ్చయముతో పనిచేయవలయును: ఎందువల్లననగా, ఆ నిశ్చయము నీనుండి వచ్చినది కాదు. అది పైనుండి వచ్చినది. ఇది త్వరగా రావచ్చును; లేక. ఒకడు బహుదీర్ఘకాలము కాచుకొనియుండవలసివచ్చును. అది పూర్వము నీవు సిద్ధపడినదానిపైనను, అనేకవిషయములపైనను ఆధారపడియుండును. అంతవరకు నీవు పట్టుదలతో, కోరుచూ, కోరుచూ, ఉండవలయును. ఓర్పును, ధైర్యమును విడువరాదు. ఆ స్థితి అన్నిటికంటె మించినది. అవసరమైతే దానిని వేయిపర్యాయములు పునశ్చరణచేయుము. బహుశా, వెయ్యవమారు ఫలితమును పొందగలవని నమ్మకముతో నుండుము.

నీవు విడిగా ఉన్న ఒక ముక్కవు గాదు. నీ ప్రస్తుత శరీరము తరచుగా నొక యాదృచ్ఛిక సంఘటన, నీలో జ్ఞానముగల ఆత్మ ఉన్నట్లయితే అది నీ శరీరనిర్మాణమునకు కారణమైతే, నీవు ఖచ్చితముగా యితరులకంటే ఎక్కువగా సిద్ధపడినవాడవయ్యేదవు. అట్లుగాక, తాను ఎక్కడకు పోవుచున్నదీ తెలియక తలక్రిందులుగా శరీరములోబడిన ఆత్మవైతే అజ్ఞానమున మునిగిన చేతన నుద్ధరించుటకు ఎక్కువ పరిశ్రమ అవసరము. ఆత్మపరముగా సిద్ధపడుటన్నది పూర్వజన్మములనుండియు వచ్చును, లేదా, ప్రస్తుత జన్మయొక్క కృషితో వచ్చును; లేక, సంపూర్ణాభివృద్ధిలోని ఒక మలుపుగాచేరి అక్కడి నుండి చివరిమెట్టు అందుకొనుటకు వలయు పరిస్థితులలో నుండవచ్చును. కాని నీవు వేయి జన్మలు ఎత్తిన యనంతరమే ఈ దశకు చేరియుందువు.

ఫిబ్రవరి 12, 1951

"భగవత్సాక్షాత్కార మింకను ఏల కలుగలేదు?" అని నీవుఅడుగుదువు. ఏలననగా, నీవు తయారుగాలేవు. క్రిందబడిన ఒక చిన్న బిందువు నిన్ను పాటపాడునట్లును నృత్యముచేయునట్లును, కేకలు వేయునట్లును, చేసినట్లయితే, ఇక సంపూర్ణమైనదంతయు క్రిందకు దిగివచ్చిన ఏమి సంభవించును? తగిన స్థిరత్వము, విశాలత్వము శరీరములోను, ప్రాణములోను, బుద్ధిలోను లేనివారికి మేమిట్లు చెప్పుచున్నాము: — "క్రిందికి లాగవద్దు" అని. దీని యర్థమేమన, "దైవశక్తులను బలవంతముగా నీవైపునకు లాగ ప్రయత్నింపక, శాంతి స్థిమితములతో నిరీక్షించుము," అని. ఆ 'దిగుదలను, సామాన్యులు భరింప సమర్థులుగారు. అయితే, అవసరమైన పునాదిని సాధించినవారికి, "ఆఁ! ఆకాంక్షించుము, క్రిందికి లాగుము" అనిచెప్పుదుము, వారు దానిని గ్రహింపగలరు. దైవమునుండి క్రిందికిదిగు శక్తులవలన తలక్రిందులుగారు."

(సంభాషణలు 1929, పేజి 14.)

దైవశక్తి ప్రజలను ఎందుకు తలక్రిందులు చేస్తుంది?

అది వారికి అత్యధికముగా మించినబలము గలదైనందున. ఒక గొప్ప తుఫానుమధ్యలో నున్నట్లు ఊహించుకోవచ్చును. మహావేగముతో వీచు గాలుల కెదురు నీవు నిలబడలేవు. అది నిలిచిపోవునంతవరకు నీవు క్రిందపడుకొని వేచియుండవలెను. దైవశక్తులయొక్క బలము తుఫానుగాలులుకంటె వేయి

మడుంగు లెక్కువ. నీ యందు సువిశాలమైన ఆహ్వానవేదిక, మిక్కిలి దృఢమైన శాంతియను పునాది, సమస్థితిగల ఆత్మ, అంతరంగమున నెమ్మది లేకపోయినట్లయితే, తీవ్రవేగముగల గాడ్పులవలె అవి నిన్ను ఎత్తుకొనిపోవును. నీవు వాని నాపలేవు. ప్రకాశము విషయమునగూడ నంతే, సూర్యుని చూచి నప్పుడు కొందఱికి కళ్ళలో నొప్పి కలుగును. నల్లటి సులోచనములను వారు ధరించవలసివచ్చును; ఎందుకనగా సూర్యకాంతిని వారు భరింపలేరు. కాని, ఇది సూర్యుని కాంతిమాత్రమే. దివ్యచేతనకు సంబంధించిన ప్రకాశము, అత్యధిక ప్రకాశమానమైనది. సూర్యునికాంతి దానిముందు నల్లని చుక్కవంటిది దానిని చూచి భరించుటకు, బలమైన నేత్రములు, దృఢమైన మేధ కావలయును. అందులకు తాను సంసిద్ధుడై యుండవలెను. విస్తార ప్రశాంతిని స్థాపించుకొనిన వాడై యుండవలెను. అట్టి ప్రశాంతస్థితి యున్నప్పుడు, తుఫాను వచ్చినప్పుడు, గొప్పసాంద్రతగల ప్రకాశము వచ్చినప్పుడు, నిశ్చలముగా నిలబడి, క్రిందబడ కుండా తట్టుకొని యుండునంతధీమా ఏర్పడును. అయితే, పదిలక్షలమందిలో ఆవిధముగా జేయగలిగినవాడు ఒక్కడును లేడు. ఆంతరికమైన ఆధ్యాత్మికాను భవపు రుచి ముందుగా అనుభవించినవాడే, ఇది ఏమిటో తెలిసికొనగలడు. నీవు నీ అంతరాత్మలోనికి ఎఱుకతో ప్రవేశించినను, అది నీకు దిగ్భ్రాంతిని కలిగించును. అది నీ అంతరాత్మయగు చైత్యపురుషుడేకనుక నీ యందుబాటులో నున్నదే. అయినను, నీ బాహ్యజ్ఞానమునకు దానికి ఎంతోభేదమున్నది. మొట్టమొదటగ నీవు దానిలో ప్రవేశించినపుడు నిజముగా నీకది దిగ్భ్రాంతినే కలిగించును. అది అతి ప్రకాశమానమైన సూర్యునికాంతికంటెను అనంతమైన, అత్యధికమైన కాంతి గలది. మనిషికి అందుబాటులోనున్న భగవంతుడు, అని యీ చైత్యపురుషుని పిలువవచ్చును.

ముఖ్యముగా ఒకనికి ఆధ్యాత్మికగుఱువు లేనట్లయితే అతడు ఆధ్యాత్మికమార్గమునకు తయారుగానున్నాడ నుటకు ఏమైనను గుర్తులుగలవా?

ఉన్నవి. అన్ని పరిస్థితులలోను ఆత్మయందు పరిశుద్ధమైన సమత్వము గలిగియుండుట అత్యంతముఖ్యమైన గుర్తు. అది త్రోసివేయరానిది. నిశ్చలముగను, స్థిరముగను, శాంతియుతముగను ఉండి అది గొప్ప శక్తియొక్క అనుభవమును భాసింపజేయును. సోమరితనమువలన గలుగు నిశ్చలత దది. ఏమి సంభవించినను, జీవితములో అతిభయంకరమైనట్టిది యేర్పడనున్న సమయములోకూడ, నీ యేకాగ్రతవలన సాధించిన శక్తి నిన్ను స్థిమితముగానుంచును. ఆ భావము నీలో గలిగించును. అదియే మొదటి చిహ్నము.

రెండవ చిహ్నము: నీవు నీ సాధారణమైన, సహజమైన ఎఱుకలో ఖైదు చేయబడి యున్నట్లు భావింతువు. అది అతి దృఢమైనదిగాను, ఊపిరాడనిదిగాను, భరింపరానిది గాను ఉండి బయటికి రావలయునన్న, ఇత్తడి గోడకో రంధ్రము చేసికొని రావలసినంత కష్టమనిపించును. ఈ బాధ భరింపరానిదగును. గొంతుక నులిమినట్లుండును. దీనినుండి బయటపడుటకు, ఆంతరంగికప్రయత్నమున్నను, నీవు దానిని పడగొట్టుకొని వెలుపలికి రాలేకున్నట్లు భావన కలుగును. నీ లోపల చేతనకు వెలుపలి భాగమున గల గది చాలా ఇరుకుగా నున్నట్లు తోచును. సామాన్యజీవితము, సామాన్యకార్యకలాపము, సామాన్యసంబంధబాంధవ్యాలు, యన్నియు అల్పమయినవిగా భావనకు వచ్చి. వానిని పగులగొట్టుకొని బయటపడవలయునను సంకల్పము కలుగును.

ఇంకను మఱియొక చిహ్నముగలదు నీవు ఏకాగ్రతతోకూడిన ఆకాంక్ష గలిగియున్నప్పుడు ఏదో ఒక శక్తి క్రిందికి దిగివచ్చినట్లును, ప్రత్యుత్తరము నీ కందినట్లును ఉండును. ఒకానొక కాంతి. సమాధానము, శక్తి వెనువెంటనే - ఎక్కువకాలము ఎదురుచూచి కాలమును వృథాచేయవలసిన అవసరములేకయే—దిగివచ్చినట్లు భావింతువు. అది అంతరములోని ఆకాంక్షకు పిలుపునకు వచ్చు జవాబు. ఊర్ధ్వచేతనలో ఒకానొక సంబంధము నెలకొల్పబడినదనుటకిది సూచన.

శక్తి క్రిందికి దిగివచ్చినప్పుడు, ఒక తారుమారు స్థితి యేర్పడినట్లయితే, ప్రాణకోశము సిద్ధముగా లేదని, దానిని బలవంతముగా నైన సిద్ధపడునట్లు చేయవలయునని అర్థము కాదా?

నీ వెట్లు దానిని బలవంతపెట్టగలవు? అది నీ చేతివ్రేళ్ళనుండి జారి పోవును. నీ సంకల్పము దానిని పట్టుకొన్నట్లు భావించునుగాని అది చిక్కక తప్పించుకొనిపోవును. దానిని అదుపులో బెట్టుకొనుట కష్టము. బలవంతము చేయుట దేనికి? తయారుఅగుటకా? ఇంతకు నీ ప్రయత్నమువలన జరుగున దేమిటి? అది సోమరి అవుతుంది ఒక మూలలో దాగికొంటుంది. అక్కడి నుండి ఏమాత్రమును గదలదు. తుఫాను దాటిపోనీలే అనుకొంటుంది. దానికి దైవచేతనతో సంబంధముకలుగుట ఒక తుఫానువంటిది. ఈ ప్రమాదము దాటి పోగానే ప్రతీకారచర్య తీసికొని, "ఇదిగో, ఇక్కడే ఉన్నాను. ఇక నావంతు" అంటుంది.

నీవు తారుమారు అయినావంటే, ప్రాణకోశమును సిద్ధముచేయుటకు, నీ వింకను ఎక్కువపని చేయవలసియున్నదని దాని అర్థము, ఎక్కడనో బలహీనత ఉన్నదని దాని యర్థము. కొందఱికి ఆ బలహీనత మనస్సులో నుండును. ఫ్రాన్సులో జంత్రవాద్య నిపుణుడైన ఒక బాలుని నే నెఱుగుదును. అతడు ఫిడేలును అద్భుతముగా వాయించగలడు. అయితే, అతని మెదడు పెద్దది గాదు. అది వానికి సంగీతములో సహాయము చేయగల దంతే. అంతకంటె ఎక్కువ చేయలేదు. తన పరిచ్ఛిన్నాత్మయందు అపరిచ్ఛిన్నాత్మా నుభవము—నీతడు పొందేవాడు. అది యథార్థమైనదే. కాని, ఇది ఆ పిల్ల వానిని తారుమారు చేసినది. దానినుండి ఏమాత్రము ప్రయోజనము పొందక లేకపోయెను. వాడు తన ఫిడేలునుకూడ వాయించుట మానుకొనెను. ఆ

యనుభవమును రానీయకుండ చేసికొనవలసివచ్చినది. ఎందుకనగా, వానికది తలకు మించిన పని. ఇది మనస్సు బలహీనతకు నిదర్శనము.

అతడు భావించుట మాత్రమే కాదు. నిజముగనే అట్టి యనుభవమును పొందెను. సాధారణముగా భావము కలుగుటకు ముందు అనుభవము కలుగవలెను. అనేకమంది మాటలతోనే ఆలోచింతురు. రెండు పరస్పరవిరుద్ధ భావములను ఏకత్ర గాంచినచో వారర్థము చేసికొనజాలరు. అనుభవముపట్ల ఆవిధముగా జరుగదు. అర్థము చేసికొనగలరు. కనుక మనస్సు విశాలమైనది, మృదువైనది, నీరవమైనదిగా ఉండవలెను.

నీవాలోచించినదంతయు నీ చేతివేళ్ళగుండా జారిపోతున్నదని భావింపక, నీవు ప్రశాంతతతో అనుభవముయొక్క సారమును నీ మెదడు అర్థముచేసికొనునంతవరకు కాచుకొని యుండుము.

ప్రాణకోశమున బలహీనత గలవారు అనేకులున్నారు. వారికి అనంత దివ్యచేతనకు సంబంధించిన శాశ్వతత్వభావము వారి చిన్న వ్యక్తిత్వములో వారి అల్పబల సంస్థితియందు గలిగినట్లయితే, అది మొదట వారికున్న భావముతో భేదించునుగనుక వీరి కించుకేనియు అర్థముగాదు. వారు జబ్బుపడుటయో, పిచ్చిపిచ్చిగా మాటలాడుటయో, కేకలువేసి నృత్యముచేయుటయో సంభవించును.

అయితే, నీవు సంపూర్ణముగా నిజాయితీ గలవాడవయితే, నిన్ను నీవు విశదమైన చూపుతో చూచుకొన్నట్లయితే, ఇది నీపట్ల జరుగదు. ఎందుకనగా తనలోఉన్న అహంభావము, అత్యాశ, మీదుమిక్కిలి తనలో సమస్థితి లేకపోవుట, తనలోని ఒకభాగమును మఱియొక భాగముయొక్క ప్రయోజనము

కొఱకు నిర్లక్ష్యముచేయుట, ఇవన్నియు, తలవనితలంపుగా వచ్చే అవిధమైన అనుభవమునకు కారణములు.

సంపూర్ణముగా సోమరితనముగల శరీరముతో, నిదురించే ప్రాణకోశముతో, నిర్భాంతపోయిన మనస్సుతో, యోగసాధనలో ముందడుగు వేసినా మనే వారు తమకు పైయనుభవము కలిగినప్పుడు ఖండితముగా దలక్రిందులైపోదురు. వారు తమ మెదడును గోల్పోదురు. శ్రుతిమించి ప్రవర్తింతురు, లేక ఏదే నొక దురదృష్టకరమైనది వారికి సంభవించును. దృఢమైన సమతూకములో గల శరీరము, బాగుగా అధీనములోనున్న ప్రాణకోశము, తర్బీదైన గ్రహణశక్తి గలిగిన తార్కికమనస్సు గలిగి, ఆకాంక్ష పెంచుకొన్న స్థితిలో నీకు జవాబు వచ్చినయెడల, అప్పుడు నీ వ్యక్తిత్వము, సుసంపన్నము. సువిశాలము ఆశ్చర్యకరము నగును. నీవు చక్కని ఆనందమును బొందుదువు. నీ గిన్నెనిండుగా నున్నది కాబట్టి అది తొణకదు. పాత్రను చక్కగా బట్టుకొనుట నేర్వని వెకిలివాని పాత్ర తొణకకమానదు. నీవు శ్రద్ధతీసుకొనకపోతే, చిన్నదైన నీ పాత్ర మఱీచిన్నదై అకస్మాత్తుగా ఘాటైన దానితో నిండినపుడు అంతయు క్రిందికి పొర్లి పోవును.

ఎఱుక తన వెలుపటనున్న సంకుచితపు అచ్చులో బంధింపఁబడినట్లు తెలిసికొన్నప్పుడు ఏమి చేయవలయును ?

నీవు ముఖ్యముగా కోపగించుకొనకూడదు. నీవు కోపగించుకొని నట్లయితే, అలసట, నీరసము చెందగలవు. ప్రయోజన ముండదు. ఆకాంక్షయొక్క అన్ని శక్తులను కూడగట్టుకొని ఏకాగ్రత వహించవలెను. నీలో నున్న అగ్నిజ్వాలను నీ వెఱిఁగి యున్నట్లయితే, నీలో బలముగా ఉన్నవాని నన్నిటిని ఈ జ్వాలకు ఏకాగ్రత అనే పిలుపుద్వారా ఆహుతి చేయవలయును. నీవు పిలుచుచు

నిశ్శబ్దముగ నెంతకాల ముండగలవో అంతకాలము ఉండవలయును. జవాబు రాగలదనే గాఢనమ్మకముతో నుండవలయును, ఆకాంక్షతో, ఏకాగ్ర చిత్తముతో, అంతరంగములోని అగ్నిజ్వాలతో ఈ దశలో నున్నప్పుడు పైన ఉన్న కప్పు మీద. ఒత్తిడి తెమ్ము. అది క్రోధముతో గాదు, — పట్టుదలతో, ఆందోళన పడకుండ, కోపపడుట గాని, రెచ్చగొట్టుటగాని ఏమియు లేకుండ ప్రయత్నింపుము. నీవు చక్కని ప్రశాంతతో పిలుపు నందించి ముందుకు సాగవలెను—

ఆ ప్రయత్నము మొట్టమొదటి దఫా జయము పొందదు. ఎన్నిమారు లవసరమో అన్నిమారులు నీవు ఈ సాధనను చేయుచుండవలెను. ఆకస్మికముగా నొక దినము జయింతువు. సముద్రమువంటి గొప్ప వెలుగులో నీవు ప్రవేశింతువు.

నీవు పోట్లాడినను, ఆందోళన పడినను, గిజగిజ తన్నుకొనినను, ఏమియు గ్రహింపలేవు. ఆవేశపడినచో తలనొప్పి తప్ప మతేమియు రాదు.

అవును, అంతే, అకాంక్ష గలిగి, ఏకాగ్రచిత్తముతో, ప్రశాంత వాతావరణమునందు, నీ యాత్మగతమైన అగ్నిజ్వాలను ఎఱిఁగి నీకు సాధ్యమైన వాటి నన్నిటిని దగులఁ బెట్టుము. అది పైకి, పైపైకి నాలుకలు చాపుతూ ముండును. అప్పుడు సంపూర్ణ జ్ఞానముతో నిదానముగా ముందుకు నెట్టుకొని పొమ్ము. నీవు తథ్యముగా నొకనాడు జయింతువు.

(తల్లి ఇంకను చదువుచున్నది) "దైవము వైపు తిరిగిన కొందఱి విషయములో వారి జీవితమునుండి సర్వ స్థిర చరాస్తులు, వారు ప్రేమించిన వ్యక్తితో సహా తొలఁగింప బడును".

ఇక్కడ మనము ఒక పెద్దసమస్యలో ప్రవేశించుచున్నాము. ఒకనికి ఏది మంచిది, ఏది కాదన్న విషయము వాని పరిణతిజెందిన జ్ఞానమునకు, దైవ జ్ఞానమునకు ఒకటి కాదు. ఏవి మంచివిగా, అనుకూలమైనవిగా గనఁబడునో అవి ఆధ్యాత్మిక దృష్టితో నీకు సర్వత్రా మేలుచేయునవి గావు. ఏది నిన్ను త్వరిత ముగా గమ్యమునకు చేర్చగలదన్న విషయమున నీ దృష్టికిని, భేదముండుననియు అది అర్థము చేసుకో జాలమనియు ప్రారంభము నుండి నీవు గుర్తించుట అత్యంతా వశ్యకము. కావుననే మొదటి నుండియు "అది బాగున్నది, నే నన్నటిని ఆమో దించుచున్నాను. తరువాత నే నర్థము చేసికోగలను," అని నీకు నీవు చెప్పుకొను చుండవలెను. యోగమును చేపట్టకముందు జీవిత సౌలభ్యము గలిగియుండి, యోగమును ప్రారంభింపఁగనే ముఖ్యముగా అనుబంధము గలిగియున్న పరిస్థితులు ఇంచుమించుగా నిర్దయతో త్రుంచివేయఁబడుట అనేకుల విషయములో సంభవించి నది. అందువలన వారు బాధలకు గుఱియగుదురు. ఇది ఒప్పుకొను ధైర్యము వారికి లేదు. అందుచే వారిట్లు భావింతురు : "ఏమిటిది ? నేను యోగ్యుడై నను నిర్దయగా చూడబడినాను".

న్యాయమును గుఱించి సర్వమానవ లోకముయొక్క అభిప్రాయమున్నది. "నీవు మంచివాడివిగా నుండ ప్రయత్నించితివి. కాని, ఎన్నో కష్టనష్టములకు గుఱియైతివి. నీవు ప్రేమించినవన్నియు నీనుండి తొలగింపఁబడినవి. అనుభ వించిన అన్ని సంతోషములు నీకు దూరముచేయఁబడినవి. నిన్ను ప్రేమించిన వారందరు నిన్ను విడనాడిపోయిరి. మంచితనము కొఱకు నీవు చేసిన ప్రయత్న మంతయు వృథాయై పోయినది." నీవు ఈ నీ తర్కవాదమును ఇంకను ఎక్కువ కాలము కొనసాగించితే, ఆకస్మాత్తుగా అసలు చీడపురుగు దృష్టికి తగులును. ఏమంటే, నీ స్వార్థప్రయోజనము కొఱకు నీవు యోగమును చేపట్టితివి. స్వార్థ ప్రయోజన దృష్ట్యా నీవు మంచితనముగా నుండ దలంచితివి. నీ పరిస్థితులు బాగు పడుననని, నీ విజ్ఞానమునకు నీవు సన్మానింపఁ బడుదువని, తలంచితివి. అది జరుగలేదు. నీకు ఇవ్వవలసిన మంచి పాఠమిది, ఎంతకాలము నీ సాధన కోరి

కను దాచిపెట్టుకొని ఉండునో, నీ హృదయములో ఎంతకాలము దైవముతో బేరమాడుట ఉండునో, అపుడు నీకు గట్టిగా బుద్ధి చెప్పుటకు బాధలు వచ్చి నిన్ను దెబ్బలు కొట్టును. అప్పుడుగాని, షరతులు లేని, బేరములు లేని, ఎఱుకలోనికి నీవు మేల్కొనవు.

నేను యోగము ప్రారంభించి నప్పటినుండి నాకు సంబంధించిన పనులన్నియు పూర్వముకంటె మేలుగా సాగుచున్నవి. అందువలన నా తుది నిర్ణయము ...

బహుశా నీ ఆకాంక్ష నిజముగా నిజాయితీ గలది, పక్షపాత రహితమైనదిగా నుండి యుండవచ్చును. అట్టి సందర్భములో ఆ విధముగా జరిగి తీరవలసినదే.

ఒకఁడు దుష్టుఁడుగా నుండి అకస్మాత్తుగాఁ బరివర్తన చెందనిశ్చయించెనేని, తరువాత ప్రతి నీచమైన పనిని చేయునపుడును హెచ్చరికగా అంతర్వాణిని వెంటనే వినునా ?

మార్పు, లేక, లోపలి పరివర్తన తీసికొన్న రూపముపైన అన్నియు నాధారపడియుండును. మార్పు అకస్మాత్తుగా వచ్చినదైతే, ఒకఁడు వెంటనే అంతర్వాణిని గుర్తెఱుఁగును; అటుగాక, అది క్రమక్రమముగా జరిగినట్లయితే, ఆ ఫలితముకూడ క్రమక్రమముగానే జరుగును. అది సంపూర్ణముగా ఒక్కొక్క వ్యక్తి పరిణతిమీఁద ఆధారపడి ఉండును. ఇదమిద్ధముగా దేల్చి చెప్పుటకు సాధ్యము గాదు. ఒక విధముగా చీల్చుకొని వచ్చినట్లు వెలుఁగు సంభవించినట్లయితే, ఒకడు వెంటనే అట్టి లోపలి హెచ్చరికను పొందవచ్చును. అది గతకాల విషయములను గూడా జ్ఞప్తికి దేవచ్చును, అది యెట్లన, గతించిన క్రియలను

ఆలోచించునపుడు, గతములో దా నెట్లున్నది, ప్రస్తుత మెట్లున్నది, వివేచించినట్లు విశదమగును. అది యటులుండ, ప్రతి పర్యాయము, వ్యక్తిలో నిజమైన మార్పు ద్యోతకమగును; ప్రతి పర్యాయము ఒక్కొక్క పొరపాటును అధిగమించును, అన్ని విషయములను గుఱించి విశదమైన దృష్టి కలుగును. ఒక నల్లటిచుక్క తెరపై జరిగిపోతున్నట్లు, దాని పుట్టుక, కారణ కార్యముల వివరణ సహజముగా దోచినట్లగును. నీకు ఖచ్చితమైన జ్ఞాపకశక్తి ఉన్నట్లయితే, కొంతకాలముపాటు, అనఁగా ఏ పది సంవత్సరముల కాలమో, నీ పరివర్తనకు ప్రయత్నమును — నిన్ను అధికాధికముగా నీవు సమర్పణ చేసికొనుటను — చేసి ఉన్నట్లయితే, నీవు నీ పూర్వస్థితిని స్మృతికి దెచ్చుకొనగల్గి యుండినట్లయితే, నీవు "ఓ! అది సంభవము కాదు, నేనా విధముగా నుండలేను" అందువు. అయినా నీ వావిధము గానే ఉంటివి. ముందున్న స్థితికి ఇప్పటి స్థితికి మధ్య ఎక్కువ కాలము గతించి నందున నీవు అదే మనిషివని నమ్మజాల కున్నావు. ఇది నీవు నిజముగా అభివృద్ధి చెందితివనుటకు నిజమైన నిదర్శనము.

## ఒకఁడు యథార్థముగా ఆధ్యాత్మిక పథమును ప్రవేశించితినని ఎప్పుడు చెప్పఁగలడు ?

మొదటి చిహ్నము (అది అందఱికిని సమానము గాదు). క్రమపద్ధతిని అన్నియు నీకు అముఖ్యములుగాఁ దోచును. పరిస్థితులు ఆ విధముగా ఏర్పాటైనప్పుడు, నీ సంపూర్ణజీవితము, నీ సర్వకార్యములు, నీ అన్ని వ్యవస్థలు అట్లే కొనసాగుచుండును. కాని, అవి అన్నియు నీకు అముఖ్యములుగా దోచును. నీ యునికికి ఇది అర్థరహితముగా తోచును. ఇదియే మొదటి చిహ్నము.

మఱియొకటియు నుండవచ్చును. ఉదాహరణకు ప్రతిదీ వేరువిధముగా, జీవితము వేరు విధముగా నున్నట్లు కానవచ్చును. పూర్వములేని వెలుతురు మనస్సులో ఇప్పుడు గోచరించును. ఇదివరకు లేని శాంతి ఇప్పుడు హృదయములో

నున్నట్లు తెలియబడును, ఇందు మార్పు కనఁబడు చున్నది. అయితే, ప్రత్యక్ష మైనమార్పు తరువాత వచ్చును. ఒకడు ఆధ్యాత్మిక జీవితమును చేపట్ట నిశ్చయించి నప్పుడు పరివర్తనసమయములో దటాలున వచ్చునది తప్ప మొట్టమొదటి మెట్టులో మార్పుచాల అరుదుగావచ్చును. ఒక్కొక్కప్పుడది మిక్కిలి కాంతిమంతముగా ప్రారంభించును. మహానందము నీలో ప్రవేశించును. అయితే సర్వ సాధారణముగా ఇది వెనుకకు దిగజారిపోవును. ఎందువల్లననగా, నీలో నింకను అనేక అపరిపక్వతలు విడనాడకుండా ఉన్నవి. అది విసుగుదలకాదు, ఏవగింపు కాదు; అయితే, అన్నియు నీకు అముఖ్యములుగా దోచినందున, వానిపై శ్రద్ధవహించుట నిజముగా శ్రమకు దగినదికాదని భావింతువు. ఉత్సాహకర మైన, లేక నిరుత్సాహకరమైన, కొన్ని శారీరక పరిస్థితులలో నీవున్నపుడు నీవు, "అది అపుడు అంత ముఖ్యముగా కనుపించెనుకాబోలు. ఇపుడు దానికి విలువ లేనేలేదు" అని తలంతువు. ఇపుడు నీవు నిజముగా మరొక వైపు నకు దిరిగియుంటివను భావన నీకు కలుగును.

ఆధ్యాత్మిక జీవితమునకు చిహ్నము. ఒక మూల కూర్చుండి ధ్యానము చేయుట అని కొంద అనుకొందురు. అది సర్వసాధారణమైన భావము. కఠి నముగా విమర్శించుట నా తలంపుకాదు. అయితే, ఎక్కువ పాలు తమ శక్తిని ధ్యానమునందు ఉపయోగించువారు, గంట కాలములో ఒక్క నిముషమైనను ధ్యానముచేసినారని నే ననుకొనను. నిజముగా ధ్యానముచేయువారు, దానిని గురించి మాట్లాడరు. వారి .కది కడుసహజమైనది. అట్లది వారికి సహజమైనప్పుడు దానిని గురించి గొప్ప ఏమీ లేనప్పుడు. తాము నిజముగా అభివృద్ధిపథములో నున్నట్లు తమలోతాము భావించుకొనవచ్చును, కాని, ఎవరు దానినిగురించి ప్రసంగింప పూనెదరో, అది ఇతరమానవులకంటే ఆధిక్యతను తమకు చేకూర్చిన దని భావింతురో అట్టి వారు తమ కాలమంతయు చాలవరకు జడస్థితిలో వెళ్ళబుచ్చి రనుట నిశ్చయము.

ధ్యానము చేయుట చాలా కష్టమైనపని. అనేక రకములైన ధ్యానము లున్నవి. నీవొక భావమును గైకొని, ఒక నిర్దిష్ట ఫలితమును సాధించుటకు దాని ననుసరింతువు. ఇది క్రియాత్మకమైన ధ్యానము. ఒక సమస్యను పరిష్కరింపదలచుకొన్నవారు, లేక ఏదేని వ్రాయదలంచుకొన్నవారు, తాము ధ్యానము చేయుచున్నామని తెలియకయే ధ్యానమును చేయుచున్నారు. ఏ భావమును అనుసరింపకుండానే ఇతరులు కొందరు తాము నిర్ణయించుకొన్న ఏ బిందువుపైననో ఏకాగ్రతను తీవ్రముచేయుటకు దృష్టిని కేంద్రీకరింతురు. మానసిక, ప్రాణిక, శారీరక సంబంధమైన ఏ బిందువుపైనైనను ఏకాగ్రతవహించు శక్తిని సాధించినట్లయితే, ఒకానొకక్షణములో నీవు దానిని దాటిపోయి వేరొక ఎఱుకలోనికి ప్రవేశింతువు. ఇంకను మఱికొందరు తమ తలనుండి అన్ని కదలికలను, భావములను, ప్రతిభావములను ప్రతీకారమును, తరిమివేసి, ఒకానొక నిజమైన, ప్రశాంతస్థితిని చేరుకొన యత్నింతురు. ఇది చాలా కష్టమైనపని. ఇరువదియైదు సంవత్సరములు ప్రయత్నించి అపజయము నొందినవార లనేకులున్నారు. ఇది అబోతుకోడెను కొమ్ములతో పట్టుకొన్న విధముగా నుండును.

మఱియొక విధమైన ధ్యానముగలదు. దానిప్రకారము ఆలోచనలను దొలగింప ప్రయత్నము జేయకయే, ఎంత ప్రశాంతముగా నుండవలయునో అంత ప్రశాంతతో నుండి ధ్యానముద్ర వహింపవలెను. ఎందుచేతనంటే, ఆలోచనలు యాంత్రికముగ నుండునవి. వానిని దొలగింపవలయునన్న అనేక సంవత్సరముల కాలము పట్టును; అందుచే ఈ బేరములో ఫలితము దక్కునని నమ్ముటకు లేదు. దానికి బదులుగా, నీ జ్ఞానము నంతటిని కూడగట్టుకొని, నిశ్శబ్దముగాను, ప్రశాంతతతోను, బాహ్యవిషయములు నీ కక్కఱ లేనట్లు సంబంధము లేకుండ ఉండవలయును. పిమ్మట అకస్మాత్తుగా నీలోని ఆకాంక్షజ్వాలను ప్రజ్వరిల్ల జేయుము. దానితో తాదాత్మ్యమును జెంది దానితో పాటుగా నీ యెఱుకయందు, ఉన్నతోన్నతస్థాయి నందుకొని ఇక వేరొండెద్దియు నాలోచింపక మౌనమువహింపుము. ఫలమును గుఱించిగాని, ఏమి

జరుగునో, ఏమి జరుగదో అనిగాని, యాలోచింపకుము. ఎడతెగని ఏకాగ్రతతో, ఆకాంక్షారూపమైన ఉల్లాసము అంతకంతకు ఉన్నతోన్నతస్థితికి జేరుకొనుటయే కావలసినది. అపుడు, ఏమి జరిగినను అది నీకు శుభప్రదముగా నుండునని ఖండితముగా జెప్పుచున్నాను. ఈ విధముగా జేసినట్లయితే, నీకున్న యవకాశములలో అంత్యంతాధికమైనదానినే నీవు సాధింతువు. ఈ యవకాశములు, వ్యక్తినిబట్టి వివిధములుగా నుండును. అప్పుడు, ప్రశాంతతతో నుండ బ్రయత్నించుట, దృశ్యమానమైనవాని వెనుకకు బోవుట, బదులుపలుకు శక్తిని ఆహ్వానించుట, నీ ప్రశ్నలకు జవాబులనిమిత్తము కాచుకొనియుండుట మొదలైన అన్నిశ్రమలు, అసత్యమైన ఆవిరివలె అదృశ్యమై పోవును. ఈ జ్వాలలో నెలుకగలిగిజీవించుటయందు జయము నీవు పొందినట్లయితే, క్రమక్రమాభివృద్ధిని జెందే ఆకాంక్షలో, వెంటనే ఫలితము రాకపోయినను, కొంత కాలమునకు ఏదో ఒకటి సంభవించుట నీవు చూడగలవు.

ఇచట మేము కొనసాగించు సామూహిక ఏకాగ్రతయందు, దేనిపైన మాఏకాగ్రత కేంద్రీకృతము గావలెను?

ఎవరైనను, ఈ ఏకాగ్రత అనగా నేమియో, ఎందుకు దానిని మనము గ్రహించితిమో చెప్పగలరా? ఈ ప్రశ్న ముఖ్యమైనది, అందరికి సంబంధించినది. ఈ ఏకాగ్రతకు, ధ్యానమునకు గల భేదమేమిటో ఎవరైనను జెప్పగలరా? ఎందుకు మనము దానిని చేపట్టుచున్నాము? అందువలన ఏమి సంభవించును?

మేము మా దైనందిన కృత్యముల నన్నిటిని సమర్పణము గావింతుము.

అవునుగాని, అది వ్యక్తిగతవిషయము, సామూహికముగా ఈ ఏకాగ్రత ఎందుకొఱకు? (అతడు మార్గములోనే యున్నాడు. గమనింపుడు, మొదటి అడుగులో సగము వేసినాడు)

మేము మా బలహీనతలపై ఏకాగ్రతను వహించి
అవి అదృశ్యమగుటకై ఆకాంక్షింతుము.

అదియును వ్యక్తిగతమైన అంశమే.

ధ్యానములు మొదట అక్కడ జరుగుచుండెడివి. (ఆశ్రమములో * ) ఉదయ, సాయంత్రములందు ధ్యానము చేయు నియమ ముండేటప్పుడు, ప్రతి ఒక్కరి ఎఱుకను సమైక్యపరిచి, నా కెంతవరకు సాధ్యమో అంతవరకు దానిని దైవము దెసకు దీసికొనిపోవుట నా పనిగా నుండెను. ఎవరు ఆ చైతన్యమును అనుభవమునకు దెచ్చుకొనిరో వారు దానిని అనుసరించిరి. ఆకాంక్షతో దైవము దెసకు ఎక్కిపోవలయునని చేయు మామూలు ధ్యానమిది. ఇక్కడ, ఆట స్థలములో జరిగెడి పని, ఇక్కడున్న వా రందఱిని సమైక్యపఱచి, ఉన్మీలితులను గావించి, దైవిక శక్తిని వారిలోనికి దింపుట. ఇది దానికి వ్యతిరేకము. అందువలన, ఇది దానికి ప్రత్యమ్నాయము గాదు. అట్లే, అది దీనికి ప్రత్యామ్నాయమనియు చెప్ప వలనుపడదు. ఇక్కడ జరుగునది ప్రత్యేకత గలది. అక్కడి ధ్యానములో,— (ఆశ్రమమందుఁ జేయునది) హాజరైన వా రందఱి ఎఱుకను సమైక్యపరిచి, ఆకాంక్ష బలముతో భగవంతుని దెసకు ఎత్తి ప్రతి ఒక్కరిని

---

* ఆశ్రమ భవనములో' చాలకాలము ధ్యానము జరుగు చుండెడిది. శిష్యుల సంఖ్య పెరుగుట చేతను, ఆటలు ప్రాముఖ్యము వహించుట చేతను, సామూహిక ఏకాగ్రతలు ఆశ్రమ ఆటస్థలమున ధ్యానములకు బదులుగా జరుగుచువచ్చినవి.

కొంచెము అభివృద్ధి నందునట్లు చేయుట, ఇక్కడ మిమ్ములను, మీ రేవిధముగా ఉన్నారో ఆ విధముగానే తీసికొందును. మీలో ప్రతిఒక్కరు, "మేము సంపూర్ణ ముగ దిన కర్మములలో నుంటిమి. శారీరకముగాఁ బని తొందరలో గడిపితిమి. ఇదిగో శరీరము, మా ప్రవృత్తుల నన్నిటిని, అవి యెట్లున్నవో ఆ విధముగనే, మే మెట్లున్నామో ఆ విధముగనే, మీకు సమర్పించుకొనుచున్నాము". అని చెప్పుచుందురు, నా పని వాని నన్నింటిని సమైక్యపరుచుట, ఒక క్రమబద్ధమైన ముద్దగా జేయుట, ఈ సమర్పణకు (ప్రతిఒక్కరు వారివారి పద్ధతిలో చేయుదానికి జవాబుగా, వారి ఎఱుకను వికసింపఁజేయుట, గ్రహణశక్తిని విశాలము చేయుట, సమైక్యపరుచుట, దివ్యశక్తిని క్రిందికి దించుట నా పనియైయున్నది. ఆ క్షణ ములో మీలో ప్రతిఒక్కరు నిశ్శబ్దముగాను, శ్రద్ధగాను ఉన్నచో, ఏదో ఒకటి మీరు గ్రహింతురు. మీకది తెలియక పోవచ్చును. కాని నిశ్చయముగా మీరు ఏదో కొంత గ్రహింతురు.

1964 మార్చిలో ఈ క్రింది ప్రశ్న తల్లికి వేయఁబడినది.

"భౌతికముగా మీరిపుడు ఆటస్థలములోని ఏకా గ్రత కార్యక్రమాలకు హాజరగుట లేదుగదా, మరి యీ స్థితిలో జరుగున దేమి ?

ఆశ్రమవాసులు కొంత అభివృద్ధిని సాధించినారు. కాబట్టి, తాము పొందు సహాయముయొక్క, శక్తియొక్క అనుభవమును వారు గ్రహించుటకు భౌతిక ముగా నేను హాజరు కావలసిన పనిలేదు.

* * *

ఫిబ్రవరి 15, 1951.

తల్లి ఏప్రిలు 21, 1929 సంభాషణ ప్రారంభములోని స్వప్నాలను దృశ్యములను గుఱించి జదువుచున్నది.

తరచుగా నాకు రైల్వేలను గుఱించి స్వప్నములు వచ్చుచున్నవి. తరచుగా నాకు రైలుబండి తప్పి పోవుచుండును.

అది కేవలము సాంకేతికమే.

నాకు ఎక్కువ సామాను లుండుటను బట్టి నేను రైలువెంట పరుగెత్తుదును, ఒక్కొక్కప్పుడు నేను జయింతును, బండిని పట్టుకొని, కడపటి పెట్టెలోనికి దూకుదును.

రైలుబండి, ఓడ, విమానము, ఇవి యోగముచేసే వారికి సాంకేతికములు. మార్గము, వేగము తెలియఁ జేయును. నీవు సమయమును కోల్పోయినట్లయితే, లేక నీకు ఎక్కువ సామాను లున్నట్లయితే, లేక నీవు ఆలస్యముగా దానిని గుఱించి తలంచినట్లయితే, నీవు మార్గము తప్పుదువు. అప్పుడు దానిని అందు కొనుటకు శ్రమతో బరుగెత్తవలసి వచ్చును.

నీవున్న పరిస్థితిని ఎక్కువ విశదముగా, చక్కఁగా దెలుపునట్టివి పై విధముగా వచ్చు కల లనేకము గలవు.

నేను కలకత్తాలో నున్నప్పుడు, ఒకడు తెల్లని యుడుపులను ధరించుకొని, నా పడకయొద్దకువచ్చినట్లు కలగంటిని. అతని చేతిలో మీారుచెప్పు, "నూతనసృష్టి" అనే పుష్పముండెను. (గొట్టపుగులాబి) అప్పుడు ఆ పుష్పము యొక్క అర్ధము నాకు దెలియదు. నేను ఇక్కడకు వచ్చిన తర్వాతనే అది నాకు దెలిసినది. నేను చూచిన ఆకారము మీావలె నున్నది.

కలలు చాలా ఉత్సాహజనకముగా నుండును. వానిని ఉపయోగించు విధము తెలిసితే___

కలలు లేని నిదురయొక్క స్వభావమేమి?

మనః ప్రాణకోశములను శాంతిపరుపగలిగితే, శరీరమును బాగుగా నిదురపుచ్చగలిగితే, ప్రశాంతమైన, నిశ్శబ్దమైన నిదురవచ్చును. అప్పుడు ప్రయత్నించి ఈ రూపములను ఊర్ధ్వలోకములోనికి ప్రవేశించగలిగితే, సత్యమైన సచ్చిదానందమును చేరగలడు.

కలలలో ఒకడు తాను కలిసికొని గుర్తుపట్టిన వ్యక్తులను తరువాతిజీవితములో కలిసికొని గుర్తించుట జరుగుచుండును. ఇది ఎట్లు సంభవము?

దీనికి అనేక అవకాశములున్నవి. అయితే, తరచుగా జరుగునదేమన మానసికము, లేకప్రాణికము. లేక సూక్ష్మభౌతికమునైన భూమికలలో పరస్పర సంబంధమును దెలుపు ముద్ర యొకటి వేయబడును, దాని ఫలితముగనే తరువాత కలిసికొనుట సంభవించును. నీ స్వప్నము ముందుజాగ్రత్తకోస

మైన సూచనమాత్రమేగాక, అది యొక నియతికూడ అగుచున్నది. నిదురలో సంబంధము కలుగుటకు ముందుగా ఆంతర్యములో సన్నిహిత సంబంధ ముండవలెను. తరువాత నీవు భౌతికప్రపంచములో కలిసికొనుటకు, పరిస్థితులు తమకుదాము అవి సంభవమగునట్లుగా సన్నివేశమగును. ఒక్కొక్కప్పుడు అది ముందు హెచ్చరికమాత్రమే యగును. అప్పుడా కల ప్రత్యేక లక్షణము కలదై యుండును. నీవు స్వప్నములో ఒకరు వచ్చినట్లు కాంచుదువు. తరువాత భౌతికముగా అతడు వచ్చుట జరుగుతుంది.

సామాన్యముగా అది ఇదివరకే యేర్పడిన సంబంధబాంధవ్యము గలది. నీ వనేకమారులు అతనిని కలుసుకొనియుందువు, మాట్లాడియుందువు; అతనితో కొన్ని గంటలకాలము రాత్రులలో గడిపియుందువు. తరువాత మీరిద్దరు కలిసికొన్నప్పుడు ఒకరినొకరు సుపరిచితులైనట్లు భావమున తట్టును. అది వాస్తవిక విషయము, మీరు భౌతికముగా కలిసికొనుటకు పూర్వమే ఒకరినొకరు ఎరుగుదురు.

## అసత్యదర్శనము లుండవా?

నీవు చూడని దానిని చెప్పినట్లయితే, అది అసత్యదర్శనమగును. అదియేగాక ఏవోకొన్ని క్రొత్తగా చేర్చుట, నీవు చెప్పేటప్పుడు, జరిగినయెడల అది అసత్యదర్శనమే యగును. నీవు చూచినది చూచినట్లు యథాతథముగా జెప్పినచో అందు అసత్యమేమియుండును ? నీ వ్యాఖ్యలో తప్పులుండవచ్చును. నీ వనవచ్చును—'దాని అర్థమిది' అని. ఇక్కడనే నీవు పెద్ద తప్పు చేయుచున్నావు. నీవు చూచినదేదో చూచినావు, చూడనిదేదో చూడలేదు. ఇది నన్ను ఆశ్చర్యచకితురాలను చేసే విషయము. "నీవు దానిని చూచినావా ? అయితే సరే. చూచినదానిని వివరించుట వేరేవిషయము. చూచినది వేరేవిషయము. అయితే నీవు చూచినదేదో చూచినావు.

ఈ ప్రశ్న, తాము చూచిన స్వల్పమైనదానిని మార్పులు, చేర్పులు చేసి చెప్పేవారివిషయములో ఉదయిస్తుంది. క్షణములో ఒక అల్పమైనదానిని చూచెదరు, తరువాత, కోరియో కోరకయో, తెలిసియో తెలియకయో విషయములను మార్పు చేయుదురు. చూచిన ఒక చిన్న విషయమునకు ఏదో చేర్చి ఇంకను మరేదియో కలిపి, కొంత వివరణ చేసికొని, సందర్భశుద్ధి కలిగించి అది ఒక రూపమునకువచ్చి తన కాళ్ళమీద తాను నిలువగలిగినప్పుడు, "నాకు ఈ దర్శనము కలలోకలిగినది." అని చెప్పుదురు. అయితే, అది అంతయు వారు చూచినదికాదు. ఇది ఒకవిధమైన మానసికద్రోహము. ఇది అయత్నకృతమైనది. మనస్సు ఇప్పుడిక్కడొకదానిని చూస్తుంది; ఇంకొక్కటి అక్కడ; మూడవది మరెక్కడనో: ఈ విధమైనది దానికి అసంతృప్తికరము. అందుచే అది కాళీస్థలాలను నింపుతుంది. "దీని పర్యవసానమది," "దాని కారణమిది" అని ఇంకను ఏదేదో అది చెప్పుతుంది, అన్నియు సరిపోయినతర్వాత, ఇది తర్కబద్ధము కాబట్టి మనస్సు సంతోషిస్తుంది. మనస్సుప్రక్షిప్తము చేసినది యాదృచ్ఛికముగా సంభవించిన సత్యము కావచ్చును అయితే, అసత్యము కూడ కావచ్చును.

నిన్ను నీవే ప్రశ్నించుకొనుము. "నీకు నిశ్శబ్దముగా నుండే మనస్సున్నదా? అది నిజాయితీగలదేనా? భౌతికలక్షణోపేతమా? చూచినదానిని హెచ్చులొచ్చులు లేకుండా చెప్పగలదా? లేక అత్యంత క్రియాతత్పరత గలదై చూచిన దానికి కొంత సొంతము చేర్చి, అప్పటికప్పుడే ఒక పెద్ద కథను అల్లుతుందా? నిన్ను అదంతయు జూచినట్లు నమ్మిస్తుందా,—యదార్థమునకు నీవదంతయు జూడకపోయినప్పటికి?" పై ప్రశ్నలకు సమాధాన మేవిధముగా నుండినను, ఈ విధమైనవి ఉన్నప్పుడు కలలు నమ్మదగినవిగా నుండవు. అయితే, ఇది దర్శనముయొక్క తప్పుకాదు, నీ వేది చూచితివో దానిని జూచితివి. తప్పంతా వ్యాఖ్యానముది లేదా చేర్పు కూర్పులది. అద్భుత రహస్యముల వెల్లడిచేయు యదార్థ దర్శనములు చేయగలిగి, వాని అర్థమేమాత్రము తెలియక యుండినవారిని అనేకు

లను నే నెఱుగుదును. అప్పటికప్పుడు వారు అయత్నకృతముగా తాము చూచి నది చూచినట్లు చెప్పెడివారు. ఒక అరగంట తర్వాత వారు చెప్పు కథలో గొంత మార్పు కనబడేది. కాళీస్థలము లన్నియు నింపిన తర్వాత ఆఖరుకు కథ తన కాళ్ళపైన తాను నిలువబడేదిగా తయారయ్యేది. ఈ కథ తప్పుడుకథ, అర్థరహి తము, కాని,—వారు చూచిన కొన్ని అంశములు మాత్రము అద్భుత రహస్యము లను వెల్లడింప జాలినవై యుండెను.

## విశ్వబద్ధత

నీకు కలలో దర్శనములను గాంచు శక్తి—నిజాయితీతో కూడ, అయత్న కృతమైనదిగా ఉంటే, అది నిన్ను బాహ్యజ్ఞానమునకు అందరాని సంఘటనలను అందుకోగల శక్తి గలవానినిగా జేయును. ఐహిక ప్రవృత్తులతో గూడిన మానసిక, ప్రాణిక, సూక్ష్మభౌతిక తలములయం దెచ్చటనో, జరిగిన సంఘటనల నన్నింటిని చక్కగా, అయత్నకృతముగా నమోదుచేయు యంత్రమొక టున్నది. ఇది ఉత్సా హాస్పదమైన విషయము—దేనిని వదలిపెట్టని, దేనిని మఱవని విధముగా సమస్త మును ఇది నమోదు చేసియుంచును. అమోఘమైన జ్ఞాపకశక్తి దీనికి గలదు. దీనిలోనికి నీవు ప్రవేశింప గలిగితే, ఇందు నీవు వెనుకకుఁ బోవచ్చును, ముందుకు బోవచ్చును, అన్ని వైపులకును బోవచ్చును. గతించినవి, రానున్నవి,—అన్ని విషయముల 'జ్ఞాపకము' అక్కడ నమోదు చేయఁబడి ఉన్నది.

ఉదాహరణకు, మానసిక ప్రపంచములో భౌతిక విభాగము కలదు. ఇది భౌతిక విషయములకు సంబంధించినది — భూమిమీఁద అన్ని భౌతిక సంఘటన లను ఇది జ్ఞాపకముంచుకొనును. అనంతమైన అసంఖ్యాకమైన గదులలో ఒకదాని తర్వాత ఒకదానిని నీవు ప్రవేశించిన విధముగా నుండును. ఈ గదులు చిన్న తలుపులు గల పావురపు గూళ్ళ వంటివి. ఒకదానిపైన ఒకటి ఉన్నవి. నీవు ఏ విషయము నైనను తెలిసికొనవలెనన్నచో ఎఱుకతో నీ దృష్టిని నిలుపగా, వెలు

గుతో కూడిన ఒక చిన్న బిందువు వంటిది నీకు కనఁబడును. నీవు తెలిసికొనవలసినది యిదే అని గ్రహింతువు. నీవు ఏకాగ్రతతో అక్కడ దృష్టినిలుపవలెను—అంతట అది తెరచుకొనును—అట్లది తెరచుకొన్నప్పుడు, సూక్ష్మాతిసూక్ష్మమైన వ్రాత ప్రతులు కొన్ని చుట్టలు విప్పుకొనుచున్నట్లు నీకు దర్శనమగును. నీ ఏకాగ్రత తగినంత బలము గలిగినదైతే, నీవు ఒక పుస్తకము నుండి చదివినట్లు చదువ ప్రారంభింతువు. అన్ని వివరములతో గూడిన సంపూర్ణమైన కథ నీ యెదుట ఆవిష్కరింపఁ బడును—అక్కడ వేనవేలు చిన్న గ్రంథములున్నవి. నీ వచట విహారము సల్పబోయినచో, అనంతత్వములో విహరించినట్లే యుండును. నీవు తెలిసికొనగోరుదాని సంపూర్ణ వివరములను ఈ విధముగా గ్రహింపఁ గలవు. ఇవి చరిత్రాంశములవలె నుండవు, చరిత్రలు ఒక ప్రణాళిక ప్రకారము వ్రాయఁబడినవి. ఆ చరిత్రలోని అంశములు సత్యములు గావు. ఎందుకనఁగా, అవి మానవుని జ్ఞాపకశక్తిపై ఆధారపడినవి. మానవుని మెదడు ఖచ్చితముగా అంశములను నమోదు చేయజాలదు. కనుక చరిత్రలు అయోమయముగా నుండును, చరిత్రకారుఁడు తాను ఎన్నుకొనిన అంశములు తనకు ముఖ్యమనిఁ దోచినవి, చూచినవి, గ్రహించినవి తెలిసికొన్నవి వ్రాయును. అది చరిత్రలో కొద్దిభాగము మాత్రమే. ఇది స్వప్నమును క్రోడీకరించిన విధము దప్ప వేరుగాదు. కొన్ని యథార్థాంశములు, కొన్ని స్వకపోల కల్పితములు.

మానవుని మెదడు విషయములను సంపూర్ణముగా అర్థముచేసికొన శక్తి లేనిది. ఎంత పండితుఁడైనా, ఎంత బుద్ధిమంతుఁడైనా, ఎంత నిజాయితీ గలవాఁడైనా, సర్వము సంపూర్ణముగా చూడలేడు. తనకు దెలిసినవి, అర్థమైనవి చెప్పఁ గలఁడు—తనకు అర్థము గానివి చెప్పలేడు, అందువలన, చరిత్ర సంపూర్ణముగా మారిపోతుంది.

అయితే, నీవు ఈ ఐహిక జ్ఞాపక గ్రంథులను ప్రవేశించుటకు శక్తిని సాధించినట్లయితే అది ఎంత యుత్తమోత్తమము, శ్రమపడి సాధింపఁ దగినది.

ఇది యోగముకంటె వేరైనది. దీనికి ఆధ్యాత్మిక జీవిత మక్కఱలేదు. నీకు ప్రత్యేక శక్తి సామర్థ్యము ఉండవలెను.

నాకు కాలవ్యవధి ఉన్నట్లయితే, ఒక్క సంగతి శాశ్వతముగా పట్టు విడుపులు లేకుండా చెప్పుచునే యుందును. అదేమన, ప్రతిదాని యందును, సంపూర్ణముగా నిష్కపటమైన నిజాయితీ గలిగియుండుట అవసరము. నీవు నిజాయితీ గలవాఁడవు కానట్లయితే, నిన్ను నీవు వంచించుకొందువు. నీ యనుభవములు విలువలేని వగును. అయితే, నీవు నిజాయితీ గలవాఁడవైతే, క్రమశిక్షణతో ప్రపంచములోని మానసిక జ్ఞాపకశక్తిని ప్రవేశించుటలో విజయము పొందుదువు, శ్రమ తీసికోదగిన అంశములను కనిపెట్టుదువు.

* * *

ఫిబ్రవరి 17, 1951

తల్లి '1929 సంభాషణ'లలోని "అసత్య దర్శనముల"ను గురించిన ఒక భాగమును ప్రారంభించినది.

స్వప్నములో కనబడిన వ్యక్తి తన యదార్థ రూపమును గాక వేరు విధమున నటించినట్లయితే ఆదర్శనము అసత్య దర్శన మగునా?

అసత్య దర్శనములని ప్రజలు మాట్లాడినపుడు, వారి అభిప్రాయము ఇది అని నే ననుకోను. అయథార్థమని తాము నమ్మిన దానిని దేనినైనను చూచుట

సంభవించినపు డద్దానిని అసత్య దర్శనమని వారందురు, నా జవాబు అట్టి వారికిది : "నీవు చూచిన దానిని గుఱించి అది వరకే ఆలోచించి యున్నావా? దానిని చూడవలెనన్న ప్రయత్నము నీవు చేసియుంటివా ? అవి నీ ఊహలో గాని, కోరికలో గాని ఉండియున్నదా? అట్లయినచో అది అసత్య మైనదే యగును. కాని, ఇప్పుడు మీ రడుగుచున్నది వేఱొకటి. తమ నిజస్వరూపమును మరుగువరచి వేరొకరుగా నటించు ఈ భూతములను నీవు నమ్మినట్లయితే, దాని అర్థము నీ దర్శనము అసత్యమని కాదు. నీ దర్శనమును గుఱించిన నీ వ్యాఖ్య సరియైనది గాదని యర్థము. ఆ మోసమును దెలిసికొనుటకు నీ యొద్ద అవసరమైన విచక్షణా శక్తి లేదు. నాయొద్ద చాలకాలము, "తమ దర్శనములలో నన్ను చూచినట్లు చెప్పినవారనేకు లుండెడివారు. అసందర్భ పరిణామములతో నన్ను చూచినట్లు, దానివలన వారికి వినాశకరమైన సంఘటనలు కలిగినట్లు చెప్పెడివారు, కొన్ని శక్తులు నేనేనని వారిని నమ్మబలుకునవి ఉన్నవి. నేను వారికి ఈ విధమైన వినోదమును తుదముట్టచేయుటకు ఒక సులభోపాయము నొసగితిని.

మఱొక విషయముకూడ కలదు. నన్ను బిలుతురు, నేను జవాబిత్తును. అయితే, వారు తరువాత చూచునది తాము కల్పించుకొన్న మానసిక రూపకల్పన. నే నొకటి చేయవలెనని వారు నన్ను కోరుదురు. అదియే సంభవించును. వారు నా యొద్దకు వచ్చి "ఈ రాత్రి మీరు వచ్చితిరి." అని చెప్పినప్పుడు, అది యెంత వరకు నిజమో నేను పరిశీలించుచుంటిని. యథార్థమునకు, వారు పిలిచిరి నేనక్కడికి వెళ్ళితిని. కాని, వారు చెప్పిన దానిని, యదార్థముగా జరిగిన దానిని పోల్చి చూచినప్పుడు, తరచుగా భేదము ఎక్కువగానే కనిపించినది. జరిగిన దేమన, వారి మనస్సులో నున్న కోరికను, చూచిన దృశ్యమును కలగా పులగముగా మిశ్రమము చేయుదురు. అప్పుడు నేను వారితో ఇట్లు చెప్పుదును ; "మీరు చూచినది పాక్షికముగ అసత్యము. నేను వచ్చినది నిజమే. కాని, నా చేత చేయఁబడినది మీరు నాచేత చేయించినదే."

(తల్లి ఇంకను చదువుచున్నది,) "నీవు ఒక కొయ్య బొమ్మమాదిరి నిన్ను సమర్పించుకొని జోక్యము కల్పించు కొనక మౌనముగా ఉండుటగాదు. నీ సంకల్పమును భగవత్సంకల్ప పరిపాలనకు అప్పగించుటయే నీవు చేయ వలసిన పని."

ఒకఁడు తన సంకల్పమును ఏ విధముగా కానుకగా యివ్వగలఁడు? కొందఱు తమ సంకల్పమును కానుకగా యిచ్చిన తర్వాత ఇక సంకల్పించుటయే మానుకొందురు. ఇది చాలా అనుకూలమైనది. కాని, నిజముగా సరియైన మార్గము గాదు.

ఒకనికి దివ్యసంకల్ప మెట్టిదో తెలియనప్పుడు, తన సంకల్పమును ఎట్లు ఆ దివ్య సంకల్పమునకు సమర్పించుకో గలఁడు? ఇది చాలా ఆసక్తిదాయకమైన సమస్య.

కొందఱు బయటినుండి తమ్ము జేరవచ్చునది యెల్ల భగవంతుని సంకల్పమే యనుకొందురు, ఆ రీతిగా అద్దానిని ఆమోదింతురు కూడ.

అవును, అది దురదృష్టకరము. కాని, వారు ఆమోదించునది సామూహిక సంకల్పమును, లేక బలవత్తరులైనవారి సంకల్పమును మాత్రమే.

ఒకఁడు తాను సంకల్పించిన కార్యముల నన్నింటిని భగవంతునికి సమర్పింప నవసరములేదా? అనగా, మొట్టమొదట తాను సంకల్పించిన పనులన్నియు జేసిన పిమ్మట భగవంతునికి సమర్పించవలెను గదా?

నీవు మొదట నీ సంకల్పమును శమింపజేసి, పిమ్మట కార్యాచరణకు పూర్వము అంతర్వాణిని వినుటకై నిరీక్షణ సలుపవచ్చును. అది వివేకవంతమైన పద్ధతి.

చూచితిరా, మనము మన సంకల్పమును భగవంతునికి సమర్పించు అనేక మార్గములను ఇదివరకే తెలిసికొని యున్నాము. మొదటిది, మనము సంకల్పించుట మానుకొనడము; రెండవది, తాను సంకల్పించినది తప్ప యితరులు కోరిన వన్నియుఁ జేయుట, మూడవది, ఏమైనను కోరుచు, ఏదైనను చేయుచు, పిదప తాను చేసిన దానిని భగవంతునికి సమర్పించుట.

అట్లుగాక, ఒకఁడు తనకు దానే తన సంకల్పమును రూపొందించుకొని, తన ఉన్నతాదర్శము ముందర దానిని నిలిపి, అది చక్కగా ఉన్నదియు లేనిదియు ఆ ఉన్నతాదర్శమనే తెఱపైన జరింపఁ జేయవచ్చును. అది ఊగిసలాడు చున్నట్లయితే, అక్కడ ఏదో లోపమున్నదని గ్రహించి దానిని సరిచేసికోవచ్చును. అట్లుగాక, అది ఎదురు తిరుగక నెమ్మదిగా తెరపైన సాగిపోయినట్లయితే, నీవేది కోరుదువో దానిని సాహసముచేసి ఘటించి ఫలితమును చూడవచ్చును. ఇక్కడ కూడ ఒక కష్టతరమైన సమస్య నెదుర్కొను చున్నాము. ఏది సంభవించినదో, అది యంతయు భగవంతుని సంకల్పమే యని భావించి హృదయ శాంతితో నెమ్మదిగా నుండువారున్నారు. నిశ్చలముగా నుండుటకు ఇది చాలా అనుకూలమైన ఉత్తమ మార్గము. దీనికి మించినది లేదు. దీనికంటే మంచిమార్గ మున్నను అది చాలా కష్టమైనదే యగును. కనుక, నీ సంకల్పమును నీవు త్రోసిపుచ్చినప్పుడు, ఇది భగవంతుని సంకల్ప మనుకొందువు. నీవు ప్రశాంతముగా నుందువు, చేయఁదగినది చేసితివి, ప్రతిఫలము నీవు తలచిన దానికి భిన్నముగా నుండును. నీవు ప్రశాంతిని బొందుదువు, (గమనించుము. ఇది అంత సులభము కాదు. ఇంత వరకు ఇది మంచిదే. కాని, ఇదే సర్వస్వము గాదు,) పరిస్థితులనుబట్టి నీ సంకల్పమునకు, వ్యతిరేకము జరుగుటయు, అది సరియైనదే యగుటయు సంభవించ

వచ్చును. ఇట్లు జరుగుటకు వీలున్నది. అప్పుడు పరిష్కారము మరింత కష్టమగును. మొదట, అది సరియైనదని ఎట్లు తెలిసికొనుట? నీవు నిష్పక్షపాతము, నెమ్మది, శాంతి, గలిగినవాఁడవైతే, జరిగిన దానిని నేరుగా ముఖములోనికి జూడగలిగి, ఒక విధమైన వ్యతిరేకతను—వెలుఁగుపోయి అసత్యము ఎదుట నుంటివను విషయమును— గుర్తించగలిగినట్లయితే, ఏదో తెలియని కారణమున నీ నిశ్చయమునకు వ్యతిరేకము సంభవించినట్లు తెలిసికొందువు. అది తనకుఁ దాను అసత్యము గాక పోవచ్చును. నీవు చూచినది నిజమే గావచ్చును. ఏదో కారణముచేత అది ఆవిష్కారము కాలేదు,—అంతే, కనుక, నీ వనుకొన్న సత్యము ఎందుకు ఆవిష్కారము కాలేదో తెలిసికొనుటకు నీవు అన్వేషణ ప్రారంభింపవలయును. ఇది మరింత కష్టముతోగూడిన సమస్యయే. అయితే, ఉన్నతి, విశాలత గలిగేవిధముగా నీదృష్టిని నీవు పెంచుకొన్నట్లయితే, నీ సంకల్పము సాధింపబడియుండునెడ దాని ప్రతిఫలము లెట్లుండెడివో నీవు వెంటనే చూడగలిగియుందువు. ఆ ప్రతిఫలములు దేనివలన కలిగినవోకూడ నీవు గ్రహించగలిగి యుందువు, తగినంతదూరమునకు నీ పరిశీలనమును ప్రసరింపజేసి యుండినట్లయితే, నీ నిశ్చయము ఎంత సత్యవంతమైనప్పటికి పాక్షికసత్యమని గ్రహింపగలిగియుందువు. అది సామూహిక, సామాన్యసత్యము కాదు, విశ్వజనీన సత్యమంతకంటెను కాదు. ఆసమయములో నీ పాక్షిక సత్యము ఆవిష్కరించబడి యుండినట్లయితే, దాని ఫలితముగా సంపూర్ణత్వమునకు, దైవచేతనకు సంబంధించిన అనేక విషయములకు భంగము కలిగియుండెడిది. (నిజమునకు సర్వము అనగా సర్వసృష్టి, సర్వవిశ్వము, భగవంతుని కార్యములో ఒకభాగమే.) పూర్ణత్వమునం దొకభాగము వెనుకకు వదలివేయబడియుండెడిది.

"దేవుడు సర్వశక్తిమంతుడైతే ఎందుకు విషయములు మార్పుచెందలేదు!" అని ప్రజలు సర్వత్ర అడుగుచుందురు. ఈ కారణముచేతనే."

నీ యభిప్రాయముప్రకారము, సంపూర్ణత ఉండవలసినరీతి, యథార్థముగా నుండవలసినదానికంటె అనంతదూరములో నున్నది. ఈ కారణము వలన, నీవు ఎంత పరిపూర్ణదృష్టితో చూచుటకు బ్రయత్నించినప్పటికీ, విశ్వములోని అధికభాగమును వదలిపెట్టుచున్నావు. బహుస్వల్పమైనది, ఇరుకైనది అయిన రేఖామాత్రసాక్షాత్కారమును మాత్రమే నీవు సాధించుచున్నావు. విశ్వములో అధికభాగము మార్పుచెందుటలేదు. సంపూర్ణత్వమునుగుఱించి అత్యధికమైన పరిశీలనాదృష్టి నీ కుండినను, అధికతర సంపూర్ణత్వమును గుఱించిన భావము నీవు కలిగియుండి సిద్ధముగానున్న మార్గమున (మనుజులనడచెడి మార్గములును సిద్ధముగానుండును.) ఇతరులకొఱకు వేచియుండక పయనించినచో, ప్రస్తుత ప్రపంచపరిస్థితికంటె సత్యమునకు అతిసమీపమున నున్నదానిని సాధింపగోరినచో ఏమి జరుగును? ఒకానొక సమైక్యతకు సామరస్యమునకు భంగము వాటిల్లుటే గాక, సమస్థితికి సైతము ఘర్షణ ఏర్పడును, ఎందుకనఁగా, సృష్టి సర్వము అనుసరింపఁజాలదు కనుక, సంపూర్ణ దైవసాక్షాత్కారమునకు బదులు స్థానికమునకు బరిమితమైన, స్వల్పాతి స్వల్పమైన సాక్షాత్కారమును మాత్రమే సాధింపఁ గలుగుదువు. చివరకు సాధింపవలసినది ఏ మాత్రము సాధింపలేవు.

కావున నీవు చూచిన సత్యమును వెంటనే సాధింపలేక పోయినందులకు ఆందోళనపడి దిగజారిపోవుట, నిరుత్సాహము చెందుట కూడదు—ఏదో తప్పు చేసితినను కారణమున నిరుత్సాహపడుట, వ్యాకులపడుట, నిరాశచెందుట అను ప్రశ్న కాదిది. ఎందుకనగా, ప్రతి తప్పును సవరించవచ్చును. నీవు తప్పు చేసితి వని కనుగొనఁగానే, తగిన కృషిచేసి పురోగమించుటకు, సంతోషమును బొందుటకు అవకాశమున్నది. కాని, నీ వొక సత్యమును, అతి ముఖ్యమైన సత్యమును దర్శించి, దానిని సాక్షాత్కరించుకోగల పరిపక్వ స్థితి ప్రపంచమునకు లేనప్పుడు మాత్రము, ఇది మఱింత జటిల సమస్యయే యగుచున్నది. ఇట్టి స్థితి అనేకులకు సంభవింపక పోవచ్చు. బహుశా నీకు సంభవింపవచ్చును. అందువలన నీకు గొప్ప ఓర్పు, గొప్ప గ్రహణశక్తి యుండవలెను. నీవు, "అది సత్యమేగాని

సంపూర్ణముగా సత్యముగాదు." అని అనుకొనవలెను—ఇతర సత్యములన్నిటితో నీ సత్యము అడుగు కలపలేదు—అన్నిటికంటే ముఖ్యముగా, ప్రస్తుత అవకాశము లతో చేయి కలుపలేదు. మనము దానిని సాధించుటకు అమితముగా తొందర జెందినాము. అందుచే ఆ ప్రయత్నము వంచింపఁ బడినది. వంచింపబడినది కాబట్టి అది అబద్ధమనరాదు. కాలము పరిపక్వము కాలేదని చెప్పవలెను, అంతే నీవు చెప్పఁగలిగినది, నీవు చూచినది నత్యమే. కాని, కాలము పరిపక్వము కాలేదు. కావున, నీవు గొప్ప ఓర్పుతో, పట్టుదలతో నీ స్వల్పసత్యమును, కాలపరిపక్వత గలుగు పర్యంతము భద్రపరచుకొనవలయును—అప్పుడు అది నీవు సాధించుటకు అవకాశము కలుగును.

తుది విజయము ఎక్కువ ఓర్పు గలిగినవారిదే, (తల్లి ఇంకను చదువుచున్నది) "నేను నా సంకల్పమును దైవమునకు కర్పింతును. దైవసంకల్పమే, దానిచేత నాకొఱకైఁ పని చేయించునుగాక" అని నీ వందువు. నీసంకల్పము నిరంతరముగా పనిచేయుచునే యుండవలయును. కాని, అది ఒక ప్రత్యేక కార్యము నెన్నుకొనుటకు, ఒక ప్రత్యేక వస్తువు నర్థించుటకు గాదు. సాధింపవలసిన ఫలితముపై తీవ్రాకాంక్షను, ఏకాగ్రతను వహించుటే కావలసినది."

సమస్యకు బరిష్కార మక్కడున్నది. ప్రతి నిమిషము ఆకాంక్షతో నీ సంకల్పమును సమర్పించు కొనవలెను. ఆ ఆకాంక్షయే తనను తాను క్రమబద్ధము చేసికొనును. ఊరకే, "దేవా, నీ సంకల్పము నెరవేరును గాక!" అనిగాక, "ఏది ఉత్తమ కార్యమో అది నేను శక్తివంచన లేక చేయఁగలుగునట్లు అనుగ్రహింపుము" అని నీవు అనవలెను. ప్రతిక్షణము ఏది ఉత్తమ కార్యమో, అది ఎట్లు చేయవలెనో, నీకు తెలియక పోవచ్చును. కాని, నీ సంకల్పమును సాధ్య

మైనంత ఉత్తమ కార్యనిర్వహణమునకై భగవదధీనము గావించుకొనవచ్చును. ఇందువలన అద్భుతమైన ప్రతిఫలములు వచ్చుట నీవు చూచెదవు - ఎఱుకతోను, చిత్తశుద్ధితోను, పట్టుదలతోను ఈ పని చేయుము. నీవు నీ గమ్యమువైపు పెద్ద పెద్ద అంగలతో బయనింతువు.

ఒకఁడు తన ఆత్మయొక్క పూర్ణోత్సాహము తోడను, బుద్ధిబలము తోడను పనులు చేయవలయును. ప్రతినిమిషము, సాధ్యమైనంతలో ఉత్తమమైన దానిని చేయుము. ఇతరులు చేయుదానిలో నీ బాధ్యత లేదు. నీకు పలుమారు చెప్పుట కిది సాధ్యముగాని విషయము -

''ఫలానివాఁడు ఇది చేయలేదు — ఫలానివాఁడు దానిని ఒక విధముగా జేసెను. అది చేయకూడనిది, అని అనకూడదు - అది యంతయు నీకు సంబంధించినది గాదు. భగవంతుఁడు ఈ శరీరమును మిక్కిలి జ్ఞానము గలిగిన, మిక్కిలి పరిశుద్ధమైన, ఎంతవరకు సాధ్యమో ఆంతటి ఎఱుక గలిగిన పరికరముగా జేసికొనుటకు ఈ భౌతిక శరీరముతో నిన్ను భూమిమీఁద అవతరింపఁ జేసెను. మానసిక, ప్రాణిక, శారీరక రంగములలో పనికివచ్చు కొంత ద్రవ్యమును, పదార్థమును, భగవంతుడిచ్చెను. నీనుండి అపేక్షింపఁబడు దానికి అనురూపమైనవే ఆయన నీకిచ్చెను. పరిస్థితులుకూడ అట్టివే నిన్నావరించుకొని యుండునట్లు సృష్టించెను. "నా జీవితము దుర్భరముగా నున్నది. నేను ప్రపంచములో దౌర్భాగ్యమైన జీవితమును సాగించుచున్నాను-'' అని యెవరైనను చెప్పినచో వారు గార్ధభములు. ప్రతిఒక్కఁడు తన సంపూర్ణ అభివృద్ధికి దగిన జీవితమును గలిగియున్నాడు, ప్రతి వ్యక్తికి అతని సంపూర్ణాభివృద్ధికి దోడ్పడగల పరిస్థితులు కల్పింపఁబడినవి. అభివృద్ధి సాధనకు ఉపకరించు కష్టములుకూడ ఉన్నవి.

నీవు జాగ్రత్తగా నిన్ను చూచుకొన్నట్లయితే, నీవు సాధింపదలచు కొన్న ధర్మమునకు వ్యతిరేకమైనదానిని నీవు మోసికొనుచుందువు. (ధర

మను పదమును దాని విశాలమైన, ఉన్నతమైన, అర్థముతోనే నేను ఉపయోగించుచున్నాను). ప్రత్యేకమైన లక్ష్యము, ప్రత్యేకముగా నియమించుకొన్న పని, ప్రత్యేకమైనసాధన, నీ స్వంతమైనవిగా నున్నవి. ప్రతిది ప్రత్యేకత గలదే, మఱియు నీ సాధన పరిపక్వత చెందుటకు అవసరమైన కష్టములను మోయుచుందువు. నీయందు సమపాళ్ళలో నీడ, వెలుగులు ఉన్నవని నీ వజ్రము గ్రహించుచునే ఉందువు. నీకు శక్తిఉన్నది. ఈ శక్తికి వ్యతిరేకమైనదియు ఉన్నది, ఒక నల్లనిమచ్చ, సాంద్రతగలిగిన చీకటి ఉన్నట్లు నీవు కనుగొన్నట్లయితే, నీలో ఎక్కడనో గొప్ప వెలుగున్నదని నీవు విశ్వసింపుము. దీనిని సాధించుటకు దానిని ఎట్లుపయోగించుకొనవలెనో అది నీ బాధ్యత.

దీనినిగుఱించి మాట్లాడువా రుండరు అయితే ఇది అతి ముఖ్యమైనది. నీవు జాగ్రత్తగా పరిశీలించినట్లయితే, అందరిలోను అంతే ననుట తెలిసికొందువు. పరస్పరవిరుద్ధములుగా గానుపించినను పరమసత్యములైన కొన్ని ప్రతిపాదనలకు ఇది దారితీయును. ఉదాహరణకు, బ్రహ్మాండమైనచోరుడు గొప్ప నిజాయితీపరుడు కావచ్చును. (ఇది దొంగతనమునకు నిన్ను ప్రోత్సహించుట కాదు.) గొప్ప అబద్ధీకుడు, గొప్ప నిజాయితీపరుడుకావచ్చును. కనుక, నీలో గొప్పబలహీనత ఉన్నదని నీవు తెలిసికొన్నప్పుడు, నిరాశ చెందవలదు. ఎందుకనగా, అది బహుశా అత్యధికమైన భగవద్బలమునకు చిహ్నము కావచ్చును, "నేను ఆవిధముగా నున్నాను. ఇతరవిధముగా నుండలేను." అని చెప్పవలదు. నీ ప్రస్తుతపరిస్థితి నిజమైనదికాదు. నీవా విధముగా నున్నావంటే ఎందుకు? నీవు ఖచ్చితముగా దానికి విరుద్ధమైనదిగా నుండవలసియున్నది, సత్యమునకు బరివర్తన జెంద నీవు నేర్చుకొనుటకై అసత్యమును మెరుగుపరచుచు కష్టములు నీకు కలుగుచున్నవి.

నీవు ఒకతూరి దీనిని అవగాహన చేసికొన్నట్లయితే, నీ ఆందోళన లనేకము తొలగిపోగలవు. నీవమితసంతోషమును బొందుదువు. ఒకడు తన

యందు నల్లని రంధ్రములున్నవని గ్రహించినపుడు, "ఇది నేను అత్యున్నత స్థాయిని చేరగలననుటకు నిదర్శనము" అనియు, అగాధము చాలా లోతుగల దైనట్లయితే, "నేను అత్యున్నతస్థాయికి ఎక్కి పోగలను." అని అనుకొన వలెను. విశ్వజనీన దృక్పథముకూడ అంతే. నీకు బాగుగా పరిచయమైన హిందూపరిభాషలో చెప్పినచో "గొప్ప అసురులే గొప్ప దేవతలు," అని చెప్ప నగును. అసురులు మారిననాడు మహోత్తమ జీవులగుదురు. ఇట్లు చెప్పుట నిన్ను అసురత్వమునకు ప్రోత్సహించుటకాదు. ఇది నీ మనస్సును విశాలము చేసి పరస్పర వైరుధ్యముగల శుభాశుభములనుండి విడివడుటకు సహాయపడును, ఎందుకనగా నీవాదశయందే ఉండిపోయినట్లయితే ఇక ఏ ఆశయు ఉండనేరదు.

ప్రపంచము ఇప్పు డెట్లున్నదో దానికి వ్యతిరేకముగా నుండియుండని పక్షమున, దానికి ఆశలేదు. ఎందుకనగా, అగాధమైన యీ కటికచీకటి పరి పూర్ణమైన యీ జడత్వము.—ఇవి సంపూర్ణజ్ఞానమునకు చిహ్నములు కాకపోయి యుండినట్లయితే, ఒకడు మూటముల్లె కట్టుకొని వెళ్ళుటతప్ప చేయవలసిన దేమియు నుండదు. ముక్కుచివరివరకు దప్ప ఎక్కువ ముందుకు చూడని ఆదిశంకరులవంటివారు, "ప్రపంచము నివసించుటకు శ్రమపడతగినదికాదు, ఎందుకనగా అదిదుస్సాధ్యము, దానితో జేయదగినది యేమియు లేదుకనుక, దానిని మాయగాపరిగణించి అటనుండి నిష్క్రమించుటయే మంచిది," అన్నారు. తద్విరుద్ధముగా నేను చెప్పునదేమన, ప్రపంచము చెడ్డదిగా, అసహ్యమైనదిగా మూర్ఖత గలదిగా, దుఃఖముతోనిండినదిగా ఉన్నందువలననే, దివ్య సౌందర్యము దివ్య కాంతి, దివ్య చేతన, దివ్య ఆనందము గలదిగా రూపొందగలిగియున్నది.

"నీవు జాగరూకత శ్రద్ధగలవాడవైతే నీవేమి చేయ వలయునో అద్దానిసిగూర్చిన అంతఃప్రేరణను తప్పక పొందగలవు. అంతట వెంటనే ఆపని చేయుటకు నీవు పూనుకొనవలెను.

గొప్ప పట్టుదలతో ప్రతిఘడియలోను సాధ్యమైనంత మంచిపనిచేయుటకు బూనుకొనవలెనని ఇంతకు పూర్వము నేను చెప్పినపుడు, "అది యంతయు సరియే కాని అది ఎట్లు తెలిసికొనేది?" అని మీరు నన్నడిగియుండవలసినది. నేను చెప్పునదేమన,—తెలిసికొన నవసరములేదు. నమ్మకముగా నీవు ఈ వైఖరిని అవలంభించినట్లయితే, ప్రతిఘడియా నీవు చేయవలసినదేదో గ్రహింతువు. ఆశ్చర్యకరమైన దిదియే. నీ నమ్మకము ననుసరించి ఈశ్వరప్రేరితజ్ఞానము అధికాధికముగా కడు ఖచ్చితమైనదిగాను, సరియైనదిగాను ఉండును.

> "నీ చర్యకు ఫలిత మేమైనను, అది నీ వాశించిన దానికి భిన్నముగా నుండినను, నీవు ఆమోదింపవలయును. సమర్పణ అనగా నిదియేనని నీవు తప్పక జ్ఞాపకముంచుకొనవలెను. అట్లుగాక నీసమర్పణ తటస్థభావోపేతమైతే, నీ వేమియు చేయవు, చేయ యత్నించవు, ఊరకే నిదురింతువు. అప్రాకృత సంఘటనకై ఎదురు చూతువు."

> "నీ నిశ్చయముగాని, కోరికగాని, దివ్యచేతనకు అనురూపముగా నున్నదో లేదో తెలిసికొనుటకు. నీకు జవాబు వచ్చినదా లేదా అనియు, అది నిన్ను బలపచుట జరిగినదా, లేక వ్యతిరేకించుట జరిగినదా, అనియు చూడవలయును. ఆనుకూల్య ప్రాతికూల్యముల ప్రకటనము మనః ప్రాణ శరీర ప్రవృత్తులచే గాక, నీ అంతరాత్మలో, నీ హృదయములో లోతున నిక్షిప్తమైయున్న ఒకానొక శక్తిమూలమున జరుగవలసియున్నది.

అది సర్వదా ఒకటే. మనలో నుండెడి యీ తెలివిమీద ప్రతివిషయమును ప్రసరింప జేయుచు, తద్వారా అది ఆమోదింపబడి యున్నదో లేక తిరస్కరింప బడియున్నదో తెలిసికొనుట అవశ్యకము.

"ఆధ్యాత్మిక ప్రగతికి ధ్యానములో వ్యయము చేసిన గంటలు కాదు నిదర్శనము. నీకు ధ్యానము చేయవలసిన అవసరము లేనప్పుడు, నీవు నిజముగా పురోగమనము సాధించినవాడ వగుదువు."

అనగా, నరముల నీడ్చుకొని బిగువుగా నుండుట కంటె, నీవు కోరినదాని పైన కేంద్రీకరణ చేయ వీలగునట్లు ఆంతరిక యంత్రాన్ని నిశ్శబ్దపరుచు ప్రబల మైన ప్రయత్నము చేయుటకంటె, నీవు మామూలుగా సహజముగా అప్రయత్న ముగా, ఏదో ఒక కారణముచేత ధ్యానముచేయ నిశ్చయించినప్పుడు నీవు చూడ దలచుకొన్నది, నేర్చుకొన నెంచినది, తెలిసికొన గోరినది నీ ఎఱుకలో ఉండి పోవును. తక్కినవన్నియు, అద్భుత క్రియ విధముగా అదృశ్యమైపోవును. నీలో అన్నియు నిశ్శబ్దత వహించును. నీ వ్యక్తిత్వమంతయు శాంతి గైకొనును. నీ నరములన్నియు ప్రశాంతముగా నుండును. నీ ఎఱుక ఏకాగ్రత చేపట్టును; సహ జముగా అయత్న కృతముగా, సాంద్రతరమైన ఆనందముతో తీవ్రతరమైన ధ్యాన ములో నిమగ్నుడ వగుదువు.

అదియే నీవు జయము సాధించితివనుటకు నిదర్శనము. అది వేరైనప్పుడు నీ వపజయము పొందిన వాడవే.

"అప్పుడు నీవు ధ్యానము నుండి విరమించుటకు వేఱుగా ప్రయత్నము చేయవలసియుండును. ధ్యానము చేయకుండా ఉండుట కష్టముగను, భగవంతుని గురిం

చిన ఆలోచన చేయకుండా ఉండుటయు, మామూలు ఎఱుకలోనికి దిగివచ్చుటయు కష్టమగును."

ఇది అందఱి విషయమువను యథార్థమగుటకు నే నెంతగానో కోరుచున్నాను.

నీవు ఏదైన నొక చుఱుకైన పనిలో నుందువు. ఉదాహరణకు, బాస్కెటు బాలు ఆట తీసికొందము. దానికి ఎక్కువ క్రియాశీలత్వము అవసరము. అయినను, లోపలి ధ్యానము, దేవునిపైన ఏకాగ్రత విడువకూడదు. అది నీ కున్నట్లయితే, నీవు చేయునదంతయు, యోగ్యతలో మిన్నగా మారును. నీవు దానిని బాగుగా జేయుటయే గాక, అనూహ్యమైన బలముతో నెరవేర్తువు. అట్లుండియు, ఉన్నత స్థాయిలో, ఏదియు నిన్ను స్పృశింపరాని అధిక వినిర్మలమైన రీతిగా నీ యెఱుక యుండును. ఏదైన ప్రమాదము సంభవించినను నీకు అది హానిచేయదు. అట్టి స్థితిలో నీ మానసిక పరిణామముండును. సహజముగా నిది శిఖరప్రాయమైన స్థితి. ప్రతివాడు చేర నభిలషింప దగిన స్థితి. మానవ సంచారము లేనిచోట, శాస్త్రోక్తమైన పద్ధతిలో, పూర్ణఅచలస్థితిలో, ప్రశాంతమైన ఒకానొక మూలలో గూర్చొని ధ్యానము చేయవలయునని అందఱు సామాన్యముగా విశ్వసించు పొరబాటులో నీవు పడవలదు. అది నిజము గాదు. అన్ని పరిస్థితుల యందు ధ్యానమున విజయము సాధించుట అవసరము — నీ తలను ఖాళీ చేయుట గాక ఏకాగ్రచిత్తముతో భగవంతుని గూర్చిన ఆలోచననే నేను ధ్యానమని పిలుతును. ఈ యాలోచనను నీలో నుంచుకొన్నట్లయితే, నీవు చేయుదాని గుణము ఉన్నత స్థాయికి మార్పుచెందును. నీవు ముందున్నట్లు గాక, కొద్దిగా మార్పు చెందినట్లు భావింతువు. శాంతితో, నిశ్చయముతో, మార్పు చెందని శక్తితో, దేనికిని లొంగని ఒకానొకదానితో విలసిల్లుదువు.

ఆస్థితిలో నీకు అపాయము కలిగించుట కష్టము. ఈ ప్రపంచము పూర్తిగా వ్యతిరేక శక్తులతో నిండియున్నది. అవి ప్రతిదానిని తారుమారు చేయజూచును అవి ఏ కొద్దిగనో జయము పొందుచుండును. తన్మూలమున నూతన ప్రగతిని సాధించుటకై నీవు ముందుకు త్రోయబడుచుందువు.

నీకు జీవితములో దెబ్బ తగిలిన ప్రతి నిమిషములోను, వెంటనే, "ఆః నేను ముందుకు సాగవలసి యున్నది" అనుకొనుము. అప్పుడు ఆ దెబ్బ నీ కాశీర్వాద మగును. నీ తలను భుజములమధ్య ముడుచుకొని యుండుటకంటె సంతోషముతో బైకెత్తుట నేర్చుకొనుము. అప్పుడు నీవు, "నేను నేర్చుకొనవలసిన దేమిటి? దేనిని తెలిసికొనఁగోరుచున్నాను? దేనిని మార్చుకొనవలసియున్నది?" అని నిన్ను నీవు ప్రశ్నించుకోవలెను.

ఇచట ప్రకృతమున మనము అవలంబించు ఏకాగ్రత, గతములో మనము చేయుచు వచ్చిన ధ్యానము రెండును ఒకటేనా ?

కాదు. లోగడ దానిని గుఱించి నేను వివరించి యున్నాను. ఇప్పటి మనము పాటించు ఏకాగ్రత ధ్యానమునకు విరుద్ధమైనది. మనము నడుపుకొనుచు వచ్చిన సామూహిక ధ్యానములో పాల్గొను వారందఱి చేతనాశక్తిని సమైక్యపరిచి ఆకాంక్షతో దానిని ఉన్నత స్థానములకు ఎత్తుటకు నేను ప్రయత్నించుచుంటిని. ఇప్పుడు ఏకాగ్రతలో మనమిక్కడ చేయునది దివ్యచేతన క్రిందకు దిగునట్లుచేయుట, వెనుక చేసినది ఆరోహణ ప్రక్రియగాకా, ఇప్పుడీ యేకాగ్రతలో అవలంబించునది అవరోహణ ప్రక్రియ - ఆకాంక్షతో పైకి లేచుటకు మారు దైవశక్తి నీలో ప్రవేశించుటకు నీవు ఉన్మీలనము చెందుదువు. దీనిని సాధించుటకు అనేక మార్గములున్నవి. ప్రతి మనిషి తన ప్రత్యేక సహజ ప్రకృతి ననుసరించి తనకు ఉత్తమమగు మార్గమును కనుఁగొనవచ్చును. ఇచట అపేక్షిత మగునది స్వీకారయోగ్య

తతో కూడిన సమర్పణము. శరీరముగాని, మనస్సుగాని, ప్రాణముగాని నీలోని ఏ ఒక విభాగమునో సమర్పించుట కాదు. నీ సంపూర్ణ వ్యక్తిత్వముయొక్క సమర్పణము జరుగవలసి యున్నది. ఇంకేమియు నీవు కోరబడుట లేదు. దైవశక్తికి ఉన్మీలనము చెందుట మాత్రమే నీవు చేయవలసిన పని. తక్కిన కార్యమును నేను చూచుకొందును.

* అక్కడ ధ్యానములో ప్రతివ్యక్తిని తనలో ఆకాంక్షాజ్వాలను రగిలించుకొని దానిని ఎంతటి ఉన్నతపథమునకు తీసికొనిపోవుట సాధ్యమో అంతటి ఉన్నత పథమునకు దీసికొనిపోవలెనని నేను కోరితిని. సహజముగా ఈ రెండును ఆవశ్యకములే, ఉయదయకాలమందు జరుగు ధ్యానములో, సత్సంకల్పము గలవారు తామెంత అభివృద్ధిని సాధించియుండినను ఈ ధ్యానకార్యక్రమములో జేరవచ్చును. ఇక్కడి నియమమేమనగా, ఎవరు తమ శరీరమును పరిపక్వ స్థితికి నిజముగా దెచ్చుకొనగోరుదురో అట్టివారే గావలెను. జీవితమునుండి తప్పించుకొనగోరువారు, తమనుండి తాము తప్పించుకొనగోరువారు, ఉన్నత పథముల జేరగోరి తమశరీరములనుండి తప్పించుకొనగోరువారు ఇచ్చటికి రాకూడదు. అందువల్లనే మొదటిలో అభ్యర్థులను ఎన్నుకొనునప్పుడు నియమములు ఖచ్చితముగా బాటింపబడినవి. అది రానురాను విశాలమగుచున్నది. అది మంచికొరకే యని ఆశించుచున్నాను. ఎవరైతే తమ భౌతిక శరీరమును పరిపక్వతకు దెచ్చుకొనగోరుదురో తమ శరీరమునకుగల విలువను గుర్తించి దాని పరిపక్వతకై ప్రయత్నించెదరో, ఉన్నతసత్యమునకు తమ శరీరము ఆశ్రయము గావలయునని కోరుదురో అట్టివారుమాత్రమే ఇందు పాల్గొన నర్హులు. చింపిపాత

---

* ఆశ్రమములో ధ్యానకార్యక్రమము తర్వాత ఆటస్థలములో ఏకాగ్రతా కార్యక్రమము ప్రారంభమయ్యెడిది.

విధముగా శరీరమును "నన్నిక శ్రమపెట్టకు" మని పారవేయగోరువారికి ఇక్కడ ప్రవేశములేదు. తద్విరుద్ధముగా, శరీరమును చక్కని పరిక్వముగా చేపట్టి దానిని పెరుగునట్లుచేసి, ఈ పద్ధతి కెంతవర కనువగునో అంతవరకు దానిని పరిపక్వము జేయనెంచువారే ఇచ్చట చేరనర్హులు.

తీవ్రమైనఆకాంక్ష. భావన, అని మీరు చెప్పునది కర్మప్రవృత్తికి విరుద్ధముగాదా ?

కాదు. వైరుధ్యము కనబడినట్లయితే, ఏకాగ్రత సరియైన పద్ధతిలో జరగ లేదని దాని యర్థము. వాస్తవముగాఁ ప్రపంచము అసత్యములో పూర్తిగా మునిఁగి ఉన్నది. అందువలన, బాహ్య వ్యక్తిత్వముతో సంబంధము తెగిపోకుండ దైవ సాక్షాత్కారమును భావించి తనలో దాను ఏకాగ్రత వహించుట చాల కష్టమను మాట నిజమే. అది సులభ సాధ్యమని నేను చెప్పను. కాని ఒక విధముగా దూరపు ఆదర్శమును నేను మీకిచ్చుచున్నాను, అది సాధ్యమైన విషయమే. లోగడ సాధింపబడి యున్నది కూడ.

* * *

ఫిబ్రవరి 19, 1951

"భూలోక స్మృతి"లోనికి ఎఱుకతో ప్రవేశింపఁగలుగు టకు క్రమ శిక్షణ అవసరము. ఏమిటా క్రమశిక్షణ?

యోగమునకు సంబంధించిన క్రమశిక్షణ కంటె, ఈ క్రమశిక్షణ ఎక్కువ కష్టమైనది. అది గుప్త విద్యా సంబంధమైన క్రమశిక్షణ.

ప్రథమమున ఒకఁడు ఎఱుకతో తన శరీరములోనుండి వెలికేగి మఱొక సూక్ష్మతర శరీరమును ప్రవేశించుటకు తర్ఫీదు పొందవలెను. తాను తలఁచిన చోటికి బోవుటకు తన ఆత్మశక్తిని ఉపయోగింప గలిగియుండవలెను. భయపడ కూడదు. ఒక్కొక్కపుడు అకస్మాత్తుగా వచ్చు భయంకరమైన వాని నెదుర్కొన గలిగియుండవలెను, ప్రశాంతతో నుండుటకు, మనోదృష్టిని అభివృద్ధి చేసికొను టకు, మనస్సు శాంతియుతముగా నిశ్శబ్దతతో నుండుటకు తర్ఫీదు పొందవలెను. ఈ జాబితా చాలా పెద్దది. గంటల తరబడిగా ఈ విధముగా వాకొనవచ్చును.

మీలో శరీరమునుండి బయటికి వెళ్ళి, ఆ బయటికి వెళ్ళుటను తెలిసికొన్న యనుభవమును బొందిన వారెవరున్నారు? సంకల్ప మాత్రముననే అట్టిది చేయు టను గుఱించి నేను మాట్లాడుటలేదు, ఎందుకనఁగా అది మఱియొక దశ.

ఒకప్పుడు నేను నా శరీరము నుండి బయటికి వెళ్ళి వెంటనే తిరిగి శరీరములో బ్రవేశించితిని.

చిన్న వాహ్యాళికి బయలుదేరుటకు ఆ అవకాశమును నీవు వినియోగించు కొనలేదు. అవునా? నీకు పరిశోధ నాసక్తి లేదన్నమాట.

ఒకఁడు శరీరము నుండి బయటికి వెళ్ళినట్లు ఎట్లు తెలిసికొనగలఁడు ?

నీవు నీ శరీరము నిశ్చలముఁగా బడియుండుట చూచెదవు. తెలిసికొనుటకు ఇతర సదుపాయములు కూడ నున్నవి.

వాసన వలన నిశ్శేషముగా స్మృతి తప్పునట్లు చేయు మందు (క్లోరోఫారం) ప్రభావము వలన నేను నా శరీరము నుండి బయటికి వెళ్ళితిని. నేను నా శరీరమును బల్లపై జూచితిని. శస్త్రచికిత్స జరుగుట కూడ చూచితిని.

ఆలాగుననే నేనొక అసాధారణమైన యోగినిని చూచితిని. ఒక దినము ఆమెకు శస్త్రచికిత్స చేయవలసిన అవసర మేర్పడినది. ఆమెకు క్లోరోఫారము నిచ్చిరి. ఆమె తన శరీరము నుండి బయటికి వెళ్ళినది. అకస్మాత్తుగా అక్కడున్న ప్రజల మనస్సులలో ఏమున్నదో చూచుటకు ప్రారంభించినది. నిదురబోవునప్పుడుకూడ మాట్లాడే అలవాటు ఆమెకున్నది. అప్పుడు గట్టిగా మాట్లాడ మొదలు పెట్టినది. ఆమె,—ఫలానావారికి మనో వ్యాకులత ఉన్నది. ఇంకొకరికి పరిష్కరించవలసిన సమస్య ఉన్నది. దానికి పరిష్కారము ఫలానా, అని ఇన్ని విషయములు చెప్పినది. ఇది ఒక అసాధారణమైన విషయము. అట్టిది విశేష ప్రజ్ఞ గలిగిన వారికే సంభవిస్తుంది. అట్టివారు ఎక్కువ మంది ఉండరు. క్లోరోఫారము ప్రభావము వలన తెలివిని గోల్పోనివారు సామాన్యముగా అనుకొనే దానికంటె ఎక్కువమందే ఉన్నారు. సాధారణముగా క్లోరోఫారము నుండి మేల్కొనగానే, ఎక్కువ అసౌఖ్యకరముగా నుండును. శరీరము వెలుపటి అనుభవములను చాల అస్పష్టముగా జ్ఞాపకముంచుకొనును. ఉన్నట్టుండి ప్రమాదములో జిక్కుకొన్న వారివలె మూర్ఛిల్లిన వారెవరైన ఇందున్నారా? నీవు నీ శరీరమును చూచు చుందువు అవును గదా? నీవు ఇట్లు ప్రశ్నించుకొందువు; "పరిహాసాస్పదమైన ఆ

స్థితిలో అదేమి చేయుచున్నది ?'' అని వెంటనే నీవు దానిలో ప్రవేశింతువు. అట్టిది పారిస్ నగరములో నాకు సంభవించినది. నాకు చక్కని భోజనము పెట్టిరి. తర్వాత నేను సభాసమావేశ స్థలమునకు బోయినాను. అక్కడ అనేకులున్నారు. చాలా వేడిగా నున్నది. బాగుగా భుజించిన నే నచట నిలబడియున్నాను. అప్పుడు అకస్మాత్తుగా అసౌకర్యముగా నున్నట్లు భావము కలిగినది. నాతో గూడ ఉన్న ఒకరితో, "నేను వెంటనే బయటికి పోవలయును,'' అన్నాను. బయటికిపోయిన వెంటనే (అది ట్రొకాడెరో చౌకు) నేను పూర్తిగా మూర్ఛ పోయితిని, నా శరీరము నక్కడ సాగిలి పడియుండుటను చూచితిని, అది చాలా పరిహాసాస్పదమైన స్థితిలో నుండెను. నేను వెంటనే దానిలో ప్రవేశించితిని. "నీవు ఈ విధమైన కుయుక్తులు నామీఁద పన్నకుము,'' అని దానిని గట్టిగా మందలించితిని.

అనేకులు ఈవిధముగా మూర్ఛపోయి తమ్ముతాము చూచుకొందురు. దీనికి ఒక నియమమున్నది. సూక్ష్మభౌతికశరీరమందలి (లేక భౌతికప్రాణకోశమందలి) నేత్రేంద్రియము ఇందులకు అభివృద్ధిచేయవలయును.

ఈవిధమైన శక్తి తనకుదానే, ప్రయత్నములేకయే రావలయును. ఒకడు పుట్టుకతోనే ఇట్టిశక్తి గలిగియుండవచ్చును. వారు ఏమంత ఎక్కువతెలివి గలవారు గాకపోవచ్చును. వారి ప్రాణికచైతన్యము మధ్యరకముదైయుండ వచ్చును. అయినను వారు పుట్టుకతోడనే ఇట్టిశక్తిగలవారు గావచ్చును. అధికాభివృధికి అది చిహ్నముగాదు. అది వేరువిధమైనదానినుండి వచ్చును. అనగా తల్లిదండ్రులశక్తినుండి, పూర్వజన్మములనుండి కావచ్చును. నీవు పుట్టుకతోనే ఇట్టి శక్తిగలవాడవు కాకపోయినట్లయితే, నీవు నీయందు సంపూర్ణజ్ఞానముగల, పూర్తిగా అభివృద్ధిచెందిన చైత్యపురుషుడుండి, అదే శరీరములో స్వేచ్ఛాజీవితమును సాగింపగలిగి యుండకపోతే అట్టి స్థితియందు దర్శనముల గాంచుట నేర్చుకొనవలెనన్న కోర్కె నీకున్నచో అందులకు సుదీర్ఘమైన

మెల్లని క్రమశిక్షణయే కావలసియుండును. పూర్తితర్ఫీదును పొందుటకు అవసరమైన ఓర్పు, దానిని భరించగల శక్తి గలవారు చాలా తక్కువ.

అది ఉత్సాహజనకమైనదే. కాని ముఖ్యమైనది గాదు. శరీరమును విడిచి బయటికి వెళ్ళుట, తిరిగి దానిని చేరుకొనుట అనునది స్వప్నముల వంటిదే. అయితే, నీవీశక్తిని అభివృద్ధి చేసికొనినట్లయితే, అది నీ జీవితమును మరింత సుసంపన్నము గావించును. నీ జ్ఞానమును శీఘ్రగతిలో పురోగమించునట్లు చేయును.

ఇరుతెగలైన ప్రజలున్నారని మీ రనుచున్నారు. ధ్యానము చేయుమని ఉపదేశింపబడువారు, ఉపదేశింపబడనివారు. ఒకడు ఏవిభాగమునకు జెందినవాడో తెలిసికొనుట యెట్లు?

మీరు ధ్యానముచేయ నుపదేశింపబడినవారేగదా.

కనుక మిమ్ము మేము అడుగవచ్చునా?

నిస్సందేహముగ. దానికొఱకే నేనిక్కడున్నాను.

ఒకప్పుడు ఒకడు శరీరమును విడిచిపెట్టి పోయినపుడు బయటికి పోయిన విభాగమును శరీరము అనుసరిస్తుంది.

నీవు నిద్రలో తిరుగాడువానిని గుఱించి మాట్లాడుచున్నావు. అయితే అది పూర్తిగా వేరువిషయము. బయటికివెళ్ళినవిభాగము (మనఃకోశముగాని, ప్రాణకోశముగాని) శరీరముతో గట్టి యనుబంధము గలిగియున్నది; లేక శరీ

రము ఈ విభాగములో గట్టిగా ముడివేయబడియున్నది. కనుక ఈ విభాగము ఏమిచేయనిశ్చయించుకొనునో, శరీరముకూడ దానిని యాంత్రికముగా అనుసరించును, అని యర్థము. నీ అంతస్సత్తయందు నీవొకటి చేయనిశ్చయించుకొందువు. నీ శరీరము ఆ సత్తలో గట్టిగా ముడిపెట్టుకొని ఉన్నది కాబట్టి అది దానిని గుఱించి ఆలోచింపకయే అంతస్సత్తను అనుసరిస్తుంది. అది చేసిన దానినే చేస్తుంది. భౌతిక శరీరమునకు, అది మేల్కొని యున్నప్పటికంటె ఈ స్థితిలో అధిక శక్తులున్నవి. శరీరము మేల్కొని యున్నప్పుడు సంచరించుటకు భయపడు అపాయకరమగు స్థలములలో, ఈ స్థితియందు అట్టి భయమును విడనాడి ఆ స్థలములలో విహరిస్తుంది. శరీరము అంతస్సత్త ఎఱుకను అనుసరిస్తుంది. దాని సొంత ఎఱుక నిదురతో నుంటుంది. (శరీరమునకు దానికి సంబంధించిన ఎఱుక గలదు.) వ్యక్తిలోని అన్ని భాగములకు - భౌతిక శరీరమునకుగూడ — స్వతంత్రమైన ఎఱుక ఉన్నది. బాగుగా అలసట చెంది, పూర్తి విశ్రాంతి కావలసినప్పుడు నీవు నిదురింతువు. అప్పుడు నీ భౌతికమైన ఎఱుక నిదురిస్తుంది. నీ సూక్ష్మభౌతిక శరీరమునకు, ప్రాణకోశమునకు, మనస్సునకు సంబంధించిన ఎఱుక నిదురించదు అది పనిచేయుచునే యుండును. అయితే, నీ భౌతిక జ్ఞానము శరీరమునుండి వేరుచేయబడును. అది స్మృతి దప్పిన స్థితిలో నిదురించును. ఏ విభాగము మేల్కొనియుండునో అది శరీరమును, భౌతికమైన జ్ఞానము లేనప్పటికి, మధ్యవర్తిగా శరీరముచేత పనిచేయించును. ఆవిధముగా ఒకడు స్వప్నసంచారి, అగుచున్నాడు. నా స్వానుభవముప్రకారము, జాగ్రదవస్థలోని ఎఱుక ఏదోఒక కారణమువలన నిదురిస్తుంది, అయితే, లోపలనున్న వ్యక్తి మేల్కొని ఉంటుంది. శరీరము దానికి గట్టిగా ముడిబెట్టబడియుండుటచేత, అది యాంత్రికముగా అనుసరిస్తుంది. అందుచేత, నిర్భయముగా చోద్యమైన పనులను చేయును. ఎందుచేతనంటే, నీవు వానిని భౌతికముగా జూడవు. మఱియొక విధముగా జూతువు.

'స్వప్నసంచారము', అంతకు ముందుగా నుండిన నిర్విరామకృషి, ఆందోళనలవలన కలుగునని చెప్పబడు చున్నది. ఇది నిజమేనా? ఈ స్వప్నసంచారమునందే 'తార్తిని' 'సోనెటా' (Sonnet) అనెడి త్రివిధగతి గీత రచనను గావించెను ఉదయము మేల్కొనినప్పుడు అది అంతయు వ్రాసియుంచగలిగెను.

స్వప్నసంచారము సర్వదా అంతకుముందుండిన నిర్విరామకృషి. ఆందోళనల ఫలితమని చెప్పరాదు. అవును. స్వప్నసంచారులు అనేకులు ఆసంచార స్థితిలో విచిత్రమైనవానిని వ్రాసిరి. అయితే, తార్తిని 'స్వప్నసంచారి' గాదు, అతడు స్వప్నావస్థలో సోనెటాలురచించెను.

అది యెప్పుడును అపాయకరమైనదే. అనూహ్యమైనవి సంభవించును. ఉదాహరణకు, ప్రాణకోశమునకు ప్రమాదము.

'స్వప్నసంచార' మును ఏవిధముగానివారణచేసికొన వచ్చును?

చాలా సులభమే. నిదురించేముందు శరీరముపై ఆంక్ష విధించుట. అంతరములోని బంధములను తెగగొట్టుటకు జాలినంతగా మనస్సును అభివృద్ధి చేసికొనకపోవుటయే, ఒకడు స్వప్నసంచారి యగుటకు కారణము. మనస్సెప్పుడును వెలుపలి వ్యక్తిత్వమును అంతర వ్యక్తిత్వమునుండి వేరుచేయును. చిన్నపిల్లలు ఇట్టి బద్ధావస్థలోనే యుందురు. కొంతమందిపిల్లలను నే నెఱుగుదును. వారు ఎంత నిజాయితీ గలవారైనను, ఒక విషయము వారి భావమున జరుగుచున్నదో, లేక వాస్తవముగా జరుగుచున్నదో గుర్తుపట్టలేరు. వారికి బాహ్యజీవితము, అంతరజీవితము రెండును వాస్తవములే. వారు కట్టుకథలు

చెప్పుటలేదు. వారు అబద్ధీకులు గాదు. రాత్రి తరువాత రాత్రి ఒకే చోటికి ప్రారంభించిన తమ స్వప్నమును పూర్తి గావించుటకు, పోయిన పిల్లలున్నారు. శరీరమునుండి బయటికి పోవుటలో వారు నిపుణులు.

నిద్రలో శరీరమును వదలిపెట్టి బయట సంచరించుట మంచిదేనా? ఒకడు తాను కోరినప్పుడు తిరుగ శరీరమున ప్రవేశింపగలడా?

నీ కేదో సంభవించినదని తట్టిలేపునట్టివారు నీ చుట్టు నుండగా నీవు నిదురించుట అపాయకరము. నీవు ఒంటరిగా ప్రశాంతముగా నిదురించినచో అపాయములేదు.

ఒకడు ఏ సమయమునందైనను తిరిగి తన శరీరమునందు ప్రవేశింపగలడు. తిరిగి శరీరమును జేరుటకంటె, సామాన్యముగా బయటనుండుటయే ఎక్కువ కష్టము, ఏదైనను ఒక చిన్న సంఘటన జరిగినట్లయితే ఒకడు వెంటనే పరుగెత్తుకొనివచ్చి శరీరములో జేరుకొనును,

ఒకడు పడకపై తన శరీరమును విడిచిపెట్టి పోయినట్లయితే వేరొకడు దానిలో ప్రవేశింపగలడా?

అట్లు సంభవింపవచ్చును. అయితే చాలా అరుదు. లక్ష సంఘటనలలో ఒకటి ఆవిధముగా జరుగవచ్చును.

ఎవరు పడితే వారు ప్రవేశింపలేరు. మానవుడు ఇంకొకరి శరీరములో తనకు అసాధారణమైన అద్వితీయమైన గూఢజ్ఞానము ఉంటేతప్ప ప్రవేశింపజాలడు, అట్లుండినవాడు ఆపని చేయడు.

మానవుడు ప్రవేశించినట్లయితే, ప్రాణలోకపు జీవులు ప్రవేశింపవచ్చును. వానికి శరీరములుండవు. తమాషా అనుభవమునకు అవి అట్లు చేయును. ఒకడు శరీరమును వదలివెళ్ళినాడని తెలియగానే (వాడు సంపూర్ణముగ పోయి యుండవలెను) అది తగిన జాగ్రత్తతో రక్షింపబడలేదని గ్రహింపగానే, తొందరగావచ్చి ఆ శరీరములో ప్రవేశించును. అట్టిది చాలా అరుదుగా సంభవించును. నీవు ప్రశ్నింపకపోయి యుండినట్లయితే, దానినిగురించి చెప్పియే యుండను. అయినను అది అసంభావ్యము మాత్రము గాదు.

ఈ విధమగు భయంకరమైన కలలు వచ్చేవారు, తాము శరీరమును విడిచి బయటికి పోయేముందు సర్వదా గుప్త విద్యానుసారముగ దమ్ము దాము రక్షించుకొనవలెను. అది అనేక మార్గములుగా జేయవచ్చును. సులభమైన మార్గమేమన, (ప్రత్యేకమైన జ్ఞానమవసరము లేదు) గురువును, లేక జ్ఞానముగల వారి నెవరినైనను ఆ భావనతోగాని, ఆత్మశక్తితో గాని ఆహ్వానించుటయు, లేక తనచుట్టును రక్షణకుడ్యము నొకదానిని నిలుపుకొనుటయు జరుగవలెను. ఇట్లు చేసినట్లయితే ఎవరును ప్రవేశింపలేరు.

శరీరము విడిచి బయటికి వచ్చు లక్షణము నీ కున్నట్లయితే, నీవు యోగమును అభ్యసించుచున్నట్లయితే, నీ నిద్రను నీవు భావనద్వారాగాని, ఇతర మానసిక చర్యలద్వారా గాని, ఇతర ఏ విధానముచేతగాని, రక్షించుకొనవలెను. ఈ రీతిగా తన్నుతాను రక్షించుకొను మార్గము లనేకమున్నవి. అయితే మీకు అట్టి అపాయము లేదు. నిజమునకు ఇతరులకుకూడ లేదు, అయినప్పటికి, ఇట్టిది సంభవించుటకు ఒకడు తీవ్రమైన దురాశాపరుడై యుండవలెను, అంతశ్శుద్ధి బొత్తుగా లేనివాడై యుండవలెను. దుష్టశక్తులతో సంబంధము గలిగి యుండవలెను. ఎందుకనగా, నియమముల ననుసరించి, సత్యమును పాటించి బ్రతుకువారు ఇతరుల శరీరములలో బ్రవేశింపరు, అట్లు ప్రవేశించుట క్రమముగాదు. అందువలన అట్లు చేయరు.

శరీరము నుండి బయటికి పోవునది, చైత్య పురుషుడా? లేక వ్యక్తిలోని మఱేదైన భాగమా ?

బయటికి పోవునది చైత్యపురుషుఁడే అయితే, ఒకనికి అది తెలియనే తెలియదు. ఎక్కువకాలము వరకు అది నీ యందుండదు కనుక నీకుఁ దెలియుట కవకాశము లేదు. చాలామందిలో చైత్యపురుష సాన్నిధ్య ముండదు. దాని ఉనికిపట్టు వారిలో సిద్ధము కాకపోవుటయే ఇందుకు కారణము. ఒక్కొక్క సమయములో బయటికి పోవునది. సూక్ష్మ భౌతిక శరీరము. పడుకోఁబెట్టబడిన శరీరమును చూచునది యిదియే. ఎందుకనగా, భౌతిక దృశ్యము ఎఱుకలో నుండుటకు శరీరమునుండి బయటికి పోవునది శరీర సంబంధ మైనదైనప్పుడే సాధ్యమగును. అయితే, సామాన్యముగా బయటికి బోవునది ప్రాణమయ శరీరము. అంతకంటె తరుచుగాఁ బోవునది మానసిక శరీరము. అయితే. మానసిక శరీరము బయటికిపోవుట ఒకడికి తెలియదు. మానసిక శరీరము చైత్యపురుషునివలె అరుదుగా శరీరములో నుండును. నీవు ఒకదానిని గాని, ఒక మనిషిని గాని, తలంచుకొన్నట్లయితే, నీ మనస్సులోని ఒక భాగము వెంటనే అక్కడ ఉండును. మనస్సు తిరుగుబోతు, చపలబుద్ధి, వచ్చును, పోవును,లోపలికి వచ్చును, బయటికిఁ పోవును. దానిని క్రమబద్ధము చేయగల, తమలోనే ఉంచుకొనఁగల, భద్రముగా లోపల బంధింపఁ గల, పోమరిగా తిరుగకుండునట్లు చేయగల వారు కొద్దిమంది మాత్రమే.

కొన్ని సమయములలో నేను బయటికి పోయినట్లును శరీరము చనిపోయినట్లును భావనకుదోచును.

అది స్వప్నము మాత్రమే. నీవు బహుశా నీ శరీరమును విడిచిపెట్టి బయటికి పోయి యుండవు. తాము చచ్చిపోయినట్లు కలగనువారును గలరు. అయితే అది ముఖ్యము గాదు.

ఒకఁడు శరీరమును విడిచి బయటికి పోయినప్పుడు, మీ వైపు పరుగెత్తుకొని వచ్చుటకుఁ బ్రయత్నించవలెను. ప్రతివ్యక్తి ఆ విధంగానే జేయును గాదా?

నూటిలో ఒక్కరుకూడ అట్లు చేయరు.

నీవది చేసియుండినట్లయితే, ఆసక్తిదాయక మగునవెన్నియో నీకు సంభవించియుండును. ఫ్రాన్సులో నాకొక పరిచితు డుండేవాఁడు నా యొద్దకు నిత్యము సాయంత్రము వచ్చేవాఁడు. నేను అతనికి దెలియబడని ప్రాంతములను చూపవలయునని, ప్రాణమయ, మనోమయ ప్రపంచములలో విహారములకు తీసుకుపొమ్మని కోరెడివాఁడు. నిజముగా నే నతనిని అక్కడికి తీసికొనిపోవుచుంటిని. కొన్ని సమయములలో ఇతరులుకూడ ఉండెడివారు. కొన్ని సమయములలో అతఁడొక్కడే ఉండెడివాఁడు. నే నతనికి శరీరమునుండి బయటికి ఎట్లుపోయేది, తిరిగి శరీరములో ఎట్లు ప్రవేశించేది, ఎఱుకను ఎట్లు నిలుపుకొనేది వగైరా చూపితిని. అతనికి అనేక ప్రదేశముల జూపి, ''అక్కడ నీవు ఈ జాగ్రత తీసికొనవలయును. ఇక్కడ నీవు ఫలానా ఫలానా పనిచేయవలెను'' అని చెప్పుచుంటిని. ఇట్లు చాలాకాలము కొనసాగినది.

మీలో ఒక్కరుకూడ నా యొద్దకు వచ్చుట లేదని నే ననుటలేదు, అయితే, కొద్దిమంది మాత్రమే దానిని ఎఱుక గలిగి చేయుచున్నారు. సామాన్యముగా (నాది తప్పైన మీరు చెప్పవలయును. అయితే అది నా యభిప్రాయము.) నీవు నిదురపోవుటకు ముందు నీవు నన్ను గుఱించి జ్ఞాపకము చేసికొని యున్నట్లయితే, నా యొద్దకు పరుగెత్తుకొని వచ్చుటకు బదులు, అది నన్ను రమ్మనుటకు పిలుపై యున్నది, నీవు నీ పడకమీద నున్నావు. నీవు విశ్రాంతి గోరినావు. బాగుగా నిదురించాలనుకున్నావు. బాగుగా ఎఱుక గలిగియుండ దలంచినావు. శరీరమునుండి నిర్గమించి నా యొద్దకు వచ్చుటకు మారుగా అప్పుడు నన్నే నీ కడకు బిలుతువు.

ఫిబ్రవరి 22, 1951

"యోగమనగా దైవముతో సమ్మేళనము. అర్పించుకొనుటద్వారా ఆ సమ్మేళనము సాధింపఁబడును. నిన్ను నీవు భగవంతునికి అర్పించుకొనుట పైన ఇది స్థాపింపఁబడినది".

సంభాషణలు (1929)

అర్పణ (offering) కును, సమర్పణ (ప్రపత్తి - surrender ) కును వ్యత్యాస మేమి ?

ఈ రెండు పదములు రమారమి సమానార్థకములే. నన్ను నేను భగవంతునికి అర్పించుకొనుట, సమర్పించుకొనుట, అర్పణము చేసికొందును అను సంజ్ఞలో సమర్పణము (ప్రపత్తి) అనుదానికంటె ఎక్కువ క్రియాశీలత్వమున్నది. దురదృష్టవశాత్తు, 'సొమిషన్' అను ఫ్రెంచి పదము నిజమైన పదముగాదు, ఆంగ్లములో మనము 'సరెండర్' అను పదము నుపయోగింతుము. అర్పణము, సమర్పణము అను రెండు పదములలో భేదములేదు, అయితే, ఫ్రెంచి పదము, 'సొమిషన్' ఎక్కువ తటస్థ భావమును సూచించుచున్నది. అది ఆమోదము మాత్రమే. అర్పణము అనగా ఇచ్చుట —స్వచ్ఛందముగా ఇచ్చుట—

"ఆత్మ నివేదనము (consecration) అను పదమునకు ఖచ్చితమైన అర్థమేమి ?

'ఆత్మ నివేదనము' అనుదానికి సాధారణముగా గుప్తమైన భావమున్నది. అయితే ఇది సంపూర్ణము గాదు. సంపూర్ణ ఆత్మ నివేదనము సంపూర్ణ సమర్పణమే యగును. కావున, ఆత్మ నివేదనము, ఆత్మ సమర్పణము సమానార్థక

ములు. 'సౌమిషన్' అను ఫ్రెంచి పదమునకు తటస్థ భావముతో ఒప్పుకొనుట యను అర్థము మాత్రమే వచ్చును — ఆత్మ నివేదము అను పదమునందు ఒక విధమైన జ్వాల నీకు స్ఫురించును. అర్పణమను పదముతో స్ఫురించుదానికంటె మిన్నయైన జ్వాల. ఆత్మ నివేదన మనగా ఒకానొక కార్యమునకు తనను తాను అర్పించుకొనుట యన్నమాట, కావున, యోగార్థములో, ఒకఁడు దైవ సంబంధమైన కార్యము నెరవేర్చు భావముతో తనను దాను అర్పించుకొనుటయే ఆత్మ నివేదన మగును.

"తీర్మానమును చేసికొన్న తర్వాత, నీ సర్వజీవితమును భగవంతునికి సమర్పించుకొనుటకు నిశ్చయించుకొన్న తర్వాత, నీవు ప్రతిక్షణమునను దానిని జ్ఞాపకము చేసికొనుచు నీ బ్రతుకు నందలి ప్రతి స్వల్పవిషయ వివరము లందును దానిని మఱువక యుండుట అవసరము. ప్రతి అడుగులోను నీవు భగవంతునికి సంబందించినవాఁడవని భావించుచుండవలయును. నీ ప్రతి ఆలోచనలోను, క్రియలోను, నిరంతర భగవదనుభవమును పొందుచుండవలయును. దివ్యచేతనయే నీ ద్వారా సర్వదా పని చేయు చున్నదను భావ ముండవలయును. ఇఁక నీది అని చెప్పుకొనగల్గున దేదియు నీయొద్ద లేదు. ప్రతిది భగవంతుని నుండి వచ్చుచున్నదని నీవు భావింతువు. దానిని నీవు తిరిగి దాని మూలమునకు సమర్పింపవలయును. ఇది నీవు తెలియ నేర్చినప్పుడు, సామాన్యముగా నీవు ఏమంతశ్రద్ధజాగ్రత తీసికొనని అత్యల్పవిషయము సైతము సంపూర్ణముగా అర్థవంతమై కనుపట్టి, పరిశీలించుటకు తెలిసికొనుటకు అతి విస్తృతమైన అవకాశమును నీకు గలిగించును." సంభాషణలు (1929) 4

సామాన్యముగా చాలా తక్కువ విలువ గట్టబడు ప్రతి స్వల్ప విషయము, ప్రతి కార్యము, ప్రతి ఆలోచనా విభాగము, ప్రతి ఇంద్రియ సంవేదనము,— వీని నన్నింటిని నీవు పరిశీలనగా జూచుచు, "ఇది నేను భగవంతునికి సమర్పించుచుంటి నన్న ఆలోచన, భావన నాలో ఉన్నదా'' అని నిన్ను నీవే ప్రశ్నించుకొనుచుందు వేని, నీ జీవితములోని ప్రతి క్షణమునను ఇట్లు నీవు పునఃశ్చరణ చేసికొన గలుగు దువేని, ఇంతకు ముందున్న నీ జీవిత దృక్పథమే పూర్తిగా మారిపోవును. అది అత్యంత విశాలమై, ప్రతిదీ యథోచిత స్థానమున నొప్పారు అసంఖ్యాకమైన స్వల్ప విషయముల మాలగా గన్పట్టును. అది యెఱుకయొక్క భూమికను విశా లము చేయును. నీ జీవితములోని ఒక అరగంటను తీసికొని దానిని గుఱించి ఆలోచించుచు, ''ఇది భగవన్నివేదిత మైనదేనా?" అని ప్రశ్నించుకొనుము, అప్పుడు స్వల్ప విషయములే ఘన విషయము లగును. నీ జీవితము భాగ్యవంతము, ప్రకా శవంతము అయినట్లు నీవు గుర్తింతువు.

"భగవంతునితోతాదాత్మ్యమే యోగ లక్ష్యముగదా ఇందు సమర్పణము (surrender) మొదటి అడుగు, అర్పణము (offering) రెండవ అడుగు అని అనుకొన వచ్చునా?"

కాదు. కొందఱు అర్పణముతో ప్రారంభించి, సమర్పణముతో ముగిం తురు. అది ఒక్కొక్కరి గుణశీలము మీఁద ఆధారపడి యుండును. నేను తక్కువ వాఁడనను భావముతో ప్రారంభించుట జరుగవచ్చును. భగవంతుని వైభ వముచే నీవు అణగారి పోయినట్లు మొదట భావింతువు. తర్వాత కొంత స్వేచ్ఛను బొంది, నిన్ను నీవు సంతోషముతో అర్పించుకొందువు. అన్ని సమయాలలో నిట్లు జరుగదు. అనేకులు ఆత్మార్పణముతోనే ప్రారంభింతురు. తమ్ము దాము అర్పించుకొనుచే అట్టివారికి సులభతరమైన పద్ధతి యగును. ప్రారంభములో అ యిచ్చుకొనుట నిర్దుష్టముగా నుండదు. తర్వాత వివరణాత్మకముగా సమర్పణ

ప్రయత్నము జరుగవలపి యుండును. మొదట, ఉత్సాహముతో నిన్ను నీవు అర్పించుకొనవచ్చును. అయితే, ప్రతి అడుగులోను ఉన్నత చేతనకు లోబడ వలపి వచ్చినపుడు అది ఎక్కువ కష్టమై పోవును.

అర్పణములో సమర్పణము (ప్రపత్తి) ఇమిడి యుండదా?

ఉండదు. ఏవిధమైన సర్వసమర్పణభావము లేకయే ఇచ్చుటలోగల సంతోషమును బురస్కరించుకొని నీవు యివ్వవచ్చును. నీకంటె అత్యుత్తమమైన ఒకానొకదానిని నీవు రేఖామాత్రముగా జూచి తాత్కాలికోత్సాహముతో నిన్ను నీవు అర్పించుకొనవచ్చును. తరువాత ప్రతినిమిషము ఆరీతిలో జీవింపవలసినపుడు, ప్రతినిముషము నిన్ను నీవు ఉన్నతచేతనకు అర్పించుకొనవలసివచ్చినపుడు, ప్రతినిమిషము ఈ సమర్పణ అవసరమైనప్పుడు, అది చాలా కష్టమగును. "అర్పణ" యనగా నీ భావమున నీ అన్నిచర్యల, అన్ని కార్యముల, సంపూర్ణార్పణే అయితే, అది సంపూర్ణసమర్పణకు (ప్రపత్తికి) సమానమే యగును. అప్పుడది కేవలము ఔత్సాహిక ప్రవృత్తిగాక, ప్రతి స్వల్ప విషయములోను సాధించి అనుభవమునకు దెచ్చుకోవలసినదగును. ఏ యుద్యమమైనను క్రమపద్ధతిలో, ఉత్సాహముతో మొదలుపెట్టినట్లయితే, అది సాపేక్షికముగ సులభమైనదే యగును. (అది నీ ప్రవృత్తియొక్క సాంద్రతను, తీవ్రతనుబట్టి ఉండును). కాని, ఆకాంక్షను జీవితములో ప్రతినిముషమున ప్రతి స్వల్పవిషయములోను సాధించుకొన ప్రయత్నించు సందర్భములో ఉత్సాహముకొంత వెనుకబట్టి సాధన కష్టమనిపించును.

"ఒకడు భగవంతుని సన్నిధిలో జీవించుచున్నాడని రుజువు చేయగల అనుభవమేదైనకలదా?"

ఒకడు దైవసన్నిధిలో జీవింప మొదలుపెట్టితే, ఇక ప్రశ్నించుటనేదే ఉండదు. నిశ్చయభావము దానిని వెన్నంటియే యుండును. ఒకడు అనుభవించును, తెలిసికొనును. ప్రశ్నించుటకు తావే ఉండదు. దైవసన్నిధిలో జీవించువాని కది సంపూర్ణసత్యమైపోవును. ఆ దశ చేరునంతవరకు ప్రశ్నించుట జరుగును; ఎందుకనగా, నీ కనుభవముండదు; ఒకతూరి అనుభవము గలిగినతరువాత, దానికి నిర్వివాదమైన అధికారము దత్తమగును. "నే నను కొంటున్నాను భగవంతుని సన్నిధిలో నివసించుచున్నానని: అయితే నాకు నమ్మకముగా దెలియదు," అనువానికి నిజమైన అనుభవము లేదనియే చెప్పవలెను. ఎందుకనగా, ఈయనుభవముయొక్క అఘాతము అంతరమున కలిగినవానికి ఇక ప్రశ్నింప సాధ్యముగాదు. ఇది కేవలము, "ఏది దివ్యసంకల్పము ?" అని యడిగినట్లుండును. నీ వెంతవరకు ఈ దివ్యసంకల్పమును సూచాయగానైనను తెలిసికొనలేదో అంతవరకు నీ కర్థముగాదు. తర్కముద్వారా వచ్చిన నిర్ణయమువలనగాని, లేదా ఊహవలనగాని, ఒకనికి దాని విషయమున ఏదో ఒకభావము కలుగవచ్చును, అయితే, ఒకతూరి ఆ సంకల్పముతో నిజమైన సంబంధము నీకు గలిగినప్పుడు అది నిర్వివాదమే యగును. తెలిసినదా ?

అపోహ లేకుండుటకు నే నింకను చెప్పుచున్నాను. ఒకనికిగల అకృత్రిమమైన అంతశ్శుద్ధిపై ఆధారపడి ఒకని అనుభవమునకు విలువ ఉంటుంది. కొందఱు అంతశ్శుద్ధి లేనివారై అద్భుతమైన అనుభవములను కల్పన గావింతురు, అది తమకు కలిగినట్లుగా భావించుకొందురు. అది అంతయు పనికిమాలినది. అవి అంతశ్శుద్ధితో కూడినవి కావు. నిజాయితీగా అనుభవమును బొందిన నిజాయితీపరులకు జెప్పుచున్నాను. ఒకమారునీకు దివ్యచేతనయొక్క అనుభవము గలిగితే, ప్రపంచమంతయు, నిజముకాదది అని వాదించినను, నీ యనుభవము నుండి ఒక అంగుళముకూడ నీవు వెనుకకుపతగ్గవు.

నీవు నిజాయితీపరుడవు కాకపోతే, నీకు అద్భుతమైన అనుభవము గలిగినను, వానివలన నీకుగాని, యితరులకుగాని విలువలేదు. నీ ఆలోచనలోని ఎక్కువభాగము నీవు నమ్మకూడదు. మనస్సు విచిత్రమైన కల్పనా చాతుర్యము గలది. అద్భుతమైన అనుభవములను తననేర్పుచేత గల్పించిచెప్పగలదు. అయితే, అనుభవమని చెప్పుకొన్న ఈకల్పనాకథలకు విలువలేదు. అందుచేత సంభవింపబోవు సంఘటనలనుగుఱించి ముందుగా తెలిసికొనగూడదు. నిజాయితీగా నుండవలయునని తలంచు గొప్పబుద్ధి గలిగియుండినను, మనస్సు తన కల్పనాశక్తిచేత ఎంతో గొప్పగా, ఎంతో బాగుగా అనేక విషయములను కల్పించి అద్భుతమైన పటమును నీ యెదుట ప్రదర్శించును. నీకు దెలియని విధముగనే వినోదకరమైన సుఖాంతగాధను దాని నిర్మాణదక్షతతో నీ సమక్షమున ప్రదర్శించును. నీవు దానిని తెలిసికొనుట మహాకష్టము. ఈ యనుభవములను బొందుటకు ముఖ్యమైన నియమ మేమనగా, "ఈ యంత్రమును ప్రశాంత వాతావరణములో నుండనిమ్ము అది యెంత తక్కువ చలించితే, అంత గొప్ప మేలుగలుగును. నీకొఱకు అది చేయు ఆలోచనల విషయము జాగ్రత.

ఆకాంక్ష, కామన,--- ఈ రెంటికిగల భేద మేమిటి ?

నీవు రెంటిని అనుభవమునకు దెచ్చుకొన్నప్పుడు, సులభముగా వాని భేదమును కనిపెట్టగలవు. ఆకాంక్షలో పక్షపాతములేని జ్వాల ఉన్నది. అది కామనలో లేదు. ఆకాంక్ష నీయాత్మకు పెడమొగమై ప్రవర్తింపదు. కామనా ప్రవృత్తి సర్వదా అట్లు పెడమొగమైయుండును, ఆంతరంగికదృష్టినుండి చూచిన, ఆకాంక్ష సర్వదా తానే యిచ్చుకొనునది కాగా, కామన లక్షణము సర్వదాతీసికొనుట. ఆకాంక్ష తనకుతానిచ్చుకొనునది అనగా, ఆలోచనారూపకమునవేగాక, ప్రాణప్రవృత్తిరూపమునగూడా ఇచ్చుకొనునది, అని యర్థము.

ఆలోచనచే ఏర్పడినదైనప్పటికి. నిజమైన ఆకాంక్ష తలలోనుండి రాదు. అది హృదయమునుండి జ్వాలవలె పైకిలేచును. శ్రీఅరవిందులు వేదములపై వ్రాసిన వ్యాసములు నీవు చదివినావో లేదో నాకు దెలియదు. ఈ ఋక్కులనుగురించి ఒకచోట ఆయన ఇట్లు వివరించెను. "ఇతరులు భావించినట్లు ఈ ఋక్కులు మనస్సుతో వ్రాసినవిగావు. అవి ఆకాంక్షయొక్క అభివ్యక్తివిశేషములు, ప్రేరణలు, హృదయమునుండి లేచు జ్వాలలు. (హృదయమన, ఈ మాంసపిండముగాదు, వ్యక్తియందలి అంతఃకేంద్రము.) అవి ఆలోచనచేసినవిగావు. అనుభవములనుబట్టి మాటలు కూర్చినవి గావు. సరియైన, ఖచ్చితమైన, తప్పునిసరియైన పదములతో అనుభవమే అట్లుపూర్తిగా రూపముదాల్చి వచ్చినది. ఇది ఆకాంక్షయొక్క సహజప్రకృతి, నీవు దానిని క్రమబద్ధము చేయనక్కఱలేదు. అది నీనుండి జ్వాలవలె లేచును. అవి మాటలైతే (కొన్ని సమయాలలో మాటలే ఉండవు) మార్పు చేయసాధ్యముకానిది. ఒకపదమును తీసి వేరుపదమును గూర్చుటకు సాధ్యముగాదు. ప్రతి పదము తగినదే, రూఢిగా. ఎంతమాత్రము మార్పుకు అవకాశములేని రీతిగా ఆకాంక్ష రూపొందును. అది సర్వదా పైకివచ్చి తనను దాను అర్పించుకొనును. కామన అట్లుగాదు, అది విషయములను తన వైపునకు లాగుకొనును.

ఆకాంక్షలోని ప్రేమకు, కామనలోని ప్రేమకు, ముఖ్యమైన భేదమేమనిన: ఆకాంక్షలోని ప్రేమ తనను దాను పూర్తిగా అర్పణము చేసికొనును. ప్రతిఫలము నాశించదు, తనదిగా దేనిని చాటుకొనదు. కామనలోని ప్రేమ అట్లుగాక వీలైనంత తక్కువగా తనకు దాను ఇచ్చుకొని, వీలైనంత ఎక్కువగా ఎదుటినుండి ఆశించును. విషయములను తనవైపునకు లాగుకొనును. సర్వదా ఏదియో కోరుచునేయుండును.

ఆకాంక్ష సర్వదా సంతోషము నిచ్చునుగాదా?

సంతోష మనుటకంటె, సమృద్ధి అనుట మంచిది. సంతోషమనే పదము మనలను అపమార్గము పట్టించును. ఆకాంక్ష నీయందు సమృద్ధిని, శక్తిని ఆంతరికజ్వాలను తోపజేయుభావమును గలిగించును. ఆకాంక్ష నీకు సంతోషమునైతమివ్వగలదుగాని. అది ఒక ప్రత్యేకమైన సంతోషము. దానిలో ఉద్రేకముండదు.

## ఆత్మ, చైత్యపురుషుడు, ఒకటేనా ?

అది నీవు ఆ పదముల కిచ్చే నిర్వచనముమీద ఆధారపడి ఉంటుంది. చాలవరకు అన్నిమతములలోను తత్వవిచారణలలోనుకూడ, ప్రాణమయపురుషునే ఆత్మయందురు. ఎందుకనగా, "ఆత్మ శరీరమును విడిచిపెట్టును." అని చెప్పబడినది. కాని శరీరమును విడచిపెట్టునది ప్రాణమయపురుషుడు "ఆత్మ రక్షణము," "దుర్మార్గపుఆత్మలు" "ఆత్మవిమోచనము" అనే ప్రయోగములున్నవి. అయితే ఇవన్నియు ప్రాణమయపురుషునికే అన్వయించును. ఎందుకనగా, చైత్యపురుషుని రక్షించడమనేది ఉండదు. అది బాహ్యజీవియొక్క పాపములను పంచుకొనదు. అది ప్రతిక్రియలు లేనిది.

> "ఒకడు కర్మపరుడై తన శక్తినంతయు నుపయోగించి కర్మచేయగోరినప్పుడు అందుకు ఎక్కువ కాలవ్యవధి గావలయును, సాధారణముగా మన కెక్కువ సమయముండదు; చాల తొందరపాటుతో నుందుము. అట్టియెడ, వీలైనంతఉత్తమరీతిలో కర్మచేయుటఎట్లు సాధ్యపడును ?"

ఇది చాలా ఆసక్తిదాయకమైన విషయము, దానిని గురించి సవివరముగా ఒకదినము మీతో మాట్లాడనెంచితిని. సాధారణముగా మనుజులు తొందర

పాటులో నున్నప్పుడు తాము చేయవలసినదానిని సంపూర్ణముగా చేయరు, ఒకవేళ చేసినచో చెడ్డగాచేయుదురు. అయితే మూడవమార్గమున్నది. అది ఒకని ఏకాగ్రతను తీవ్రతరము చేయును. సమయము చాలా కొద్దిదైనప్పుడు కూడ, ఏకాగ్రతవలన సగము సమయము కలసివచ్చును. కడు సామాన్యమైన ఒక ఉదాహరణము తీసికొందము. స్నానముచేయుట, ఉడుపులు వేసికొనుట,—వీనికి అవసరమైన కాలము మనుష్యులనుబట్టి మారును. అవును కదా! అయితే, ఇట్లనుకొందము: కాలహరణము కాకుండా, తొందరపాటు లేకుండా, ఇదంతయు చేయుటకు ఒక అరగంటకాలము పట్టుననుకొందము. నీవు తొందరపాటులో నున్నచో, ఈ రెంటిలో ఏదో ఒకటి జరుగును. నీవు బాగుగా స్నానము చేయవు లేక గజిబిజిగా బట్టలు ధరింతువు. కాలమును వ్యర్థముచేయకుండుటకు మఱియొక మార్గమున్నది. శ్రద్ధాశక్తులను ఏకాగ్రము చేయుట, ఏమి చేయవలయునో దానిని గుఱించి మాత్రమే ఆలోచన చేయుట. రెండవ దానిని గురించి ఆలోచన చేయకుండుట, సరియైన పని చేయుట, అది చక్కని మార్గములో చేయుట ధ్యేయమైయుండవలయును, (అది నా జీవితానుభవము; అందుచే నిశ్చయముగా చెప్పగలను) ఇట్లయినచో, ముందు అరగంటలో చేయుదానిని ఇపుడు 15 నిముసములలో జేయగలవు. బాగుగా జేయగలవు, కొన్ని సమయములలో మఱీ బాగుగా జేయగలవు. దేనినీ మఱువక, దేనినీ విడిచిపెట్టక అవలీలగా సాంద్రతరమైన ఏకాగ్రతతో జేయగలవు.

"ఓ! పనులు బాగుగా జేయవలయునంటే, తప్పనిసరిగా ఎక్కువ కాలము కావలయును " అనే వారందఱికి ఇది సరియైన జవాబు. ఎక్కువకాలము కావలయు ననుట సరియైనది కాదు. చదువుట, ఆడుకొనుట, పనిచేయుట, నీవు చేయు ఈ పనుల కన్నింటికి ఒకే ఒక పరిష్కార మున్నది.—ఏకాగ్రతను ఎక్కువ చేయుట—నీవు ఏకాగ్రతను సంపాదించినప్పుడు, నీకు అలసట కలుగనేరదు. సహజముగా ప్రారంభ దశలో అది బిగువును కలిగిస్తుంది. తరువాత దానికి నీవు అలవాటు పడినప్పుడు, ఆ బిగువు సడలి, క్రమముగా ఒకానొక స్థితి నీకు రాగలదు.

ఏకాగ్రత కలిగియుండక పోవుటయే నీకు విసుగుకు కారణమగును. నీ ప్రవృత్తి పలుముఖము లగుటకు, ఇతర విషయములచేత నీవు దిగ్భ్రమింగ బడుటకు కారణమగును. ఏకాగ్రత వలన ఒకఁడు పనులను బాగుగను త్వరితముగను చేయుటలో విజయము సాధించును. పనులను అభివృద్ధి సాధనముగా చేసికొన గల్గును. అట్లు కానిచో, పనులను ఆసక్తిరహితముగా'' జేయవలెనన్న అస్పష్ట భావనలో పడిపోదువు అది కడు ప్రమాదకరము, ఏలయన ఉపేక్షనే అనాసక్తిగా భ్రమించెడి ప్రమాదము ఇందున్నది.

* * *

ఫిబ్రవరి 24, 1951

ముందొక రోజున నేను, ప్రజలు ఎక్కువ కాలము తమయందు చైత్య పురుషుని కలిగియుండరని చెప్పియుంటిని. దానిని ఎక్కువ విస్తరముగ ఇప్పుడు మీకు వివరించుచున్నాను. మన లోపలనున్న వ్యక్తిత్వాలకు మూఁడవ పరిమాణము ఉండదను సంగతి మీరు జ్ఞాపకముంచు కొనవలయును. నీవు నీ శరీరమును కోసి చూచినట్లయితే, ఆమాశయాది భాగములు కనఁబడును. అవి మూఁడవ పరిమాణము కలిగినవి. లోపలనున్న వ్యక్తిత్వాలు పరిమాణ స్వరూపము వేరువిధముగా నుండును. కొందఱు మానవులు తమలో చైత్యపురుషుని కలిగియుండరని నేనన్నప్పుడు, వారి లోపలి కేంద్రములో చైత్యపురుషుడు లేనేలేడని కాదు, అయితే, వారి బాహ్యచేతన అతి స్వల్పము, అతి పరిమితము, అతి అస్పష్టము అయిన హేతువుచేత, అది, అనగా ఆ బాహ్యచేతన చైత్యపురుషునితో సంబంధము పెట్టుకొన జాలకుండును. దాని యెఱుక గలిగియుండక పోవుటతోపాటు సన్నిహిత సంబంధముకూడ లేకయుండును. చైత్యపురుషుఁడు ఆ బాహ్యచేత

నను అధిగమించి కడుదవ్వున నుండుటచే వాని మధ్య గుణ స్వభావ సంబంధము ఏమాత్రము ఉండదు. మతములు నీలో మినుకు మినుకు మను వెలుగు ఉన్నదని చెప్పుచున్నవి, అది రవ్వంత అయినందువలన శరీరములో ఏభాగము లోనైనను దానిని కష్టము లేకుండ నిక్షిప్తము గావింపవచ్చును. ఇట్లనుట వలన అది శరీర ములో నున్నదని గాదు, అది యెఱుకలోనే మఱియొక విభాగములో నున్నది. దానితో సంబంధము పెట్టుకొన్న వ్యక్తులున్నారు, పెట్టుకోని వారును ఉన్నారు. అయితే, నీవు అణువులోనున్న దైవ సన్నిధి దగ్గరకు వచ్చినట్లయితే ఈ రూప కల్పనను సులభముగా అర్థము చేసికొన వచ్చును. ఎందుకనఁగా, అక్కడ అతి సూక్ష్మమైన ఒక విభాగమును తాకుచున్నావు. నీవు దాని సరిహద్దులలో నుండుట చేత, ఇది, రెండు, మూఁడు, నాలుగు లేక ఐదు విభాగములని ఇదమిద్ధముగా గుర్తింపజాలవు. నీవు ఆధునిక పదార్థ విజ్ఞాన శాస్త్రమును చదువుకొన్నట్లయితే నేను చెప్పునదేమో నీవు అర్థము చేసికొనఁగలవు, అణు నిర్మాణమునకు కారణ మైన విభాగములు పరిమాణములో కండ్లకు కనబడనంత సూక్ష్మాతి సూక్ష్మములు కాబట్టి, వాని కదలికలు మన మూడు పరిమాణముల అర్థ జ్ఞానముతో మనకు బోధ పడవు. అవి అనుసరించే నియమములు పూర్తిగా మన మూడు పరిమాణముల భావమును అతిక్రమించి యుండును గావున దాని నర్థము చేసికొనుట మరింత కష్టము. అందువలన, ఆ దృష్టినుంచి నీవు మాట్లాడినచో, ప్రతి అణువుయొక్క కేంద్రములోను భగవంతుని మిణుకు మిణుకు మను వెలుఁగుకలదని చెప్పవచ్చును. అది సత్యదూరము కానేరదు కూడ. కాని, నేను భగవంతుని మిణుకు మిణుకు మను వెలుఁగును గుఱించి మాట్లాడుట లేదు. చైత్యపురుషుని గుఱించి చైత్య పురుష చేతనను గుఱించి, ఆత్మ విస్ఫులింగమునకు భిన్నమైన దానిని గుఱించి మాట్లాడుచున్నాను. చైత్య పురుషుఁడు రూపము గలిగిన ఒక మూర్తి. ఆ చైత్య పురుష చేతన కేంద్రచేతన చుట్టును వ్యవస్థీకరించబడి యున్నది. దానికి రూప మున్నది, పరిమాణమున్నది. కాని, అది బాహ్యచేతనపు మూడవ పరిమాణ రూపభావనకు భిన్నమైనది.

సుమారు ఏడు సంవత్సరముల వయస్సుగల పసి పిల్లలు తమ చైత్యపురుషునితో విశేష సంబంధము కలిగియుందురని తరచుగా చెప్పబడుచున్నది. ఖచ్చితముగా దీని అర్థమేమి ?

ఇది సరిగాదు. పిల్లలు పుట్టకమునుపే, తల్లి గర్భములో వారు పడక ముందే, వారి చైత్యపురుషుడు వారి రూపకల్పన సమయములో కనుపెట్టియుండు సందర్భము లున్నవి. కొంతమంది పిల్లలు పుట్టి భూమిమీఁద పడగానే, మొదటి కేక వేసినప్పుడు, చైత్యపురుషుఁడు వారితో సంబంధము కల్పించుకొన్న సందర్భము లును ఉన్నవి. కొందఱికి, పుట్టిన కొన్ని గంటల తర్వాత, మఱికొందఱి విషయములో కొన్ని నెలల తర్వాత, కొందఱి సందర్భములో కొన్ని సంవత్సరముల తర్వాత చైత్యపురుషుఁడు వారితో సంబంధము పెట్టుకొనుట సంభవించును. ఇట్లుగాక చైత్యపురుషుని జోక్యమేలేని పిల్లలును ఉన్నారు.

పిల్లలకు ఏడు సంవత్సరాల వయస్సు రాకముందు మానసిక ప్రయత్నము చేయుమని వారిని ప్రోత్స హింపరాదని మీరొక నాడునాతో అన్నారు.

అది వేరే విషయము. పిల్లల భౌతికపు మెదడు ఏర్పడిన తర్వాత నిదానముగా కొద్దికొద్దిగా అభివృద్ధి చెందును. ఏర్పడే మెదడుకు, దాని శక్తికి మించిన పనిని జేయుమని చెప్పిన ఆ మెదడు అలిసిపోను, మితిలేని పని చేయించినట్లగును, తుదకు రోగమున ద్రోసినట్లగును.

చైత్యపురుషుడు, భగవంతుని విస్ఫులింగము, — రెండును ఒకటే యని మీరు చెప్పినారు.

లేదు. నేనట్లు చెప్పలేదు. అది బుద్ధిలేని తనమగును. చైత్య పురుషచేతన భగవంతుని దివ్య విస్ఫులింగం చుట్టు ఏర్పడుతుంది. విస్ఫులింగం ఏకం, విశ్వ జనీనం. అన్ని స్థలముల యందదే అన్నిటి యందదే; అంతము లేనిది. అన్నిటి యందు నొకటిగానే ఉంటుంది. నీవు 'అది ఒక జీవపురుషుడు అనరాదు. నీ కిష్ట మైతే, అది ఒకే ఒక జీవపురుషుడు' అనవలెను; అది ఒక జీవి కాదు. మూలము నకు పోయినట్లయితే ఒకే ఒక ఆత్మ యున్నదనవలెను. సమస్త విశ్వమునకు మూల మొక్కటే అయినట్లు, సమస్త సృష్టికి మూల మొకటే ఐనట్లు, అన్ని జీవాత్మలకు మూల మొక్కటే. అట్లుగాక, స్వంత అనుభవముతో, స్వంత అభి వృద్ధితో, స్వంత పెరుగుదలతో, స్వంత వ్యవస్థతో, చైత్యపురుషుడు ఒక వ్యక్తి. కేంద్ర దివ్య విస్ఫులింగముయొక్క క్రియాఫలితమే ఈ వ్యవస్థ.

అయితే ఏ దినము బాహ్యవ్యక్తి (భౌతిక, మానసిక, ప్రాణికవ్యక్తి సంఘా తము) చైత్యపురుషునితో నేరుగాను, నిరంతరముగాను, సంబంధము పెట్టుకొను నో, అప్పుడు, ఇతని భౌతికసత్త, కేంద్రీయ దివ్యచేతనచే వ్యవస్థచేయబడిన దనవచ్చును. నీవు దానితో సంబంధము పెట్టుకొన్న మరుక్షణమునందే, నీవు దానికి లోబడిన వెంటనే, దానిచే నీవు వ్యవస్థ చేయఁబడుదువు. అనగా, శరీరము దానిచే వ్యవస్థ చేయఁబడినదనియు చెప్పవచ్చును. అయితే అది శరీరము, ఆత్మ కాదు. శరీరము దివ్య విస్ఫులింగముచేత వ్యవస్థ చేయబడినంత మాత్రాన అది ఆత్మ కానేరదు.

## అణువునందు చైత్యపురుష చైతన్యం ఉన్నదా ?

లేదు. అది ఇంకను అక్కడ లేదు. భౌతిక పదార్థములో చైత్యపురుష చైతన్యము రూపొందుటకు అవకాశ మున్నదని మాత్రం చెప్పవచ్చును. దివ్య చైతన్యము వికీర్ణమగుటకు ఒకే లక్ష్యమున్నది. పరమేశ్వరుని ప్రత్యక్ష ప్రభావము క్రిందికి రాగల ఒక వ్యవస్థా నిర్మాణానికి అవకాశము కల్పించుటే ఆ లక్ష్యము.

అందుచేతనే అది అస్తవ్యస్త లోకము లన్నింటిని దాటివచ్చుట జరుగుచున్నది. * అందువలన, అదే విధముగా వ్యష్ట్యాత్మయొక్క మూలము కూడ అణువులోని మూల పదార్థములలో నున్నదనియు చెప్పవచ్చును. అయితే అది మూలము మాత్రమే. అది పూర్తిగా చైత్యపురుష రూపమున వ్యవస్థ చేయబడినప్పుడు, ఆ చైత్యపురుషునికి మన భౌతికరూపమును బోలిన రూపమే ఏర్పడును. అంతే అచ్చముగా అట్లే యుండునని గాదు. కాని, దానికి ఖచ్చితమైన రూపమున్నది. ప్రతి చైత్యపురుషుని రూపము మఱియొక దానితో భేదించుచున్నది. అవన్నియు ఒకే నమూనాలోనుండునవి గాదు. ప్రతి దానికిని ప్రత్యేక వ్యక్తిత్వము గలదు.

తల్లి మరల చదువ నారంభించును :

"చాలమందికి తాము అవతలి వైపునకు (లోకాంతరమునకు) బోయి తిరిగి వచ్చినట్లు జ్ఞాపకముండునా ?"

సంభాషణలు (1929)

నేను తీవ్రముగా జబ్బుపడి, రెండు గంటలసేపు స్మారకము తప్పిపోతిని. అప్పుడు నాకు, నేను లోకాం

---

* ఈ సంభాషణ ప్రచురించు సమయములో మాత తన భావము సుస్పష్టముగ నుండుటకై ఈ క్రింది అంశమును చేర్చినది; "ప్రాణిక వ్యవస్థలోని కొన్ని భాగములు అస్తవ్యస్తలోకములు. అచటి జీవులలో చైత్యపురుషుడు లేడు. చైత్యపురుషుడు భూమిమీదనే, అనగా భౌతిక ప్రపంచములోనే ఉండును. నేను, అందుకనే క్లుప్తముగా చైత్యపురుషుని వ్యవస్థచేయు దివ్యవిస్ఫులింగము అస్తవ్యస్త లోకములను దగచి" భౌతిక ప్రపంచములో అభివ్యక్తమై తన చుట్టును చైత్యపురుష వ్యవస్థకు వీలు గలిగించినది.

తరము కేగినట్లు, వేఱొక ప్రపంచములో ఉన్నట్లు నాకు భావము గలిగినది. నేను తిరిగి స్మృతిలోనికి వచ్చినపుడు, నేను సామాన్యముగా జీవించే ప్రపంచమునకు భిన్నమైన ప్రపంచములో సుదీర్ఘ ప్రయాణము చేసినట్లు భావముకల్గినది.

అది పాక్షికముగా బయటికి బోవుట మాత్రమే. పూర్తిగా బయటికి పోవుట కాదు. పూర్తిగాపోయినచో అది మరణమే యగును. పూర్తి బయటికి పోయినప్పుడు, అనగా శరీరముతో పూర్తిగా విడిపోవడంజరిగి వాస్తవముగా మృతిచెందడం జరిగినప్పుడు, ఒకడు తిరిగివచ్చి నట్లయితే, అది మఱువరాని తీవ్రబాధనే కలిగించును. పసిపిల్లలు భూమిమీద జన్మింపగానే, ఈ వాతావరణముతో గలిగే సంబంధము వలన వారు ఏడ్చుదురని చెప్పబడుచున్నది. దానికి వేరు కారణమున్నదని నేను భావించుచున్నాను. శరీరములోనికి తిరిగి ప్రవేశించుట సంఘర్షణకలిగిస్తుంది; ఎందుకనగా బయటికి పోవునది ఎక్కువగా భౌతికపదార్థముతో గూడినదైతేనే సంఘర్షణవలన బాధ సంభవిస్తుంది. అట్లు భౌతికమైనదేదియో బయటికిపోయి అన్ని సంబంధములు తెగిపోయినపుడే నిజముగా మరణము సంభవిస్తుంది. అందువలననే (ఈ రహస్యమును కనిపెట్టుటకు ఇప్పుడిప్పుడే మనము మొదలిడినాము) జనులు ప్రాణము పోయిన 6 లేక 7 దినములవరకు చావరు. శరీరము యథాతథముగా నున్నంతవరకు చావరు. శరీరము కుళ్ళుటకు ప్రారంభించినపుడే చావు వచ్చినదని నమ్మవచ్చును. ఆ సమయములో ఎవరికైనను, అందుకు గావలసిన జ్ఞానము, శక్తిసామర్థ్యములు ఉన్నట్లయితే ఆ స్థితిలోనున్న వ్యక్తిని పునరుజ్జీవింపజేయవచ్చును. అద్భుతముగా చావునుండి లేచిన పెక్కుసందర్భములకు ఇదియే కారణమని నా అభిప్రాయము.

ఒకడు మృతిచెందినాడు. వైద్యులు గుండెను మర్దించిరి. కొంతకాలముతర్వాత పునర్జీవము పొందినాడు.

అవును. ఆ పరిధిలో కొన్ని "అద్భుతము" లను చేయుటకు ప్రారంభించుచున్నారు.

(తల్లి ఇంకను చదువుచున్నది)

"ఎఱుకయొక్క ఒక దశను చేరుకొన్నతర్వాత నీవు లోకాంతరగతులను జ్ఞాపకముచేసికొందువు. ఈదశను పాక్షికముగా కొంతకాలము అందుకొనుట కష్టముగాదు. గాఢమైన ధ్యానములో. స్వప్నములో లేకదర్శనములో ఒకనికి ఈజీవితము ఇంతకుముందే జీవించితినని, దీనిని అనుభవమునకు దెచ్చుకొంటినని, ఈ సత్యములను తెలిసికొంటినని, భావము కలుగవచ్చును, ఇది పూర్తిసాక్షాత్కారము కాదు. పూర్తిసాక్షాత్కారమగుటకు ఒకడు శాశ్వతమైన ఎఱుకను పొందియుండవలెను. అది భూతభవిష్యద్వర్తమానములలోని మనజీవితములను శాశ్వతముగా తనయందు ధరించియుండును."

మానసిక, ప్రాణిక రంగములలో విచ్చలవిడిగా దిరుగుచు, తాము తమ గతజీవితములను జ్ఞాపకమునకు దెచ్చుకొంటిమని చిలవలు పలవలుగా కథలు చెప్పువారిని ఎంతమాత్రము విశ్వసింపరాదు. బాగుగా పేరుపొందిన ఒక మహిళ తాను కోతిగా నున్నప్పటినుండి తన గత జీవిత విశేషాలను జెప్పినది. ఇది ఒక ప్రబలమైన నిదర్శనము. అది కల్పనాకథ అని నేను ధ్రువపరచుచున్నాను. ఎందుకనగా ఆవిధముగా జ్ఞాపకమునకు దెచ్చుకొనుట అసాధ్యమైనపని.

జరిగేదిది. ఆకర్షణవల్లను, బంధుత్వమువల్లను, ఎన్నికవల్లను, ఒకానొక దివ్యవిస్ఫులింగము చైత్యపురుషచేతనను తన చుట్టు సమీకరించుకొననారంభించె

ననుకొనుడు, (ఇది స్పష్టముగా జంతువులలో కాననగును. నీవే ప్రత్యేక సృష్టివని. నీకొక్కడికే చైత్యపురుషు డున్నాడని, తదితరమైన సృష్టికి లేదని భ్రమపడవలదు. అది లోహములలో ప్రారంభమగును. అంతకంటె కొంత హెచ్చుస్థాయిలో చెట్లయందు. అటుపిమ్మట జంతువులలో రేఖామాత్రముగా మొట్టమొదటి చైత్యపురుషచైతన్యము తోచును). ఈ చైత్యపురుషుడు తగినంతగా అభివృద్ధిజెంది, స్వతంత్రమైన తెలివి, వ్యక్తిగతవివేకము కలుగు సమయము వచ్చును. వ్యక్తిగత ప్రత్యేకతను సాధించిన అనేకజన్మల అనంతరము, తననుగుఱించిన, తన అభివృద్ధికి తనకు తా నెన్నుకొన్న తనచర్యలనుగుఱించి వాతావరణమును గుఱించి తెలిసికొనును. జ్ఞానశక్తిలో ఒక దశకు చేరుకొన్నప్పుడు—సామాన్యముగా భూమిపై తన జీవితము ముగియనున్న కడపటిక్షణమున, ఉత్తరజన్మ ఏ పరిస్థితులలో కొనసాగవలెనో నిర్ణయించుకొనును. ఇక్కడ ఒక ముఖ్యమైన విషయమును గుఱించి చెప్పవలసియున్నది. ఈ చైత్యపురుషుడు ప్రగతినొంది, భౌతికజీవితమందును, ఈ భూమియందును మాత్రమే రూపము నేర్పరుచుకొనును, ఎప్పుడు ఈ శరీరమునువదలిపెట్టునో, అప్పుడు విశ్రాంతిలో ప్రవేశిస్తుంది. ఈ విశ్రాంతిలో తన కోరికప్రకారము తాను సాధించిన అభివృద్ధిననుసరించి. ఎంత కాలముండవలయునో, అంతకాలముండును ఈ విశ్రాంతి పూర్వానుభవమును. జీర్ణింపజేసికొనుటకు, ప్రయత్నములేని అభివృద్ధిని సాధించుటకు పనికివచ్చును. ఈ చైతన్యపురుషుడే అటుపిమ్మట గతానుభవములదృష్ట్యా ఎక్కువ క్రియాశీలముగల అభివృద్ధి నిమిత్తమై పునర్జన్మమునెత్తును. అయితే, ఒక జీవితమును ముగించినతర్వాత (అది సాధారణముగా తాను అభిలషించినది సాధించినతర్వాతనే) అది తాను మరల పుట్టబోవు వాతావరణమును స్థలమును. పరిస్థితులను జీవితవిధానమును తాను కోరిన ప్రగతిని సాధించుటకు వీలుగా పొందవలసియున్న అనుభవముల సునిశ్చిత ప్రణాళికను స్వయముగా ఎన్నుకొనును.

సుస్పష్టమైన ఒక ఉదాహరణను ఈ సందర్భములో నేను మీ కిచ్చె దను. ఒకానొక చైత్యపురుషుడు ఏకారణముచేతనో, రాజు కావలసిన ఒకా నొక పుట్టుకను నిచ్చయించినాడు. ఎందువల్లననగా. పరంపరగా తన అనుభ వముల దృష్ట్యా, పరిస్థితులదృష్ట్యా, అది తనకు తగినదిగా భావించుటవలన. రాజుగా జీవించి ఈ యనుభవముల నన్నింటిని పొందిన తదుపరి, తానున్న జీవితములో ఇక సాధింపవలసినది లేదని గుర్తించినాడు. కనుక తన జీవి తమును ముగించుకొని పోపనిశ్చయించినాడు. తరువాతిజన్మయందు సాధారణ పరిస్థితులలో, సాధారణవాతావరణములో, హెచ్చుకాకుండా తక్కువ కాకుండా తాను కోరినది స్వేచ్ఛగా జేయగలిగినట్టి సన్నివేశము నెన్నుకొన్నాడు. ఎందు కనగా, రాజు జీవితము సేవకుని జీవితము, రాజు తన గౌరవమునిలుపుకొను టకు తా ననుసరింపవలసిన విధానము, అసలుకు నకలుగా నున్నప్పటికి పాటించ వలయును, అన్నిరకములైన ఉత్సవములకు, వినోదములకు తలయొగ్గవల యును. (అది బహుశా స్వాతిశయప్రవృత్తి గలవారికి ఆనందదాయకముగానే ఉండవచ్చును. కాని అది చైత్యపురుషునికి సరిపడదు. ఎందుకనగా ఇందు మూలమున అతడు అనేకమైన ఇతరానుభవములను పోగొట్టుకొనవలసివచ్చును) ఇట్లు నిర్ణయించుకొన్న అనంతరము, రాజజీవితము ఇవ్వగలిగిన అనుభవము లను, జ్ఞాపకములను తనలో నిక్షిప్తముచేసికొని, తనునిర్ణయించుకొన్న కాల వ్యవధిమేరకు విశ్రాంతిగైకొనును. (ఇక్కడ నేను ప్రత్యేకముగా తనయందే తాను నిమగ్నమైన చైత్యపురుషుని గురించి మాట్లాడుచున్నాను. ఒక పనికి సమ ర్పించుకొన్న చైత్యపురుషుని గురించికాదు. అట్లయినప్పుడు, ఆ చైత్యపురు షుని భవిష్యద్జీవితమును, పరిస్థితులను ఆ పనియే నిర్ణయిస్తుంది. ఇక్కడ తన అభివృద్ధిని క్రమక్రమముగా పూర్తిచేసికొను జిజ్ఞాసగల చైత్యపురుషుని గురించి మాట్లాడుచున్నాను). పిమ్మట ఆ చైత్యపురుషచేతన ఒక సమయములో శరీరమును ధరించ నిర్ణయిస్తుంది. ఇదివరకే అనేక అనుభవములను పొంది యున్నది కాబట్టి. దానికి ఏ దేశములో ఏ చేతనావిభాగము అభివృద్ధి గాంచినదో, మరియొక విభాగము ఏదేశములో అభివృద్ధిగాంచినదో, ఈ వివరము లన్నియు

దెలియును. అందువలన, తన అభివృద్ధికి ఏదేశ మనుకూలమగునో—దేశము జీవితపరిస్థితులు, ఇంచుమించుగ దలిదండ్రుల సహజప్రకృతి, శరీరముయొక్క- స్థితిగతులు. భౌతికరూపము, తన అనుభవములకు గావలసిన గుణగణములు —అన్నింటిని ముందుగానే నిశ్చయించుకొనును. విశ్రాంతి అనంతరము, తగు సమయములో మేల్కొ-ని, తన ఎఱుకను తాను కోరుకొన్న ప్రాంతములో, కోరు కొన్న స్థితిగతులలో భూమిమీద కేంద్రీకరించి ప్రవేశపెట్టును. ఇక్క-డకొంత మార్పునకు గూడ అవకాశమున్నది. ఎందుకనగా, చైత్యపురుషచైతన్యస్థితియందొకడు భౌతికజ్ఞానమునకు కడుదూరమున నుండుటచే సుస్పష్టముగా అన్నింటిని చూడలేడు. రమారమిగా మాత్రమే చూచును. దేశమునుగుఱించిగాని, వాతావరణమునుగుఱించిగాని, అతడు పొరపాటు పడడు. తాను ఎన్నుకొన్నవారి ఆంతరచైతన్యమును స్పష్టముగా జూచును. అయితే; లవలేశము అనిశ్చయము సంఘటిల్లవచ్చును. అదే సమయములో భూలోకమునందు ఎవరైనా దంపతులుగాని, లేక ఒక స్త్రీగాని, ఉన్నా రనుకొందము, ఆస్త్రీకి చైత్యపురుషసంబంధమైన ఆకాంక్షఉండి, ఎందుకో, ఎటులనో తెలియకయే, తానొక అసాధారణమైన బిడ్డను, అసాధారణమైన పరిస్థితులకు సమాధానముగా పొంద వలెనని అభిలషించిన దనుకొనుము. ఇట్టి తరుణములో, ఈ ఆకాంక్ష భూలోకములో ఉన్నప్పుడు, అది ఒక స్పందనమును కలిగిస్తుంది, ఒక చైత్యజ్యోతిని వెలిగిస్తుంది. దీనిని ఆ చైత్యపురుషుడు వెంటనే చూచును. ఇక ఆలస్యము చేయక అక్క-డికి పరుగెత్తును. అప్పటినుండి, (అది గర్భధారణసమయము) అతడు ఆ బిడ్డ నిర్మాణమును గమనించుచుండును. ఈ నిర్మాణము తన ప్రణాళికకు అనుకూలముగా నుండునట్లు చూచుకొనును. కాబట్టి ఆబిడ్డ భూమి మీద అవతరించకపూర్వమే చైత్యపురుషుని పలుకుబడి ఆబిడ్డపై ఉంటుంది.

అన్నియు సవ్యముగా జరిగినట్లయితే, ప్రమాదమేమియు సంభవించక పోతే (ప్రమాదములు ఎప్పుడైనను జరుగవచ్చును) బిడ్డ పుట్టబోవు సమయములో అన్నియు సవ్యముగా జరిగినట్లయితే. చైత్యపురుషశక్తి (బహుశ

సంపూర్ణముగా కాదు, కొంతభాగము) వేగముగా ఆబిడ్డలో ప్రవేశించి ఆ బిడ్డ మొదటి అరుపునుండియే, తా ననుకొన్న యనుభవములపైపుగా దానిని నెట్టును. తల్లి దండ్రులు దానిని యెఱిగియుండక పోయినను, బిడ్డ బాహ్యచేతనకు అది ఏమియు తెలియకపోయినను (గ్రహించుటకు వలయు మెదడు చిన్నబిడ్డకు ఉండదు. అది నిదానముగా క్రమక్రమముగా ఏర్పడును) చైత్యపురుషుని పలుకుబడి అన్ని సంఘటనలయందును ఆ బిడ్డ జీవితములో అన్ని పరిస్థితులయందును త్రోవచూపును. ఆబిడ్డ ఎఱుకతో చైత్యపురుషుని తెలిసికోగలిగిన ఘడియ వరకు (భౌతికముగా సాధారణముగా నిది 4 సం. నుండి 7 సం. వరకు, కొందఱి విషయములో ఇంకా శీఘ్రముగను ఒక్కొక్కప్పుడు వెంటనేకూడ. జరుగవచ్చును. అట్లు వెంటనే జరిగినప్పుడు ఆబిడ్డలు మామూలు 'బిడ్డలు' కారు. వారిలో 'అప్రాకృత లక్షణములు' గోచరించును. అది కేవలము చైత్యపురుష సాన్నిధ్యాభివ్యక్తిఫలితమే) తమకు బోధింపగలినవారిని కలిసికొనుటకు భౌతికముగా అవకాశము లేనివారు, లేక అట్టి అదృష్టము కలిసిరానివారు ఉన్నారు. అయినను, అడుగడుగునా తమ జీవితములో అవసరమైనప్పుడెల్లా ఒకరు తమ్ము నడిపించుచున్నారని. అందు వలన తాము అత్యధికాభివృద్ధిని పొందుచున్నామనే భావము వారికుండును, వారికి ఒక పరిస్థితి అవసరమైనప్పుడు అది కలుగుచున్నది; వారొకరిని కలిసికొన గోరినప్పుడు వారు వచ్చుచున్నారు. వారు కొన్నిగ్రంథములను చదువుకొన దలచినప్పుడు అవి వారి అందుబాటులోనికి వచ్చుచున్నవి. ప్రతి విషయము ఆవిధముగా ఏర్పాటగును. ఎవరో ఒకరు వారిని కనిపెట్టి, వారి అభివృద్ధికి సకలవిధములైన అవకాశములను కల్పించుచున్నట్లు వారికి విశదమగుచున్నది. వీరు, "అయితే చైత్యపురుషుడనగా ఎవరు?" అనుచున్నారు. ఎందు వలన? ఎవరును వీరికి చైత్యపురుషుడను మాటనుగుఱించిగాని, ఆ పురుషుని గురించిగాని వివరించియుండలేదు. అటువంటివారికి, ఒక్కతూరి కలిసికొనుట ఒక్కతూరి చూచుట చాలు, వారిని మేలుకొల్పుటకు, వారు జ్ఞాపకమునకు దెచ్చుకొనుటకు ఒక మాట చాలు. అప్పుడు వారు, "అదంతయు మాకు దెలియును," అందురు.

తన అభివృద్ధిమార్గమున చివరిఘట్టమును చేరిన చైత్యపురుషుని విషయమున సరీగా ఇదే జరుగును. తర్వాత భూలోకమున అవతరింపవలసిన అవసరముండదు. తన అభివృద్ధిని పూర్తిచేసినందువలన, భగవంతుని పనికి తనను పూర్తిగా సమర్పించుకొనుటయో, లేక ఊర్ధ్వలోకములకు వెళ్ళుటయో తను స్వేచ్ఛగా నిర్ణయించుకొనవచ్చును. అయితే, సామాన్యముగా ఈదశలో నున్న చైత్యపురుషుడు, తనకు సంభవించినదంతయు జ్ఞాపకము చేసికొని కష్టములలో కొట్టుమిట్టాడుచున్నవారికి సహాయము చేయవలసిన అవసరమును గుర్తించును. ఈ చైత్యపురుషులు దైవకార్యమునకు తమ ఉనికిని అర్పించి వేయుదురు. అయితే, ఇది ధ్రువమైనది, తప్పనిసరియైనది గాదు. వారు స్వేచ్ఛగానే నిర్ణయము చేసికొందురు. కాని, నూటికి 90 పాళ్ళు ఈవిధముగనే జరుగుచుండును.

అయితే, సామాన్యుల జీవితములో, అనగా చాలినంత అభివృద్ధి సాధించినవారిలో, బాహ్యజీవికి, చైత్యపురుషునికి గల సంబంధము అప్పుడప్పుడు కలుగుచుండును. అది అనుభవములనుబట్టి, కొన్ని అవసరములనుబట్టి జరుగుచుండును. ఆసమయములలో శ్రీఅరవిందులు చెప్పినట్లు, చైత్యపురుషుడు 'ముందుకు' వచ్చియుండును. నేరుగా భౌతికపరిస్థితులతో, రూపములతో, మాటలతో, శబ్దములతో ఇంచుక కాలము మాత్రము సంబంధము గలిగియుండును. ఫొటోగ్రాపులోవలె, సినిమాలోవలె, సమస్తము నమోదుచేయును. ఇది జీవితకాలములో ఒకనిమిషకాలము, లేదా కొలది నిముషములుమాత్రమే. ఈ క్షణకాలసంబంధములు పునఃపునః కలుగుచుండవచ్చును. అయితే ఇవి శాశ్వతములుగావు. దీనినే చైత్యపురుషుడు జ్ఞాపకముంచుకొనును. నీకు, చైత్యపురుషసంబంధమైన జ్ఞాపకములు, నమ్మకమైనవి, అయత్నకృతమైనవి, మనస్సుచేతగాని, ప్రాణముచేతగాని, కల్పితములుగానట్టివి. అనగా శుద్ధముగా ఆత్మవి, సరియైనవి, అయినప్పుడు, ఇది ఎడనెడ వచ్చిపోవునవిగానే యుండును. "నేను ఇదిగా ఉంటిని, అదిగా ఉంటిని." అని పూర్వజన్మలనుగురించి జ్ఞాప

కము దెచ్చుకొనుట దుస్తరము. నీ జీవితములోని ముఖ్యఘట్టములందు చైత్య పురుషసంబంధమైన అనుభవములు సంభవించినప్పుడు, ఆయా పరిస్థితుల సముదాయము 'తాళపుచెవి' మాదిరిగ ఒక కథను (ఉడుపులు, మాట్లాడినమాటలు, అలవాట్లు, వాతావరణము మొదలగునవి) అందించినప్పుడు "ఓః అవును, ఆజీవితము నేను జీవించితిని" అని నీవు అనగలుగుదువు. అయితే, ఒకానొకడు వచ్చి తన పూర్వజన్మములను కోతిదగ్గరనుండి పూసగుచ్చినట్లు సర్వ వివరములతో జెప్పినయెడల, అది యంతయు మోసమని విశ్వసించుము.

> చైత్యపురుషుడు తన భౌతికశరీరము కాగలదానిని "యాదృచ్ఛికముగా" కలుసుకొనుటనుగుఱించి మీరు వక్కాణించి యున్నారు."

కాదు. నేనన్నది "ఆకస్మికముగా" అని. ఆకస్మికము యాదృచ్ఛికము కాదు.

జీవితములో, వ్యతిరేకశక్తుల మధ్య ఘర్షణ సర్వదా ఉన్నది. ఈ ఘర్షణయొక్క ఫలితము, ఊర్ధ్వచేతనను గుఱించిన యెఱుక గలిగిననేతప్ప ముందుగా దెలియదు. మానవునిచేతనను మించని చేతనతో ఎవడును ఆఘర్షణయొక్క ఫలితమును ముందుగా గ్రహింపలేడు, అందువలననే అది "ఆకస్మికముగ" సంభవించినదిగా పిలువబడుచున్నది, ఆ ఆకస్మికసంఘటనకు గల కారణములు సామాన్యచేతనకు ముందుగా తెలియబడవు.

> స్వప్నములో నా పూర్వజన్మపు సన్యాసిజీవితమునకు సంబంధించిన చిత్రములను జూచినట్లు భావించితిని.

భారతదేశములో ఆధ్యాత్మిక జీవితమును కొనసాగింప వలయునన్న సన్యాస జీవితమును గ్రహింపవలెనను బలమైన సూచన ఉన్నది. ఇది బహుశా నీ స్వప్నమునకు గారణమైయుండవచ్చును. ఏమైనప్పటికి అది నిజముగా పూర్వజన్మకు సంబంధించినదైతే చిట్టచివరిది మాత్రముగాదు. నీవు నిజముగా మధ్య జన్మలుకూడ ఎత్తియున్నావు. వరుసగా ఒక దేశములోనే జన్మల నెత్తుట అరుదు. అది లాభకరమైనదికాదు. ఉదాహరణకు, నీవు చూచినది మొదటి క్రైస్తవుల కాలములోని సన్యాసిజీవితమై యుంటే, నీవు కొన్ని వివరములు చూచియుందువు. నీచర్మపురంగులో, భేషము, ఉడుపులు వగైరా, కాని నీవు బహుశా భారతీయజీవితమునకు సంబంధించిన చిత్రములనే చూచియుందువు. ఏదైనను సంభవించుటకు వీలున్నది. ఈవిశ్వము, సకలసంభావ్యతలు నెరవేరుటకు వీలుగా నిర్మింపబడియున్నది. అయితే, నేను చెప్పినట్లు, ప్రత్యేక అంత్యలక్ష్యమును దృష్టిలోబెట్టుకొన్న ఒక ప్రత్యేకకార్యమును సాధించుటకుతప్ప ఒకే దేశములో అనేకమార్లు జన్మముల నెత్తుట అరుదు. అట్టి సందర్భములో అద్దానిని తెలిసికొనకపోవుటయు అరుదే. చైత్యపురుషుడు పూర్తిగా ఏర్పడి, ఒక లక్ష్యముతో పనిని ప్రారంభించి ఆప్రత్యేకపనిని సాధించుటకై తనకు తానే అదే దేశములో పునర్జన్మమెత్తినాడని దీని యర్థము.

అనేకులు పూర్వజన్మములలో సన్యాసి జీవితమును సాగించియుండవచ్చును. ఎందుకనఁగా, తత్సంబంధమైన సామూహిక సూచన ఈ దేశములో బలముగానున్నది. ఒకఁడు తాను పరిపక్వతనంది ఆధ్యాత్మిక జీవితము జీవించుటకు ఈ ప్రపంచమును విసర్జింపవలయునని ఆలోచించుట సహజము.

సాంకేతికముగా రాబోవుదానిని సూచించు కలలున్నవి. కాని గత జన్మములలోని నిజమైన స్మృతులతో గూడిన కలలు కనుట సర్వసాధారణము గాదు. ఆ విధముగా కలలు గనుటకు ఒకఁడు తన చైత్యపురుష చేతనలో ఆ స్వప్నము

లను గాంచవలయును. ఎక్కువమంది అందులకు సమర్థులు గారు. ఒకడు మానసిక, లేదా ప్రాణ సంబంధమైన ఎఱుకలోఁ కలలు గనుచుండునేకాని, చైత్య పురుష చేతనయందు కలలు గనుట చాలా అరుదు. అది జరుగవచ్చును గాని అరుదు.

కొన్ని సమయములలో స్మృతులని తలంచబడు కలలు వచ్చును. అయితే అవి సాంకేతికములు మాత్రమే. లోపలి తెలుపై రూపములతో కూడిన ఒక ఘట్టమును, అందులో నీవొక నటుడుగా నున్నట్లు ప్రదర్శించిన ఒకానొక మానసిక కల్పనను నీవు కలలో జూతువు.

ఇక్కడ భారతదేశములో పిల్లలు తరచుగా గ్రామాలలో జన్మింతురు. వారు పసితనములో నుండగానే గత జన్మములోని తమ గ్రామము, అందు తామెక్కడ నివసించుండినది, తమ తలిదండ్రులు వగైరా విషయములను గురించి చెప్పుచుందురు. ఇది నిజమేనా?

నిజమే. కాని, సామాన్యముగా ఈ పిల్లలు పసితనములోఁ గాని, చిన్న వయస్సులో నున్నప్పుడుగాని, మరణించియుందురు. వారి పూర్వజన్మ వృత్తాంతము అప్పటికి మాసిపోయి ఉండదు. ఇది జరుగుట కవకాశమున్నది.

చైత్యపురుషుని అభివృద్ధి స్వరూప మెట్టిది?

అది వ్యక్తిత్వ ప్రధానమైన అభివృద్ధి. అన్ని అనుభవములను కూడగట్టి దైవచేతన చుట్టును వ్యవస్థీకరించు శక్తి నయ్యది కలిగియుండును.

చైత్య పురుషుని లక్ష్యమేమన, దైవచేతనచుట్టు, వ్యక్తిని, వ్యక్తిత్వమును, నిర్మాణము చేయుట. సామాన్యముగా బాహ్యజీవితముయొక్క అనుభవము లన్నియు (యోగముద్వారా చైతన్యవికాసము పొందినట్లయితే) ఆంతరంగిక పురుషుని వ్యవస్థ చేయకుండానే గడచిపోవును. చైత్యపురుషుఁడు ఈ యనుభవముల నన్నింటిని వరుసగా సంఘటిత మొనర్చును. అది దైవమునెడ ఒక ప్రత్యేక వైఖరిని తనలో దీపింప జేసికొనన నభిలషించును. అందుచే నది ఆ వైఖరి తనలో దీప్తమగుటకు అనుకూలమైన అన్ని అనుభవముల కొరకు నిరీక్షించును. ఉదాహరణకు గొప్ప సామంత కుటుంబపు అనుభవము నొకదు అభిలషించె నను కొనుము. ఈ సామంతుడు సాధారణ మానవునివలె చలింపలేడు. ఈతని అభిజాత్యము ధీరత్వముతో, అపాయకర పరిస్థితినిగూడ సాహసోపేతముగా భయము లేక ఎదుర్కొనుటకు పురికొల్పును. రాజు శరీరములోఁ బ్రవేశించిన వాడు, ఏమి సంపాదింప గల్గునో వివరించెదనని ఇది వరకు చెప్పియుంటిని. ఇతరులవలెనే రాజుకూడ సామాన్య మానవుఁడే. అతనిలో ప్రత్యేక చేతన యేమియు లేదు. అయితే అతని జీవితావసరములనుబట్టి, అతఁడు తన ప్రజలకు ప్రతీకవంటివాడు కాబట్టి, సామాన్యుడుగా తాను చేయనొల్లని పనులను తన పదవినిబట్టి చేయవలసి వచ్చును. ఇది నాకు అనుభవము వలన తెలియును. వాస్తవిక పరిస్థితిలో రాజుకు చిహ్నముగా నుండిన ఫొటోగ్రాపులను నేను చూచితిని. ఏదో జరిగినది; అతని ప్రాణమును దీయుటకు ప్రయత్నము జరిగియుండవచ్చును. కాని, అతడు దాని నుండి రక్షింపఁబడెను, ఆ ఫొటోగ్రాపులలో రాజు సైనిక దళమును తనిఖీచేయు చుండెను. ఉన్నట్లుండి ఒకఁడు ఆయన మీదికి దూసుకొని వచ్చెను. చెడ్డ ఉద్దేశముతోనే కావచ్చును, కాకపోవచ్చును,—ఏమియు జరుగలేదు కాబట్టి. ఏమైనప్పటికి, సంపూర్ణ నిర్లక్ష్యభావముతో, నిర్వివాదమైన శాంతితో, చిరునవ్వుతో అతడు తానున్న తావునుండి ఇంచుకేనియు, జలింపక నిలిచియే యుండెను. తన మీఁదికి దూసుకొని వచ్చినవాడు సులభముగా హాని జేయుటకు వీలుగా సమీపములో గుఱికి అనువుగా నుండెను. నాకు తెలిసినంతవరకు ఈ రాజు వీరుఁడుగాడు. కాని, రాజు స్థానములో నున్నందున పరుగెత్తలేదు. అట్లు చేసియుండినట్లయిన కడు నీచముగ

నుండును గదా? అందువలన అతడు ప్రశాంతితో, ఆ తావునుండి చలింపక, బాహ్యమునకు భయమును జూపక నిలిచియుండెను. రాజు జీవితము నుండి నేర్చుకొనవలసిన దానికి ఇదియొక ఉదాహరణము.

ఎలిజబెత్ రాణిని గుఱించిన యదార్థగాథ యొకటి కలదు. ఆమె తన జీవిత అంత్య దినములలో నున్నది. చాలా జబ్బుగా నున్నది. దేశములో క్లిష్ట పరిస్థితు లున్నవి. పన్ను విధింపులను గుఱించి, ఒక గుంపు జనము (వ్యాపారు లను కొంటాను) ఒక మహజరును ఆమెకు సమర్పించుటకు ప్రజా పార్టీ ప్రతినిధి వర్గ ముగా ఏర్పడినారు. ఆమె తన గదిలో నిలబడలేనంత జబ్బుగా నున్నది. అయితే ఆమె నిలబడి, ఉడుపులను ధరించుకొన్నది వారికి దర్శన మిచ్చుటకు. ఆమె సేవకు రాలు "అది అసాధ్యము, మీరు నిలబడిన మరణింతురు", అని కేకవేసినది. రాణి ప్రశాంతతో; "మనము తరువాత చచ్చిపోదము" అన్నది. ఇది రాజు జీవితములో ఒకఁనికి కలుగు అనుభవ పరంపరలో నుండి ఒక ఉదాహరణము. ఈ విధమైన జీవితమును ఎన్నుకొన్న చైత్యపురుషుని ఎన్నికను సమర్థించునట్టి గుణవిశేష మిదియే.

ఈ విధమైన జ్ఞాపకములే, అనుభవముయొక్క వాస్తవికతను నిరూపణ చేయును. ప్రజలు తమ పూర్వ జన్మవృత్తాంతములను చెప్పునపుడు సాధారణ ముగా జరుగునదిది ; ఈ జీవితములలో సర్వత్ర సహజముగా అభివృద్ధి కలదు. కావున వీరు అంతకంతకు అద్భుత పరిస్థితులలో జీవించెడి అద్భుత మానవులన్న మాటః ఇది తప్పు. విషయము లెప్పుడును అట్లు జరుగవు. చైత్యపురుషుఁడు కొన్ని గుణములు శక్తులు వగైరాలను అభివృద్ధిపరుచు ఒకానొక జీవిత పంథా ననుసరించును. తనకు ఏమి కొఱతయో తానెరుగును గాన, ఉత్తరజన్మలో ఇప్పటిదానికి భిన్నమైన దాని నతడు ఎన్నుకొనవచ్చును. ఈ యనుభవము వలన దోహదమైన అనుభవములను గైకొనును.

* * *

ఫిబ్రవరి 26, 1951

"యోగానుష్ఠానపు ప్రారంభదశలో, సామాన్య పుస్తకములను చదువుట సాధకునికి మంచిదా?"

(సంభాషణలు 1929) పేజి 31

అనేక మారులు నన్ను అడిగిన ప్రశ్న యిది. ఎవరైనా తాను సామాన్య పుస్తకములను చదివినందున తన కెట్టిఫలితము కాననయ్యేనో, చెప్పినట్లయితే అది నా కెక్కువ ఆసక్తిదాయకము కాగలదు,

సాధారణ పుస్తకాలు నాకు విసుగు పుట్టింప జేయును.

అది మంచి చిహ్నమే.

అవి మనస్సులో నాకు విశ్రాంతి నిచ్చును. నా మీఁద ఏ గుణమును గలిగింపవు.

అట్లుగాదు. మన యందలి అవచేతన సర్వమును నమోదు చేస్తుంది. సామాన్య పుస్తకములు నీమీఁద ఏ గుణమును కలిగించవను అభిప్రాయము నీకు గలిగినట్లయితే నీ లోపల ఏమి కలుగుచున్నదో నీకు దెలియదని దాని యర్థము. చైతన్యస్థాయి తక్కువగా నున్న పుస్తకము చదివిన ప్రతిసారి అది నీ అవచేతనను అచేతనను బలపరచుట సంభవించును. నీ చేతనను ఊర్ధ్వమునకు పోనీకుండా జేయును. నీ అవచేతనను శుభ్రపరచుకొను ప్రతి ప్రయత్నము మీఁద, బక్కెట్లతో కలుషిత జలమును బోసినట్లగును,

అది తప్పదు. అయితే, తమచేతన చాలా క్రింది స్థాయికి బడి పోయినదని గుర్తింపలేని ప్రజలుకూడ ఉన్నారు.

మామూలు సంభాషణ, నిన్ను సామాన్య జీవితపు స్థాయిలో నిలిపియుంచి నీకు తలనొప్పికలిగించే స్థితి ఒకటున్నది. అది కొనసాగినట్లయితే నీ కడుపులో త్రిప్పి నట్లయి నీకు జ్వరము వచ్చును. నేను ఉబుసుపోకకు చేసే సంభాషణలను గురించి చెప్పుచున్నాను. ఎవ్వరో కొందఱు తప్ప ప్రతి ఒక్కరు ఈ విధమైన కసరత్తులో పాల్గొనుచుందురు. మౌనము వహించవలసిన విషయములపైన కూడ మాట్లాడు దురు, ఇంకా ఇతర విషయములను తడవుదురు. నీవీ విధముగా కొనసాగించి నట్లయితే నీ చేతనను పైకి రాకుండా పూర్తిగా ఆటంక పరచినవాడ వగుదువు. ఇనుపగొలుసులతో సామాన్య చేతనకు నిన్ను నీవు బంధించుకొందువు. అవచేత నలో జరగవలసియున్న పని జరుగదు. ప్రారంభమైనను గాదు. పైకి రావలయు నని కోరువారికి తగినన్ని కష్టములు, బయటి ప్రోత్సాహమునకు ఎదురుచూడ నివ్వ కుండ చేయునవి ఇది వరకే ఉన్నవి.

సహజముగా నీ కండరములను బలపరచుటకు జేయు కసరత్తువలెనే. నీ చేతనను ఉన్నతస్థాయిలో నుంచుటకు జేయు ప్రయత్నములు నీకు ప్రారంభములో అలసటచేకూర్చును. ఆకారణమువలన నీవు కసరత్తును విడిచిపెట్టుటలేదు. కనుక మానసికముగా గూడ నీవు ఆవిధముగనే చేయవలయును. నీ మనస్సు క్రిందికి దిగజారు అవకాశమును నీవు కల్పించకూడదు. పనిలేని మాటలు నిన్ను క్రిందిస్థాయికిదించును, నీవు యోగము చేయవలయునంటే దానిని విస ర్జించి తీరవలయును—అంతే.

(తల్లి ఇంకను చదువుచున్నది)

"నీవు పవిత్రమైన పుస్తకముల జదువుచుండినను దైవమునకు దూరముగనే ఉండవచ్చును, అటులే నీవు

వివేకహీనమైన రచనలను చదివినను భగవంతుని సంబంధము గలిగియుండవచ్చును. భగవంతునితో ఏకత్వమున నుండగల చేతనామార్గమొకటి కలదు. దానిలో ఉండి నీవు చదివినదంతయు, గమనించినదంతయు, నీ కానంద ప్రదముగా నుండును, ప్రపంచములోని ప్రతిదానికిని అద్దాని చరమసత్యము, దైవాధారము కలదు. భౌతికమైన. నైతికమైన, రసభావసంబంధమైన. ఏదో ఒకటి దర్శనమయి నిన్ను ఆటంకపరచనట్లయితే, నీవు సౌందర్యమును, ఆనందమును, సామాన్యబుద్ధికి అసహ్యాము గను, నిర్భాగ్యముగను, బాధాకరముగను, పరస్పరవిరుద్ధముగను కనబడువానిద్వారానైనను బొందవచ్చును."

— (అదే గ్రంథము)

నేను ఇక్కడ మాట్లాడే చేతనాస్థితిని సాధించుట మిక్కిలి కష్టము. అది సంవత్సరములతరబడి సాధన చేయవలసిన క్రమశిక్షణ. అది ప్రతివారికి అందుబాటులోలేని భగవత్సాక్షాత్కారము. అయితే, ప్రతిఒక్కరు అనుభవించి ముందుకు సాగవలసిన ఒకానొక మధ్యస్థితి ఉన్నది. ఆస్థితియందు సాధకుడు తనకును—తాను వినగూడని, చూడగూడని అన్నింటికిని—గల సంబంధమును తెగగొట్టుకొనును.

(తల్లి మఱియొక ప్రశ్నకు పోవుచున్నది) "ఏమి జరిగినదో అది జరుగవలసియే యున్నదనుట స్పష్టము. అది ఉద్దిష్టబడనిదైతే జరిగి ఉండదు, మనము చేసినతప్పులు మనకు సంభవించిన కష్టములు, అన్నియు జరుగవలసినవే, ఎందువల్లననగా, మనకు వాని ఆవశ్యకత ఉన్నది; మన జీవితాలకు ఒక ప్రయోజనమున్నది. అయితే, నిజముగా వీనిని మానసికముగ వివరించలేము. వివరించబడకూడ

దుకూడాను. సంభవించినవన్నియు మనకవసరమైనవే. మానసికకారణమువలన గాదు, మానసిక ఆలోచనాపరిధులను దాటించి మనలను ముందుకు కొనిపోవుటకు అయితె, అసలువీనిని వివరించవలసిన అవసరమున్నదా? ప్రతివిషయముచు. ప్రతిఘడియలోను ఈ విశ్వమంతయు వివరించుచునేయున్నది. పూర్తివిశ్వము ఏవిధముగా ఉండవలసియున్నదో ఆవిధముగానే యున్నది. కాబట్టి, జరుగవలసినది జరుగును." (అదేగ్రంథము)

విశ్వము ప్రతిదానిని, ప్రతినిమిషములోను వివరించుచునే యున్నది. అది చాలా ముఖ్యమైనవిషయము.

ఒకడు ఒక భాషను నేర్చుకొనవలయునన్న పుస్తకములను చదువవలసినదే. ఉదాహరణకు, 'అలెగ్జాండర్ డ్యూమా' రచనలవంటి సామాన్యపుస్తకమును చదువవలసిన అవసరము లేదా ?

అవును, భాషను నేర్చుకొనుటకు చదువగోరినట్లయితే, ఒక రచయిత తన అభిప్రాయములను ఏవిధముగా వెలిబుచ్చినాడో అర్థము చేసికొన వాంఛించినట్లయితే, అది సవ్యముగానే ఉన్నది. అయితే, దేనినిపడితేదానిని చదువుటకు ఇది సాకు కాగూడదు.

కల్పనాకథలకు ఏమైనను విలువ ఉన్నదా?

అది ఆ కల్పన యొక్క గుణముపై అధారపడిఉంటుంది. ఒకని కల్పనాశక్తిని, వృద్ధిచేసికొనుటకు అది మంచిదే అని నీవన్నట్లయితే, ఇది సరియైనదే. కాని, నీవు తీసికొనవలసిన జాగ్రత ఏమిటంటే, అసత్యమైన కల్పనలను వృద్ధిచేసికొనగూడదు.

ఊహాకల్పితమైన కథలు జీవితముతోను, సత్యముతోను సంబంధము కల్పింపవా ?

సర్వదా అట్లు కల్పించునని చెప్ప వీలు లేదు. 'అసత్యముతో సంబంధము' అంటే అర్ధమేమి? ఇసుకరేణువులోను సత్యమున్నది. ఆమాట కర్ధములేదు.

పుస్తకములలో చిత్రించవలసిన పని లేకుండానే ప్రపంచములో అసహ్యకరమైనవి చాలినన్ని ఉన్నవని నీవు భావించుటలేదా! జీవితము అతి నికృష్టము, నీచము, కొన్నిసమయములలో అసహ్యకరములై కన్పట్టుచుండినస్థితిలో, ఇది వరకున్నవానికంటె ఇంకను చెడ్డవానిని గురించి ఊహించుట యెందుకు? ఈవిషయము చిన్నప్పటినుండియు నాకు ఆశ్చర్యము కలిగించుచుండెడిది. మరింతసుందరమైనదానిని, మరింతసుందరమైన జీవితమును ఊహించినట్లయితే అది నీవు తీసుకొన్నశ్రమకు తగినదిగా నుండును. అసహ్యకరమైన వానిని గురించి వ్రాయుటలో సంతోషమును పొందువారు ప్రకటించునది మనోదారిద్ర్యమును, అది సర్వదా మనోదారిద్ర్యపు లక్షణమే. ఒక కథను ఆదినుండి అంతమువరకు సుందరముగా నుండునట్లు చెప్పుట మహాకష్టము. దానికంటె, సంక్షోభకరమైన ఒక సంఘటనతోనో, లేక ఒక అవాంతరముతోనో ముగియునట్లు వ్రాయుటసులభము. చాలామంది రచయితలు, సంతోషముతోను, ఆనందముతోను ముగియునట్లు కథను వ్రాయబూనినచో అది వారు చేయజాలరు. వారికి తగినంత ఊహాబలముండదు. ఏవో కొన్ని కథలు ఉన్నతస్థాయితో ముగిసినట్లు వ్రాయబడియున్నవి. తక్కినవన్నియు న్యూనతతో ముగిసినవే. దీనికి

కారణమేమన, పైకిపోవుటకంటె క్రిందపడుట సులభము. గొప్పతనము, ప్రతిభ వెల్లడియగు అంశముతో కథను ముగించుట అత్యధిక కష్టమైన విషయము. తన కథానాయకుని, తన్ను తాను అధిగమించు ప్రతిభాశాలినిగా సృష్టించుటకు రచయిత తానెంతో మేధావిగా నుండవలయును. ఇట్లు అందఱు రచియింపలేరు.

> సామాన్య గ్రంథములు చదువునప్పుడు, రచయితయొక్క మనస్సులో బ్రవేశించుచున్నాననే అభిప్రాయము కలుగును. అది ముదావహముగా నుండదు, ఒకడు బయటివానితో, వ్యాపారవిషయముగాని, పనివిషయముగాని మాట్లాడుట మంచిదిగానే, సంతోషజనకముగానే ఉండును. కాని, వానితోనే అతని వ్యక్తిగతవిషయములను గుఱించి సంభాషించినచో వెంటనే అది బాధాకరముగా నుండును, నేనిది గమనించిన విషయము,

అవును; ఎందుకనగా, పని సాంకేతికవిషయమునకు సంబంధించినదైనప్పుడు అది మనిషిలోని ఉత్తమమైన అభిప్రాయమున సంబంధించినది కనుక, ఆసక్తిదాయకముగానే నుండును. వ్యక్తిగతవిషయమైనప్పుడు వాడు క్రిందిస్థాయికి పడిపోవును. ఎవరో కొందరట్లు పడకపోవచ్చును. అందువలన, అద్భుతమైన పండితులు, రచయితులు, కళాకారులు, ఆశ్చర్యకరమగువానిని ఉత్పత్తి చేయగలిగినవారు ఇంట అడుగుబెట్టగానే హేయమైన భర్తలుగాను, నిస్సంతోషులైన తండ్రులుగాను, భరింపరానివారుగాను తన చుట్టునున్న వారికి కనబడుదురు. నేను సంఘములో శ్రేష్ఠులనబడువారి గుఱించి మాట్లాడుచున్నాను. ఎవరైతే, ప్రత్యేకవిషయములో నిపుణత్వమును సాధించినారో, నూతనవిషయములను కనుగొన్నారో, గొప్పసంస్థలను నడుపుచున్నారో, వారు బయట అసాధారుణులు, గొప్పశక్తికలిగినవారు, ఇంటికి రాగానే సామాన్యులు, తరచుగా భరింపరానివారు అగుదురు. సావకాశముగానే వారు విశ్రాంతిగైకొందురు,

బిగువుసడలించుకొందురు. కాని, వారు వినోదించుటకు బూనుకొనినతోడనే సర్వము వమ్మగును. గొప్ప తెలివిగలవారిని, పొగడతగిన కళాకారులను నే నెఱుగుదును. వారు వినోదపడ నారంభింపగానే పూర్తిగా బుద్ధిహీనులై పోయినారు, చాలా అసహ్యాకరమైన పనులను చేసినారు. క్రమపద్ధతిని పెంచబడని బిడ్డలవలె ప్రవర్తించినారు. ఇదంతయు బిగువు సడలించుకొనుటకు చేయు ప్రయత్నఫలితముగా కలిగినదీ దురవస్థ. అనేకుల విషయములో దీని అర్థమేమి? అది సర్వదా క్రిందిస్థాయికి దిగిపోవడమే అవుతుంది. నిజమైన కాలక్షేపమేమనగా, ఒకడు ఒకమెట్టు పైకి పోవలయును, తనను తాను అధిగమింపవలెను. క్రిందకు దిగజారిపోవుటవలన, ఒకని అలసట పెరిగి మూఢత్వమేర్పడును. అంతేకాక, క్రిందకుదిగజారిన ప్రతిపర్యాయము, వాని అపచేతన మరింత బరువెక్కిపోవుటయే యగును. బరువెక్కిన అవచేతనను, తాను ఉన్నతస్థాయికి పోవలయునన్నచో, శుభ్రపరచవలయును; లేనట్లయితే అది కాళ్ళకు బంధమువేసినట్లు పరిణమిస్తుంది. అయితే అది బోధచేయుట కష్టము. ఒకడు ఇతరులకు బోధించగలుగుటకు ముందు తన్ను తానుబోధించుకొనవలయును.

ఇది పిల్లలకు ఎప్పుడును బోధింపలేదు. వారికి ఆటవిడుపు కలిగింపవలెనను సాకులో వారికి బుద్ధిమాలిన పనులన్నీ చేయుటకు అవకాశము గల్పించబడినది.

ఒకడు తాను క్రిందికి మునిగిపోవుటచేగాదు తన అలసటను బాపుకొనుట. నిచ్చెన యెక్కవలెను. అక్కడనే వానికి విశ్రాంతి, ఎందుకనగా, అక్కడ అంతరశాంతి, వెలుగు, విశ్వజనీనమైన శక్తిలభించును. కొద్దికొద్దిగా సత్యముతో సంబంధము సంపాదించుకొనును, అదియే ఒకని జీవితపరమార్థము.

నీవా సంబంధము కలిగించుకొన్నట్లయితే, నీ అలసటఅంతయు పటా పంచలగును.

ఒకడు తన తప్పును తెలిసికొన్నప్పుడు తిరుగా దానిని చేయజాలడు, చేయగలడా?

ఒకడు పట్టుదల గలవాడైతే చేయడు, చేసినతప్పులనే మఱలమఱల చేస్తున్నట్లయితే, ఎక్కడో ఒకచోట అతడు పతనము జెందును. ఒకడు తన తప్పును తెలిసికొన్నతర్వాతకూడ, దానిని పదేపదే చేసినాడన్నచో దాని అర్థము, వాని బాహ్యచేతనయే దానిని గుర్తెఱిగినదని, తక్కినదంతయు చేసినతప్పుకు సంతృప్తిచెంది దానినే బలపరుచుచున్నదని గ్రహింపవచ్చును. తప్పుచేసేప్రమాదముగాకుండా "నేను పదేపదే అదే తప్పును చేసినచో నాకు అంతశ్శుద్ధి లేదన్నమాట." అని చెప్పుకొనుము, అంతశ్శుద్ధికలవాడవగుటకు ప్రయత్నించుము.

ఒకఁడు ఇతరులతో మాట్లాడునప్పుడు, ఒకఁడు వారితో అరుదుగా ఏకీభవించును. ఎందుకనఁగా అందరు ఒకే దృక్పథమును గలిగియుండరు. అట్లుగాక నేను ఇతరుని అభిప్రాయమును చూడగలిగినను, దానిని ఆమోదింపను.

దాని యర్థము నీవు మృదుస్వభావము గలిగినవాఁడవు గావు. నిన్నొకఁడు విసిగించుచున్నాడని. నీవనుకొంటే, నీ వతనిని విసిగించుచున్నావని యతఁడనుకొనును. నీవు నిన్ను ఇతరుని స్థానములో బెట్టుకొని ఆలోచిస్తే తప్పు. నీవు ఒక నిర్ణయానికి రాలేవు. ఇది తప్పనిసరి, నీ కర్థము గానిది. నీ కొకఁడు చెప్పినప్పుడు, నీవు "వాని కేమియుఁ దెలియదు" అని యనకూడదు — నీవు వానిని అర్థము చేసికొనుటకు బ్రయత్నింపవలెను. నీవు అంతశ్శుద్ధి గలవాఁడవైతే, నీకు

దెలియని విషయము ఒక చిన్న బిడ్డవచ్చి నీకు చెప్పినప్పటికీ, "ఈ బిడ్డ వట్టి అవివేకి" అని యనగూడదు. "నేను నిజంగా అవివేకిని. ఎందుకనఁగా, నేనర్థము చేసికొనలేదు," అని యనుకొనవలెను.

ఒక సమస్యను నూరు దృక్పథములతో జూడవచ్చును. నీవు సమస్యకు పరిష్కార మార్గమును గనిపెట్టవలయునన్న, అన్ని అంశములను ఒకదాని వెంట నొకటి తీసికొని, వాని నధిగమించి, ఏ విధముగా సామరస్యమును సాధింప నగునో చూడవలయును.

ఒకే సమయములో అన్ని వాదములను, అన్ని విశ్వాసములను, మానవులు తమ దివ్యచేతన నుండి చెప్పిన భావములను, అత్యధిక వ్యతిరేకాభిప్రాయములను (బౌద్ధము, వేదాంతము, క్రైస్తవమతము) అన్ని ఆధ్యాత్మిక తత్త్వములను మానవ మేధస్సు నుండి వెలువడి పరమ సత్యములో ఒక లేశమును గ్రహింప గలిగిన వానిని, అనగా సర్వమును చూడగలిగిన చైతన్య స్థితిని— దివ్యవిజ్ఞాన స్థితిగపేర్కొనదగినదానిని—నీవు పొందుట జరుగవలసి యున్నది. ఈ స్థితిలో నీవు ప్రతి ఒక్క విషయమును దాని దాని స్థానములోనుంచుటయే గాక, అన్నియు నీకు విచిత్రమైన సత్యములుగానే గోచరమగును. ఏదైనను, దేనిని గురించియైనను అర్థము చేసికొనుటకు ఇవన్నియు త్రోసి వేయరానివని నీవు గుర్తింతువు. చేతనయొక్క ఒకానొక స్థితిలో—"ఓ, నేను మీరింకను అర్థము చేసుకోలేని విషయములను చెప్పఁ మొదలిడినాను." సులభ గ్రాహ్యమగు ఒక ఉదాహరణము నొసగెదను. అనాటోలి ఫ్రాన్సు అనునతఁడు తన పుస్తకములందొక దానిలో, "మానవులు ప్రపంచము ప్రగతి నొందుటకు ప్రయత్నించనంత కాలము అన్నియు సవ్యముగానే జరిగినవి. అందరును సంతృప్తిగానే యుండిరి. తాను పరిపక్వత సాధింపవలెనను బాధలేదు, ప్రపంచము పరిపక్వత చెందునట్లు చూడవలెనను బాధలేదు, తత్కారణముగా అన్నియు సవ్యముగానే సాగినవి ఇతరులు ప్రగతి చెందవలయునని కృషిచేయుట ఎంత మాత్రము కూడనిది. వారు

చేయందలంచిన దేదో చేయనిండు, దేనిని గుఱించియు బాధపడనక్కఱలేదు. అదే అన్నిటికంటె తెలివైన పని" అని వ్రాసెను. ఇతరులు దానికి విరుద్ధముగా, "సాధింపవలసినది పరమ సత్యమొకటున్నది. ప్రపంచము మూర్ఖతతో నిండి యున్నది. మార్గములో ఎన్ని కష్టము లెదురైనను, అన్నిటికి తెగించి మానవుని జ్ఞాన ప్రకాశముం లోనికి దెమ్ము. మూర్ఖత్వము నుండి బయటికి లాగుము." అని చెప్పుదురు. అయితే, చేతనయం దొక దశయున్నది. ఆ స్థితిలో రెండు మార్గముల దృష్టి ఖచ్చితముగా నిజమైనదే. సహజముగా రెండు అంశములనే తీసి కొంటె స్పష్టముగా జూచుటకు సాధ్యముగాదు. మన చైతన్యముచేత ప్రకాశించిన సత్యముయొక్క అన్ని కోణముల నుండియు దానిని చూడవలయును. అప్పుడు ఆ స్థితిలో పూర్తిగా నేదియు చెడ్డదికాదు, అన్ని సమస్యలు, అన్ని కష్టములు అన్ని యుద్ధములు, ఒకటేమిటి, సర్వమును నీకు విచిత్రమైన సామరస్యమును బొందినవిగా కనబడును.

అయితే నీవు ఈ స్థితిని మానసికముగా ననుకరింప, — గమనించితిరా, మానసికానుకరణను చేయుటకు, — బ్రయత్నించి నట్లయితే, నీవు నిజముగా బుద్ధి లేని పనులను చేయుదువు—అయోమయ స్థితిని మెదడులో పెట్టుకొని, తెలియకుండానే పరస్పర విరుద్ధమైనవి చెప్పువారిలో నొకండ వగుదువు.

ఆ స్థితిలో ఏ వైరుధ్యము ఉండదు. అది సంపూర్ణ స్థితి. ఆ సంపూర్ణతలో సకలవిధ సత్యముల జ్ఞానము ఇమిడియున్నది. దేని దేని స్థానము ఎక్కడెక్కడ ఏర్పడియున్నది, ఈ విశ్వము ఎందు కేర్పడినది, దేనిచేత నిర్మింపంబడినది, అనునవి విదితమగును. ఈ స్థితిని చేరుట వ్యక్తిగత ప్రయత్నమువలనగాదు. ఒకండు దానిని అందుకొనవలెనని చేయు ప్రయత్నము వలన గాదు, దానిని అందు కొనునది. అయత్నకృతముగా నీవు ఆ స్థితి వగుదువు. అది మానసిక అంతశ్శుద్ధి పూర్వక శ్రద్ధయొక్క విజయము. పక్షపాత రహిత నిరపేక్ష స్థితి, మూర్ఖ ఛాందసములేని స్థితి, ఆ స్థితిలో సత్యాన్వేషణము కూడ ఉండదు.

ఆ దివ్య ప్రకాశమునకు నీవు ఉన్మీలితుడగుదువు.—అంతే.

ఈ సాయంత్రము ఎందుకు మీకిది చెప్పుచున్నా ననఁగా, ఒకఁడు చేసినది సాధించినది, మఱియొకనికి మార్గదర్శకముగా నుండుటకు. ఒక్క శరీరము సాక్షాత్కార అనుభవమును బొందిన చాలును. అది, మనమేమి చేయగలమో సూచించుటకు ప్రామాణికము కాగలదు. నీవు అది చాలా దూరమున నున్నదని భావింపవచ్చును. కాని నీవు, "పారమార్థిక తత్త్వజ్ఞానమునకుఁ జెందిన జీవితము తప్పక విజయవంతమగును. ఎందుకనఁగా, అది ఆవిష్కారమగుటకుఁ బ్రారంభించినది." —అనే నిశ్చయముతో నుండగలవు.

* * *

మార్చి 1, 1951

"దివ్యచేతనకు సంబంధించిన భూమిక యొకటి కలదు. సంపూర్ణముగా అన్నియు దానిలో దెలియును. ముందుగా దర్శించబడినది, నిర్ణయించబడినవి యైన విషయములు గల సంపూర్ణ ప్రణాళిక దానిలో స్పష్టముగా జూడవచ్చును. ఆ విధమైన దర్శనము అతిమానస దివ్య విజ్ఞానపు ఉన్నతోన్నత సంస్థితులలో నెలకొనియున్నది. అది సాక్షాత్తుగ భగవంతుని దివ్యదృష్టియే. ఆ జ్ఞానమును మనము గలిగియుండని పక్షములో, మనము ఆ స్థాయిలోనే తప్ప ఉపయోగపడని మాటలను మాటలాడి ప్రయోజనము లేదు—మన ఇప్పటి స్థితిలో ఇక్కడ

చూచునవి ఆ స్థాయికి పనికిరావు. ఎందుకనఁగా, ఎఱుక యొక్క క్రింది స్థాయిలో ఏదియు సాధింపలేవు; ముందుగా నిర్ణయింపలేవు. అంతయు సిద్ధపరుపఁబడు దశలో నుండును, ఇక్కడ ధ్రువపరుపఁబడిన సత్యము లుండవు. సంభావ్యముల విజృంభణ మాత్రముండును. సంభావ్యములలో ఏది జరుగవలయునో దానిని గ్రహింతువు. ఈ దశలో మనము కోరుకొనవచ్చును, ఎన్నుకొనవచ్చును; ఒక సంభావ్యమును విసర్జింపవచ్చును, ఒకదానిని ఆమోదింవచ్చును. ఒక మార్గమును అనుసరింపవచ్చును, ఒకదానినుండి వెనుకకు మఱలవచ్చును. యదార్థముగా జరుగుచున్న దేమైనప్పటికి, అది పరతర భూమికలో ఎఱుకకు తెలియఁబడి, ముందుగా నిర్ణయింపఁబడి యుండవచ్చును. దానినే మనము చేయవచ్చును.

(సంభాషణలు, 1929 పే. 33)

"ముందుగా నిర్ణయింపఁ బడినది" అనుట యథార్థమునకు సమానముగాదు. 'ముందుగానే ఉన్నది' అనుట అంతకంటె సరియైన ప్రయోగమగును. వికసనమును గుఱించిన చేతన సత్యమే, ఆభాసకాదు.

ప్రపంచమంతయు ఒకే సంపూర్ణవస్తువని భావింపుము ఒక అనుభవములో అది అంతము గలది, పరిమితమైనది—అయితే, అసంఖ్యాకములైన సంభావ్యములతో అయ్యది కూడియున్నది. దానిలో మిశ్రమము లనేకములు. అవి అనంతమైన దానితో సమమైనవి. (నీవు మాటల విషయములో జాగ్రత్తగా నుండవలయును. నాకు మాటల ఒత్తిడితో తలదిమ్ము పట్టినది. అవి నేను జెప్పదలఁచుకొన్న అర్థమును చక్కగా బ్రతిపాదింపలేవు.) కనుక, పరమమైన దివ్యచేతనచేత ఈ ప్రపంచము రూపొందించ బడినది. అది నిర్ణీత శాసనముల ప్రకారము జరిగి

నది. వానిని గుఱించి తరువాత మాటలాడుకొందము. అది భగవంతుఁడే యను దృష్టినుంచి విశ్వము ఒకే పూర్ణవస్తువు. అయితే, భగవంతుని స్వరూపమంతా విశ్వములో లేదు. భగవంతుఁడే స్వయముగా దన్ను దాను వినియోగ పరుచుకొని పదార్థరూపము వహించినాడు. దివ్యచేతన దైవిక అవకాశము లన్నింటిలోనికి తాను ఎన్నుకొన్న మార్గమును అనుసరించుచు విహరించును. అవకాశముల సమూహము దానియొక్క వీలైనన్ని మిశ్రమములతో కూడియున్నది. అవి అనంతమునకు సమానము. దివ్యచేతన స్వతంత్రముగా ఇక్కడ విహరించి పదార్థ సంభూత మగుచున్నది. అనంతమైన అనేకత్వముయొక్క మధ్యలో అది సంచరించిన మార్గము స్వేచ్ఛాయుతమైనది. స్వేచ్ఛ గలిగిన దివ్యచేతనయొక్క నిశ్చయము ప్రకారము ఆ మార్గము ముందుగా నేర్పడినది. ఈ నిశ్చయము స్వేచ్ఛ గలిగినది అయినందున, అంతయు ముందుగా ఏర్పడిన దైనప్పటికి, అందుచేత తప్పనిసరి యైనప్పటికి, మార్గమును మార్చగలదు. ఆ మార్గము స్వేచ్ఛ గలిగినది, అనూహ్యమైనది. మార్గముయొక్క ఈ మార్పులు, విషయములమధ్య, పరిస్థితులమధ్య సంబంధములను కూడ మార్పుచేయును. అందువలన నిశ్చయముకూడ మార్పు చెందును. ఈ మార్పు 'అనుగ్రహముయొక్క ఫలితము' అనవచ్చును. అనుగ్రహముయొక్క సాహాయ సంపత్తి చేత, అది నిశ్చయించి నట్లయితే, విషయములు మార్పుచెందును. మార్గము వేరైనదగును. విషయములు వాని స్థానమునుండి మారి. ఒకానొక మార్గమును అనుసరించుటకు బదులు వేరొక దానిని అనుసరించును. ప్రత్యేక నిశ్చయమును బట్టి ఒక పరిస్థితి ఒకానొక స్థలములో ముందుగా సంభవించును, ఉదాహరణకు విషయముల మధ్య సంబంధములు ఆకారణముగా మారును. *

---

* ముందుగా నుండిన దనుటకు. ఈ సంభాషణల ప్రకటన సమయములో తల్లి ఈ క్రింది వ్యాఖ్యానమును చేర్చెను సత్ అనగా నిజమైన ఉనికి. అది అభివ్యక్తము గాదు అభివ్యక్తము గాకయే యుండును. అది ఉనికిలో, అభి

ఏ క్షణములో కాలము ప్రారంభమగును? ఎన్నిక చేయు చేతన, అభివ్యక్తి మొదలైన స్థితియందలి కాలములోనిదా?

కాదు. కాలము ప్రవాహ రూపమైనది, పరమచేతన పదార్థత్వమునుపొందుటకు ముందు తనలో తననుదానువీక్షించుకొనును. సర్వవ్యాప్తము, సంపూర్ణము, యుగపదుద్ధితము నగుదృష్టి అది. అచట కాలమనునది లేదు. ఆకారణముచేతనే దేశమనుదానిని గురించియు మాట్లాడుటకు వీలులేదు. ఎందుచేతననగా.అవన్నియు ఒకే సమయములో సంభవించునవి. అది అంతకంటెను గొప్పది. విషయియే గాని, ఏ విషయము లేనట్టిస్థితి. సృష్టిలక్ష్యము విషయీభూత మగుటయేకదా. కాని, ఈ విషయీభూతస్థితికి ప్రథమదశయున్నది. అందు, విశ్వప్రణాళిక నంతనూ తనలో ఇముడ్చుకొన్న సంపూర్ణచేతన విలసిల్లుచుండును. అదియే విశ్వపదార్థత్వమునకు కారణము. అక్కడ విశ్వము ముందుగానే ఉన్నది. అయితే అభివ్యక్తము కాబడలేదు. కాలము విషయీభూతిస్థితితో, పదార్థత్వముతో ప్రారంభమగును.

అతిమానస దివ్యవిజ్ఞాన స్థాయిలో కాలము ప్రారంభమగునని చెప్పవచ్చునా?

---

వ్యక్తము గాని ఉనికియొక్క స్థితి. 'తత్' అనునది ఉనికిలేమి యొక్క స్థితికాగా, సత్ యనునది ఉనికి యొక్క స్థితి. సహజముగా 'తత్' అభివ్యక్తము గాదు. అయితే సత్ కూడ అభివ్యక్తము గాదు — 'చిత్–తపస్' వచ్చినవుడే (అదియే 'చిచ్ఛక్తి), సత్ అభివ్యక్తము కానేర్చును.

ఆ కాల లక్షణము వేరు. కాలప్రారంభము, రూపప్రారంభము అచట నుండును. అక్కడ కాలము ప్రత్యేకగుణము గలది. అతిమానసవిజ్ఞాన స్థాయికి పూర్వము విశ్వాత్మకమగు అచలస్థితియున్నది. అందు సర్వము ఏక కాలముననే దర్శనమగును. సర్వమును ప్రణాళికాబద్ధ మొనర్చునపుడు పరంపరాగతముగా వచ్చుదానిపై కాలము ఆధారపడియున్నది. అతిమానసవిజ్ఞాన స్థాయిలో నీవు ఏకకాలములో జూచు సంపూర్ణత్వము అచలస్థితిలో నుండునదిగాదు. అచలస్థితిలోనుండు సంపూర్ణత్వము, మఱియొక విధమైన సంపూర్ణమునకు స్థానమిచ్చునవుడు కాలమనునది తోచును. తనకు వెలిగా సంభవించునవి, తనకు తెలియని రీతిగా, ఇవి అతిమానస విజ్ఞానమున ఆంతరంగికముగా ఏర్పడు సంబంధములు ఇచ్చట అంతయు తనలోనిదిగనే ఎరుకపడుచుండును. ఈ అంతరములోని సంబంధములు మాత్రము మార్పుచెందుచుండును. అట్లు మార్పు చెందుటయె కాలమునుగుఱించిన మొదటి భావమును సృష్టించును.

ఎఱుకయొక్క ఈ స్థితిలో, విషయములు పుట్టుట, సంచరించుట, అదృశ్యమగుటను గుఱించిన భావము తట్టదు, అది అంతేకదా ?

ఓ. కాదు. ఆవిధమైన దేమియు గాదు.

(తల్లి చదువుటను మఱల ప్రారంభించినది) "సర్వమును ముందుగానే అతిమానసదివ్యచేతన తెలిసికొనును. ఎందుకనగా, తన శాశ్వతత్వములోనే అన్నియు సాధింపబడునుకనుక. ముందుగానే తనయొక్క ఉన్నతచేతనలో ఏర్పాటుచేయ బడిన కార్యక్రమమును సాగించుటకు ఆడు ఒక ఆటమాత్రమే యిది, ఆమె ఈ సంపూర్ణకార్యక్రమము సాగించుటకు తనకు దెలియనట్లుగనే భూమిమీది

కవతదించును. అది ఒక నూతనమైన, ఇదివరకు ఉప యోగింపని దారమును ఉపయోగించి వస్త్రము నేయుచున్నటుగనే ఆమె పనిచేయును."

నీ వొక పని చేయసంకల్పించినప్పుడు ఆపని ప్రారంభము గాకమునుపే, 'అంతయు నిరుపయోగము' అని చెప్పినట్లయితే నీవా పనిని చేయగలవా? చేయలేవు. నిజముగా జేయలేవు. అటువంటిదే ఇచట జరుగును. నీవు చేయుపనులలో నూటికి తొంబైమారులు నీవు కోరిన ప్రతిఫలము లభింపదు. పదిలక్షలలో నొకడు "ఈ పనిని చేయుము. ఫలితము నీవు కోరినదిగా ఉండనేఉండదు." అన్నట్లయితే ఆపనిని చేయునా? అయితే శక్తులఖేలనములో, సమైక్యాశక్తుల కొఱకు, శక్తులసంపూర్ణత్వము కొఱకు అందఱు తప్పక పనిచేయవలసినదే, వ్యక్తిగతముగా ఆపనిచేయు వ్యక్తికి ప్రయోజనములేకపోయినను చేయవలసినదే. కనుక ఒకడు తాను చేయుపని పూర్తిపనిలో అత్యంతస్వల్పమైనదని ముందుగానే గ్రహించినట్లయితే ఆపనిని చేయడు. అయితే నీవు దానిని అధిగమించి పనిచేయునప్పుడు, ముందుగా నిర్ణయించుకొన్న స్థిరమైన చరమ ఫలితమేదియు మనసులోనుంచుకొనక, ఫలితమేమయినను ఇది చేయవలసిన ధర్మమనుదృష్టితో చేయుదువు. ఈ విధమైన నిరపేక్షలక్ష్యమున్నప్పుడు, నీవు ఉన్నతచేతనలో ఫలితమేమైనప్పటికి కార్యము చేయవలయునని గ్రహింతువు. ఫలితమును సామాన్యముగా నీవు తగినంత సుస్పష్టముగానే తెలిపికొందువు. కనీసము చూచాయగానైనను గ్రహింతువు. ఇట్లు ఫలితమేమగునన్నది నీవు తెలిసికొనియున్నను, నీవుచేయు విధానములోమాత్రము ఏవిధమైన మార్పు ఉండదు,

క్రిందినుండి పైకి పోవుటవివరణముకంటె, పైనుండి క్రిదికివచ్చే వివరణముకొఱకై నీవు ఎదురుచూచుట వివేకము. కొద్దికొద్దిగా ఆదివ్యచేతన పైనుండి క్రిందికి దిగివచ్చుచున్నవిషయమును, కాని అట్లు క్రిందికి ఆ రీతిగా

దిగివచ్చునప్పుడు అది అస్పష్టమైపోవుచున్న విషయమును నీవు తెలిసికొనవలయును అట్టిసందర్భములో ఏవిధానము ననుసరించి పనులు జరుగుచున్నదియు ఎవరికిని అర్థముగాదు. అదియే అజ్ఞానస్థితి యని పిలువబడును.

"నిర్మాణములోను. వర్ణసంయోజనములోను. ఒక క్రమపద్ధతిని చిత్రపటమును చిత్రించుట నీకవసరము, ఒక పరిమితిని నీవు నిర్దేశించుకొనవలెను. అంతయు ఒక చట్రమునందు ఇముడునట్లు చేయవలయును. అయితే ఆపరిమితి ఊహామాత్రమే, చట్రము సంప్రదాయముననుసరించి ఏర్పాటు చేసికొన్నది మాత్రమే. ఒక నిర్ణీత చట్రము నతిక్రమించి సుదూరముగా నిలకడలేకుండా చిత్రముసాగుచునేయుండును, ప్రతి పొడిగింపు, అదే పరిస్థితులలో అనంతమైన చట్రముల వరుసలలో చిత్రించవచ్చును. మనలక్ష్యము, ఇది, అది, అని మనమందుము. అయితే అది మఱియొక లక్ష్యమునకు ప్రారంభమని, అది మరల మఱియొకదానికి అందించునని మనకు తెలియును,"　(సంభాషణలు 1929 పేజి 36)

ఒక అంశము తరువాత ముగియునని నాకు ముందుగనే తెలియజెప్పినట్లయితే అది నాకు అమితమైన నిరుత్సాహమును గలిగించును. ఆ నిరుత్సాహమువలన నేను కదలలేని స్థితి వచ్చును.

నన్ను స్థిమితపరుచునది యేమన, ప్రతిది ఎడతెఱపి లేకుండా ఎప్పుడును అనంతముగా సాగుచుండునన్న విషయము, క్రొత్త దొకటి సర్వదా చేయుచునే యుండవలయునన్న విషయము.

సాధించిన లక్ష్య మేదైనను. అది రానున్నదానికి ప్రారంభము.

ఆధ్యాత్మికము, చైత్యాత్మికము,— ఈ రెండింటికి భేదమేమి?

ఈ రెండును ఒకటి కాదు. చైత్యపురుషతత్త్వము ఒకవ్యక్తిత్వము. ఇది భగవంతుని సన్నిధిచే ఏర్పాటుచేయబడును. ఇది భూమికి సంబంధించినది. నేను విశ్వమునుగురించి మాట్లాడుటలేదు. భూమినిగురించే మాట్లాడుచున్నాను. చైత్యపురుషుని భూమిమీదమాత్రమే నీవు చూడగలవు. మిగిలిన విశ్వమంతయు వేరువిధముగా ఏర్పాటైనది.

భౌతికముకంటె ఉన్నతములైన సర్వభూమికలు విశ్వమునందిమిడియున్నవి. భూగోళభౌతికమునందు, మానసిక, ప్రాణికభూమికలు. మానసిక భూమికకు, పైన ఆధ్యాత్మిక ప్రకాశికకు సంబంధించిన భూమికలు ఉన్నవి. అవి మన ఆత్మకు సంబంధించినవి. ఈ యాత్మయే కొద్దికొద్దిగా పరిణామ పద్ధతిలో మారుచువచ్చి మనమిపుడు చూచుచున్న పదార్థమగుచున్నది. అధిమనస్సు Over Mind కు సంబంధించిన జీవులకు, ఇతర ఉన్నత భూమికలకు చెందిన జీవులకు చైత్యపురుషుడు Psychic Being ఉండదు. దేవతాగణమునకును చైత్యపురుషుడు లేడు.

భూమిమీదమాత్రమే చైత్యపురుషజీవితము ప్రారంభమగును. పరిపక్వతాసాధనకుగాను, ఈ భౌతికజీవితమును మేలుకొల్పి దైవికమూలముతో కలుపు అవసరముకొఱకై భగవంతుని యేర్పాటిది. చైత్యపురుషుడు లేనిచో భౌతిక పదార్థము నిశ్చేతనస్థితినుండి మేల్కొని యుండదు. తనకుమూలమైన ఆధ్యాత్మికజీవితమును కాంక్షించియుండదు. కనుక చైత్యపురుషుడు మానవుని శరీరములో ఆధ్యాత్మికజీవనమును కాంక్షించుటకు కారణమగుచున్నాడు.

చైత్యపురుష ప్రపంచమునకు భూమికి ఏ ప్రత్యుత్తరప్రత్యు త్తరము లున్నవా ?

భూమిమీదనే చైత్యపురుషుడు అనుభవములను వ్యక్తిత్వమునకు మలుచుకొనునని నే నిదివరకే మీకు జెప్పియుంటిని. కావున, చైత్యపురుషప్రపంచము, భూమి ఒకదానిపై ఒకటి పరస్పరము ఆధారపడియున్నవి.

చైత్యపురుషుని మేల్కొల్పుటకు ఘటిష్టమైన మార్గమేది ?

అతడు బాగుగా మేల్కొనియేయున్నాడు. మేల్కొనియుండుటయేగాక, పనిచేయుచున్నాడుకూడ. నీకదితెలియకున్నది. అంతే. నీకతడు నిదురించుచున్నట్లు కనబడును. ఎందుకనగా, నీవు అతనిని గుర్తించుట లేదు.

మౌలికముగా, చైత్యపురుషుడు, ఈవిధమైనచైతన్యముతో నుండకపోయినట్లయితే, మానవులు దుఃఖకరమైన, చులుకుదనములేని, మొత్తముమీద పశుప్రాయులుగానే ఉండియుందురు. ఆకాంక్ష యొక్క ప్రతికిరణము చైత్యపురుష ప్రతిపాదనలవలననే సర్వదాకలుగుచున్నది. చైత్యపురుషుడులేకపోయినట్లయితే, అతని ప్రభావము లేనట్లయితే ప్రగతి అనేదేఉండదు; ప్రగతి కావాలనే ఆకాంక్షకూడఉండదు.

సౌందర్యభావన యుండునా ?

ఉండును, అత్యున్నత సౌందర్యభావన కాకపోవచ్చును. అయితే, ప్రాణిక జీవితములో పూర్ణమైన సౌందర్య, సామరస్యభావన ఉన్నది. మౌలికమైన ప్రగాఢమైన, విశ్వజనీనమైన, స్థిరమైన సౌందర్యభావనమాత్రము చైత్యపురుష

నకు సంబంధించినదే. రూప, వర్ణ, దృశ్యములకు సంబంధించిన సౌందర్య భావన విద్యాశిక్షణ, సంస్కారముగల ప్రాణికజీవికి పూర్ణముగా నుండును.

### ప్రేమ ఉండదా ?

ప్రేమ అనగా నీ యర్థ మేమో దానిపై అది ఆధారపడియున్నది. అక్కడ దైవికప్రేమ సహజముగానుండదు. అన్ని ఉద్వేగములు, ఆకర్షణలు, కామనలు ప్రాణికజీవిలో నున్నవి. దివ్యచేతన క్రిందకుదిగి పదార్థములో విస్తరించిపోయినందున, ఈ ప్రవృత్తుల గుణవిశేషము పూర్తిగా మారిపోయినది. నిజమైన ప్రేమయొక్క అవకాశములు మేల్కొల్పబడినవి. లేనిచో ప్రేమగా పరిగణింపబడిన ఈ అన్ని ఉద్వేగములు, కామనలు—కబళించాలనే ప్రవృత్తిగల ఇవన్నియు ప్రాణికజీవిలోనే ఉన్నవి. పదార్థములోని ప్రేమయొక్క మొదటిరూపము సర్వమును కబళింపజూచే లక్షణమే. భుక్తపరుచుకొని జీర్ణించుకొనగోరు లక్షణమిది. అది చేయుటకు ఉత్తమమార్గమేదన, సర్వమును కబళించి జీర్ణింపజేసికొనుటయే. నిండారినప్రేమలోనే పిల్లి తన కూనలను, పులి గొఱ్ఱెపిల్లలను తినివేయుచున్నవని చెప్పవచ్చును.

### పూవులలో సౌందర్య భావనయున్నదా?

పూవులలో జీవలక్షణమున్నది, ప్రాణతత్వమున్నది. అదియే వానికి సౌందర్యభావన కలుగజేయుచున్నది. మనము అనుకొనేరీతిలో వానికి వ్యక్తిత్వము లేదు. కాని, సిద్ధినపేక్షించు జాతీయత యొకటున్నది. చైత్యపురుష సాన్నిధ్యస్పందనపు తొలిసూచన నాకు వృక్షజాతి జీవితములో ద్యోతకమైనది. పూవు అని పిలువబడే ఈ వికసనము నిజముగా చైత్యపురుష సాన్నిధ్యపు మొట్టమొదటి ఆవిష్కరణమేయగును. చైత్యపురుష చైతన్యము మానవునిలో వ్యక్తిత్వమును సంతరించుకొనుచున్నది. కాని, దాని సాన్నిధ్యము

అతనికంటె ముందేక లదు. మానవునిలోని వ్యక్తిత్వమువంటిది మాత్రములేదు.— అంతే: అది ఒకవిధమైన శక్తిగా, చేతనగా, ద్రవీభూతస్థితిలో గానవచ్చు చున్నది. ఉదాహరణకు, గులాబిపూవు తీసికొనుడు. ఆకృతిలో, వర్ణములో సౌరభములో దానికిగల పరిపూర్ణత ఒకానొక ఆకాంక్షను, చైత్యాత్మిక సమర్పణ భావమును వ్యక్తముచేయుచున్నది. సూర్యకిరణముల తొలిస్పర్శకు ఉదయమున వికసించు గులాబిని తిలకింపుడు, అది నిజముగా ఆకాంక్షారూపమగు అత్యద్భుత ఆత్మార్పణము.

ప్రతిపూవునకు ప్రత్యేకమైన గంభీరార్థముండును గాదా?

మానసికముగ మనము అర్థము చేసికొనురీతిలోగాదు. ఒక పూవునకు ఖచ్చితమైన యొక అర్థమును ఆపాదించినపుడు, అది యొక మానసిక భావనయగును. ఈ భావనాస్పర్శకు పూవు ప్రతిస్పందించి దానినామోదింపవచ్చును. కాని, పూవునకు మానసికచేతన యనునది లేదు. వృక్షజాతియందు చైత్యపురుషుని తొలిసూచన యున్నద్దిగాని మానసికచేతనారంభము లేదు జంతువులవిషయములో అట్లుకాదు. వానిలో మానసికజీవితము రూపొందుటకు ప్రారంభించును. వానికి విషయములగుఱించిన అర్థమును గ్రహించు శక్తి ఉన్నది. పుష్పములలో అది పసిబిడ్డ కదలికవంటిది, అది ఇంద్రియ జ్ఞానముగాదు; భావముగాదు. అది రెండును గలిసిన ఒకానొక విశేషము. అది అయత్నకృతమైన కదలిక, ఒక ప్రత్యేక కంపనము. కనుక, ఒకడు దానితో సంబంధము కలిగి దానిని అనుభవించినట్లయితే, దాని ప్రతిపాదన అతనికి అవగతమగును. ఆలోచనతో దానిని అనువాదము చేయవచ్చును. నేను అదేవిధముగా పుష్పములకు, మొక్కలకు అర్థమునిచ్చితిని. దాని కంపనలోని గుణముల గుర్తింపు కొద్దికొద్దిగా ఒకవిధమైన కొలతతో కొలిచినట్లుగా వచ్చును. (ఒక్కొక్కప్పుడు ఇది ఆకస్మికముగా వచ్చును. అప్పుడప్పుడు

అది కొంతకాలము తీసికొనును.) ప్రాణికమైన యీ కంపనములకు మాన సిక ఆలోచనయొక్క స్పందనముతో సమావేశము కలుగును. తగిన సామ రస్యము వానికి ఏర్పడిన పక్షములో, ఆ మొక్కలు తెలియజేయు అంతరా ర్థపు సాక్షాద్దర్శన మగును.

కొన్ని దేశములలో (ముఖ్యముగా ఈ దేశములో) కొన్నిమొక్కలు పూజకు, అర్పణకు, భక్తికి చిహ్నముగా ఉపయోగింతురు. ప్రత్యేక ఉత్సవ ముల సమయములలో కొన్నిటిని సమర్పింతురు. ఈ గుర్తింపు ఆ మొక్క లకు వాని సహజప్రకృతికి దగినట్లు, అయత్నకృతముగా, ఏమియు దెలియ కయే నేనును ఇచ్చుట సంభవించినది. ఇది మతసంబంధమైన ఉత్సవములలో ఇవ్వబడిన అర్థమునకు సరిపోయినది. ఆ కంపనము వాస్తవముగా ఆ పుష్పము లోనే ఉన్నది. అది వాని ఉపయోగమునుబట్టి వచ్చినదా? లేక అది దూరము నుండి, ఎక్కడనో క్రింది లోతులనుండి, చైత్యాత్మిక జీవితమునుండివచ్చినదా? అది చెప్పుట చాలా కష్టము.

చైత్యపురుషుడు తాను ఎక్కడ జన్మమెత్త గోరెనో
ఆ స్థలములోనే పడకపోవుట సంభవించగలదా ?

తన చైత్య ప్రపంచము నుండి చైత్య పురుషుఁడు ఒక వెలుగును భూమి మీద చూచినట్లయితే, అది యెక్కడైనది తెలియక పోయినను వేగముగా అక్క డకు దిగవచ్చును. చైత్యపురుషుఁడు తగినంతగా మంచి ఎఱుకలో నున్నట్లయితే, సరియైన స్థలములోనే ఆకాంక్షగల వెలుగు కొఱకు అన్వేషించును. తన సం స్కృతి, విద్యా విశేషమును బట్టి ఆ స్థలమును సులభముగా గుర్తింపఁనేర్చును, కళ, తాత్విక సంస్కృతి, జ్ఞాన వ్యక్తిత్వముల యందు ప్రవేశముగల స్త్రీ, తాను కనబోవు బిడ్డ, తాను చదివిన గ్రంథముల ప్రకారము ఉత్తమ లక్షణములు కలిగి యుండవలెనని ఆకాంక్షింప వచ్చును. అప్పుడు చైత్యపురుషుడా స్థలమును

గుర్తించుట కష్టమైన పనిగాదు. చైత్య పురుషులు పరంపరగాఁ బుట్టుచుండుటచేత, ప్రతి పర్యాయము ప్రత్యేక పరిస్థితుల కనుగొనుట కష్టమగును. చైత్యపురుషుఁడు తలక్రిందులుగాఁ బడి, మూర్ఛపడిన నిదర్శనములు కూడ గలవు. ఇది దురదృష్ట కరము. అటువంటి పుట్టుకలలో మేలుకొనుటకు సామాన్యముగా చాలాకాలము పట్టును. ఒక భావనలో అది దురదృష్టకరమే; ఎందుకనగా, విచక్షణా జ్ఞానము లేకపోవుట. లేక కొన్ని శక్తులు, అడ్డపడుట అతని నిశ్చయమును బహుశా కుంటుపడునట్లు చేసియుండవచ్చును. అప్పుడు అవి చైత్య పురుషునిపై సగము విజయము సాధించినట్లగును. వేనవేలు అవకాశము లున్నవి తెలియునా? ప్రతిదీ ఒకే ప్రణాళిక ప్రకారము నడచునని చెప్పవీలులేదు. ప్రతి చైత్య పురుషుడు తదితరుల కంటె భిన్నుడు.

* * *

మార్చి 3, 1951

"ప్రతికూల శక్తులుండుట ఎంతయు అవసరము. ఆ శక్తులు నీ నిర్ణయమును బలమైనదిగాను, నీ ఆకాంక్షను స్పష్టమైనదిగాను చేయును. నీవు కారణమును సృష్టించుటచేత వారుంటున్నా రన్నది వాస్తవము, ఎంత కాలము వారికి బదులు పలుకునది నీలో నుండునో అంత కాలము వారి జోక్యము శాసనబద్ధమైనదే. నీలో నున్న దేద్దియు వారికి జవాబు చెప్పక పోయినట్లయితే, వారికి నీ శరీరములోని ఏ భాగము పైనను అధికారము లభింపక పోయినట్లయితే, వారు నిష్క్రమించి నిన్ను వదిలి పెట్టుదురు." (సంభాషణలు 1929 పేజి 39.)

ప్రతికూల శక్తులను ఎదుర్కొను మంచి మార్గమేదనగా, ఎప్పుడును దైవమును సాక్షాత్కరింప గోరుచు, స్మరించుచు, నిర్భయముగా నుండుట.

సంభాషణ ఈ క్రింది ప్రశ్నతోఁ బ్రారంభమగును, "ప్రతికూల శక్తులు బయటినుండి వచ్చునా? లేక లోపలినుండి వచ్చునా?

శిష్యుఁ డొకఁడు జవాబిచ్చు చున్నాడు: వెలుపలి చేతన నుండిగాని, వ్యక్తినుండి గాని అవి వచ్చుచున్నవి.

ఆ వ్యక్తి ఎక్కడ నిలబడుచున్నాడు? చేతన ఎక్కడపడితే అక్కడ ఉన్నట్లయితే, బయట, లోపల,—వీని భేదమేమి?

"నీవు ఒకదానిని వదలించు కొనవలయునని కోరితే, అది నీ వెలుపల నున్నదని చెప్పుము," అని సాధకులు సర్వదా బోధింప బడుచున్నారు. ఇది ఒక భావము మాత్రమే; అయినను, అది బయట నున్నదను భావమువలన కష్టములను తొలగించుకొనుట సులభతరము. అయినప్పటికి, నేను యిప్పుడే నీకు దీనికి వ్యతిరేకమైనది చెప్పితిని; "నీలో" ప్రతికూల శక్తులకు జవాబు చెప్పునది లేనట్లయితే అవి యెప్పుడు నిన్ను యెదుర్కొనవు"; అని. కనుక ఏది లోపల నున్నదో, అది బయటకూడ నున్నది; ఏది బయటనున్నదో అది లోపలకూడ నున్నది. రహస్యమేమనగా, వెంటనే చర్య తీసికొనుటకు ఎక్కడుంచితే చాలా అనుకూలముగా నుండునో అచ్చట దానిని ఎట్లుంచవలయు నన్నది తెలిసికొనుట.

నీ గుణగణములలో తీవ్రమయిన దొకటి నీ కున్నట్లయితే — ఉదాహరణకు కోపపడు అలవాటు నీ కున్నట్లయితే—"నేను మరల కోపమును దెచ్చుకొనరాదు." అని నిశ్చయించుకొనుము. అది చాలా కష్టమైన పని. అయితే మఱి

యొక పక్షమున "కోపము ప్రపంచమంతయు విహరించును. అది నాలో మాత్రము లేదు. అది ప్రతి ఒక్కరిలో నున్నది. అది ఇక్కడ, అక్కడ తిరుగుచున్నది. నేను నా ద్వారమును మూసివేసినట్లయితే అది ప్రవేశింపదు.'' ఇట్లు నీకు నీవు చెప్పుకొనుము. ఇది చాలా సులభమైనది. "అది నా స్వభావము. నే నావిధముగాఁ బుట్టినాను,'' అని నీ వాలోచించినట్లయితే, దానిని నివారించుట కష్టసాధ్యమై పోవును. ఈ కోపమునకు జవాబు చెప్పుటకు, నీ గుణగణములయం దేదో ఒకటి ఉండుట వాస్తవము, అన్ని చర్యలు, అన్ని చలనములు సర్వసాధారణములు. అవి లోపలికి వచ్చును, బయటికి పోవును, అంతట చరించును. నీవు ఎంతవరకు నీ ద్వారమును తెఱచి యుంచుదువో అంతవరకు అవి నీలో ప్రవేశించును. అది యటుండ, నీకు ఈ ప్రతికూల శక్తులతో ఒక దగ్గర సంబంధ మున్నట్లయితే ఎందుకో తెలియకుండానే నీకు కోపము వచ్చును. అన్నియు అన్నిచోట్ల నున్నవి. పరిమితులు నిర్ణయించుట తొందరపాటు.

ధ్రువపడిన భౌతికవాదిచేత వ్రాయఁబడిన ఒక పుస్తకములో ఎక్కడో చదివితిని. అందులో మానవులు, ఇతరులతో సంబంధములేని రీతిగా ఒక తోలు సంచిలో బెట్టి మూత కుట్టివేసినట్లున్నారని వ్రాసినాడు. అది నిజముగా మూర్ఖత్వము, అయినా దానితో సహాయము పొందిన వారున్నారు. వారొక సంచిలో నుంచఁబడి, ఇతర మానవులతో సంబంధము సంచిద్వారా తప్ప వేరు విధముగా లేనివారుగా నున్నారన్న భావము వారిని రక్షించును. బయటనుండి వారు ఏ చెడ్డ దానిని తీసికొనకుండా అది ఆపుచేయును. కొన్ని మూఢత్వాలు ఒక్కొక్కప్పుడు లాభదాయక మవుతాయి. ముందు దినము, మనము మనస్సు వివేకసంపాదనమునకు పరికరము గాదు అని అనుకొన్నాము; కాని భావముల భూమికలో ప్రతిదీ సాపేక్షకమే. ప్రతిదీ చూచుటకు ఒక మార్గము, ప్రతిదీ జీవించుటకు ఒక మార్గము చూపించును. ప్రతి శాస్త్రమునకు భాషయున్నది. ప్రతి మతమునకు భాషయున్నది. ప్రతి వేదాంతమునకు భాషయున్నది. ప్రతి కార్యమునకు బాషయున్నది. ఎక్కువ భాషలను నేర్చుకొనుటచేత అనేక విషయములను తెలిసికొంటినని భావము గలుగు

చున్నది. జరిగిన దేమిటనగా, నీ వనేక భాషలను నేర్చుకొంటివి. మనస్సు యొక్క సర్వభూమికలు నీకు ఒక నాటక మగుచున్నవి. అది సాపేక్షికము. నీవు దానిని బాగుగా నటింపవచ్చును. పెద్దగా ఆడవచ్చును. అయినను అదంతయు నాటకమే. దానిని యే విధముగా ఉపయోగింపవలయునో తెలిసిన ప్రజలున్నారు. వారు బుద్ధి కుశలత గలవారు దానిని ఉపయోగించుట తెలియని వారుకూడ ఉన్నారు. వీరు బుద్ధిలేనివారు.

మనము విషయములతో తాదాత్మ్యము చెందినప్పుడు అవి మన 'లోపల' నుండును. తాదాత్మ్యమును మనము తిరస్కరించినప్పుడు ఆ విషయములు మనకు వెలిగా నుండునా ?

ఇది కేవలము అంతఃప్రవృత్తికి సంబంధించిన సంభాషణ. కర్మాచరణకు, కర్మను కొన్ని తరగతులుగా విభజించుకొనవలసి వచ్చును. ఆ కర్మ చేయుటకు మనస్సు ఉపయోగపడును. అది ప్రణాళికలను వేయును — అది ప్రతి వస్తువును దాని స్థానములోఁ బెట్టును. ఆట ఆడును. ఈ క్రియా శీలత్వమే ఆటకు నియమావళిని ఏర్పాటు చేయును. ఆ నియమావళికి లోబడినందు వలన జయము సాధింపబడుచున్నది. అయితే నిజమైన జ్ఞానము మఱియొక స్థలమునుండివచ్చును.

(తల్లి మఱియొక ప్రశ్నకు బోవుచున్నది.) "మానసిక నమ్మకము చాలదు; దానిని పూర్తిగాహొంది, ప్రాణిక నమ్మకమును, శారీరక నమ్మకమును గలిగి వానిని అణువులలో బెట్టవలయును. నీవు నీయందంతటను సంపూర్ణత్వముగల శక్తిని సృష్టించుకొన్నట్లయితే, అప్పుడు దాని నేదియు ప్రతిఘటింపలేదు. అయితే నీ శరీరము నందలి ప్రతి యణువులోను ఆ నమ్మకమును స్థాపించుకొనవల

> యును. ఉదాహరణకు : ఇప్పుడు సాంకేతిక శాస్త్రజ్ఞులలో, చావనుదానిని జయింపవచ్చును, అన్న జ్ఞానము ఇప్పుడిప్పుడు కలుగుచున్నది. అయితే మానవులందరు చావు తప్పనిసరి యని గట్టిగా నమ్ముచున్నారు. మొదట మానసిక యెఱుకనుండి, తరువాత ప్రాణిక ప్రకృతినుండి అవచేతనపు భౌతిక క్షేత్రమునుండి ఈ నమ్మకమును తుడిచివేసి నట్లయితే చావు తప్పనిసరి యేమియుగాదు."
>
> (అదే గ్రంథము పేజీలు 41 - 42)

ఇది సమస్యను వ్యతిరేక పంథాలో చూచు విధానము. అట్లుగాక, మరణములేని స్థితి సాధ్యమని నమ్మితే, అది అధిక క్రియాశీలత్వమునుగలది యగును. అది సంభావ్యమే కాక భవిష్యత్తులో సాధింపఁబడును కూడ. అప్పుడు చావు నెదిరించుటకు శక్తి గలుగును.

> "వ్యవస్థ నొందిన వ్యక్తిగతచేతనకు స్థిరమైన ఆధారము ఏర్పడు నిమిత్తమై ఒక స్థిరరూపము కావలసి వచ్చినది. కాని, ఆ రూపమునకు గల స్థిరత్వమే చావును తప్పనిసరి చేసినది.''
>
> (అదే గ్రంథము పేజీ 42)

వ్యక్తి దేనితో నిర్మాణమైనది ? నాకు ఎవరు మీలో చెప్పగలరు ? నీవు ఒక వ్యక్తివని, వ్యక్తివిగనే ఉన్నావని నీ యందు భావమును గలిగించుచున్నదేది ?

> డెకార్టీ చెప్పిన రీతిగా, "నేను ఆలోచించుచున్నాను. గనుక ఉన్నాను."

ఓ! కాదు. అది నీవు వ్యక్తిత్వము పొందితివని రుజువు చేయదు.

నీవు ఒక వ్యక్తివని ఏది నీకు అభిప్రాయమును గలిగించును? నీవు పుట్టినప్పటికంటె పదేండ్ల వయస్సులో వేరుగా నున్నావు. ఇప్పుడు పదేండ్ల వయస్సు నాటికంటే భేదముగా నున్నావు. అవును గదా? ఒకే పరిమితులకు లోబడి రూపము పెరుగుటచేత పోలికలుండకమానవు. అట్లయ్యు పుట్టినప్పటివలె యిప్పుడు లేవు. నీవు, "నేను అదికాదు" అనవచ్చును గూడ. భౌతికముగా అంత మార్పు వస్తుంది. ఇప్పుడు నీవు ఐదు సంవత్సరముల వయస్సు నాటి ఆంతరంగిక జ్ఞానమునకు, ఇప్పటి ఆంతరంగిక జ్ఞానమునకు తేడా చూడుము. ఎవరు కూడ అది యథాతథముగా నున్నదని చెప్పరు. ఇక ఐదు సంవత్సరముల నాటి ఆలోచనలు ఇప్పటి ఆలోచనలు పరిశీలించుము. అన్నియు విభేదముగానే యుండును. అన్నీ యిట్లుండియు, నేను ఆలోచన చేస్తున్న అదే మనిషిని అని ఏది నీలో భావమును గలిగించుచున్నది?

తన మార్గములో ప్రవహిస్తున్న నదిని ఉదాహరణకు తీసికొందము. ఆ నదిలో ప్రవహిస్తున్న నీరు ఎప్పటికి ఒకటే కాదు. నది యన నేమి? అందులో ఒక నీటి బొట్టుకూడ అదే కాదు. స్థిరత్వమనునది లేదు, ఇక నది యెక్కడున్నది? (కొందఱు ఈ యుదాహరణను వ్యక్తిత్వము లేదనుటకు తీసికొందురు. వారు వ్యక్తిత్వము లేదని రుజువు పరుచుటకు ఆతురతతో నుందురు.) వ్యక్తులకు శరీర మొక్కటే. జ్ఞానము మార్పు చెందుచుండును, ఉద్దేశములు మారుచుండును, ఇంద్రియజ్ఞానము మారుచుండును. అయితే, ఇక వ్యక్తిత్వ మేమిటి? కొందరు వ్యక్తిత్వము జ్ఞానముపై ఆధారపడి యుండునందురు. నీకు స్మృతి ఉన్నది కనుక నీవు మనిషివి. ఇది సంపూర్ణముగా అబద్ధము—నీకు జ్ఞాపక శక్తి లేక పోయినను నీవు వ్యక్తివే.

నది ప్రవహించు మార్గము నది.

నదియొక్క మార్గము దానిని స్థానికము చేయుచున్నది. అయితే మార్గముకూడ ఎక్కువ మార్పుచెందుచుండును. దానియర్థము 'అంతయు అస్థిరమే' ఇది సత్యము. కాని, పాక్షికమైన సత్యము. పూర్ణమైనదిగాదు. నీవు నీలో ఏదో ఒకటి స్థిరముగా నున్నదని భావించుచున్నావు. స్థిరత్వమును గూర్చిన ఈభావము ఎక్కడనుండి వచ్చుచున్నది?

> భౌతికముగా దాని ఉనికిని జూపవలయునంటే, నేను హృదయములో ఏదోఒక చోటును జూపింతును. "నేను ఒకటి చేయబోతున్నాను," అన్నప్పుడు ఆ మాట్లాడునది యథార్థమైన "నేను" కాదు. "నేను ఆలోచించుచున్నాను" ఆ ఆలోచించునది నిజమైన 'నేను'గాదు. నిజమైన 'నేను' ఆలోచనను తిలకించుచున్నది. అనగా ఆలోచనలు వచ్చుచుండుటను గమనించుచున్నది. స్వాభావికముగా ఇది ఒక మాట్లాడుధోరణి.

అధికసంఖ్యాకులైన ప్రజలు, "నేను" అని అన్నప్పుడు, వారిలో ఒక భాగముమాత్రమే—భావముయొక్క, శరీరముయొక్క, ఆలోచనయొక్క, భాగము మాత్రమే నిర్లక్ష్యముగ అట్లు పలుకుచున్నది. అది సదా మార్పుకు లోనైయున్నది. కావున, 'నేను' అసంఖ్యాకము. ఆ 'నేను' సర్వదా మారును దానిలో స్థిరముగా నున్నదేది? నిజముగా స్థిరముగా నున్నది చైత్యపురుషుడు. ఎందుకనగా, ఏది శాశ్వతమందుమో అది మరణము లేనిదిగా నుండవలెను. అట్లు కానియెడల అది శాశ్వతమైనది గాదు. అది వేనిమధ్య సాగుచున్నదో, ఆ యనుభవములకు అది భిన్నముగా నుండవలెను. అది అనుభవములుగాదు.

కనుక యదార్థముగా నదియొక్క ప్రవాహమార్గము నదిగాదు. మార్గము ఒక పరిస్థితి మాత్రమే. ఆపోలికను ఇంకను విస్తరించినట్లయితే, (పోలి

కలు నిరుపయోగములు. ప్రజలు వానిలో తమకు గావలసినవే కనుగొనుచుం డురు.) జీవితమునకు నది చక్కని ప్రతీకయని చెప్పవచ్చును. దానిలో స్థిర రూపము వహించినది ఒకే జాతికి జెందిన నీరు. అది సర్వదా ఒకే నీటి బిందువులతో కూడినది కాకపోవచ్చును. కాని సర్వదా అది నీరే. నీరులేనిదే నది లేదు. మానవునిలో సర్వదా ఉండునది చైతన్యము. శరీరమును ధరించునది అదే. రూపములుగావు శాశ్వతముగా నుండునవి. శాశ్వతమైనది ఎఱుక. అదే అన్ని రూపములను అనుబంధించునది. అన్నిటిలో ప్రవహించు నది. అన్నింటిని గుఱించిన జ్ఞాపకమును (స్మృతి అతి బాహ్యమైనది) వహించునది. అయితే. తాను మాత్రము ఒకే చైతన్యస్పందనముతో నుండునది.

అదియే సృష్టియొక్క గొప్ప రహస్యము: ఎందుకనగా, అది ఒకే చేతనకు సంబంధించినది. చేతన ఒకటే. ఎప్పుడయితే ఈ చేతన ఆవిష్కరింపబడుతుందో, బాహ్యమునకు విస్తరించుకుంటుందో, అప్పుడది ఆ విస్తరణ కొరకే. అసంఖ్యాకమైన ముక్కలుగా విభక్తమౌతుంది. ప్రతిముక్క వ్యక్తి యొక్క ప్రారంభమునకు, మూలమునకు కారణమగుచున్నది. ఈ రూపనియతియే. రూపయదార్థమే. ప్రతివ్యక్తిరూపమునకు మూలము. ప్రతిరూపమునకు ఈ నియతి. ఈ యాథార్థ్యము లేకుండినచో వ్యక్తిత్వమునకు. అవకాశములేక పోవును. ఇది అనంతముగా వ్యాపించు శక్తి. బహుశా ఏకాగ్రతచెందినవి, సమీకరింపబడినవి, యగు అంశములుండవచ్చును. గాని వ్యక్తిత్వమునొందిన చేతన యుండదు. అనేకముగా మార్పుచెందు ఏకవస్తువులో ప్రతిరూపము ఒక తత్వవిశేషమగును. ఈ అనేకత్వములో అసంఖ్యాకమైన నియతులు, చైతన్యాంశములు ఇమిడియుండి, విశ్వమంతయు వ్యాపించి తుదకు ప్రత్యేక వ్యక్తులక్రింద ఏర్పడుచున్నది. వ్యక్తిత్వమును పెంపొందించుకొనుటకు వ్యక్తి నిరంతరముగా తన మౌలికస్థానములనుండి దూరమునకు కడుదూరమునకు పోవుచున్నాడు. అయితే, ఒకతూరి వ్యక్తిత్వము ఏర్పడగానే, అనగా లోపలి సత్యమును గురించిన ఎఱుక పూర్తికాగానే, లోపలి గుర్తింపుతో అనేకత్వములో

మౌలికమైన ఏకత్వము పునఃస్థాపింప వీలగును. మనము చూచుచున్న ఈ విశ్వమునకు కారణమైన దిదియే. ఇది జరుగవలెననియే విశ్వము సృష్టింప బడినది. పరమేశ్వరుడు తనకుదాను ఆవిష్కరణ చేసికొన్నది, తన్ను తాను తెలిసికొనుటకు.

ఏమైనప్పటికీ ఈ సృష్టికి కారణములివి. మన విశ్వముతో మనము తృప్తిచెందుదము. భూమిమీద జీవితమును శ్రేష్ఠతమముగా నుపయోగింతము. తక్కినది తగినకాలములో రాగలదు.

తెలిసికొనుడు. నేను కావలయుననియె, 'అహంకారము వ్యక్తిత్వభావనకు కారణములలో నొకటి యని చెప్పలేదు. ఎందుకనగా, అహంకారం అబద్ధం, మాయ, వ్యక్తిత్వభావనకూడ (బుద్ధుడు, ఆదిశంకరుడు ఉద్ఘాటించినరీతిని) అబద్ధము, మాయమే. వ్యక్తిత్వము రూపొందుటకు మూలము పరమేశ్వరుడే కావున, అహంకారమనునది తాత్కాలికముగా అవసరమై నడుమలో వచ్చిపోవు వక్రరూపముమాత్రమే. దాని ప్రయోజనము తీరిపోయినతార్వాత అది అదృశ్యమగును. సత్యచేతన స్థాపింపబడిన తర్వాత అది నిరుపయోగమైపోవును.

* * *

మార్చి 5, 1951

తల్లి ప్రకృతిసహజమైన విపత్తులను గురించిన సంభాషణలలో ఒక భాగమును చదివినమీదట ఇట్లు ప్రశ్నించినది: "ఎందుకు విపత్తులు సంభవించును?"

> "దివ్యచేతన ప్రపంచములో ప్రత్యక్షమగుటకు జేయు ప్రయత్నమును మనుష్యుడు ప్రకృతి వ్యతిరేకించుటవలన కలుగుచున్నది."

ఇది పాక్షికమైన సత్యము. ప్రకృతి కిట్టి భావమున్నదని నేను అనుకోను. ఉదాహరణకు: భూకంపము కలిగినది, అగ్నిపర్వతము ప్రేలినది, అప్పుడు దాని సమీపమున నున్నవారు మరణించుచున్నారు. స్పష్టముగా వీరి కది గొప్ప ఆపద. మనము ఊహించినట్లయితే ప్రకృతి కదిమంచి తమాషా. మనము, "ఎంత ఘోరమైన తుపాను" అందుము. సహజముగా మనుష్యుల కది ఘోరమైనది అయితే ప్రకృతికి కాదు. అది ఉభయులకు గల దృష్టిబేధము;—అవునుకాదా? ఉన్నతమైనశక్తి భూమిమీద ప్రత్యక్షమగుట కుద్దేశింపగా దానిని ప్రకృతి తీవ్రముగా ఎదిరించినదన్న విషయము నిజమని నే ననుకోను. అది సంభావ్యము కావచ్చునుగాని అపరిహార్యముగాదు. దానిని సులభముగా నర్థముచేసికొనవచ్చును. ప్రకృతి తన మహాప్రబలశక్తులతో ఆడు ఆట అది. దాని కది వినోదము. ఏమైనప్పటికి అది విపత్తేమీ కాదు. ప్రకృతి చేతనకు లేక, భౌతికచేతనకు, భౌతికరూపకములు, భూమిమీద ఉన్న మానవులు చీమలవంటివారు. నీవు నడిచిపోవునప్పుడు చీమలు మరణించునని తెలిపియు నీవు తొలగిపోవు,—నీవు దృఢమైన అహింసావాదివై తేతప్ప. నీవు నడిచెదవు. కొన్నివందల చీమలను నలగద్రొక్కుదువు. నీవదితప్పించుకోలేవు. ప్రకృతియునంతే, ఆమె కదలిపోవును. ఆ నడచి

పోవుటలో కొన్ని వేలమందిని నాశనము గావించును. ఆమె కది అముఖ్యమైనది, కొన్నిలక్షలమందిని ఆమె సృష్టింపగలదు. అది కష్టసాధ్యమైనదికాదు.

ఇది పారిస్‌లో జరిగిన ఒక సంఘటనను స్ఫురణకు దెచ్చుచున్నది. అది "ధానవిపణి" అని పేరుగలిగిన బజారు. ఈ బజారునకు వివిధ వ్యాపారులు వచ్చి అన్నిరకముల వస్తువుల క్రయవిక్రయములలో పాల్గొందురు. వస్తువిక్రయమున వచ్చిన ద్రవ్యము దానధర్మములకు వినియోగింతురు. (అది ముఖ్యముగా మేలుచేయుటకంటె వినోదమునకు వినియోగపడును. అయినా దానకర్మముల మేలు చేకూరును.) ఉన్నతసమాజములోని సొగసంతా, నాగరికతంతా, అక్కడ చేరును. ఆ బజారు మహాసుందరముగా ఏర్పాటు చేయబడినది. అయితే దృఢముగా నిర్మింపబడలేదు; ఎందుకనగా, అది మూడు లేక నాలుగుదినముల వ్యవహారము గనుక. రంగురంగుల టార్పాలిన్ పైకప్పుతో అది అమర్చబడినది. విద్యుచ్ఛక్తి దీపములు వెలిగింపబడినవి. పని చాలా సున్నితముగా జేయబడినది. నాలుగుదినముల ముచ్చటేగదా యని వారి భావము. విద్యుచ్ఛక్తి ప్రమాదము Short circuit సంభవించి, మంటలులేచి సర్వమును దహింపజొచ్చినవి. పైకప్పు మంటలలో తగులుకొని మనుష్యులపై కూలి పడిపోయినది. నే నిదివరకే చెప్పినట్లు, సమాజములోని సంస్కార ప్రియులందరు అక్కడున్నారు. వారికది మానవతా దృక్పథముతో చూచినచో గొప్ప విపత్తు. ద్వారముచెంత నున్నవారు తప్పించుకొనుటకు ప్రయత్నించిరి. అది నిజమైన సంకులసమరము. ఈ నాగరకులందరు సామాన్యముగా సత్ప్రవర్తన గలవారు. వీధిలోని రౌడీలవలె త్రోవ్లాడ పాగిరి. గొప్ప గౌరవము గలవాడు, రాజమర్యాదగలవాడు, కీర్తిగలవాడు, కవి, నాగరికత గలవాడు అక్కడుండుట తటస్థించినది. అతడు తన వెండి బెత్తముతో, మహిళల తలపై బాదుచు ముందుకు సాగిపోవ ప్రయత్నించుచుండెను. అది చాలా వినోదకరమైన దృశ్యము. తరువాత సంఘములో ఏడ్పులు, రోదనలు, శవజాగరణలు, అంత్యకర్మలు జరిగినవి.

అంత్యక్రియల శ్మశానవాటిలో ఒక పెద్దమనిషి ఉపన్యాసము గావించెను. అతడు, ""ఆది మీకు దగినట్లు జరిగినది. దేవుని శాసనము ననుసరించి మీరు బ్రతుక లేదు. మిమ్ము దహించుటద్వారా దేవుడు శిక్షించినాడు.'' అని చెప్పెను.

ఎక్కడెక్కడ ప్రమాదము జరుగునో అక్కడక్కడ యిది జరుగును. అనేకులు ఎదురుతిరిగి, ""ఈ దేవుడు మాకక్కరలేదు.''— అనిరి. ఈ భావాలు సామాన్యమానవ లక్షణమునకు చక్కని ఉదాహరణలు.

మానవులను పాపులను చేయుట క్రైస్తవసంప్రదాయము. దైవమును గురించిన మన అభిప్రాయమును అది భగ్నపరచును. పాపులుగా పుట్టిన దురదృష్టము కారణమున వారిని శిక్షించు దేవుడు ఉదారు డెట్లగును? అయినను....

(తల్లి మరల చదువుచున్నది) "తత్వశాస్త్రము, వస్తువుల రహస్యమును బయలుపరచుటలో నపజయము నందినది ఎందుకనగా అది సర్వవిశ్వమును మానవుని మనస్సులో నిరికింప బ్రయత్నించినది,

(సంభాషణలు 1929 పేజి 46)

"మానవుని మనస్సు పరిమాణమునకు విశ్వమును ఇముడ్చుట." ఇది నిజముగా ప్రతి మానవుడు చేయునది. విశ్వమును గూర్చి వారు ఈ విధముగా తీర్పు చెప్పుటయే గాక విశ్వమును నిర్మించిన దైవ నియమములను గూర్చి కూడ తీర్పు గావింతురు. తాము కొంత తెలిసిన వారమని ఊహింతురు.

"స్వేచ్ఛ'' అనుదానికి అన్ని తగులములనుండి విముక్తి చెందుట యని అర్థమా ?''

అన్ని తగులముల నుండి విముక్తి పొందుటే గాదు, ఫలితముల నియతికి సంబంధించిన బంధములనుండి కూడ విముక్తి బొందవలెను. భౌతిక రంగములో ఒక నిర్ణయమున్నది. అది ఈ ఫలితముల నియతినుండి, కారణ కార్యనియతి నుండి వచ్చినదే. అందువలన, ఆంతరిక స్వేచ్ఛ అన్ని తగులముల నుండియే గాక, అన్ని ఫలితములనుండి కూడ విముక్తి కలిగించును— ఇదివరకే అనేక మార్లు నేను చెప్పినట్లు. నీ ఆంతరిక స్వేచ్ఛ వలన నీ చేతన భౌతిక ప్రపంచమును పాలించు భూమిక కంటె అత్యున్నతమైన భూమికను అందుకొనును. ఆ ఉన్నత భూమిక నుండి దివ్యశక్తి క్రిందకు దిగి సకల భౌతిక ఫలితములను రద్దు చేయగలదు.

ఒకడు ఉన్నతచేతనయందు ఒక సత్యమును సాధించినను, మనస్సు దానిని వ్యతిరేకించినట్లయితే, ఈ నూతన సత్యమును ఆమోదించుటకు మనస్సును బలవంతము చేయవలెనా ?

నీవు దానిని బలవంతము చేయుటలో జయించినట్లయితే చాలా మంచిదే. కాని, అది అంత సులభము గాదు. ఇది జరుగుటకు దానిని బలవంతము చేయవలెనని నిర్ణయించినంత మాత్రమున చాలదు, అది తిరుగుబాటు చేయును. తిరుగుబాటు చేయునది అది ఒకటే కాదు. మరి, అట్లు తిరుగుబాటు చేసిన మనస్సు నేమి చేయుదువు? తన యిష్టము వచ్చినట్లు చేయుటకు విడిచిపుత్తువా? ఆ విధముగా దాని శక్తిఅంతయు వ్యయించి పోవునట్లు చేయనెంతువా? అది ఏమీ మంచి పద్ధతి గాదు.

ఈ కార్యక్రమపద్ధతి అందఱిలోను ఒకటిగానుండదు. మనస్సులో ఎక్కువ వెలుగున్నవారు (లేక, ఉన్నదని భావించువారు) ఉన్నారు. వారికి విషయములు తెలియును. ప్రపంచము, ఇతరులు ఎట్లు నడుచుకొనవలయునో తెలియును. అది

యును గాక, మార్గమున తాము చాలా ముందుకు పోయితిమనే నిశ్చయము వారి కుండును. కాని, వారు కార్యమున కుపక్రమించి నప్పుడు, వీధిలోని తుంటరిపిల్ల వానికంటె బుద్ధిహీను లగుదురు. ఎందువలన? ఎందుకనగా, దానిని నిశ్చయించి నది మనస్సు గాదు. ఒకవేళ అది నిశ్చయించినప్పటికి అమలు జరిపినది మనస్సు గాదు. ఏది అమలు జరిపినదో అది మనస్సుయొక్క పెత్తనమును అంగీకరింపదు. దానితో, "నాయంతకు నన్ను వదిలిపెట్టుము, నన్ను శ్రమ పెట్టవద్దు. నా ప్రేరణ ప్రకారము నేను పనిచేయుదు", అనును. అప్పుడు నీ వేమి చేయుదువు? మనస్సు నకు పాఠము నేర్పుటకు ప్రయత్నింతువా? నీవు ప్రయత్నము చేయవచ్చును. గాని జయము గాంతువని నమ్మకము లేదు.

అది సులభమైన సమస్య గాదు. మానవ ప్రకృతి అస్థిరమైనది. ఒక విధ ముగా ఆలోచించిన తర్వాత అది మఱియొక విధముగా ఆలోచించును. ఒక విధ ముగా అనుభవమును బొందిన తర్వాత మఱియొక విధముగా అనుభవమును బొం దును. ఇంకను అదే విధముగా సాగించును. ఏదియు స్థిరముగా నుండదు. మం చిది చెడ్డదానికంటె ఎక్కువకాల ముండదు. చెడ్డది మంచిదానికంటె ఎక్కువకాల ముండును. అయినను, ఇట్టిది అనంతముగా కొనసాగదు. వేచియుండే ఓపిక నీకు ఉన్నట్లయితే తప్పక అది మారును.

కాని, ప్రతిదీ తిరిగి వచ్చుచునే యుండును!

అవును. నిజముగా ఏదియు లఘువిధముగా మారదు. దాని లయగతిమాత్రమే మారును. అది రంగులచక్రాలవంటిది. ఒకప్పుడు ఒక రంగుకనపడును. మఱియొక ప్పుడు ఇంకొకరంగు ఎక్కువకాలము కాచుకొనియున్నట్లయితే, ఎఱుపు, నీలము, తెలుపు; ఎఱుపు, నీలము, తెలుపు-ఇట్లు అనంతముగా సాగిపోవుచుండును. అవిధమైన సిద్ధాంతమును చాటెడివారు కొందరున్నారు, నే ననేకమారులు విన్నాను. ప్రాణీకస త్త్వను ఎంతమాత్రము అణగద్రొక్కరాదనీ దానిఇచ్చవచ్చినట్లు పోనివ్వవలెననీతుదకది

అలసట జెంది చక్కబడుననీ వారందురు. ఇది శుద్ధ అవివేకమునకు పరాకాష్ఠ. మొట్టమొదటి సంగతి ఏమంటే,—ప్రాణిక సత్త తన సహజ ప్రకృతి ప్రకారము ఎన్నటికీ తృప్తి చెందదు. ఒక రకమైన కార్యసరళి చప్పనై తోచిననో, దానిని ద్విగుణీకృతము గావించును. తన అవివేకములో తనకు విసుగు పుట్టించినచో, వాటిని మరింతగా పెంచయత్నించి 'అతి' లోనికి దిగును. ఒకవేళ అలసట జెందినట్లయితే, విశ్రాంతి తీపికొని మఱల ప్రారంభించును. ఎందుకనఁగా అది మార్పునకుఁ అంగీకరించదు. ఇతరులు, నీవు నీ ప్రాణిక సత్తను త్రొక్కి ఉంచినచో, అది అణఁగి యుండినను తిరిగి ఒక దినము ఆవిరియంత్రము లాగ పైకి పొడుచుకొని వచ్చును.'' అందురు. ఇది నిజము. కాని, ప్రాణిక సత్తను అణఁగద్రొక్కుట సమస్యకు పరిష్కారము గాదు. దాని యిష్టము వచ్చినట్లు చేయనిచ్చుట కూడ సమస్యకు పరిష్కారము గాదు. సామాన్యముగా నిది తీవ్రమైన అవస్థలను గూర్చును. మూడవ పరిష్కార మార్గముండి తీరవలయును.

ఊర్ధ్వమునుండి వెలుఁగువచ్చి ప్రాణికసత్తకు పవిత్రతను గూర్పవలయునని ఆకాంక్షించుటయా ?

స్పష్టముగా నంతే. అయితే, సమస్య ఆలాగే ఉన్నది. నీవు మార్పును ఆకాంక్షించుచున్నావు. అది ఖచ్చితముగా రావాలని నీ యాశ. అయితే నీ యాకాంక్షకు సమాధానము వెంటనే రాదు. ఈలోపల నీ ప్రకృతి వ్యతిరేకించును. విషయము లీ విధముగా జరుగును : అనుకొన్న సమయములో ప్రకృతి నీకు లోబడినట్లు తోచును. నీవు ఫలితము దక్కినదని భావింతువు. కోరిన ఫలితము సాధింపఁబడినదని నీవనుకొన్న మఱుక్షణము నందే నీ ఆకాంక్ష యందలి తీవ్రత కుంటువడును. అంతట నీలోపల దాగియుండినది. జిత్తులమారి యగుటచేత, ఒక మూల నిశ్శబ్దముగా గాచుకొనియుండి, నీవు ఏ మఱగానే పెట్టిలోని వ్యక్తివలె ఎగిరి దుముకును. నీవు మఱల మొదలెత్తుకొనవలెను.

అయితే, దానిని సమూలముగా పెరికి వేసినట్లయిన ?

ఆహా! అది సాధ్యమని నమ్ముటకు వీలులేదు. ప్రపంచమును రక్షించుటకు దానిని అమితముగా క్షీణపరిచి, తుదకు దాని నామరూపములు లేకుండా చేయఁజూచిన వారిని నే నెఱుఁగుదును. ఇది సన్యాసుల మార్గము. సమస్య ఉండుటకే అవకాశము లేకుండా చేసి సమస్యను రూపుమాపు నెంచుచున్నావు. అయితే ఇది దేనినీ మార్చజాలదు.

అదికాదు. దానికొక మార్గమున్నది. నమ్మకమైనది. నీ మార్గము స్పష్టముగా కనబడునదిగా నుండవలెను. నిన్ను గూర్చి స్పష్టముగా మేల్కొనిన యెఱుక యుండవలెను. అక్కడ ఏమి జరుగుచున్నది, ఎట్లు జరుగుచున్నది, నీకు దెలిసి యుండవలెను. క్రోధ ఘూర్ణిత మానసుఁడైన వానిని, హింసాపరుని ఉదాహరణకు తీసికొందము. ఒక పద్ధతి ప్రకారము, "నీకెంత యిష్టమో అంత కోపము దెచ్చుకొనుము. దాని పర్యవసానమును నీ వనుభవింతువు, ఇది నిన్ను స్వస్థుని జేయును," అని చెప్పఁబడినాడు దీనిని చర్చింపవచ్చును. ఇంకొక పద్ధతి ప్రకారము, "నీవు నీ కోపమును త్రొక్కిపట్టుము, అది అదృశ్యమగును," అని చెప్పఁబడినాడు. ఇదియును చర్చింతము. ఏమైనప్పటికి నీవు దానిని సర్వదా త్రొక్కిపట్టి యుండవలయును. ఒక్క నిమిషకాలము ఏమఱి ండినచో వెంటనే ఏమి జరుగునో నీవు చూతువు. అప్పుడు కర్తవ్యమేమి ?

నీవు అధికాధికముగా నీ చేతనను పెంపొందించుకొనవలెను. అది యెట్లు జరుగనున్నది, ఏ మార్గము ద్వారా విపత్తు వచ్చినది, నిన్ను కైవస మొనర్చుకొనుటకుముందు దారిలో ఎట్లు పొంచియుండినది నీవు పరిశీలించవలయును. నీవు ఏదైనా ఒక లోపమును, చిక్కును పూర్తిగా తొలగించుకొన వలెనంటే, ఒకేఒక్క మార్గమున్నది. ఏ మఱుపాటులేని జాగ్రత్తగల ఎఱుకను కలిగియుండుటకు నీవు సంపూ

ర్ణముగా శ్రద్ధ వహించవలెను— మొదట నీవేమి చేయవలయునో విశదముగా తెలిసికొనవలెను. వెనుబాటు, సంశయము గలవాడవై, "ఇది చేయుట మంచిదా కాదా? అది సమన్వయ సాధనలోనికి వచ్చునా? రావలసిన అవసరము లేదా?" అనే వితర్కములోనికి దిగరాదు. ఏలనంటే, నీవు నీ మనస్సును నమ్మినట్లయితే, అది ముందుకు వెనుకకు ఆడుట నీవు చూతువు. అది సర్వదా ఊగిసలాడుచుండును. నీవొక నిర్ణయమునకు వచ్చినట్లయితే, అది సరికాదనుటకు నీయందు వివాదములను గల్పించును. నీవు, "అవును, కాదు"ల మధ్య, తెలుపు నలుపులమధ్య ఇటునటు విసరబడుదువు. ఏ నిశ్చయమునకు రాజాలవు. కనుక మొదట ఖచ్చితముగా నీకేమి కావలయునో తెలిసికొనవలెను. మానసికముగా గాక, ఏకాగ్రత, ఆకాంక్ష, సత్సంకల్పము ద్వారా తెలిసికొనవలెను. అది ముఖ్యాంశము. తరువాత క్రమక్రమముగా. పరిశీలన ద్వారా వ్యక్తిగతముగ నీకు సంబంధించిన మార్గమును కనుగొనవలెను. అదే మార్గమును అనుసరింపవలెనని ఇతరులను నమ్మించుట నిరుపయోగము. ఎందుకనగా, అది జయమును బొందదు. ప్రతి మనుజుఁడు తనకు నచ్చిన మార్గమును అనుసరింపవలయును; ప్రతి మనుజుఁడు తన మార్గమును కనుఁగొనవలెను. నీ మార్గమును నీ ఎంతవరకు అమలు పెట్టుదువో అంతవరకు అది విశదమై, రానురాను సరియైన దగును. నీ వొక అంశమును సవరించుకొందువు. వేరొక దానిని విశదపరచుకొందువు. కనుక నీవు పనిచేయ ప్రారంభింపుము. కొంతకాలము అంతయు సవ్యముగానే యుండును, తర్వాత, ఒక దినము దాటరాని ఒక కష్టము నిన్నెదుర్కొనుట కనుగొందువు. అప్పుడు నీకు నీవు "నేను చేయవలసిన దంతయుఁ జేసితిని. కాని. ఇపు డిక్కడంతయు ముందున్నంత చెడ్డగానే ఉన్నది" అని అనుకొందువు. ఇటువంటి సందర్భములో నీవు తప్పనిసరిగా ఇంకను అధికమైన నిలకడగల ఏకాగ్రతతో నీ లోపలి ద్వారమును తెరిచి, ఈ పరిస్థితి లోనికి ఒక క్రొత్త శక్తిని, ముందచ్చట లేనిదానిని, నూతనమైన ఎఱుకగల స్థితిని గొనిరావలయును. అప్పుడొక శక్తి నీ స్వయంశక్తి నిర్వీర్యమై పోయిన స్థితిలో ద్యోతకమగును. స్వయంశక్తి నిర్వీర్యమైపోయినపుడు సామాన్యులు, "మంచిది, నే నిఁకముందు ఏమియు జేయఁజాలను. అం

తయు ముగిసినది.'' అని యనుకొందురు. నేను చెప్పున దేమన, నీవిట్టి అడ్డు గోడకు ఎదురుగా నిలఁబడినప్పుడు, అది ఒక క్రొత్త ప్రారంభదశ యగును. సడ లని ఏకాగ్రతతో నీవు ఆ గోడను దాటి ఆవలివైపునకుఁ బోవలయును. అక్కడ క్రొత్త జ్ఞానము ద్యోతకమగును. క్రొత్త బలము, క్రొత్త శక్తి, క్రొత్త సహా యము అందుబాటునకు వచ్చును. నీవు క్రొత్త విధానమును కనిపెట్టుదువు. అది నిన్ను సుదూరము గొనిపోవును.

ఇది నిన్ను నిరుత్సాహపరుచుటకు జెప్పుటలేదు. విషయములట్లు సంభ వించును. అన్నిటికంటె పెద్దదేమన, అది సంభవించినపుడు నీవు నిరుత్సాహ పడుట. కావున నీవు. ''నాకు గల ప్రయాణ సదుపాయముతో ఇపుడింతవరకు వచ్చితిని. ఇకమీద ఇవి ఉపయోగ పడునట్లు లేదు. ఏమి చేయవలెను ? ఇక్కడ కూర్చుండిపోవుటేనా ? అట్లెన్నటికి జరుగరాదు. క్రొత్త ప్రయాణ సదుపాయము లను కనుగొని తీరవలెను'' అని నీకు నీవే చెప్పుకొనవలెను. ఇవి తరచుగా జరుగుచుండును. కొంత కాలమునకు నీవు దీనికి యలవాటు పడిపోదువు. ఈ స్థితిలో కొంచెముసేపు కూర్చుండి ధ్యానము చేయుము. పిమ్మట, ఆ నూతన సదు పాయములను కనుగొనుము. నీ యేకాగ్రతను, ఆకాంక్షను, శ్రద్ధా విశ్వాసము లను వృద్ధిచేసి నీకు అందగల నూతన సహాయముతో, నూతన కార్యక్రమమును ఏర్పరచుకొని ముందునకు సాగిపొమ్ము. ఇదియే ఒక దశనుండి మఱియొక దశకు పురోగమించెడి పద్ధతి. నీవు గ్రహించిన దానిని, నేర్చుకొన్న దానిని ప్రతి దశలోను, బహుజాగ్రత్తతో, ఎంత సంపూర్ణముగా అమలు జరపగలవో, అంత సంపూర్ణము గానూ అమలు జరపుము. నీవు కేవలము అంతర్నిష్ఠలోనే ఉండిపోయి, ఆంతర పురోగమనమును భౌతిక క్షేత్రమునకు గూడ వర్తింప జేయుటకు ప్రయత్నించక పోయినట్లయితే, నీకు కదలలేని స్థితియేర్పడును. ఎందుకనగా, నీ బాహ్యవ్యక్తిత్వము మార్పు చెందనిదై, వెనుకకు లాగుచు, ముందుకు సాగిపోనీయని విధముగా బం ధించిన సంకెలయగును. కనుక ముఖ్య విషయ మేమన (అందఱు చెప్పునది,

కొందఱే ఆచరించునది) నీకుఁ దెలిపిన దానిని అమలు పెట్టుము. దానితో నీకు జయించే ఆస్పద మేర్పడును. పట్టుదల చూపినట్లయితే గమ్యము చేరుకొందువు.

నీవొక అడ్డుగోడ యెదుట నిలబడినప్పుడు నిరుత్సాహ పడవలదు. ఎప్పుడును, "ఓః నే నేమి చేయుదును, అది ఇంకను అక్కడే ఉన్న" దని అనుకొన వలదు, ఇదే విధమైతే ఆ స్థితి అట్లే ఉండును. ఇంకను అట్లే ఉండును. తుది వరకు అట్లే ఉండును. నీవు చరమ లక్ష్యమును చేరినప్పుడే ఆకస్మికముగా నన్నియుఁ కూలిపోవును.

* * *

మార్చి 8, 1951

"పూర్వ జన్మములను గుఱించిన నిజమైన స్మృతి పూర్ణ జ్ఞానములో ఒక భాగమేకావచ్చును. అయితే అది భావనాకల్పనల మార్గమున లభించునదిగాదు. అది ఒకవైపున బాహ్యావిషయిక జ్ఞానమేయైనా, మఱియొక వైపున వ్యక్తిగత ఆంతరంగికానుభవముమీాద ఆధారపడినదిగానున్నది. ఇక్కడనే కల్పన, అపార్థము, అసత్యనిర్మాణములకు ఎక్కువ అవకాశమున్నది. పూర్వ జన్మముల సత్యమును అందుకొనుటకు నీ అనుభవ జ్ఞానము విశుద్ధమైనది, నిర్మలమైనదిగా నుండవలెను. వ్యక్తిగతమైన అభిప్రాయములనుండి, చిత్తవృత్తులనుండి,

తనయిష్టము వచ్చినట్లు వివరించు, వ్యాఖ్యానించు, మనస్సుయొక్క అలవాటులనుండి విడివడినదిగా నుండవలెను."
సంభాషణలు (1929)పే 46;47.

మానసికక్షోభ్యమును దొలగించుటకు ఏమి చేయవలయును ?

మనస్సును నీరవముగా నుంచుటకు నేర్చుకొనవలెను. సద్దుచేయక శాంతముగా నుండుట, శ్రద్ధగలిగియుండుట ముఖ్యమైనవి. నీవు నీ మనస్సును నేరుగా నిశ్శబ్దముగా నుంచుటకు బ్రయత్నించుట కడుంగడు దుష్కరము; దాదాపుగా అసాధ్యమైన పని. ఎందుకనగా, దానిలో ఎక్కువభాగము పనిచేయకుండా ఉండలేదు. అది ఎప్పుడును నిలువకుండా నమోదుచేయు యంత్రమువలె పనిచేయుచుండును. అది నమోదు చేసినదంతయు మఱల, మఱల పునరుక్తిగా, నిలుపుదలలేకుండా, పలుకుచునేయుండును,—దానికొక నిలుపుదలచేయు మఱ యుండిననే తప్ప. నీవట్లుగాక, నీ చేతనను, సాధారణమనస్సుయొక్క భూమిక నుండి ఉన్నతభూమికకు మార్చగలిగినట్లయితే, దివ్యతేజస్సులోనికి ఈ ఉన్మీలనము నీ మనస్సును నిశ్చలము గావించును. ఇక అది కలదు. ఆవిధముగా ఒనగూడిన మనశ్శాంతి నిలుకడగా ఉండును. ఒకసారి ఈ భూమికలోనికి ప్రవేశించినట్లయితే నీవు దానినుండి బయటికి రానొల్లవు. నీ బాహ్యమనస్సు సర్వదా ప్రశాంతస్థితిలో నుండును.

ఒకేఒక నిజమైన పరిష్కారమార్గము ఉన్నతతేజస్సు కొఱకు ఆకాంక్షించుటయే.

మన సహజప్రకృతిలో తిరుగుబాటుచేయు వివిధభాగములకు లొంగుబాటును నేర్పుట ఏట్లు ?

అర్థముచేసికొనలేని చిన్నబిడ్డను బుజ్జగించినట్లు, అవి అర్థముచేసికొను రీతిగా అన్నిరకములైన మార్గములను ప్రయత్నింపవలెను. పటములు, సంకేతము వివరణలు,— అన్నింటిని ఉపయోగింపవలెను; వానితో హేతువాదము చేయుము. తమ కార్యముల పర్యవసానములను, అవి తెలిసికొనునట్లు చేయుటకు ప్రయత్నించుము. అన్నిటికంటెమించి, గొప్ప ఓర్పును వహించుము. ఒకే విషయమును మఱల, మఱల ప్రయోగించుటకు విసుగుపడకుము.

ఈ కార్యములలో మనస్సు సహాయకారిగా ఉండగలదా?

ఆ మనస్సు పూర్తిగా జ్ఞానమును పొందియుండినట్లయితే, చైత్యపురుష జ్యోతికి విధేయమై యుండినట్లయితే, సత్యముయొక్క బోధ పొందియుండినట్లయితే, సహాయకారియగును. విషయములను వివరించును.

పునర్జన్మములకు ఏవైనను సాధారణనియమములు, విశాలమైన రేఖామాత్రపుసూత్రములు ఉన్నవా? లేక ఏదైనను సంభవమేనా?

ఒకడు ఏస్థితికి సంబంధించియున్నాడు, అనేదానిపైనను, చైత్యపురుషుని అభివృద్ధిపైనను, అది ఆధారపడియుండును, చైత్యపురుషుడు పురోగతిదశలలోనున్నట్లయితే, పరిపక్వ స్థితికి దగ్గరలోనున్నట్లయితే మరణమునకు ముందుచేసిన యెన్నిక (దీనినిగుఱించి ముందు దినము మాట్లాడియున్నాను) వాస్తవమైనదే యగును. ఆ యెన్నికరీత్యా అన్నియు సాధ్యమే. అయితే, ఇతరులవిషయములో పునర్జన్మ దానంతటదియే సంభవించును. కనుక నియమము లేమియులేవు. అది పరిస్థితులపైన అధికముగా ఆధారపడి ఉండును. ముఖ్యముగా, చైత్యపురుషుడు అనుసరించు మార్గముపైన దాని మూలకారణముపైన ఆధారపడియుండును.

అది చెప్పుట కష్టము. పురుషుడుగా పుట్టునా? స్త్రీగా పుట్టునా? అనేది చాలా కాల మునకుగాని నిర్ణయముగాదు. చేతన వృద్ధిపొందినకొలదీ కొంత ఐక్యత్వము సాధించినకొలదీ, చేతన సమైక్యతను గడించినకొలదీ ఒకదారిని వదలిపెట్టి మఱియొకదారిని కోరుకొనుటలో శక్తిని అభివృద్ధి చేసికోగలదు. అయితే, ఈ ఎన్నికకుముందు అసంఖ్యాకజన్మలద్వారా స్త్రీ పురుష రూపములను దాల్చి యుందువు. అందుకనే బహుశా కొందఱి స్త్రీలకు పురుషప్రవర్తన ఉంటుంది. పురుషులకును ఆవిధముగనే స్త్రీ తత్వముంటుంది. ఇప్పుడున్న లింగములకు వ్యతిరేకప్రేరణలు ఉండుటకూడ గమనింపవచ్చును. అయితే ఎన్నిక సమయ ములో ఒకడు సృష్టికర్త్రియగు చిచ్ఛక్తిచేతనకో, లేక సాక్షిభూతముగానున్న అచలత్వమునకో తాను సంబంధించియుండ నిశ్చయించుకొనవచ్చును. అది మూలకారణముపై ఆధారపడియుండును.

## అందఱి చైత్యపురుషులకు మూల మొకటేనా?

క్రింద వివరించినట్లుగా విషయములు సంఘటిల్లును. చైత్యపురుష జీవి తపు మూలస్థానము, భౌతికపదార్థములో నిహితమైయున్న దైవసన్నిధి ఒకటే. అది అర్థమగుచున్నదిగదా! అయితే, ఊర్ధ్వప్రపంచపు వ్యక్తులున్నారు. వారు భూమిమీద ఎప్పుడును జన్మమెత్తలేదు. కాని, వా రచట పనిజేయవలెనని అభి లషింపవచ్చును. అట్టిసందర్భములో వారు, సంపూర్ణాభివృద్ధిజెందిన కొందఱు చైత్యపురుషులతో ఏకత్వముపొంది తమ ప్రకృతి ననుసరించి పనిచేయుటకు వచ్చియుందురు. వారిచేతన భూమిమీద చైత్యపురుషుని ఎఱుకతో చేర్చబడును. ఎప్పుడును భూమిపై జన్మమెత్తనివీరు, సృష్టి కొనసాగుకొలదీ, తామురాను పదార్థముతో సమైక్యతజెంది భూలోకమునకు వత్తురు. ప్రత్యేకకారణములచేత, ఆదిలో విశ్వములోనికి వచ్చిన ఆదిమూర్తులు వీరు. మానవులు వీరిని దేవత లనియు, దేవతాంశసంభూతులనియు అందురు. ప్రత్యేకకారణములవలన రూపము చెందుచున్న చైత్యపురుషుని దేవతలలో ఒకడు ఎన్నుకొని వానికి సహాయము

చేయును. వాని అభివృద్ధి ననుసరించును. ఈ చైత్యపుషుడుతగినట్లుగా సిద్ధపడినతర్వాత, ఈ ఏకత్వమును బలపరచుటకు తగినంత బలమును పొందిన తర్వాత, అతడు (ఆదేవుడు) ఈ చైత్యపుషునితో సమ్మిశ్రితముజెందును. వానిని తన్నుగానే భావించి భూమిమీద బనికి బూనుకొనును. ఇది తరచుగా సంభవించునది గాదు; అయితే సంభవించినది, భావిలో సంభవించును గూడ. ప్రాచీన సంప్రదాయములో భూమిమీద అవతారమెత్తిన దేవతల కథలను నీవు తెలిసికొనగలవు. కొందఱు పౌరాణికులు వారినిగురించి చెప్పుదురు. అవి యదార్థస్థితికి అనుగుణమైనదే. అయితే, అందఱు చైత్యపురుషులు ఊర్ధ్వభూమికలలోనున్న దివ్యులతో సమైక్యము చెందినవారు కారు.

ప్రాణికలోకములోనిజీవులు శరీరము గైకొనుట గుఱించి "భూతావేశము" అను గుఱించి తల్లి ప్రస్తావించినది:

## ప్రాణికజీవులు చైత్యపురుషుని గలిగియున్నారా ?

లేదు. అవి అవతరించవలయునంటే చేయవలసిన మొట్టమొదటిపని యేమనగా ఎవరు చైత్యపురుషుని పొందియున్నారో వారినుండి ఆ చైత్యపురుషుని తరిమివేయవలయును. అది పుట్టుకనుండియు సంభవింపవచ్చును. కొందరు పిల్లలు దాదాపు విగతప్రాణులై పుట్టుదురు. చనిపోయినవారుగా వారిని భావించుట జరుగును. కాని ఇంతలో ఆకస్మికముగా వారు తిరిగి బ్రతుకుదురు దీని యర్థమేమనగా, ప్రాణికలోకజీవుడు వారిలో ప్రవేశించినాడు. నాకు అట్టి సంఘటనలు కొన్ని తెలియును. ఇది జబ్బుగానుండిన కాలములోకూడ సంభవింపవచ్చును. ఒకడు ఎక్కువ జబ్బుగా నున్నాడు. క్రమక్రమముగా చైత్యపురుషునితో సంబంధము కోల్పోయినాడు. తరువాత మూర్ఛకు సరియగు నట్టి స్థితిలో పడిపోయినాడు. చైత్యపురుషునితో సంబంధము పూర్తిగా తెగిపోయినది. అప్పుడు కనిపెట్టియుండిన ప్రాణికలోకజీవుడు వెంటనే వానిలో ప్రవే

శించినాడు. ఈవిధమైన సంఘటనలు నాకు దెలియును. అది నిదానముగా జరుగునవికూడ కావచ్చు. ప్రాణికజీవి ఆ వ్యక్తియొక్క వాతావరణములో ప్రవేశించును. అతనిపై తన పలుకుబడి నుపయోగించును. తుదకు అతనికి రోగము, దెబ్బలు, మానసికరోగము వచ్చునట్లుచేయును. తరువాత, చైత్యపురుషునితో ఉన్న సంబంధము పూర్తిగా తెగగొట్టబడినప్పుడు ప్రాణిక జీవి ఆ వ్యక్తియొక్క శరీరమును తన స్వాధీనములోనికి దెచ్చుకొనును, కొంతమంది ఎక్కువ రోగముచేత బాధపడి తరువాత దానినుండి బయటపడి నప్పుడు, వెనుకటికంటె విభిన్నవ్యక్తిత్వముతో కనబడుదురు. తరచుగా ఈ విధముగా సంభవించును.

ఈ ప్రాణికజీవులు ఆధ్యాత్మికజీవితముచే ఆకర్షింప బడుదురని మీరన్నారు—ఎందువలన ?

వారు ఆకర్షింపబడుదురుగాని, ఆధ్యాత్మిక జీవితమును పూర్తిశ్రద్ధతో అనుసరింపవలయునని వారు నిశ్చయించినట్లు దాని అర్థము కాదు. ఈ జీవుల ముఖ్యమైన గుణము అబద్ధముచెప్పుట, వారి ప్రకృతి మోసముతో నిర్మింప బడినది, వారికి మాయపై అధికారమున్నది. వారు దేవతలయొక్క, లేదా ఇంకను అధికమైన ఉన్నతజీవులయొక్క రూపమును దాల్చుచుందురు. దిగ్భ్రమ గూర్చు ప్రకాశములో కనబడుచుందురు, అయితే, అంతఃశుద్ధి గల్గినవారు వారిచే మోసగింపబడరు. వారు తమ్ము ఏదో హెచ్చరించుచున్నట్లుగా భావింప వచ్చును. అయితే, ఒకడు అద్భుతమైన వాటిని, అనూహ్యమైన వాటిని, చోద్యమైనవాటిని ఇష్టపడేవారు, అద్భుతమైన కల్పిత కథాప్రపంచములో నివ సింపగోరినవారు, సాధారణముగా సులభముగ మోసగింపబడును,

హిట్లరు విషయములో ఇటీవల చారిత్రకసంబంధమైన ఒక తార్కాణము సంఘటిల్లినది. పరదైవముగా అతడు భావించిన ఒకానొక జీవునితో అతనికి సంబంధమేర్పడినది. ఆజీవుడు వచ్చి అతనికి సలహాయిచ్చుచు, అతడేమి చేయవలసినదీ చెప్పెడివాడు. హిట్లరు ఏకాంతస్థలమునకు బోయి, తన సలహాదారు వచ్చునంతవరకు వేచియుండి, అతనినుండి ప్రేరణలను బొందుచుండువాడు. తరువాత వానిని తు. చ. తప్పక పాటించెడివాడు. ఇతడు భావించిన ఆ పరదైవము స్పష్టముగా ఒక అసురుడు. తంత్రవిద్య ప్రకారము "అసత్యానికి ప్రభువు.'' అయితే అతడు తనను సర్వజాతులకు ప్రభువుగా ప్రకటించుకొన్నాడు. అతనికి ప్రకాశమానమైన రూపమున్నది. మంత్ర విద్య నెఱిగి, రూపములవెనుక ఏమున్నదో తెలిసికొనగలవారిని మినహాయించి తక్కినవారిని తప్పుడుదారి త్రొక్కించును. అతడు యెవరినైనను మోసము చేయగల అద్భుతశక్తిసంపన్నుడు, సాధారణముగా హిట్లరుకు రొమ్మున వెండి కవచముతో, తలకు ఇనుపకుళ్ళాయితో దర్శనమయ్యెడివాడు. ఒకవిధమైన జ్వాల అతని తలలోనుండి బయటి కుబికివచ్చుచుండెడిది. తనచుట్టు, కనులు మూత బడజేయు కాంతిపుంజముతో కనుపించుచుండెడివాడు, హిట్లరు అతని వైపు చూడగలిగేవాడు కాడు. అతడు హిట్లరుకు ఏమి చేయవలయునో అంతా చెప్పెడివాడు. కోతిపిల్లతోను, ఎలుకతోను ఆడుకొనునట్లు హిట్లరును అతడు విని యోగించుకొనుచుండెడివాడు. హిట్లరు తన తనువును భగ్నపరచుకొనునంత వరకు ఆ అసురశక్తి అతనిచేత వీలైనన్ని విపరీతవిజృంభణల నన్నింటినీ చేయించెడిది. చివరకు హిట్లరు భగ్నుడై పోవుటయేజరిగినది. ఇటువంటి సంఘటనలు తరుచుగా జరుగుచుండును. కాని, వాని స్థాయి కొద్దిపాటిది.

ఆ అసురశక్తికి హిట్లరు చాలా మంచి మధ్యవర్తి (Medium) గా ఉపయోగబడినాడు. అతనికి మధ్యవర్తిత్వము వహించు అమోఘమైన శక్తి యుండినది. కాని, వివేక విజ్ఞానములు మాత్రము లేకుండెను. ఈ శక్తి హిట్లరుకు ఎట్టిదైనను చెప్పి నమ్మించుచుండెను. హిట్లరు వాని నన్నింటిని మ్రింగుచుండెడివాఁడు. ఆ

శక్తే హిట్లరును క్రమక్రమముగా ముందుకుఁ ద్రోసినది. దానికి ఇదంతయు వినోదము. మానవ జీవితమంటే దానికి లెక్కలేదు. ఈ శక్తులు మనుష్యులలో, పిల్లి ఎలుకలతో చెలగాట లాడినట్లు ఆడుచుండును. తుట్టతుదకు అది వాటిని తిని వేయును.

మానసికముగా కుంటుపడిన వ్యక్తులు ఇట్టి శక్తుల స్వాధీనములో నుందురా ?

శారీరకముగా అవయవ నిర్మాణములో నేదైన దురదృష్ట కరమగు లోప ముండినను, ఏదైన ఆకస్మిక ప్రమాదమునకు గురియైనను, రక్తములో నొకచోట గడ్డ కట్టుకొనిపోయి యుండినను అట్టి సందర్భములలో దక్క ఇతర సందర్భములలో అది భూతావేశమే యగును. మానసికముగా కుంటుపడిన వానిని నీ యొద్దకు తీసికొని వచ్చినట్లయితే, వానికి అవయవ నిర్మాణములో దురదృష్టకరమైన లోప మున్నట్లయితే, వానికి స్వస్థత చేకూర్చలేవు. వాఁడు భూతావిష్టుడై యుండి, అవయవ లోపము లేనట్లయితే, వానికి స్వస్థత చేకూర్పవచ్చును. దురదృష్టవశాత్తు ఇటువంటివి ఎవరి కిష్టమో వారికే జరుగును. మనిషిలో అత్యాశ, అహంభావము, మూర్ఖత్వము, అమితగర్వము ఉన్నట్లయితే, అట్టి వారితో ఈ జీవులు వినోదించుచుండును. పాక్షికముగా భూతావిష్టులైన అట్టివారి ననేకులను నేను స్వస్థుల గావించితిని. వారికి కొంత సుఖము కలిగినది. అయితే అది ఎక్కువకాల ముండలేదు. దాదాపు వెన్వెంటనే అది తగ్గిపోగా, "నే నిప్పుడు సాధారణ మనిషినైతిని. ఇంతకు ముందు నేనొక అసాధారణమైన వ్యక్తిగా నుంటిని'' అని అనుకొనెడివారు. తనలో ఒక గొప్ప శక్తి ఉన్నట్లు వారు భావించుకొని, అది పాపము చేయుటయందుపయోగ పడినను, తృప్తి చెందుచుండెడివారు. అట్టి స్థితియందు వారు తమ శక్తి నంతటిని ఉపయోగించి ఆ తొలగిపోయిన భూతమును మఱల ఆహ్వానించుచుండిరి. తొలగిపోయిన భూతము నాశనమగును. గాన అదే తిరిగి రాదు—దానికి బదులు మఱి యొకటి ప్రవేశించును. ఒక వ్యక్తి విషయములో ఇట్టిది మూడు

పర్యాయములు సంభవించినది. కడపట నేను విసుగుపడితిని. దానిని నీవే తొలఁగించుకొనుము, నాకిఁక ఆ విషయములో శ్రద్ధ లేదు" అంటిని.

ఇట్టి సందర్భములో, చైత్యపురుషుడు ఏమగును ?

సాధారణముగా అతడు తొలఁగి పోవును. నే నొకటి మీకు చెప్పవలసియున్నది. ప్రాణికలోకములోని జీవులు మరణింపవు. కాని. వానిని నాశనము చేయవచ్చును. ఆ సామర్థ్యము ఆధ్యాత్మిక శక్తికి మాత్రమే కలదు. ఉదాహరణకు : ప్రాణిక జీవులతోడి పోరాటములో, (ఇట్లు పోరాడే ప్రాణికశక్తి గలిగిన వారున్నారు) అనుభవమంతయు నొకటే. ప్రాణిక లోకములో ప్రాణిక జీవునితో (భూతముతో) పోరాటము జరిగినట్లయితే, నీవు దానిని నాశనము చేయవచ్చును. కాని అది మరల పుట్టగలదు. అది సర్వదా రూపములను బొందుచుండును. పురాణములలోని వేయి తలల నాగుబాములకు, రాక్షసులకు ఇది మూలమని నేను భావించుచున్నాను.

వానిని తుదముట్ట, అనఁగా తిరిగి అవి పుట్టకుండునట్లు చేయగలది ఒకటున్నది. అది సృష్టికర్త్రియగు పరాశక్తి. ఆ శక్తి అతిమానస దివ్య విజ్ఞాన లోకమున కావలనుండి వచ్చును. అది అందరికి అందుబాటులో లేనిది. ప్రకాశవంతమైనది, దిగ్భ్రమ చేకూర్చు ధవళిమ గలది. సాధారణమైన కనులు దానిని జూచినట్లయితే కనులు పోయి గ్రుడ్డితనము దాపురించును. ప్రాణిక జీవి (భూతము) ని ఈ శక్తి స్పృశింపఁగానే అది కరగిపోవును, నీరై పోవును,— ఉప్పునీటిలో ఒక జాతిపురుగు కరిగిపోవు విధముగ.

రాస్ పుటిన్ ప్రాణిక జీవియా ?

అతనిని గుఱించి అనేక వ్యతిరేక విషయములను విన్నాను. కొందఱు అతనిని భగవంతుని అవతార మన్నారు. కొందఱు అసురుని అవతార మన్నారు. నే నేమియుఁ జెప్పలేను. నే నెప్పుడును అతనితో సంబంధము పెట్టుకోలేదు.

హిట్లరు మరణించిన తర్వాత ఆ అసత్య ప్రభువు, స్టాలిన్‌లో చేరు కొన్నదా ?

అది సంపూర్ణముగా అట్లు జరుగదు. అయితే, అది దాదాపు అటువంటిదే. ఈ భూతము హిట్లరు మరణించి నంతవరకు గాచుకొని యుండదు. అక్కడనే నీవు పొరబడుచున్నావు. ఈ భూతములు ఏ ఒక వ్యక్తికో అంటిపెట్టుకొని యుండవు. ఒక వ్యక్తిని పట్టుకొన్న భూతము అదే సమయములో మఱియొకనితో ఐక్యము చేసికొనుచుండును. హిట్లరు విషయములోకూడ అంతే. హిట్లరు జయించి యుండినట్లయితే మానవజాతి కంతయు కీడుమూడి యుండెడిది. అయితే, దాని విషయములో సంశయమేమియు లేదు. అతనిని ఆవేశించి యుండిన శక్తి, అతనిని నాశనము చేసినంత మాత్రమున నాశనమై పోదు. అది సులభమైన పని కాదు. ఈ భూతముల సృష్టి దేవతల సృష్టికంటె ముందు జరిగినది. అవి ప్రథమ సృష్టి. మొదటగా విశ్వములో వ్యక్తిత్వము గల జీవులు అవే. కనుక అవి సులభముగా తొలగింపఁబడవు. ఒక పోరాటములోని విజయము చాలదు.

అవి విశ్వ పరిణామమునకు ఎంత వర కవసరమో అంతవరకు నుండును. వాని ప్రయోజనము ముగియఁగనే అవి పరివర్తనము చేయఁబడును, లేదా అదృశ్యమై పోవును.

అది యట్లుండ, అవి తమ అంతిమ ఘడియ వచ్చుచున్న విషయము నెఱుఁగును. అందువలననే అవి యెంత హాని చేయవలయునో అంతయుజేయుచున్నవి.

అవి నాలుగుండినవి, ఒకటి పరివర్తనము చేయఁబడినది, ఒకటి మూలము లోనికి గరగిపోయినది. రెండు ఇంకను మిగిలియున్నవి. ఇవి రెండును మొదటి రెండు కంటె అతి భయంకరమైనవి. ఒక దానికి గుప్తవిద్యయందు "అసత్య మున కధీశ్వరుడనీ రెండవదానికి 'మరణమున కధీశ్వరు'డనీ పేర్లు. ఎంతకాలము ఇవి రెండును సజీవముగా నుండునో అంతకాలము కష్టములు తప్పవు.

* * *

మార్చి 10, 1951

"ధనముయొక్క శక్తి ప్రస్తుతము ప్రాణిక లోకములోని జీవుల, శక్తుల చేతులలోను, లేదా వాని పలుకుబడి క్రిం దను ఉన్నది. ఈ పలుకుబడి వలననే సత్య సంబంధమైన కార్యములకు ధనము విరివిగా వచ్చుట మీా కెప్పుడును గనుపింపదు. సర్వదా అది తప్పుడుమార్గము పట్టుచున్నది. ఎందువల్లననగా. అది వ్యతిరేక శక్తుల అధీనములోనున్నది. ప్రాణిక జీవులకు భూమిమీాఁద గట్టి పట్టు ఉండుటకు ఇది ప్రబలమైన కారణము, శక్తియుతము గాను, సంపూర్ణము గాను, సమగ్రముగాను వ్యతిరేక శక్తులయొక్క పిడికిలిలో ధనమునుండు విధముగా పటిష్ఠమైన ఏర్పాటు చేయబడినది అందువలన, ఈచిక్కనైన వ్యవస్థనుండి ఏదైనను రాబట్టుట అధిక దుస్తరమైన విషయము. ప్రస్తుత ధన సంరక్షకుల నుండి కొద్ది మాత్రమైనను డబ్బు రాబట్టవలయునని ప్రతి

దఫా చేయు ప్రయత్నము భయంకర యుద్ధముగా పరిణమించుచున్నది." సంభాషణలు (1929) పేజి 51

యక్ష సంబంధమైన కథలలో ఒకానొక ధన నిక్షేపమును సర్పములు సంరక్షించు చుండునని తరచుగాఁ చెప్పబడినది. ఇది నిజమేనా?

అవును. అయితే అది, భౌతికమైన సర్పము గాదు. ప్రాణికమైనది. ధన నిధులకు తాళపు చెవి ప్రాణికలోకములో నున్నది. వానిని బహుపెద్దదైన నల్లని నాగుబాము కాపాడుచుండును. సాధారణ సర్పము కంటె అది పదిరెట్లు. యాభై రెట్లు పెద్దదిగా నుండును. అది నిధుల గేట్లలో నుండి కావలి గాయుచుండును. అది దేదీప్యమానమై నల్లని రంగుతో, నిలువున నిలబడి కడు మెలకువతో నుండును. నే నొకప్పుడు దాని కెదురుగా నిలబడుట తటస్థించినది. (సామాన్యముగా ఈ జీవులు నే నాజ్ఞాపించినపుడు నాకుఁ లోఁబడును.) దానితో 'నన్ను పోనిమ్ము' అంటిని. అది, "నిన్ను పోనిచ్చుట నా కిష్టమే. కాని, నేనా పని చేసినట్లయితే, వారు నన్ను జంపివేయుదురు. అందువలన, నేను నిన్ను పోనివ్వలేను." అని బదులు చెప్పినది. నేను, "నాకు ప్రవేశము లభించుటకు నీకు నేనేమి చేయవలయును" అని అడిగితిని. అప్పుడది, "ఒకే ఒకటి నీకు దారి యిచ్చునట్లు నన్ను జేయును. మానవునిలోనున్న స్త్రీ వాంఛాప్రేరణకు నీవు అధికారివైతే, మానవ జాతిలో దానిని నీవు జయింపఁగల్గితే, నేను నిన్ను ఆటంక పరచను, నీకుఁ ప్రవేశ మిత్తును."

నన్ను అది పోనివ్వలేదు. నేను ఆ షరతును నెరవేర్చలేదు. మానవు లందరిలోను ఆ ప్రవృత్తిని జయించు నంతటి ఆధిపత్యమును నేను సంపాదించలేక పోతిని. అది చాలా కష్టమైన పని.

ప్రాణికలోక జీవునితో సంబంధము కలిగియున్న వారి తోడి సంబంధమును త్రుంచివేసుకొనుటకు, వారికట్టి సంబంధము నిజముగా నున్నట్లు తెలియవలెనుగదా! అది యెట్లు తెలియుట ?

నిజముగా అది తెలిసికొనుట కష్టము. ప్రాణికలోకపు ప్రత్యక్ష దర్శనము కలిగియుండిననే తప్ప. నేను అనేక మార్లు చూచితిని. రెండు విషయములు మాత్రము సంభవించును. అవి సామాన్యముగా జరుగుచుండును కూడ. ఏదో కారణముచేత నీవు ఒకరితో ఏకీభవించనప్పుడు, ప్రయోజనముల సంఘర్షణ మేర్పడి వివాదము జరిగినప్పుడు, ఎదుటివానిని గురించి, 'వాడొక భూతము' అని నీవు యనుట జరుగుచుండును. ఒకడు తన్ను దాను మొదట అనుమానించుకోవలెను; పిమ్మట ఇతరులను. ఇంతకంటె విచిత్రమైన ఉదాహరణము మరొకటి కలదు. భూతావిష్టులే గాక, భూతముల అవతారములే యగు ఇద్దరు వ్యక్తులను నే నెఱుగుదును. వీరే ఎదుటివారిని నిర్విరామముగా భూతములని హేళన చేయుచుండిరి. కనుక, సమగ్ర అవగాహన లేనిదే నిర్ణయము చేయరాదు. అజ్ఞానము మిడిమిడి జ్ఞానముకంటె మంచిదని రుజువుచేయు నిదర్శనము లున్నవి. నీవు ప్రాణికలోకమునకు జెందినవానితో వ్యవహారము నడుపుతున్నావని తెలియనపుడు, సాధారణ మానవునితో వ్యవహరించిన విధముగనే నడుచుకొనవలయును, అనగా, దగినట్లు నిన్ను నీవు రక్షించుకొనుము. వాడు శత్రువైనట్లుగా చెలరేగవలదు. జాగ్రత్తగా నుండి ఓర్పు వహింపుము. తర్వాత, వాడేమి చేయుచున్నను, నిర్లక్ష్య భావము వహింపుము, పరిపక్వత జెందిన ప్రాణిక జీవిని స్వాధీనములో నుంచుకొని పూర్తిగ అనాసక్తుడై యుండగలవాడే, నీతో "ఫలాని మనిషి అపాయకరమైన జీవి'' అని చెప్పగలుగును.

(తల్లి ఇంకను చదువుచున్నది) మానవుడు తన భౌతిక శరీరములో స్వేచ్ఛగా, సురక్షితముగా నుండును. శరీర మతనికి కోట. తమ శరీరమును అసహ్యించుకొను వారు న్నారు. మరణించినతర్వాత, శరీరమునుండి బయటపడిన తర్వాత, విషయములు బాగుపడునని, సుఖవంతముగా నుండునని భావింతురు. నిజమునకు నీ శరీరము నీకు కోట నీ రక్షకశాల. నీవు నీ శరీరములో నున్నప్పుడు శత్రుప్రపంచముయొక్క శక్తులు నీమీద నేరుగా అధికారమును చెలాయించుట దుస్తరము. భయంకరస్వప్నములనగానేమి ? ఇవి ప్రాణికప్రపంచములోనికి నీ ప్రయాణములు. నీవు భయంకరమైన కలలలోనున్నప్పుడు మొట్టమొదట నీవు చేయు ప్రయత్నమేమిటి ? నీవు వెంటనే నీ శరీరములో ప్రవేశించి ఒళ్ళు విరుచుకొని సాధారణమైన భౌతికజ్ఞానములోనికి వత్తువు."

(అదే గ్రంథము పే. 53.)

మరణానంతరము ప్రాణికసత్త యేమగును ?

అది కరిగిపోవును. వేరువిధముగా జరుగుట అరుదు. నీకు బలమైన కోరిక ఉన్నట్లయితే. రెండు ప్రేరణలమధ్య విభజింపబడి యున్నట్లయితే. ప్రాణికసత్త ముక్కముక్కలై పోవును. ఆవిరిగానో, ద్రవముగానో మారుట కంటె, అది చిన్నచిన్న ముక్కలక్రింద విడిపోవును. ప్రాణిక పదార్థము యొక్క ఈ చిన్నముక్కలు తమతమ కేంద్రప్రేరణ, కేంద్రవాంఛ, కేంద్ర మోహము చుట్టు చేరి చిన్నచిన్న వ్యక్తిత్వములను సృష్టిచేయును. వీటికి మానవాకార ముండదు. అనిశ్చయమైన రూపములను బొందును. ఒక్కొక్కప్పుడు ఆముక్కలు మొదట దేనిదేనికి సంబంధించినవో ఆయా రూపములను వహించును. మఱియొకప్పుడు ఏయేకోరికలకు తాము ప్రతినిధులుగనున్నవో, ఆయా కోరికల

నభివ్యక్తముచేయు రూపములను దాల్చును. సహజముగా వానియొక్క ఒకే వ్యాపారము కోరికను, లేదా, మోహమును, తృప్తిపరుచుటకు మార్గమును అన్నిచోట్ల అన్వేషణచేయును. ఉదాహరణకు, తన ధనముపైన పిశినిగొట్టుకు గల మోహమును తీసికొందము. వాడు మృతి జెందును. వాని ప్రాణిక రూపము కరిగిపోవునుగాని, అతనికి ధనముపైనున్న మోహము సజీవముగా నుండును. సజీవమైన వ్యక్తిత్వమును ప్రాణికలోకములో స్థాపించుకొనుటకు కొన్ని మౌలికపదార్థములను తన చుట్టు చేర్చుకొనును. తాను మానవుడుగా బ్రతికియుండినపుడు ఎక్కడనైనా ధనమును దాచియుంచినట్లయితే ఆ వ్యక్తిత్వ రూపము ఆ ధనమును సంరక్షించుటకు, దానికి కావలియుండుటకు, దానిని సమీపింపబోవు వారిని ఆటంకపరుచుటకు ఆ ధనము దాచియుంచిన స్థలముపై తిష్ఠవేయును. శీఘ్రగ్రాహులైన వారు, ధనము ఎక్కడనో దాచిపెట్టబడినదని తెలిసికొన్నప్పుడు, ఉండుట నిజమని గ్రహించి, "ధనమక్కడున్నది." అని చెప్పుదురు. అది మొదటి పరిణామము. తరువాతి పరిణామమేమనగా, ఆ ప్రాణికరూపము ఆ ధనమును రక్షించుచు, దానిని ఎవరును సమీపింపరాదని, సర్వదా విపత్తులను కల్పించుచుండును. దానిని సమీపించువారికి వ్యాధులను కల్పించుట, ప్రమాదములను కల్పించుట, హత్యకూడ చేయించుటదాని కార్యక్రమము, ఏ పరికరమైనను దానికి మంచిదే. ఒకడు ఎక్కువ భావోద్వేగము గలవాడైతే వానికి ఎక్కువగా భయముగలిగించి పిచ్చివాడగునట్లు చేయును.

అసహ్యాకరమైనట్టి అనేక చిన్నచిన్న వ్యక్తిత్వాలు తుచ్ఛమైన కామ వాంఛయందు పుట్టినవి ఉన్నవి. కోరికలు (దాని సంబంధమైన వ్యక్తిత్వాలు) మరణముతో కరిగిపోవు. ఈ వ్యక్తిత్వాలు సజీవముగావుండి ఇంద్రియచాపల్యముగల వాతావరణములోని మనుజుల నాశ్రయించి వారిని ప్రోత్సహించుచు, తమ పరిధిలోనికి దెచ్చుకొనును. ఎంత పోషణ కావలయునో అంత సంపా

దించుటే వాని ధ్యేయము. కొన్ని దజనుల వ్యక్తిత్వాలచేత చుట్టుకొనబడిన మనుజులను నేను చూచితిని. అది యథార్థవిషయము. "మారిస్‌మాగ్రే" నుగురించి మీరు వినియుండిరో లేదో నాకుదెలియదు. అతను రచయిత, ఇక్కడికి ఒకమారు వచ్చియుండెను. అతడు తన రచనలయందొక పుస్తకములో, 'బలమైన స్త్రీపురుషసంబంధమైన పశుబుద్ధి గలవాడు గుంపుల, గుంపులైన ప్రాణికజీవులచేత చుట్టుకొనబడియుండుననియు వారాతనిని తమ తృప్తికొఱకు ఉపద్రవము చేసి కార్యరంగమున దింపి ప్రాణికశక్తిని ఆహారముగా నుపయోగింతురని వ్రాసెను. అతనికా విషయము చక్కగా దెలియును. అతడు పరిశీలించెను స్వల్పముగా ఇంద్రియోద్వేగము గలవారికికూడ అది అగపడును. అనేకసార్లు బాధపెట్టబడిన వారుకూడ, ఈ ప్రేరణ బాహ్యమునుండి వచ్చుచున్నదని గ్రహించిరి. అది వారిలో దేనినో ఒకదానిని లేపును. ఆ ప్రేరణ బయటినుండి వచ్చుచున్నది అనుకొనువారు, నూర్లు, వేలమంది ఉన్నారు. అది మానవజాతికి అత్యధికమైన కష్టములను దురదృష్టవశాత్తు కల్పించుచున్నది. అది భయంకరమైన దాస్యము.

### ప్రాణికమైన భయంకరస్వప్నములలో వ్యక్తిత్వములోని ఏభాగము శరీరమునుండి బయటికిబోవును?

నీ ప్రాణికశక్తి అంతయు సంపూర్ణముగా బయటికి బోదు. ఆవిధంగా బోయినట్లయితే అపస్మారస్థితి కలుగును, కనుక, ప్రాణికజీవిలోనుండి ఒక భాగముమాత్రమే. విహారమునకు వెళ్ళును. కొన్ని అసహ్యమైన ప్రదేశములకు గూడ బోవును. అందువలన చాలా చెడ్డరాత్రులు గడుపవలసివచ్చును. రాత్రివిహారములకు అవకాశములు అసంఖ్యాకములు. అది ఒక చిన్నభాగమైయుండవచ్చును, అయితే అది ఎఱుకగలదైతే, నీకది సొగసైన ఒక చిన్న దుస్స్వప్నమును ప్రాప్తింపజేయును.

నీవు నిదురించే సమయములో, నీ లోపలివ్యక్తులు శరీరముపై ఏకాగ్రత గలిగియుండవు. అవి బయటికి బోయి ఇంచుమించుగా స్వేచ్ఛగా సంచరించును. అది పరిమితులకు లోబడిన స్వేచ్ఛయే; అయినను స్వేచ్ఛయే యనవచ్చును. అవి తమ భూమికలలో సంచరించుటకు బోవును, మనస్సు అంతకంటె ఎక్కువే. ఎందుకనగా. అది అరుదుగా శరీరములో నుండును. అది శరీరము కేంద్రీకరించబడియుండునేగాని, దానిలో ఇమిడియుండదు. ప్రాణిక జీవికూడ శరీరమును విడిచిపోయినను శరీరముపైననే కేంద్రీకృతమై యుండును. మనస్సు పేశలత్వము కలిగినదైనందున, తగినంతగానొకమనిషిని గురించి ఆలోచించినచాలును, అతనితో తాను కొంతవరకు మానసికముగానైనను ఉండ నేర్చును.

ఒక స్థలమును గురించి గాఢముగా నాలోచించి నట్లయితే నీ మనస్సులో ఒక భాగము అచ్చట నుండును. దూరమనేది లేదు, మనస్సును కేంద్రీకరణ చేయుటకు మంచి తర్ఫీదు కావలెను, కొందరికి మాత్రమే మనస్సు బాగుగా నిరూపింపఁ బడిన రూపము గలదిగా నున్నది. అది తిరుగుచు. వచ్చుచు పోవుచుండు మేఘముల విధముగా నుండును. మన శరీరముతో సమానమైన రూపము ప్రాణ శక్తికి రావలయునంటే అది వ్యక్తీకరణ చెందియుండవలెను, లేదా ఎక్కువ కేంద్రీకృతమై యుండవలెను. మనస్సు విషయమున ఇది మరింత ఎక్కువగా వర్తించును. అది ఖచ్చితమైన రూపమును బొందుటకు చైత్య కేంద్రము చుట్టు విశేషముగ వ్యక్తీకరణమును, కేంద్రీకరణమును బొందుట అవసరము.

జీవిత మంతయు మనస్సును వ్యవస్థీకరించుట యందే వ్యయము చేయు వారున్నారు. తమ మనస్సును కోటవలెను, పెద్ద భవనమువలెను, తీర్చిదిద్దుకొన్న కొందరిని నేనెఱుఁగుదును. (అసామాన్యమైన మానసిక శక్తులు గలవారిని గురించి మాట్లాడుచున్నాను) వారు తమ మనస్సును గొప్ప కట్టడమువలెను,. గొప్ప శక్తి, స్థిరత్వము, పటుత్వము, గల గోడలుగల దానినిగను చేసినారు. అందువలనబాహ్య

తనయిష్టము వచ్చినట్లు వివరించు. వ్యాఖ్యానించు, మనస్సుయొక్క అలవాటులనుండి విడివడినదిగా నుండవలెను."
సంభాషణలు (1929)పే 46;47.

మానసికజాడ్యమును తొలగించుటకు ఏమి చేయవలయును ?

మనస్సును నీరవముగా నుంచుటకు నేర్చుకొనవలెను. సద్దుచేయక శాంతముగా నుండుట, శ్రద్ధగలిగియుండుట ముఖ్యమైనవి. నీవు నీ మనస్సును నేరుగా నిశ్శబ్దముగా నుంచుటకు ప్రయత్నించుట కడుంగడు దుష్కరము; దాదాపుగా అసాధ్యమైన పని. ఎందుకనగా, దానిలో ఎక్కువభాగము పనిచేయకుండా ఉండలేదు. అది ఎప్పుడును నిలువకుండా నమోదుచేయు యంత్రమువలె పనిచేయుచుండును. అది నమోదు చేసినదంతయు మఱల, మఱల పునరుక్తిగా, నిలుపుదలలేకుండా, పలుకుచునేయుండును,—దానికొక నిలుపుదలచేయు మఱ యుండదనే తప్ప. నీవట్లుగాక, నీ చేతనను, సాధారణమనస్సుయొక్క భూమికనుండి ఉన్నతభూమికకు మార్చగలిగినట్లయితే, దివ్యతేజస్సులోనికి ఈ ఉన్మీలనము నీ మనస్సును నిశ్చలము గావించును. ఇక అది కలదు. ఆవిధముగా ఒనగూడిన మనశ్శాంతి నిలుకడగా ఉండును. ఒకసారి ఈ భూమికలోనికి ప్రవేశించినట్లయితే నీవు దానినుండి బయటికి రానొల్లవు. నీ బాహ్యమనస్సు సర్వదా ప్రశాంతస్థితిలో నుండును.

ఒకేఒక నిజమైన పరిష్కారమార్గము ఉన్నతతేజస్సు కొఱకు ఆకాంక్షించుటయే.

మన సహజప్రకృతిలో తిరుగుబాటుచేయు వివిధభాగములకు లొంగుబాటును నేర్పుట ఏట్లు ?

అర్థముచేసికొనలేని చిన్నబిడ్డను బుజ్జగించినట్లు, అవి అర్థముచేసికొను రీతిగా అన్నిరకములైన మార్గములను ప్రయత్నింపవలెను. పటములు, సంకేతము వివరణలు,— అన్నింటిని ఉపయోగింపవలెను; వానితో హేతువాదము చేయుము. తమ కార్యముల పర్యవసానములను, అవి తెలిసికొనునట్లు చేయుటకు ప్రయత్నించుము. అన్నిటికంటెమించి, గొప్ప ఒర్పును వహించుము. ఒకే విషయమును మఱల. మఱల ప్రయోగించుటకు విసుగుపడకుము.

ఈ కార్యములో మనస్సు సహాయకారిగా ఉండ గలదా?

ఆ మనస్సు పూర్తిగా జ్ఞానమును పొందియుండినట్లయితే, చైత్యపురుష జ్యోతికి విధేయమై యుండినట్లయితే, సత్యముయొక్క బోధ పొందియుండినట్లయితే, సహాయకారియగును. విషయములను వివరించును.

పునర్జన్మములకు ఏవైనను సాధారణనియమములు, విశాలమైన రేఖామాత్రపుసూత్రములు ఉన్నవా? లేక ఏదైనను సంభవమేనా?

ఒకడు ఏస్థితికి సంబంధించియున్నాడు, అనేదానిపైనను, చైత్యపురుషుని అభివృద్ధిపైనను, అది ఆధారపడియుండును, చైత్యపురుషుడు పురోగతిదశలలోనున్నట్లయితే, పరిపక్వ స్థితికి దగ్గరలోనున్నట్లయితే మరణమునకు ముందుచేసిన యెన్నిక (దీనినిగుఱించి ముందు దినము మాట్లాడియున్నాను) వాస్తవమైనదే యగును. ఆ యెన్నికరీత్యా అన్నియు సాధ్యమే. అయితే, ఇతరులవిషయములో పునర్జన్మ దానంతటదియే సంభవించును. కనుక నియమము లేమియులేవు. అది పరిస్థితులపైన అధికముగా ఆధారపడి ఉండును. ముఖ్యముగా, చైత్యపురుషుడు అనుసరించు మార్గముపైన దాని మూలకారణముపైన ఆధారపడియుండును.

అది చెప్పుట కష్టము. పురుషుడుగా పుట్టునా? స్త్రీగా పుట్టునా? అనేది చాలా కాలముంనకుగాని నిర్ణయముగాదు. చేతన వృద్ధిపొందినకొలదీ కార్యైకత్వము సాధించినకొలదీ, చేతన సమైక్యతను గడించినకొలదీ ఒకదారిని వదలిపెట్టి మఱియొకదారిని కోరుకొనుటలో శక్తిని అభివృద్ధి చేసికోగలదు. అయితే, ఈ ఎన్నికకుముందు అసంఖ్యాకజన్మలద్వారా స్త్రీ పురుష రూపములను దాల్చి యుందువు. అందుకనే బహుశా కొందఱి స్త్రీలకు పురుషప్రవర్తన ఉంటుంది. పురుషులకును ఆవిధముగనే స్త్రీ తత్వముంటుంది. ఇప్పుడున్న లింగములకు వ్యతిరేకప్రేరణలు ఉండుటకూడ గమనింపవచ్చును. అయితే ఎన్నిక సమయములో ఒకడు సృష్టికర్త్రియగు చిచ్ఛక్తిచేతనకో, లేక సాక్షిభూతముగానున్న అచలత్వమునకో తాను సంబంధించియుండ నిశ్చయించుకొనవచ్చును. అది మూలకారణముపై ఆధారపడియుండును.

## అంపటి చైత్యపురుషులకు మూల మొకటేనా?

క్రింద వివరించినట్లుగా విషయములు సంఘటిల్లును. చైత్యపురుష జీవితపు మూలస్థానము, భౌతికపదార్థములో నిహితమైయున్న దైవసన్నిధి ఒకటే. అది అర్థమగుచున్నదిగదా! అయితే, ఊర్ధ్వప్రపంచపు వ్యక్తులున్నారు. వారు భూమిమీద ఎప్పుడును జన్మమెత్తలేదు. కాని, వా రచట పనిజేయవలెనని అభిలషింపవచ్చును. అట్టిసందర్భములో వారు, సంపూర్ణాభివృద్ధిజెందిన కొందఱు చైత్యపురుషులతో ఏకత్వముపొంది తమ ప్రకృతి ననుసరించి పనిచేయుటకు వేచియుందురు. వారిచేతన భూమిమీద చైత్యపురుషుని ఎఱుకతో చేర్చబడును. ఎప్పుడును భూమిపై జన్మయెత్తనివీరు, సృష్టి కొనసాగుకొలదీ, రానురాను పదార్థముతో సమైక్యతజెంది భూలోకమునకు వత్తురు. ప్రత్యేకకారణములచేత, ఆదిలో విశ్వములోనికి వచ్చిన ఆదిమూర్తులు వీరు. మానవులు వీరిని దేవతలనియు, దేవతాంశసంభూతులనియు అందురు. ప్రత్యేకకారణములవలన రూపము చెందుచున్న చైత్యపురుషుని దేవతలలో ఒకడు ఎన్నుకొని వానికి సహాయము

చేయును. వాని అభివృద్ధి ననుసరించును. ఈ చైత్యపురుషుడుతగినట్లుగా సిద్ధపడినతర్వాత, ఈ ఏకత్వమును బలపరచుటకు తగినంత బలమును పొందిన తర్వాత, అతడు (ఆదేవుడు) ఈ చైత్యపురుషునితో సమ్మిశ్రితముజెందును. వానిని తన్నుగానే భావించి భూమిమీద బనికి బూనుకొనును. ఇది తరచుగా సంభవించునది గాదు; అయితే సంభవించినది, భావిలో సంభవించును గూడ. ప్రాచీన సంప్రదాయములో భూమిమీద అవతారమెత్తిన దేవతల కథలను నీవు తెలిసికొనగలవు. కొందఱు పౌరాణికులు వారినిగురించి చెప్పుదురు. అవి యదార్థస్థితికి అనుగుణమైనదే. అయితే, అందఱు చైత్యపురుషులు ఊర్ధ్వభూమికలలోనున్న దివ్యులతో సమైక్యము చెందినవారు కారు.

ప్రాణికలోకములోనిజీవులు శరీరము గైకొనుట గుఱించి
"భూతావేశము" లను గుఱించి తల్లిప్రస్తావించినది:

## ప్రాణికజీవులు చైత్యపురుషుని గలిగియున్నారా?

లేదు. అవి అవతరించవలయునంటే చేయవలసిన మొట్టమొదటిపని యేమనగా ఎవరు చైత్యపురుషుని పొందియున్నారో వారినుండి ఆ చైత్యపురుషుని తరిమివేయవలయును. అది పుట్టుకనుండియు సంభవింపవచ్చును. కొందరు పిల్లలు దాదాపు విగతప్రాణులై పుట్టుదురు. చనిపోయినవారుగా వారిని భావించుట జరుగును. కాని ఇంతలో ఆకస్మికముగా వారు తిరిగి బ్రతుకుదురు దీని యర్థమేమనగా, ప్రాణికలోకజీవుడు వారిలో ప్రవేశించినాడు. నాకు అట్టి సంఘటనలు కొన్ని తెలియును. ఇది జబ్బుగానుండిన కాలములోకూడ సంభవింపవచ్చును, ఒకడు ఎక్కువ జబ్బుగా నున్నాడు. క్రమక్రమముగా చైత్యపురుషునితో సంబంధము కోల్పోయినాడు. తరువాత మూర్ఛకు సరియగు నట్టి స్థితిలో పడిపోయినాడు. చైత్యపురుషునితో సంబంధము పూర్తిగా తెగిపోయినది. అప్పుడు కనిపెట్టియుండిన ప్రాణికలోకజీవుడు వెంటనే వానిలో ప్రవే

శించినాడు. ఈవిధమైన సంఘటనలు నాకు దెలియును. అది నిదానముగా జరుగునవికూడ కావచ్చు. ప్రాణికజీవి ఆ వ్యక్తియొక్క వాతావరణములో ప్రవేశించును. అతనిపై తన పలుకుబడి నుపయోగించును. తుదకు అతనికి రోగము, దెబ్బలు, మానసికరోగము వచ్చునట్లుచేయును. తరువాత, చైత్యపురుషునితో ఉన్న సంబంధము పూర్తిగా తెగగొట్టబడినప్పుడు ప్రాణిక జీవి ఆ వ్యక్తియొక్క శరీరమును తన స్వాధీనములోనికి దెచ్చుకొనును, కొంతమంది ఎక్కువ రోగముచేత బాధపడి తరువాత దానినుండి బయటపడి నప్పుడు, వెనుకటికంటె విభిన్నవ్యక్తిత్వముతో కనబడుదురు. తరచుగా ఈ విధముగా సంభవించును.

ఈ ప్రాణికజీవులు ఆధ్యాత్మికజీవితముచే ఆకర్షింప బడుదురని మీరన్నారు—ఎందువలన ?

వారు ఆకర్షింపబడుదురుగాని, ఆధ్యాత్మిక జీవితమును పూర్తిశ్రద్ధతో అనుసరింపవలయునని వారు నిశ్చయించినట్ల దాని అర్థము కాదు. ఈ జీవుల ముఖ్యమైన గుణము అబద్ధముచెప్పుట, వారి ప్రకృతి మోసముతో నిర్మింప బడినది, వారికి మాయపై అధికారమున్నది. వారు దేవతలయొక్క, లేదా ఇంకను అధికమైన ఉన్నతజీవులయొక్క రూపమును దాల్చుచుందురు. దిగ్భ్రమ గూర్చు ప్రకాశములో కనబడుచుందురు, అయితే, అంతఃశుద్ధి గల్గినవారు వారిచే మోసగింపబడరు. వారు తమ్ము ఏదో హెచ్చరించుచున్నట్లుగా భావింప వచ్చును. అయితే, ఒకడు అద్భుతమైన వాటిని, అనూహ్యమైన వాటిని, చోద్యమైనవాటిని ఇష్టపడేవారు, అద్భుతమైన కల్పిత కథాప్రపంచములో నివ పింపగోరినవారు, సాధారణముగా సులభముగ మోసగింపబడును.

హిట్లరు విషయములో ఇటీవల చారిత్రకసంబంధమైన ఒక తార్కాణము సంఘటిల్లినది. పరదైవముగా అతడు భావించిన ఒకానొక జీవునితో అతనికి సంబంధమేర్పడినది. ఆజీవుడు వచ్చి అతనికి సలహాయిచ్చుచు, అతడేమి చేయవలసినదీ చెప్పెడివాడు. హిట్లరు ఏకాంతస్థలమునకు బోయి, తన సలహాదారు వచ్చునంతవరకు వేచియుండి, అతనినుండి ప్రేరణలను బొందుచుండువాడు. తరువాత వానిని తు. చ. తప్పక పాటించెడివాడు. ఇతడు భావించిన ఆ పరదైవము స్పష్టముగా ఒక అసురుడు. తంత్రవిద్య ప్రకారము "అసత్యానికి ప్రభువు.'' అయితే అతడు తనను సర్వజాతులకు ప్రభువుగా ప్రకటించుకొన్నాడు. అతనికి ప్రకాశమానమైన రూపమున్నది. మంత్ర విద్య నెఱిగి, రూపములవెనుక ఏమున్నదో తెలిసికొనగలవారిని మినహాయించి తక్కినవారిని తప్పుడుదారి త్రొక్కించును. అతడు యెవరినైనను మోసము చేయగల అద్భుతశక్తిసంపన్నుడు. సాధారణముగా హిట్లరుకు రొమ్మున వెండి కవచముతో, తలకు ఇనుపకుళ్ళాయితో దర్శనమయ్యెడివాడు. ఒకవిధమైన జ్వాల అతని తలలోనుండి బయటి కుబికివచ్చుచుండెడిది. తనచుట్టు, కనులు మూత బడజేయు కాంతిపుంజముతో కనుపించుచుండెడివాడు. హిట్లరు అతని వైపు చూడగలిగేవాడు కాడు. అతడు హిట్లరుకు ఏమి చేయవలయునో అంతా చెప్పెడివాడు. కోతిపిల్లతోను, ఎలుకతోను ఆడుకొనునట్లు హిట్లరును అతడు వినియోగించుకొనుచుండెడివాడు. హిట్లరు తన తనువును భగ్నపరచుకొనునంత వరకు ఆ అసురశక్తి అతనిచేత వీలైనన్ని విపరీతవిజృంభణల నన్నింటినీ చేయించెడిది. చివరకు హిట్లరు భగ్నుడై పోవుటయేజరిగినది. ఇటువంటి సంఘటనలు తరుచుగా జరుగుచుండును. కాని, వాని స్థాయి కొద్దిపాటిది.

ఆ అసురశక్తికి హిట్లరు చాలా మంచి మధ్యవర్తి (Medium) గా ఉపయోగబడినాడు. అతనికి మధ్యవర్తిత్వము వహించు అమోఘమైన శక్తి యుండినది. కాని, వివేక విజ్ఞానములు మాత్రము లేకుండెను. ఈ శక్తి హిట్లరుకు ఎట్టిదైనను చెప్పి నమ్మించుచుండెను. హిట్లరు వాని నన్నింటిని మ్రింగుచుండెడివా(డు. ఆ

శక్తే హిట్లరును క్రమక్రమముగా ముందుకుఁ ద్రోసినది. దానికి ఇదంతయు వినోదము. మానవ జీవితమంటే దానికి లెక్కలేదు. ఈ శక్తులు మనుష్యులలో, పిల్లి ఎలుకలతో చెలగాట లాడినట్లు ఆడుచుండును. తుట్టతుదకు అది వాటిని తిని వేయును.

మానసికముగా కుంటుపడిన వ్యక్తులు ఇట్టి శక్తుల స్వాధీనములో నుందురా ?

శారీరకముగా అవయవ నిర్మాణములో నేదైన దురదృష్ట కరమగు లోప ముండినను, ఏదైన ఆకస్మిక ప్రమాదమునకు గురియైనను, రక్తములో నొకచోట గడ్డ కట్టుకొనిపోయి యుండినను అట్టి సందర్భములలో దక్క ఇతర సందర్భములలో అది భూతావేశమే యగును. మానసికముగా కుంటుపడిన వానిని నీ యొద్దకు తీసికొని వచ్చినట్లయితే, వానికి అవయవ నిర్మాణములో దురదృష్టకరమైన లోపమున్నట్లయితే, వానికి స్వస్థత చేకూర్చలేవు. వాఁడు భూతావిష్టుడై యుండి, అవయవ లోపము లేనట్లయితే, వానికి స్వస్థత చేకూర్పవచ్చును. దురదృష్టవశాత్తు ఇటువంటివి ఎవరి కిష్టమో వారికే జరుగును. మనిషిలో అత్యాశ, అహంభావము, మూర్ఖత్వము, అమితగర్వము ఉన్నట్లయితే, అట్టి వారితో ఈ జీవులు వినోదించుచుండును. పాక్షికముగా భూతావిష్టులైన అట్టివారి ననేకులను నేను స్వస్థుల గావించితిని. వారికి కొంత సుఖము కలిగినది. అయితే అది ఎక్కువకాల ముండలేదు. దాదాపు వెన్వెంటనే అది తగ్గిపోగా, "నే నిప్పుడు సాధారణ మనిషినైతిని. ఇంతకు ముందు నేనొక అసాధారణమైన వ్యక్తిగా నుంటిని" అని అనుకొనెడివారు. తనలో ఒక గొప్ప శక్తి ఉన్నట్లు వారు భావించుకొని, అది పాపము చేయుటయందుపయోగ పడినను, తృప్తి చెందుచుండెడివారు. అట్టి స్థితియందు వారు తమ శక్తి నంతటిని ఉపయోగించి ఆ తొలగిపోయిన భూతమును మఱల ఆహ్వానించుచుండిరి. తొలగిపోయిన భూతము నాశనమగును. గాన అదే తిరిగి రాదు—దానికి బదులు మఱి యొకటి ప్రవేశించును. ఒక వ్యక్తి విషయములో ఇట్టిది మూడు

పర్యాయములు సంభవించినది. కడపట నేను విసుగుపడితిని. దానిని నీవే తొలఁగించుకొనుము, నాకిఁక ఆ విషయములో శ్రద్ధ లేదు" అంటిని.

ఇట్టి సందర్భములో, చైత్యపురుషుడు ఏమగును ?

సాధారణముగా అతడు తొలఁగి పోవును. నే నొకటి మీకు చెప్పవలసి యున్నది. ప్రాణికలోకములోని జీవులు మరణింపవు. కాని. వానిని నాశనము చేయవచ్చును. ఆ సామర్థ్యము ఆధ్యాత్మిక శక్తికి మాత్రమే కలదు. ఉదాహరణకు : ప్రాణిక జీవులతోడి పోరాటములో, (ఇట్లు పోరాడే ప్రాణికశక్తి గలిగిన వారున్నారు) అనుభవమంతయు నొకటే. ప్రాణిక లోకములో ప్రాణిక జీవునితో (భూతముతో) పోరాటము జరిగినట్లయితే, నీవు దానిని నాశనము చేయవచ్చును. కాని అది మఱల పుట్టగలదు. అది సర్వదా రూపములను బొందుచుండును. పురాణములలోని వేయి తలల నాగుబాములకు, రాక్షసులకు ఇది మూలమని నేను భావించుచున్నాను.

వానిని తుదముట్ట, అనఁగా తిరిగి అవి పుట్టకుండునట్లు చేయగలది ఒకటున్నది. అది సృష్టికర్త్రియగు పరాశక్తి. ఆ శక్తి అతిమానస దివ్య విజ్ఞాన లోకమున కావలనుండి వచ్చును. అది అందఱికి అందుబాటులో లేనిది, ప్రకాశవంతమైనది, దిగ్భ్రమ చేకూర్చు ధవళిమ గలది. సాధారణమైన కనులు దానిని జూచినట్లయితే కనులు పోయి గ్రుడ్డితనము దాపురించును. ప్రాణిక జీవి (భూతము) ని ఈ శక్తి స్పృశింపఁగానే అది కరగిపోవును. నీరైపోవును,— ఉప్పునీటిలో ఒక జాతిపురుగు కరిగిపోవు విధముగ.

రాస్ పుటిన్ ప్రాణిక జీవియా ?

మనే అభిప్రాయమును అది కలిగించును, ఎందుకనగా, పాతకోట నేలమట్టము చేసి క్రొత్తది కట్టబడి నందుచేత,

కోటలేకుండా బ్రతుకుట మహాకష్టము. తాము జీవించి యుండలేదని, తాము వ్యక్తీకరణము పొందలేదని, తాము అయోమయస్థితిలో తేలియాడుచున్నా మని జనులకు అభిప్రాయము కలుగును. అనంతమైన దానిలో బ్రతుకుట, తిరుగుట, నిరంతరముగా మార్పు చెందుచుండుట, దృఢముగా ప్రగతిలో నుండుట, దేనికో ఒకదానికి అంటిపెట్టుకొని యుండకపోవుట, "నేను ఇది నా ఆలోచనా పద్ధతి ఇది'' అనుచు, ఏ ఒకదానినో పట్టుకొని వ్రేలాడకుండుట, చాలా కష్టముతో కూడుకొన్నది. ఈ పరిస్థితిని చేరుకొనుటకు ఎవరును తొందరపడి ప్రయత్నము చేయరాదు. అట్లు చేసి మనస్సు చెడగొట్టుకొనువారు గలరు.

మానసిక నిర్మాణము చేయున దేది ?

మానసిక అహంకారము దానిని నిర్మాణము చేయును. అన్నిటికి తెగించి సాహసముతో వ్రేలాడుచుండును.

'నేను' 'అహంకారము' అనునవి ఒకటేనా ?

సామాన్యముగా ఒకటే.

ఒకటి ఆలోచించి, మఱియొకటి చెప్పువారుండుట
ఎట్లు సంభవించును ?

అవును, అది తరుచుగా సంభవించును. వారొకటి ఆలోచించ మొదలు పెట్టినపుడు దానికి వ్యతిరేకమైన దానిని చెప్పుదురు, ఆలోచన నాలుకను అతీన

ములో పెట్టుకొనగలిగితే అనేక బుద్ధి రహిత సంభాషణలు జరుగకుండా చేసికొన వచ్చును. నీవు అదుపును పోగొట్టుకొని ఏదో బుద్ధిలేని దానిని ప్రేరణవలన మాట్లాడుచుందువు, మాటలాడుకొనుటకే మాటలాడు ఒక యంత్రమువలె లెక్కింపఁ బడుదువు. అది అసత్య ప్రలాపము. అయితే ఇదే. ఇరువదినాల్గు గంటలు లోకములో చలామణి యందున్నది. దీని నుండి తప్పించుకొనువారు అల్ప సంఖ్యాకులు మాత్రమే. అన్ని విధములైనవి వారు చెప్పుదురు. పైపెచ్చువారు, "మేము అది యంతయు ఎందుకు చెప్పితిమి?" అని అడుగుదురు. ఎందులకు మాట్లాడితి మనునది కూడ వారికి దెలియదు. నేను కొందఱి నెఱుగుదును. వారెప్పుడును ఇతరులు వినగోరు దానినే చెప్పుదురు. ఎవరితో వారు మాట్లాడుచుందురో వారు తమలోఁ దాము. "అతఁడు నాతో ఇదో అదో చెప్పబోవుచున్నాడు." అని అనుకొందురు. లేక, "అబ్బ! అది అతడు నాకు చెప్పకుంటే బాగుండును!" అని అనుకొందురు. కాని యీ చెప్పబోవు వాడు, యంత్రపు బొమ్మవలె, కడు నెమ్మదిగా ఎందుకో తెలియకుండా, దానినే చెప్పుటకు ప్రారంభించును.

అది నిశ్చిత బుద్ధి లేకనా ?

కాదు. అది మానసిక వికారము. అక్కడ నిశ్చిత బుద్ధి ఏమంతగా ఉండదు? బుద్ధి జోక్యము చేసికొను పక్షమున బహుశా అసహ్యత కొంత తగ్గును.

కాదు, అవి మానసిక వృత్తులు; అంతా మానసిక నిర్మాణము, ఎందుకో తెలియకుండా బోనులో అదేపనిగ వలయాకారముగాఁ దిరుగు ఉడుతవలె సర్వదా చలించును, వచ్చుచు బోవుచుండెడి మానసికశక్తి.

అప్పుడది విశ్వ సంబంధమైన ఆటయా ?

కాదు, కేవలము విశ్వసంబంధమైనది కాదు, మానవజాతిలో అది ఉన్నది. అది మానవ లక్షణము. ఎంతమంది మానవులకు స్వంత ఆలోచన ఉన్నవి ? సామాన్య మానసిక నిర్మాణము గల సామాన్య మానవజాతిలో అట్టివారు లేరని నేను నమ్మకముగా చెప్పగలను. విచారణ ఫలితముగా ఎంతమందికి ఒక భావము కలుగుచున్నది. చాలా కొద్దిమందికి మాత్రమే. అది వారి కున్న ట్లయితే, వారు అతి కఠినులనియో అమిత మేధావులనియో, నిరంకుశత్వము, అధికార దర్పము గలవారనియో, అన్ని విధములైన విశేషణములతో కప్పివేయబడుదురు. అది యెందుకనగా వారికి ఒక నిశ్చితమైన ఆలోచనా పద్ధతి ఉన్నది.

ఏ సామాన్య భావమునైనను గైకొనుడు. ఉదాహరణకు "ప్రపంచము యొక్క కాలపరిమితి అనంతమా ?" లేక, "దానికి ఆది అంతము ఉన్నవా ?" అను ప్రశ్నను తీసికొందము. ఎవరికి ఈ విషయములో సరియైన ఆలోచన ఉన్నది ? మఱియొక ప్రశ్న తీసికొందుము. "భూమి యెట్లు ప్రారంభమైనది ? మానవజాతి భూమి మీద ఎట్లు మొదలైనది ? మనస్సు ఈ ప్రశ్నకు సమాధానము నివ్వజాలదు. అది అసంఖ్యాకమైన అవకాశముల మధ్య ఇదమిద్ధమని నిర్ణయింపఁ జాలదు. తన యిష్టానిష్టములను బట్టి, తన కేది తృప్తికరముగా, సౌఖ్యకరముగా ఉండునో ఆ యాలోచనవైపు మొగ్గి, "అవును, అది తప్పనిసరిగా అదే." అని అనును. నీవు నిజాయితీ, ధర్మనిరతీ గలవాఁడవైతే, నీ యిష్టానిష్టముల ఆట లెక్కచేయకపోతే, నీ వేవిధముగా నిర్ణయింపఁ గలవు ? ఈ విషయము మానవ జాతికి అత్యంత సన్నిహితమైనది. ఆసక్తిదాయకమైనది. భూమి దాని రాజ్యము గదా.

ఈ విషయములో నీ వొక గ్రంథమును చదివితే అది ఒక మార్గమును చెబుతుంది. ఇంకొక గ్రంథమును చదివితే అది మఱియొక దానిని సూచిస్తుంది. తరువాత, మతములు చేయి గల్పించుకొని, తమ వాదములను బట్టి ఫలాని ఫలాని భావము సరియైనది. అదియే నిరవధిక సత్యము. నీవు నమ్మితీరవల

యును అనును. నీవు నమ్మకపోతే నీకు నరక మనును. నీవు విజ్ఞాన శాస్త్ర వేత్తల గ్రంథములను చదువుదువు. అవి విజ్ఞానశాస్త్ర విషయములను చెప్పును. నీవు తత్త్వవేత్తల గ్రంథములను చదువుదువు. అవి తత్త్వ సంబంధమైనవి చెప్పును. నీవు భూతముల గురించి వ్రాయబడిన గ్రంథములను చదువుదువు. అవి ఐహికము కానివాటిని వర్ణించును. నీ వెక్కడ ప్రారంభించినావో అక్కడికే వత్తువు. తమ మనస్సులలో స్థిరత్వముండవలయు నను వారున్నారు. (తమ మనస్సులలో తాము నిర్మించుకొన్న కోటలలో నుండదలంచు వారు. అది వారికి సౌఖ్యకరమైన భావమును కల్పించును.) కనుక వారికి నచ్చినదానిని వా రెన్నుకొందురు. ఇందుకు తగినంత మనోబల మున్నచో ననేక భావములనుండి ఒక దానిని ఎన్నుకొందురు. దానిని నీ కొఱకు శుద్ధము చేయుదురు. ప్రతిదానిని దానికి తగిన స్థలమును నిర్ణయించి అక్కడ స్థాపించి సొగసైన గోడ కట్టుదురు. (అనగా అక్కడ అనేకమైన వ్యతిరేకతలు ఉండరాదు. అటుకానియెడల ఘర్షణ జరుగును. అది సరియైన ప్రణాళికాబద్ధముగా నుండవలయును.) అప్పుడు వారు "ఇప్పుడు మాకు తెలియు" నని అందురు. నిజముగా వారి కేమియు తెలియదు.

ఎక్కువ మానసిక క్రియాలోలత్వము గలవాడు ఈ యాటలో ఎక్కువగా పాల్గొనును. ఉన్న భావములలో దేనినో ఒకదానిని పట్టుకొని వ్రేలాడును. అదియే జీవిత పరమావధిగా దానికి లంకె వేసికొనును. ఒక కేంద్రభావమునందు స్థిరపడి, "తక్కినవన్నియు ముక్కలై పోయినను నేను ఖాతరుచేయను. ఈ నిర్ణయమే నిలుచును. ఇదే సత్యమైనది." అని బల్ల గుద్ది చెప్పును. యోగము దగ్గరకు వచ్చునప్పటికి (విచిత్రముగా) ఈ భావమే నిర్విరామముగా చాటబడును. అన్ని సంఘటనలు, అన్ని పరిస్థితులు దీనిమీదికే తలపడును. క్రింద పడిపోవు నట్లు ఊగిసలాడువరకు వదలిపెట్టవు. అంతట ఒక శుభదినమున నిరాశతో, "ఆహా! నా యభిప్రాయము గతించినది" అనవలసివచ్చును.

ఒకానొకడు కవితాశైలిలో, "అన్నిటిని జయించుటకు అన్నిటిని ఏ విధముగా పోగొట్టుకొనవలయునో తెలిసికొనవలెను," అని యనును. మనస్సునకు సంబంధించినంతవరకు ఇది నిజమే. ఎందుకనగా నీవు సర్వమును గోల్పోవుట తెలిసికొనకపో , నీవు దేనినీ సంపాదించుకొనలేవు.

ఈ భూమి ఏట్లు ప్రారంభమైనది ?

విజ్ఞాన శాస్త్రజ్ఞుల నడుగుము వారు చెప్పగలరు.

చివరకు, ప్రగతి సంపాదించుటకు, నేర్చుకొన్నవన్నియును మఱువవలెనన్నచో, ఇక నేర్చుకొనుట వలన ప్రయోజనమేమి ?

ఇది కసరత్తువంటిది. నీ శరీరమును పుష్టిగా నుంచుకొనుటకు, బలముగా నుంచుకొనుటకు, శరీరమును కసరత్తులో బెట్టవలెను. అయితే, జీవితాంతము బరువులెత్తుట, సమాంతరముగానున్న ఇనుప కడ్డీలపైన గంతులు వేయవలెననికాదు. వినోదమునకుగాను, వృత్తికిగాను, నీవు దానిని సాగించవచ్చును. అయితే నిజముగా అది అత్యుత్కృష్టమైన లక్ష్యముగాదు. మనస్సు విషయములో గూడ అంతే.

ప్రగతిని సాధించు శక్తిని సంపాదించుటకు, క్రొత్తజీవితానికి తగినట్లు పొందు కుదుర్చుకొనుటకు, ఉన్నతచేతనమండి వచ్చు శక్తులను ఆహ్వానించుటకు, ఈ కసరత్తులన్నింటిని జేయవలసినదే. అందుకొఱకే పిల్లలను పాఠశాలలకు బంపుట. అది చదువుకొన్నదంతయు జ్ఞాపకమునకు దెచ్చుకొనుటకు గాదు. తాను నేర్చుకొన్నదంతయు ఎవనికి జ్ఞాపకముండును ? వారు ఇతరులకు బోధింపవిధియైనప్పుడు వారు దానినంతయు మరల నేర్చుకొనవలెను. వారు సర్వమును

మరచిపోయి యుందురు. మరల చదువుట వలన త్వరగా అంతయు గుర్తుకు వచ్చును. వా రదివర కెప్పుడును పాఠశాలకు పోనివారైతే, వారెప్పుడును దేనిని నేర్చుకొనని వారైతే, అంతయు మొదలుపెట్టవలసినదే. నీవు సమాంతర ఇనుపకడ్డీల (Paralar Bar) పైన కసరత్తు 4-5 వ యేట ప్రారంభించిన నీకది అపాయము గలిగించును గదా ! మెదడుకు సంబంధించికూడా అంతే. ఉత్తమమైన కసరత్తు అంటే ఏమిటో నీకు దెలియునా ? తాత్వికవేత్తతో ప్రతిదినము సంభాషణ పెట్టుకొనుము. ఎందుకనగా, అక్కడ ఘనపదార్థమేమియు నుండదు. నీవు ఒక రూపము గలిగిన దేనిపైనను కేంద్రీకరింప నక్కఱలేదు. అక్కడేదియు బాహ్యారూపము లేదు. నిజముగా ప్రతిదియు ప్రత్యేకముగా మాటలతోనే వేరు చేయఁబడిన రంగములోనే సాగవలయును. అది స్వచ్ఛముగా మానసిక కసరత్తు. తాత్వికవేత్త యొక్క మానసిక రూపమును నీవు ప్రవేశింపఁ గలిగి అర్థము చేసికొని, ప్రత్యుత్తర మిచ్చుట చక్కనైన కసరత్తే.

(గణిత శాస్త్రజ్ఞుని శిష్యుఁడు)

గణితశాస్త్రజ్ఞులకును అదే సరిపోవునని నేను అనుకొనుచున్నాను !

**అవును.**

మరణ సమయములో ప్రాణికజీవి, ప్రాణికలోకపు వ్యతిరేక శక్తులు, వ్యక్తిత్వాలు, ఎదుర్కొన్నట్లయితే అది యెక్కడైనను రక్షణ కొఱకు చూచునుగాదా ?

అవును. ఈకారణమువలననే అన్ని దేశములలోను, అన్ని మతములలోను, ఒకరి మరణానంతరము కనీసము ఏడు దినములైనను, ప్రజలు సమావేశమై అతనిని గుఱించి ఆలోచన చేయవలయుననిసిఫార్సు చేయఁబడినది. ఎందుకనఁగా, ప్రేమతో

అతనిని గుఱించి ఆలోచించి నప్పుడు, (లోపలి సంక్షోభము లేకుండా. ఏడ్వకుండా. పెడత్రోవలుబట్టు ఆవేశములు లేకుండా) నీవు ప్రశాంతముగ నుండగలిగినచో, నీ వాతావరణము, ఓడలకు దారిజూపువెలుఁగువలె అతనికి ప్రయోజనపడును. వ్యతిరేక శక్తులు అతనిని ఎదుర్కొన్నప్పుడు(నేను)ప్రాణిక జీవునిగుఱించి మాట్లాడుచున్నాను. విరామము దీసికొను చైత్యపురుషుని గుఱించి కాదు) దిక్కులేకపోయెఁ గదా! అని భావించును. ఏమి చేయుటకుఁ దోపక దురవస్థలో బడును. అప్పుడు ప్రేమతోఁ దన్ను గుఱించి తలంచుకొన్న వారి వెలుఁగు జూచి అక్కడికి బరువెత్తును. అట్లు సర్వదా సంభవించును. చనిపోయిన వాని ప్రాణిక జీవిగాని, అందులో నొక భాగముగాని (ఒక్కొక్కప్పుడు సంపూర్ణజీవి—అది సక్రమ పద్ధతులలో ఏర్పడి ఉంటే) తన్ను ప్రేమించిన ప్రజల, లేదా వ్యక్తియొక్క ఆలోచనా తరంగముల వలన ఏర్పడిన సూక్ష్మప్రకాశము, లేక వాతావరణమునందు రక్షణ తీసికొనును. చనిపోయిన వాని ప్రాణిక జీవునిలోని ఒక భాగమును ఎప్పుడు తమ వెంటమోసి కొని తిరుగు ప్రజలున్నారు. అపరకర్మల వలన ప్రయోజన మిదియే. లేనిచో అవి దండుగ వాని కర్థము లేదు.

కర్మ కలాపములతో పని లేకుండా ఇది చేయుట శ్రేయస్కరము. కర్మకలాపము వలన హాని కలుగవచ్చును గూడ. ఏలనంటే, నీవు ఈ కార్య కలాపము ఏర్పాట్లవలన తొందర పని గలిగియుండినపుడు దానిని గుఱించే ఆలో చింతువు గాని మరణము చెందిన వ్యక్తిని గుఱించి ఆలోచింపవు. అదియునుగాక ప్రజలు అందుకొరకే ఈ కర్మకాండను చేయుదురు. దుఃఖమును మఱువవలెనన్న, ప్రయత్నములో నిమగ్నమై యుందురు. మరణించిన వ్యక్తిని గుఱించి ఆలో చింపరు. బాధాకరమైన దానిని మరువ యత్నించుట, చికాకునుండి బయల్పడుటకు ఏదైన వినోదము కల్పించుకొనుట, అను ఈ రెండు కారణముల వలన ప్రజలు తమ కాలమును వృథా చేయుదురు. నిజమైన దేమియు జేయరు.

ప్రజలు విసుగు జెందినపుడు (కొందఱికి నిశ్చయముగా తొందర పనులలో నుండుట అవసర ముండదు. వారు దురదృష్టవశాత్తు భాగ్యవంతులై యుందురు.) వారు అవివేకమైన పనులు చేయుదురు. విపరీతమైన పనులు చేయుటకు గారణము మానవులయొక్క మందకొడి తనమే. ఈస్థితిలో నీవు తడిసిన పాత ప్రేలికవలె నుందువు. నీవు దేనికిని ప్రతీకారము చేయవు. నిన్ను నీవు కొరడాతో కొట్టుకొనవలసి వస్తుంది—పనులు చేసికొనుచు సాగిపోవుటకు.

ప్రకృతి ప్రణాళికలో మానవులకు విశ్రాంతి క్షణములు ఇవ్వఁబడినవి. ఎందుకు ? తమ్ము తాము తిరిగి కనుగొనుటకు; కాని వాటిని సద్వినియోగముచేయరు.

ఈ సంభాషణ ముగింపఁ బోవునప్పుడు తల్లి ఈ క్రింది విషయమును ఎత్తి చూపినది. (10—3—65)

నే నిప్పు డనేక విషయములు చెప్పగోరుచున్నాను.

ఉదాహరణకు ప్రభువు మానవులతో ఎఱుకతోఁ గూడిన సంబంధమును గోరి, వారి సమీపమునకు వచ్చినప్పుడు, వారు తమ బుద్ధిహీనతచే అమితమైన అవివేకపు పనులను జేయుదురు.

ఇది సత్యము, సంపూర్ణముగా సత్యము. మనుజుఁడు తన మూలమును దెలిసికొనుట కనువుగా అన్నియు నిశ్శబ్దత వహించిన తరుణములో, తన బుద్ధిహీనతచేత అతడు తాను వేరై పోవుటకు ఆలోచించును; లేదా, చెడ్డవగు బుద్ధిలేని కార్యములను సాగించును.

వెలుఁగుయొక్క శక్తిని భరింప లేనందువలన తాను వేరుపడ గోరునా ?

అవును.

ఒత్తిడి చాలా బలముగా నున్నది.

అవును. చెదిరిన, భయభ్రాంతులై పోవు వారున్నారు. వారు దానిని భరింపలేరు, దానినుండి బయటపడుటకు దేనినైనను అందుకొన బోవుదురు.

సమాప్తి